# మతసమాజాలు : మహిళలు





రచన :

## మల్లాది సుబ్బమ్మ



మల్లాది పబ్లికేషన్సు

9, ఎమ్. ఐ. జి. హెచ్. కాలనీ,

మెహిదీపట్నం,

హైదరాబాద్ - 500 028

మల్లాది పబ్లికేషన్సు నెం. 2

# మతసమాజాలు : మహిళలు

1987 జనవరి





పబ్లిషర్సు : మల్లాది పబ్లికేషన్సు,
9, ఎమ్. ఐ. జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం,
హైదరాబాద్ - 500 028



సోల్ డిస్ట్రిబ్యూటర్సు :
వికాసం
9, ఎమ్. ఐ. జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం – 500 028
ఫోన్ : 35429

వెల : రు. 60.

ముద్రణ :
లిబర్టీ ప్రింటర్సు, చీరాల
తెలుగునాడు ప్రింటర్సు, చీరాల.

# జ్ఞాపకార్థం

అపి మరపురాని స్మృతులు. ఆ రోజులు వేరు. ఆ ప్రేమలు వేరు. అది నలభై ఏళ్ళ అనుబంధం. నా శ్రేయస్సు కోరిన వాత్సల్య బంధం. నన్ను ఇంతగా తీర్చిదిద్దిన భవ బంధం.



శ్రీ మల్లాది సోమసుందరం  శ్రీమతి మల్లాది కామేశ్వరమ్మ

అదొక విధమైన సహజీవనం. అందులో కష్టసుఖాలెన్నో ఉన్నాయి. మరచిపోలేని ఘట్టాలెన్నో జరిగిపోయాయి. 13 ఏళ్ళ వయస్సులో వారియింట అడుగుపెట్టాను. కూతురుగా అభిమానించారు. కోడలుగా మలుచుకున్నారు. వారు సనాతనులు. మహా నిష్ఠా గరిష్ఠులు. ఉద్యోగ నిర్వహణలో, జీవిత విధానంలో ఆత్మాభిమానం, ధర్మ నిబద్ధత, ఉత్కృష్ట కార్యాచరణ వారికి పెట్టని కోటలు. వారిలో మానవత తొణికిసలాడేది. మా సిద్ధాంతాలు వేరయినా నా శ్రేయస్సును కాంక్షించి నా భవిష్యత్తుకు బాటలు వేసిన మాననీయులు, అసాధారణ వ్యక్తులు అయిన నా అత్తమామలకు కృతజ్ఞతా గౌరవాలతో ఉడతా భక్తిగా ఈ గ్రంథాన్ని సమర్పించు కుంటున్నాను.

# అవగాహన

ఏ పరిశోధనా గ్రంథం వ్రాయాలన్నా, ఏచరిత్ర పరిశీలించాలన్నా, ఏ వ్యవస్థను వివరించాలన్నా సమాజంలో సగభాగమైన స్త్రీల పరిస్థితి గురించి ముందుగా సమాచారం సేకరించాలి అది ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో పెనవేసుకొని ఉంటుంది. దానిని విడదీసి ముందుగా అధ్యయనం చేయాలి. సామాజిక, మతపరమైన లక్షణాలను విశ్లేషించాలి. ఒక లక్ష్యసిద్ధితో ఆనాటి పరిస్థితులను ఆకలింపుచేసుకోవాలి. అవి ఈనాటికి ఎందుకు పనికిమాలినవి అయ్యాయో వివరించ గలగాలి.

అది బృహత్తర ప్రణాళిక. ఎంత చేసినా ఇంకా కొంత మిగిలి పోతుంది. కనుక కష్టసాధ్యం. అంతేగాదు మరొక అంశం గమనించతగినది. విషయ సేకరణలోగాని, రచనలోగాని, ప్రజలకు అందించే సందేశములో కాని అసలు విషయానికి (సబ్జక్టుకు) న్యాయం చేయాలి. ఏ పరిస్థితుల్లోను పక్షపాత వైఖరి పనికిరాదు చరిత్రను వక్రీకరించటానికి ఏ రచయితకూ అధికారం లేదు. ఇలా అన్నంత మాత్రాన తన అభిప్రాయ ప్రకటనకు రచయితకు స్వాతంత్ర్యం లేదని భావించరాదు. వ్యాఖ్యానం చేయటం, భాష్యం చెప్పటం అతని లేక ఆమె హక్కు. ఈ అంశంపై రాజీ లేదు. తను నమ్మిన భావాన్ని నిర్భయంగా, నిర్మొగమాటంగా, నిస్సంకోచంగా తెలియజెప్పటం రచయిత విధి; కర్తవ్యంకూడాను.

భారతదేశంలోని ముఖ్యమైన మూడు మతాలు హైందవం, ఇస్లాం, క్రైస్తవం, స్త్రీల పట్ల ఎలాప్రవర్తిస్తున్నాయో వివరించటానికి అవతరించింది ఈ గ్రంథం. స్త్రీల యెడ వైఖరి విషయంగా ఈ మతాలన్నింటిలో సామ్యాలు, పోలికలు ఎక్కువగా కన్పడుతున్నాయి. పురుషాధిక్య సమాజాన్ని కొనసాగించటానికి, స్థిరపరచటానికిఇవి ఉపకరిస్తూనే ఉన్నాయి. ఈనాటి సమాజానికి, అనువుగాలేవు ఈమతధర్మసూత్రాలు. కనుక వాటినిమౌలికంగా మార్చవలసిన ఆవశ్యకతఉదయించింది. దానిని విశదీకరించటమే ఈ గ్రంథం యొక్క ముఖ్యోద్దేశ్యం.

రచయిత :

మల్లాది సుబ్బమ్మ.

# ఈ పుస్తకంలో ఇదీ వరస

పారిపోలేని ఖైదీల లాంటి మన స్త్రీల ఈ పరిస్థితికి మూలకారణమేమిటి
అని ప్రశ్నిస్తే-

స్త్రీల ఈ భావనకు ప్రాతిపదిక ఈ నాటిది కాదు. తర తరాలుగా యుగ యుగాలుగా 'తాను తక్కువ పురుషుడెక్కువ' అనే భావం స్త్రీ పురుషులిద్దరిలో జీర్ణించి పోయింది. అందుకే ఇరవై ఏళ్ళ అమ్మాయి కూడా పదమూడు ఏళ్ళ అబ్బాయిని తన వెంట తోడు తీసుకొని వెళుతుంది. బలాత్కరిస్తుంటే తాను అబలనని, బలహీనురాలనని తలంచి మిన్నకుంటుంది. ఎన్ని డిగ్రీలున్నా భర్త తల వంచి మెళ్ళో తాడు కట్టించుకుంటుంది. భర్త కన్నా పెద్ద చదువు, ఉద్యోగం కోదుకోదు. ఆస్తులన్నీ భర్త పేరనే పెట్టిస్తుంది. ఇంటి చాకిరీకి, పిల్లల పెంపకానికీ ఇష్టపడుతుంది. ఈ అస్తిత్వానికి బీజాలు రుగ్వేదం లోనే పడ్డాయి. "ఓ దేవా! నాకు మగ బిడ్డను ప్రసాదించుము." అనే రుక్కు రుగ్వేదంలో దర్శనమిస్తుంది. క్రమేపి ఇంకా మారుతూ స్త్రీల స్థితి ఇతిహాసాల నాటికి శోచనీయంగా దిగజారి పోయింది. ఉదాహరణలు కోకొల్లలు. భర్త గ్రుడ్డి వాడయితే గాంధారి కళ్ళకు గుడ్డకట్టుకుంది. భర్త ఆజ్ఞ ప్రకారం కుంతి పరాయి పురుషులకు బిడ్డల్ని కన్నది. ద్రౌపది అత్తగారి ఆదేశం ప్రకారం పాంచాలి అయింది. చంద్రమతి అమ్ముడు పోయింది. సీత అగ్ని ప్రవేశం చేసింది. అసలు తప్పు ఇంద్రుడిది అయినా శాపం వల్ల అహల్య రాయిగా మారింది. తండ్రి ఉత్తరువు మేరకు తన తల్లిని నరికి వేశాడు పరశురాముడు. కామించిన శూర్పణఖను నేరస్తురాలిగా నిరూపించి ఆమె ముక్కు చెవులు కోయటం న్యాయమన్నారు. భర్త కోరిక మేరకు సుమతి మగనిని వేశ్యకు అర్పించింది. ఇలా చెప్పుకుంటూ పోతే ఇలాంటివి ఎన్నో మరెన్నో ఉన్నాయి.

మను ధర్మ శాస్త్రం, కుమారీ శతకం ఆంధ్ర హిందూ స్త్రీలకు శిరోధార్యాలయినాయి. భారత దేశ సంస్కృతి సింహళ దేశానికి వ్యాపించింది మనకందరికి తెలుసు. ఒక సనాతన సింహళ బ్రాహ్మణుడు తన కుమార్తె వివాహ సమాయాన ఆమెకు చేసిన హిత బోధ 15 వ శతాబ్దపు 'కావ్య శేఖర' అనే కావ్యంలో పద్య రూపకంగా పొందు పరచడం జరిగింది. ఆ పద్యాలలో కొన్నింటిని తొమ్మిదవ తరగతి బాలికల పాఠ్య పుస్తకాలలో చేర్చారు. ఆ హిత బోధ ఇలా సాగింది :-

'నీ భర్త అనుమతి లేకుండా నీవు ఇల్లు విడిచి పోరాదు. వీధిలో నడిచేటప్పుడు చక చకా అడుగులు వేయవద్దు. ఆ పాద మస్తకం నిండుగా ఉచిత రీతిలో వస్త్ర ధారణ చేయాలి. నీ భర్తకు, అత్త మామలకు, అతని బంధువు

కుల దాసిలా సేవ చేయుము. చంచల చిత్తలైన వేశ్యలతో, దొంగలతో, దాసీ జనంతో, నటీ సమూహంతో, నాట్య గత్తెలతో, పుష్ప లావికలతో, రజక స్త్రీలతో చెలిమి చేయవద్దు. నీ ఇంటిని, తోటను ప్రతి దినము ఊడ్చి శుభ్రంగా ఉంచుము. ఉదయం, సాయంత్రం సంధ్యా కాలంలో దేవునికి దీపారాధన చేసి తదుపరి భుజించుము. నీ భర్త ఊరి నుండి తిరిగి వచ్చినప్పుడు అతనికి సంతోషంతో స్వాగతమిమ్ము. అతనికి పాద ప్రక్షాళన చెయ్యి; ఆ పనిని దాస దాసీ జనాలకు అప్పగించవద్దు.

వీధివాకిట నిలబడికాని, తోటలలో విహరిస్తూ కాని, ఇంటి పనులను పోమరితనంతో నిర్లక్ష్యం చేస్తూ కాని కాలాన్ని వృధా చెయ్యకు. నీ ఇంటి సామానులు భద్రంగా కాపాడుము. నీ భర్త అనుమతి లేనిదే ఏ వస్తువులను ఎవ్వరికీ - కనీసం నీ సంతానానికి కూడా - ఇవ్వతగదు. ఒకవేళ నీ భర్త తన ప్రేమను ఒరులపై ప్రసరింప జేసినచో ఆయనతో ఈ సంగతి ప్రస్తావించ వద్దు. నీ చింతకు ప్రతీకగా నీ కన్నీటి ధార మాత్రమే మిగిలిపోవాలి.

ఆహార విషయంగా నీ భర్త ఇష్టాయిష్టాలను గమనించుము. ఆయన తృప్తి చెందేటట్లు ఆహారం పెట్టి అతనిని తల్లిలా పోషించుము. నీవు రంగు రంగుల పట్టు వస్త్రములు ధరించి, సొమ్ములు పెట్టుకొని, అలంకరించుకొని, సుగంధ ద్రవ్యాలు మేన నలముకొని దేవతా స్త్రీ వలె సౌందర్యంతో విలసిల్లుతూ భర్త దరి చేరవలెను. ఇంట్లో అందరికన్నా చివరి ముఖ్యిగా నిద్రించుము; అందరికన్నా ముందుగా మేల్కొనుము. భర్త నిద్ర లేచే టప్పటికి నీవు అతని చెంత వుండవలెను. నీ భర్త నీపై ఆగ్రహించినా, ఉదాసీనత ప్రదర్శించినా, దయను, క్షమను ప్రదర్శించాలి గాని అతనితో పరుషంగా మాట్లాడకు: నీ సుఖం కోసం నీ భర్తను గాక మరెవ్వరినీ ఆశ్రయించవద్దు.

ఈ నీతులతో వారి వారి సంప్రదాయాలను బట్టి కొద్ది తేడాలతో అన్ని కాలాలలో ఆడవారికి 'బ్రెయిన్ వాష్' వేయబడింది. క్రమేపీ ఆ సనాతన భావాలను జీర్ణించుకున్న మన మహిళలు అవి తమ సంస్కృతికి చిహ్నాలుగా, ఉన్నతాశయాలుగా భావించి తమకు తామే ఆమోదించి ఆచరిస్తున్నారు. ఇదీ భారతనారి చరిత్ర. అందువల్లే సహగమనాలు, బాల్యవివాహాలు, వరకట్న మరణాల లాంటివి ఇంకా జరుగుతూనే ఉన్నాయి. భర్త లేని స్త్రీకి ఆనాడు సహగమనం ధర్మ సమ్మతమయితే నేడు కూడా ఆమెను చిన్నచూపు చూస్తున్నారు. అక్కడక్కడా ఇంకా వితంతువును కురూపిని చేసి ఆనం దిస్తున్నారు. మారుతున్న నాగరికత, శాస్త్ర విజ్ఞానాలతో పాటు మహిళల మనస్తత్వాలు కాని పురుషుల వైఖరి కాని మారలేక పోతున్నాయని తేలుతున్నది.

ఈ మానసిక దాస్యానికి మూలం పురాతన సంస్కృతి అని చెప్పక తప్పద హైందవ సంస్కృతిలో స్త్రీ స్థానాన్ని, స్థాయిని గుర్తించి ఆనాటి సంస్కృతి స్పష్టంగా, సాధికారికంగా వివరించటానికే ఇంత ప్రయత్నం చేయాలి వచ్చింది. అంత గాఢంగా మన మనస్సులలో ముద్రలు వేసుకున్న ఆనా ధర్మశాస్త్రాల సారం, సంప్రదాయాల బలం ఒక్కసారిగా పోదు. అది చా సంక్లిష్టమైన పని. ఆ చిలుమును వదిలించటానికి ఒక సంస్కర్త గాని ఒ సంస్కారి గాని చాలరు; ఒక దశాబ్దం చాలదు. మహిళాభ్యుదయ గాముల అందరూ ఐక్యతతో ఎలుగెత్తి చాటాలి. సంఘాలుగా ఏర్పడాలి. పోరాటాల సలపాలి. త్యాగాలకు సిద్ధపడాలి. ఎడతెగని పోరాటం సాగించాలి. ప్రత్యా ఘాత శక్తులు వినాశానికైనా ఇష్టపడతాయి గాని గద్దె దిగవు. అయినా పట్టు విడువని రీతిలో ఉద్యమాన్ని నడపాలి. బాధితులు అగ్రభాగాన నిలిచి సర్వశక్తులూ వినియోగించాలి. ఇది స్త్రీల విముక్తి ఉద్యమంగా తయారయితేనే విజయాన్ని సాధించగలం. పాత ఆచారాలను ధ్వంసం చేయడం ఎంత కష్టమో ఆధునిక భావాలను జొప్పించటం అంతకన్నా కష్టతరం. అయినా ఎప్పుడో ఒకప్పుడు ఆ పని జరగాలి కదా! అందుకే ఈ గ్రంథరచన చేయాల్సి వచ్చింది.

ధన్యవాదాలు :-

హైందవ సంస్కృతి మారాలని, హిందూమత భావాలు ఈనాటి సమాజాభివృద్ధికి గొడ్డలి పెట్టనే ఉద్దేశ్యంతో ఈ గ్రంథ రచనకు నన్ను పురి కొల్పింది స్నో స్నహజీవన కార్యకర్త, అఖిల భారత హ్యూమనిస్టు సంఘానికి, ఇండియన్ రేషనలిస్టు సంఘానికి అధ్యక్షులుగా ఉన్న ఎం. వి. రామమూర్తి గారు. "ఇంతకు ముందు 'ఇస్లాం : స్త్రీలు', 'క్రైస్తవం : స్త్రీలు' వ్రాశావు. 'హైందవం : స్త్రీలు' వ్రాయకపోతే అది లోపభూయిష్టం, అసంపూర్ణం అవుతుంది" అనే భావాన్ని వెలిబుచ్చి ఆయన తన సహాయ సహకారాలను అందించారు. నేను ఆయనకు అందుకు ఋణపడి ఉన్నాను.

ఈ పుస్తకం నా గ్రంథ పరంపరలో 31 వది. వరుసగా, అవిచ్ఛిన్నంగా గ్రంథ ప్రచురణ చేయటానికి నాకు ఎంతో చేయూతను ఇచ్చిన నా బిడ్డలు కె. ఆర్. మల్లాది, ఎం. జి. కె. మూర్తి, వి. మల్లాది, పర్సా విజయలక్షిలను అభినందించకుండా ఉండలేను.

ముద్రణా వ్యవహార భారాన్ని మోసిన మిత్రులు రాజారెడ్డిగారికీ, అమూల్య గ్రంథాలను సేకరించి అందించిన అనేకమంది హితులకు నా ధన్యవాదాలు.

రచయిత

# ఆలోచన

మానవజాతి శైశవాన్ని దాటింది. బాల్యావస్థను అధిగమించింది. యౌవనదశలో ప్రవేశించింది. దాని శక్తియుక్తులు వికసించాయి. గ్రహాంతర యానాన్ని సాధించింది. దూరశ్రవణ, దూరదర్శనాది సాధన సంపత్తులను చేకూర్చుకుంది. సూక్ష్మదర్శనాన్ని తన స్వంతం చేసుకుంది. మానవ దేహ విభాగాలకు ప్రత్యామ్నాయాలను సంతరించుకుంది. వాటికి విడిభాగాలను సరఫరా చేసుకుంటున్నది. జీవోత్పత్తి క్రమాన్ని సూత్రప్రాయంగా తెలుసుకున్నది. స్త్రీ పురుష సంయోగంతో నిమిత్తం లేకుండా పిండోత్పత్తికి బాటవేసింది. కృత్రిమ గర్భధారణను సుగమం చేసింది. మానవ బుద్ధి చేసే పనులలో కొన్నింటిని యంత్రాల సాయంతో నెరవేరుస్తున్నది. అంటే ఆలోచనాక్రమంలో కొంతభాగాన్ని యంత్రాలకు కట్టబెట్టింది. ఒకనాడు చేతులతో, కాళ్ళతో చేసేపనులను యంత్రాలద్వారా చేయగల్గిన మానవజాతి ఈనాడు మెదడుతో చేసే కార్యాలను యంత్రాలద్వారా సాధించగలుగుతున్నది. ఈ ప్రగతిని మంచికి వినియోగిస్తుందా? లేక చెడును సాధ్యం చేయటానికి వాడుతుందా? అనేది వేరేప్రశ్న. అది మానవజాతి సంస్కృతీ స్థాయిపై ఆధార పడుతుంది.

ఈ దశలో స్త్రీ పురుషుల సంబంధాలు ఎలా ఉండాలనేది విచారణీయాంశం. ఈ సమస్యకు సమాధానం మన విజ్ఞానంపై ఆధారపడుతుంది. శారీరక విషయంగా కొద్దిపాటి మార్పు తప్ప స్త్రీ పురుషులలో తేడా లేదు. మెదడుయొక్క నిర్మాణంలో హెచ్చులొచ్చులు లేవు. జ్ఞాపకశక్తిలో, ఆలోచనలో, ఊహలో స్త్రీ పురుషునికి తీసిపోదు.

ఈనాటి సామాజిక స్థితిని గమనిస్తే పురుషుడుచేసే ప్రతి పనినీ స్త్రీ చేయగలదని తేటతెల్లమయింది. స్త్రీ కూడా గ్రహాంతర యాత్రచేసి తిరిగి వచ్చింది. స్త్రీలు శాస్త్రజ్ఞులుగా విలసిల్లుతున్నారు. రాజ్య పరిపాలకులుగా భాసిల్లుతున్నారు. సాహితీ పరులుగా, కళాకారులుగా పేరు తెచ్చుకుంటున్నారు. వారు ప్రవేశించని సామాజికరంగం లేదు.

ఇది బుద్ధికి ప్రాధాన్యత ఇచ్చేకాలం. బుద్ధి కుశలతకు పెద్ద పీటవే రోజులివి. కండబలానికి విలువ తగ్గింది. ఈనాడు పది పన్నెండుమ సంతానాన్ని కనే స్త్రీ బలహీనురాలవుతుందని, వారిని పెంచి పోషించడం ఆమె ఎక్కువ కాలాన్ని అంటే 20 లేక 24 ఏండ్లు అందుకు వినియోగిం లని పూర్వం తలచేవారు. పరిస్థితులు మారాయి. అసలు అంతమ పిల్లల్ని కనవలసిన అవసరంలేదు. పైగా అది ప్రపంచానికే ప్రమాదకర ఇక వ్యక్తిగతంగా స్త్రీ విషయం వేరే చెప్పనక్కరలేదు. ఆమె జీవితకా అంతా పిల్లలను కనిపెంచటంతో సరిపోతుంది. ఆమె ఎంతసేపూ ఇతర కోసం జీవించటమే కాని తనకొరకు జీవించటానికి ఆస్కారం లేదు. ఆ సంతానోత్పాదన యంత్రమవుతుంది. ఆ స్థితిని ఆమె ఇపుడు ఆమోదించే లేదు. తనకు ఇష్టమయితే ఆమె ఒకబిడ్డకో లేక ఇరువురికో జన్మను ఇస్తుం ఆమెకు ఆ విషయంలో సర్వాధికారం, తన దేహంపై తనకు పెత్తన కావాలని ఆమె కోరుతున్నది. అది సహజమైన కోరిక; న్యాయమైనమాట

ఒకరినో, ఇద్దరినో పిల్లలను కనే స్త్రీ బలహీనురాలు కానేరదు ప్రసవంవల్ల ఆమె బాధపడదు. శరీరారోగ్యాన్ని కాపాడుకునే శక్తి స్త్రీ పురుషునికన్నా 10 శాతం ఎక్కువయని అధునిక విజ్ఞానం చెపుతున్నది కనుక ఎట్టి పరిస్థితులలోను పురుషుడు స్త్రీ కన్నా బలవంతుడుగా చలామ కావటానికి వీలులేదు. మరోవిషయం గుర్తుంచుకోవాలి. స్త్రీలు మాత్రమే బిడ్డల్ని కనగలరు. సత్యమే. కాని బిడ్డలను పెంచటం తల్లితో చేయనక్క లేదు. తల్లిదండ్రులిరువురూ ఆ విషయంలో సమర్థులు. తండ్రి కూడా పి లను పెంచగలడు. ఈ సత్యాన్ని స్వీడను దేశం గుర్తించింది, పిల్లల కలుగగానే తల్లిదండ్రులు ఇరువురుకలసి 180 రోజులు సెలవు తీసుకోవచ్చు నని నిబంధనను ఆమోదించారు. ఎవరు ఎన్నిరోజులు సెలవు తీసుకోవాలో వారిలోవారు తేల్చుకుంటారు. అదిగాక భార్య ప్రసవకాలంలో భర్తకు 10 రోజులు జీతంమీద సెలవుఇస్తారు. ప్రతి పిల్ల పుట్టినప్పటినుండి బడికి వెళ్ళే వయస్సు వచ్చేవరకు, ఈ కాలంలో, అదనంగా తల్లిదండ్రులు పిల్లలను పెంచే నిమిత్తం 180 రోజులు జీతంతో సెలవు తీసుకోవచ్చును. అదీగాక తల్లిదండ్రులలో ఎవరో ఒకరు అనారోగ్యంగా ఉన్న బిడ్డను చూచుకోవటానికి 60 రోజులు జీతంతో సెలవు ఇస్తుంది యాజమాన్యం. అంటే

తల్లికిగాని, తండ్రికిగాని బిడ్డ బిడికి వెళ్ళలోపల 360 రోజుల సెలవు ఉంటున్నదన్నమాట. పిల్లలను పెంచే బాధ్యతను తండ్రి స్వీకరించాలని ఈ నియమాల భావం. ఇలా బిడ్డను కనడంవేరు, బిడ్డలను పెంచడం వేరు అని తేలిపోయింది.

ఇలా వస్తున్న మార్పులకు, ఆలోచనలలో, భావాలలో వస్తున్న పరిణామానికి సమాజం స్పందించవలసి వుంటుంది. కాని అలా జరగటంలేదు. పాతకాలపు అభిప్రాయాలే ఇంకా అనేక దేశాల్లో చెల్లుబాటు అవుతున్నాయి. మనదేశం ఈ సూత్రానికి మినహాయింపుకాదు. మనదేశంలో హిందూ సమాజం రెండువేల ఏండ్లనాటి భావాలతో మసుగడ సాగిస్తున్నది. ఈ మార్పును అంగీకరించక పోవటానికి రెండు కారణాలు కన్పడతాయి, ఒకటి పురుషజాతి స్వార్థం. అది అమలు, లేకపోతే పాతభావాల ప్రాబల్యం. ఇది రెండవ అంశం, పాత భావాలు మతంపై ఆధారపడుతున్నాయి. మతం ఆయా సామాజిక పరిస్థితులనుబట్టి రూపొందటం జరిగింది. దేశ, కాలాలు సామాజిక స్థితిని నిర్ణయిస్తాయి. ఆయా కాలపు జ్ఞానం, ఆ ప్రజానీకపు సంస్కృతి, మత రూపురేఖలను, తీర్చిదిద్దుతాయి. పాతభావాలను ఈనాటితో పోలిస్తే అనేక విషయాలలో అజ్ఞానాన్ని ప్రాతిపదికగా కలిగి ఉంటాయి. పురుషాధిక్యతాభావం అలాంటిదే. దానికి మత ప్రామాణ్యతను సంతరించి పెట్టారు. ఆ మతాన్ని ఈనాడూ అనుసరిస్తూ, స్త్రీ పురుష సమానత్వానికి దానిని అడ్డుగా చూపిస్తున్నారు. ఇలా స్వార్థపరులు కొందరూ, అజ్ఞానంతో కొట్టుమిట్టాడేవారు మరి కొందరు మహిళా పురోగతికి అడ్డుకట్ట వేయాలని ప్రయత్నిస్తున్నారు. మనదేశంలోని అత్యధికులదైన హిందూమతం అందుకు ఉపయోగపడుతున్నది అలాంటి వారికి. హిందూ సమాజపు పాత కాలపు ఆచారాలను, సంప్రదాయాలను పట్టుకొని ప్రేళ్ళాడాలని వారిసంకల్పం.

హిందూ సమాజం ఎలా ఉద్భవించిందో, ఎలా పెరిగి పెద్దదయిందో, ఎలా పరిణామం చెందిందో, ఎలా ఈనాటికి ఈరూపం దాల్చిందో తెలియ జెప్పటానికి మల్లాది సుబ్బమ్మ యీ చిన్ని పొత్తంలో వీలయినంత విస్తృతంగా వివరంగా విశదీకరించారు. ఈ చారిత్రాత్మక పరిశీలన ఉపయోగ కరం. దీనివలన అన్నిమతాలకు ఉన్నసామ్యం వెలికి వస్తుంది. పోలికలు.

బయటపడతాయి. మగదేవుళ్ళ ఉనికి, వారి ప్రవక్తల బోధల వెనుకన ఉన్న కర్కశ సత్యాలు గోచరమవుతాయి. ఆయా మత సమాజాల రుషులు, ధర్మ శాస్త్రవిదులు, స్మృతికర్తలు, ధర్మకోశ రచయితలు వీరి ఆలోచనా స్రవంతి వెనుక దాగియున్న పురుషాహంకార ధోరణి, పురుషాధిపత్య భావనదర్శనం ఇస్తాయి. దీంతో బండారం బయట పడుతుంది. హైందవం యొక్క విశిష్టత ప్రత్యేకంగా ఏమీలేదని, అదీ అన్నిమత సమాజాల వంటిదేనని తెలుస్తుంది. ఈ విషయాన్ని హైందవ సమాజంలోని స్త్రీలు గ్రహించడానికి ఈ పుస్తకం తోడ్పడగలదన్న ఆశించడంలో అత్యాశలేదు. అలా జరిగిననాడు గ్రంథకర్త శ్రమ సఫలీకృతమయినట్లుగా భావించవచ్చు.

ఎం. వి. రామమూర్తి,

హైదరాబాద్. అధ్యక్షుడు, భారత హేతువాద సంఘం.

## ఉపోద్ఘాతం

# ఎందుకీ గ్రంథం? ఎవరికోసం ఈ రచన?

మున్ముందుగా ఈ గ్రంథ రచనకు ఎందుకు పూనుకున్నదీ కొంత వివరించవలసి వుంటుంది! హైందవం: స్త్రీలు, అనే విషయంపై ఇతరుల గ్రంథాలు కొన్ని వున్నాయి. మరో గ్రంథం ఎలా అవశ్యకత మవుతుంది? ఈ ప్రశ్నకు సమాధానం తప్పనిసరిగా ఇవ్వాలికదా!

ఇంతక్రితం "ఇస్లాం: స్త్రీలు" "క్రైస్తవం: స్త్రీలు" అనే పుస్తకాలు వ్రాశాను. స్త్రీ జనాభ్యుదయం సమాజ పురోగతికి అత్యావసరమని విశ్వసించే మహిళలు మతసమాజాలలో స్త్రీల స్థితిని గమనించి, పరిశీలించి ఆ సమాజాలను సంస్కరించటానికి పూనుకోవడం వారి కర్తవ్యం. ఆ విధి నిర్వహణలో భాగంగా ఈ పరిశోధనకు పూనుకోవడం జరిగింది. మతాల మనుగడ మానవ సమాజ జీవితంలోనే సాగుతున్నది. సామాజిక ధర్మాలను నిర్వచించడానికి, వాటిని వర్తింపచేయడానికి మతాలు కొన్ని విలువలను ప్రతిపాదిస్తాయి. ఆ విలువల ఆధారంగా ఆచారాలు, సంప్రదాయాలు ఉద్భవిల్లుతాయి. అంటే మత విలువలు ఆచరణలోకి వస్తాయన్నమాట. ఆచరణ నుండి మరల ఆలోచన ఉద్భవిస్తుంది. మార్పు అవసరంగా కన్పడుతుంది. మార్పును సూచించే ప్రవక్తలు, ధర్మశాస్త్రి కోవిదులు ముందుకు వస్తారు. వారికి వ్యతిరేకంగా పాత ఆచారాన్ని సమర్థించేవారు మరికొందరు మేధావులు రంగంలోకి దిగుతారు. భావాలపరంగా సంఘర్షణ సాగుతుంది. సమాజాలలో ఇరువర్గాలకు అనుచర బృందాలు ఏర్పడుతాయి. ఎడతెగని వైరుధ్యం విజృంభిస్తుంది. మరల తగాదా అంశాలను సమన్వయం చేసే మహా పురుషులు ఆవిర్భవిస్తారు. ఇలా సాగుతుంది నిరంతర భావ సంఘర్షణ. అలాగే సాగుతుంది నిరంతర సామాజిక చలనం. మతాలు ఆయా సామాజిక దశలనుబట్టి పుట్టాయని తేలుతుంది. అయితే సామాజిక పరిస్థితులలో ముఖ్యమైన అంశాలు ఉదాహరణకు-ఆర్థిక, రాజకీయ భాగాలు మారినా భావసౌధం

వెంటనే మారదు. భావాల మార్పుకు చాలా వ్యవధి పట్టుంది. అలాగే ఏ పరిస్థితులలో ఒక మతం పుట్టిందో ఆ పరిస్థితులు మారినా ఆ మతభావాలు వెంటనే నశింపుకావు.

మరొక అంశాన్నికూడా మనస్సులో ఉంచుకోవాలి, మతం సమాజంపై ఎంతో ప్రభావం చూపుతున్నది. అలాగే సామాజిక నిర్మాణం ఆ మతాన్ని పెంపుచేయడమో బలహీన పరచడమో చేస్తుంది. అంటే బాని సత్వ సమాజంలో పుట్టిన మతాన్ని సమాజపు జమీందారీ దశ బలహీన పరుస్తుంది. కాని దానిని పూర్తిగా చంపలేదు. పరిస్థితులు మారాయి. వాటి కనుగుణంగా నూతన భావసౌధం అవసరమవుతుంది. దానిలో భాగమైన తాత్విక ధోరణి అవతరిస్తుంది. అది మతపరం కావచ్చు లేక మత వ్యతిరేక మైనది కావచ్చు. ఏమైనా సమాజ పరిస్థితులకు అనుగుణమైన తాత్విక ధోరణి వెంటనే ప్రబలం కాకపోవచ్చును. అంతేకాదు పాత ఆలోచనా సరళి సమాజ విధానాన్నికూడ శాసించ ప్రయత్నించవచ్చు. సమాజం పాటించే ఆచారాలకు సంప్రదాయాలకు పాత ఆలోచనా ధోరణి సమర్థనను కల్పించ టమేకాక ప్రజల మనస్సుపై రాజ్యం చేస్తుంది. ఈ వికటాట్టహాసాన్ని మనం గమనిస్తున్నాం. ఉదాహరణకు-ఋగ్వేదకాలంనాటి సమాజంలో పుట్టిన ఆలోచనా ధోరణి ఈనాటికీ హిందువుల జీవితాలను శాసిస్తున్నది. ఋగ్వేద కాలపు సమాజం ఈనాడు లేదు, అయినా ఆ కాలపు భావాలు ఈనాటికీ పెత్తనం చేస్తున్నాయి.

ఇంతకూ చెప్పదలిచిందేమంటే, మతంకూడా సమాజంలోనేపుట్టుందని పెరుగుతుందని, మారుతుందని, ఒక్కొక్కప్పుడు పెరుగుదల క్రమాన్ని స్తంభింపచేసుకొని సమాజాన్ని వెనుకకు నడిపించాలని ప్రయత్నిసుందని. కనుక మతాన్ని అన్నిదశలలో అధ్యయనం చేయవలసి ఉంటుంది. అయితే చారిత్రక దృక్పథంతో పరిశీలించ వలసి ఉంటుంది.

భారతదేశంలో అత్యధిక సంఖ్యాకులు హిందువులు. కనుక వారి సమాజాన్ని శోధించాలి. స్త్రీల అభ్యున్నతికి హిందూ సమాజపు ఆచారాలు,

సంప్రదాయాలు మతభావనలు, ధర్మశాస్త్రాలు ఎంతవరకు ఉపకరించాయో లేక నష్టదాయక మయినాయో పరిశోధన చేయాలి.

ఒక అంశాన్ని ప్రస్తావించక తప్పదు. సమాజ జీవితాన్ని నియంత్రణం చేయపూనే ప్రతిభావం లేక భావ సముదాయం సామాజిక శాంతిని కాంక్షించకతప్పదు. కాకపోతే ఆ శాంతిస్మశాన శాంతియా? లేక సమాజంలోని సభ్యుల ఇచ్ఛాపూర్వక శాంతియా?అనేది మీమాంస. సమాజపు ఉనికి కొంతగా కొంత సామరస్యంపై ఆధారపడుతుంది. కాకపోతే సంఘర్షణకు దారితీసే అంశాలు, అవకాశం కల్పించే విషయాలు ఉనికి కలిగి ఉండవచ్చు. సంఘర్షణకూడ జరుగవచ్చు. కాని తదుపరి మరల సామరస్యం నెలకొంటుంది. ఇలా సామాజిక సామరస్యానికి ఎప్పుడో ఒకప్పుడు దోహదం చేసే భావ సముదాయంలో కొంతగా కొంత శాశ్వత విలువలు చోటుచేసుకుంటాయి. అలాగే ప్రతి మతంలోను కొన్ని శాశ్వత విలువలు ఉంటాయి. అందువల్ల మతంలో లోపాలను బహిర్గతం చేసినంత మాత్రాన వాటిలోని ప్రయోజనకర అంశాలను కాదనడం కాదు. ఈ సిద్ధాంతం ప్రతి మతానికీ వర్తిస్తుంది; అలాగే హిందూమతానికీ వర్తిస్తుంది.

ఇకపోతే హిందూమత విలువలలో అన్నీ చెడ్డవని చెప్పటం నా ఉద్దేశంకాదు. కాగా విలువైన వాటిని ఉటంకించటం నా ప్రసుత కర్తవ్యానికి అనవసరం. స్త్రీని హిందూ సమాజ ఆచారాలు, సంప్రదాయాలు ఎలా అభ్యుదయ మార్గాన సంచరించనీయటం లేదో వివరించదలచిన నాకు ఆ సమాజపు ప్రయోజనకర అంశాలను ప్రస్తావించటం అనుచితం. ఈ అంశాన్ని గమనించకుండా చదివితే హిందూ సమాజపు లోపాలు కన్పడి, రచయితకు దృష్టిదోషం ఉన్నదా అనే సందేహం రావచ్చు. కొందరు తొందరపడి నిందకు పూనుకోవచ్చు. మిస్ మేయో 'మదర్ ఇండియా' లాగా, మురుగుకాల్వల ఇనస్పెక్టరు రిపోర్టు అని మహాత్మాగాంధి అన్నట్లు వర్ణించవచ్చును. ఆ ప్రమాదం లేకపోలేదు. కాని ఆ విషయం తెలిసికూడా హిందూ సమాజపు లోటుపాట్లను వివరించటానికే ఉద్యమిస్తున్నాను. అలాకాక మంచి చెడ్డలను రెంటిని విశదీకరించుకుంటూపోతే గ్రంథం పెరుగుతుంది. అదీగాక నా ఉద్దేశ్యము కుంటుపడుతుంది. ఆధునికతకు అనుపుగా హిందూ

సమాజాన్ని పరిద్దుటయే భారతస్త్రీల కర్తవ్యమని నా భావం. ఆ అంశాన్ని సూటిగా, గట్టిగా వారి దృష్టికి తేవడమే నా సంకల్పము. అందుకే ఈ గ్రంథం వ్రాయడం జరిగింది.

మతం సామాజిక ఆచార సంప్రదాయాలను మలుస్తుందనే అంశాన్ని ఇదివరకే గుర్తించాము. మతాలకు ప్రామాణిక గ్రంథాలుంటాయి. కొన్ని మతాలకు ఒక గ్రంథం ఉంటే మరికొన్ని మతాలకు అనేకం ఉంటాయి. హిందూమతానికి అనేక ప్రామాణిక గ్రంథాలున్నాయి. శ్రుతులు, స్మృతులు, ధర్మసూత్రాలు, ధర్మశాస్త్రాలు, వాటికి భాష్యాలు, మరల వాటికి అన్వయ గ్రంథాలు ఇలా ఎన్నో మరెన్నో వున్నాయి. హిందూమత చరిత్ర నాలుగువేల ఏళ్ళపైగా ఉంది. కనుక ఇంత శాస్త్ర సంచయం ఉండడంలో ఆశ్చర్యంలేదు. వీటి పరిశీలనకూడా తప్పనిసరిగా జరగవలసిన పని.

హిందూస్త్రీలయెడ సమాజ వైఖరిని తెలుసుకోవటానికి రెండు పద్ధతులల్లో అధ్యయనం సాగించవచ్చును. సమాజ దశలలో ఒక్కొక్క దానిని తీసుకొని ఆ దశల్లో స్త్రీయెడ ప్రదర్శింపబడిన వైఖరిని సవిస్తారంగా తెలుసుకోవడం ఒక పద్ధతి. ఉదాహరణకు, ఋగ్వేదకాలంలో స్త్రీ హోదా, పుట్టుక, బాల్యం, విద్య, వివాహం, దాంపత్య జీవితం, వైధవ్యం, స్త్రీధనం, మాతృత్వం, సామాజిక జీవితంలో స్థానం, ఇలా వీటిని గురించి విడివిడిగా వివరించటం అలాంటిది. అలాగే బౌద్ధయుగంలో, లేక ముసల్మాను యుగంలో స్థితిగతులను అర్థంచేసుకోవడానికి పరిశీలించవచ్చు. అలాగాక స్త్రీ జీవితంలో దశలను పేర్కొని దశలవారీగా అన్ని కాలాల్లోను స్త్రీయొక్క పరిస్థితిని తెలియచెప్పడం రెండవపద్ధతి. ఉదాహరణకు-ఆడపిల్ల పుట్టినపుడు ఋగ్వేదకాలంనుండి ఈనాటివరకు ఎలా ప్రజలు భావిస్తూ వచ్చారనే అంశం కూలంకషంగా చర్చించటం అలాంటిది. ఈ పుస్తకంలో రెండవపద్ధతిని అనుసరిస్తున్నాము. ఈ రకపు రచనవల్ల ఉపయోగం చాల వుంటుంది. ఏమంటే ఏయే రంగంలో హిందూ సమాజం కుంటినడక నడుస్తున్నదో, అపమార్గాన పయనిస్తున్నదో, ఎక్కడ దృష్టిదోషానికి పాల్పడుతున్నదో స్పష్టపడుతుంది. కనుక సంస్కర్తలకు ముఖ్యాంశాలు కొట్టవచ్చినట్లు కనపడతాయి. వారిదృష్టిలో సంస్కరణ రంగాలు ప్రస్ఫుటంగా ఉంటాయి.

ఈనాటి ఆచారాలకు, సంప్రదాయాలకు మూలాధారాలైన భావాలు ఏ వేదంలో వున్నాయో, ఏ స్మృతిలో ఉటంకించబడినాయో, ఏ ధర్మ శాస్త్రాలలో పేర్కొనబడినాయో, ఏ భాష్యంలో వివరించబడిందో అంతా వ్రాయాలంటే బృహత్ గ్రంధమవుతుంది. గ్రంధ విస్తరణ భీతివల్ల ఆ కృషికి పూనుకోవటంలేదు. కాగా మౌలికాధారాలను పేర్కొనటం మాత్రం చేస్తున్నాను.

ఇక గ్రంధ నామాన్ని గురించి ముచ్చటించవలసి వున్నది.

"హైందవం" అనే పదానికి రెండు అర్ధాలు చెప్పుకోవచ్చును. హిందూమతం అని ఒక అర్థం. హిందూసమాజం అని రెండవ అర్థం. హిందూమతం అనే అర్ధంలో సనాతనులు వాడుతున్నారు. వర్ణాశ్రమ ధర్మాలు, వేదప్రామాణ్యత, స్త్రీ పాతివ్రత్యం ముఖ్యలక్షణాలుగా ఉండి దైవంలో విశ్వాసాన్ని ఆధారంగా కలది హిందూమతమని వారు బాహాటంగా ప్రకటిస్తున్నారు. రెండవ అర్థాన్ని నేటి కాలపు శాసనాలు, ఉదాహరణకు హిందూవివాహ శాసనం ప్రతిపాదిస్తున్నది. భారతదేశంలో జన్మించి లేక భారతదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకొన్న యూదు, జొరాస్ట్రియను మతాలను క్రైస్తవ, ఇస్లాంలను అనుసరించకుండా ఉండే వ్యక్తి హిందువు. ఇది శంకరాద్వైత తత్వశాస్త్రపు పోకడను పోలి ఉన్నది. "బ్రహ్మం" ఏదంటే ఇది అని స్పష్టముగా చెప్పలేక "నేతి, నేతి" (అంటే ఇదికాదు ఇదికాదు) అని చెప్పినట్లు హిందువు అంటే ఇలాగని చెప్పటం కుదరక చేసిన నిర్వచన ప్రక్రియ అది.

కొంత చారిత్రక పరిశీలన చేస్తే విషయం సుస్పష్టమవుతుంది. భారత దేశానికి ఆర్యులు రాకముందు మహోన్నతమయిన నాగరికత హరప్పా, మహోంజోదారో నగయిరా ప్రదేశాలలో విలసిల్లింది. అది ప్రధానంగా నగర జీవితానికి సంబంధించిన నాగరికత. తరువాత ఆర్యులు తండోప తండాలుగా భారతదేశంలోకి చొచ్చుకొని వచ్చారు. వారు ఒక్కసారిగా రాలేదు. అనేక పర్యాయాలుగా వచ్చారు. మొదటిజట్టు క్రీ. పూ. 2500 ప్రాంతంలో వచ్చి అచ్చటి స్థానికులను ఓడించి ఆ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నారు.

సింధునది, దాని ఉపనదులు ప్రవహించే ప్రాంతమది. దానిని సప్తసింధు ప్రాంతమనేవారు. అందులో ఒక నది "సరస్వతి" ప్రస్తుతం అంతర్వాహిని అయినదని ప్రతీతి. అప్పటికదే ఆర్యులు సంచరించే ప్రాంతం. దానిని ఆనాడు ఆర్యావర్తమనేవారు. తరువాత వీరు తూర్పుదిశగా వలసవెళ్ళి గంగా యమునా మైదాన ప్రాంతాన్ని ఆక్రమించారు. స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. వీరి ఉద్గ్రంథం ఋగ్వేదం. ఇంతలో మరో విడత మరోజట్టు ఆర్యులు ప్రస్తుతపు ఇరాన్ ప్రాంతంనుండి వలసవచ్చి సింధునదీ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నారు. వీరు తమతోపాటు అధర్వ వేదాన్ని తెచ్చారు. అప్పటికి వేదాలు వ్రాయబడలేదు. నోటిమాటద్వారానే వాటి ఉనికిని కాపాడడం జరిగింది. భారతదేశంలో ఉండే అనార్యులతో మొదట వచ్చిన ఆర్యులు, తరువాత వచ్చినవారూ అందరూ వివాహాది సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకున్నారు. ఈ సమ్మేళనం వలన ఉద్భవించిన సమాజం మహాభారతంలో కన్పిస్తుంది. రెండు సంస్కృతుల - ఆర్య అనార్య సంస్కృతుల - సమ్మేళనం జరుగనారంభించింది. ఆనార్యుల దేవతలను ఆర్యులు స్వీకరించారు. ఆర్యుల సంప్రదాయాలను అనార్యులు చేపట్టారు. గ్రీకు యోధుడు అలెగ్జాండరు భారతదేశ భూభాగంపై దండెత్తివచ్చాడు. క్రీ. పూ 326 లో వాయవ్యదిశనున్న ప్రాంతాన్ని ఆతడు జయించటం, అతని తరపున సెల్యూకస్‌ను రాజప్రతినిధిగా నిలిపి వెళ్ళడం తటస్థించింది. గ్రీకులను యవనులని ఆర్యులు పిలిచేవారు. గ్రీకులు ఆర్యులను సింధుతీర వాసులు కనుక సింధీయులు అని, హిందువులని పిలచేవారు. కొంతకాలానికి ఇక్కడ నివాసమేర్పరచుకున్న యవనులనూ హిందూసమాజంలో చేర్చు కోవడం జరిగింది. దాంతో హిమాలయాలు ఉత్తరంగా, వింధ్య పర్వతాలు దక్షిణంగా, సముద్రాలు తూర్పు పడమరగా ఎల్లలుగా కల ప్రాంతం ఆర్యావర్తమయింది. ఎందరో భారతదేశంపై దండెత్తివచ్చారు. కుషానులు, శకులు ఆ కోవకు చెందినవారు. వీరంతా హిందూసమాజంలో కలసిపోయారు. తరువాత ఆర్యసంస్కృతి దక్షిణాపథానికి ప్రాకింది. ఆర్యసంస్కృతియే హిందూ సంస్కృతిగా చలామణీ అయింది.

మొదట్లో ఆర్యమతం కేవలం బ్రాహ్మణమతం. ఆనాటి తొలి ఆర్యులలో మూడు వర్ణాలుండేవి. బహుశః వృత్తి నిబట్టి ఆ వర్ణవిభజన

ఆనాడు అలా జరిగి యుండవచ్చు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల పేరులో ఆ వర్ణాలు పిలువబడినవి. విద్య, పాండిత్యం, పౌరోహిత్యం, కర్మలు చేయించుట బ్రాహ్మణ ధర్మాలు. సమాజ రక్షణ క్షత్రియధర్మం. వ్యవసాయమూ, పశుపాలన వైశ్యుల కర్తవ్యం. కాగా తరువాత తామాక్రమించి గెలుచుకున్న ప్రాంతాల ప్రజలలోని కష్టజీవులను (దస్యులని పిలువబడ్డే వారిని) లొంగదీసుకొని సేవలు పొందుతూ వారిని శూద్రులుగా నామకరణం చేయటం జరిగింది. ఇలా నాలుగవ వర్ణాన్ని సృష్టించటం జరిగింది. ఏదైనా బ్రాహ్మణ ప్రాధాన్యతతో భాసిల్లింది ఆ సమాజం. దానికి ఎదురు దెబ్బలు తగలకపోలేదు. బానిసత్వాన్నుండి విముక్తి పొందాలనే తహ తహతో అనేకమంది బానిసలు సమాజంనుండి పారిపోయారు. అడవులలో తిరగడం ఆరంభించారు. అలాంటివారి సంఖ్య వేలకు మించిపోయింది. వారు బ్రాహ్మణ మతాన్ని చీల్చిచండాడారు. ఇంతలో క్షత్రియులూ తిరుగుబాటు మనస్తత్వాన్ని ప్రదర్శించారు. నూతన మతాల సృష్టి జరిగింది. వాటిని వారు ఆహ్వానించి బలపరిచారు. ఆ మతాలే జైన బౌద్ధాలు. ఇదంతా క్రీ: పూ 600-500 నాటి మాట. అశోకుని కాలంలో బౌద్ధం ఇతర ప్రాంతాలకు, దేశాలకు విస్తరించింది. మళ్ళీ గుప్తరాజుల కాలంలో బ్రాహ్మణమతం కొంత పుంజుకున్నది. ఈనాటి కేరళలో పుట్టిన శంకరాచార్యులు మత జైత్ర యాత్రచేసి హిందూమతాన్ని, అంటే బ్రాహ్మణ మతాన్ని మరల కట్టుదిట్టం చేశాడు. (క్రీ. శ. 787-820) ముసల్మానుల దండయాత్రలు 11 వ శతాబ్దిలో ఆరంభమయ్యాయి. హిందూసైన్యాలు వెనుకంజ వేయక తప్పలేదు. తర్వాత ఐరోపియనులు వ్యాపారం నిమిత్తం రావడం మెల్ల మెల్లగా రాజ్యాలు ఏర్పరచుకోవడం మనకు తెలిసినదే. పోర్చుగీసువారు, డచ్చివారు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు అలా వచ్చినవారే. చివరకు బ్రిటిషువారు నిలద్రొక్కుకొని తమ రాజ్యస్థాపన చేయటం, క్రైస్తవమత ప్రాబల్యాన్ని పెంచటం జరిగింది. 1947 లో స్వరాజ్యం వచ్చింది. బ్రిటిషువారి పాలనలో హిందూ ఆచారాలను మారుస్తూ కొన్ని శాసనాలు వచ్చినా స్వాతంత్ర్యానంతరం ఎక్కువగా హిందూ శాసనానికి సవరణలు విరివిగా వచ్చాయి. అవి చాల మౌలిక మార్పులను చేశాయి. ఇక్కడ గమనించవలసిన ముఖ్యాంశం ఏమంటే హిందూ మతం క్రైస్తవ, ముసల్మాను మతాలను తనలోఇముడ్చుకోలేక పోయింది. దానికి కారణాలు

అనేకం. ఆ మతాల ఆవిర్భావం మరో దేశాలలో కావటం, ఆ మత ఆచార వ్యవహారాలు హిందూమతానికి సంపూర్ణంగా భిన్నం కావటం ముఖ్య కారణం. ఏమైనా ఈనాడు భారతదేశంలో క్రైస్తవ, ముసల్మాను మతాలను అనుసరించేవారు హిందూసమాజానికి వేరుగా ఉంటున్నారనేది, పచ్చినిజం.

హైందవం అనే దానిని మతపరంగా నిర్వచించడం ఒక పద్ధతి. అయితే జాతి (RACE) పరంగా వివరించపూనడం మరియొకటి. అయితే ఈ రెండవ విధానంలో కొన్నిచిక్కులు వస్తున్నాయి. ప్రపంచంలో ఈనాడు ఏ జాతీ మరో జాతితో సంకరం కానిదిలేదు. ఆర్యావర్తమే తీసుకోండి. యవనులను, హూణులను, శిక్కులను, ఆమాటకువస్తే మొదట్లో దస్యులను లేక రాక్షసులను, కిన్నరులను, గంధర్వులను ఇలా ఎందరినో ఆర్యులు తమ సంఘంలో కలుపుకున్నారు. ఎవరు ఆర్యులో, ఎవరు అనార్యులో తెలియని స్థితిలో ఈనాడు ఉన్నాం. కనుక జాతిపరమైన నిర్వచనకు ఆస్కారం లేదు.

కాగా రాష్ట్రీయ స్వయం సేవక సంఘంవారు మరో నిర్వచనాన్ని ప్రచారం చేయాలని 1940 నుండి ఎంతగానో శ్రమిస్తున్నారు. హిందూ సంస్కృతికి, హిందూ పరంపరాగత విశ్వాసాలకు, మనోగతభావాలకు వారు ప్రాముఖ్యతను ఇస్తున్నారు. ఇక్కడకూడా మరోచిక్కు ఉదయిస్తున్నది. హిందువుల సామాజిక రీతులు, ఆచార వ్యవహారాలు, ఆలోచనా ధోరణులు మారుతూ వచ్చాయి. ఋగ్వేదకాలపు భావాలు అన్నీ ఈనాడు లేవు. ఆనాటి ఆచారాలు ఈనాడు ఆమోదయోగ్యం కావటంలేదు. స్మృతులు, ధర్మ సూత్రాలు, గృహ్యాసూత్రాలు, వీటిపై భాష్యాలు, కారికలు, అన్వయ గ్రంథాలు ఇలా ఎన్నో వందకుపైగా ఉన్నాయి. ఇవన్నీ ఏక కాలములో వచ్చినవి కావు. ఆయా కాలాల పరిస్థితులకు అనుగుణంగా ఉద్భవించాయి. పరస్పర విరుద్ధ అంశాలు లేకపోలేదు. ఏ సమాజానికి అయినా మార్పు సహజం, మరి రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘం వారు ఈ పరంపరలో దేనిని స్వీకరిస్తారు, దేనిని పరిహరిస్తారు ? పోనీ మారనివి ఉన్నాయా అంటే కొన్నిఅంశాలు ఉన్నాయి. జన్మపై ఆధారపడే వర్ణధర్మం, పురుషాధిక్యత, స్త్రీని అస్వతంత్రను చేయటం ఇవి మారలేదు. ఈ పరంపరాగత హిందూమతాన్ని అంగీకరిస్తారా సంఘంవారు ? తేల్చి చెప్పవలసిన తరుణం ఆసన్నమయింది.

హిందూత్వం లేక హైందవం నిర్వచనకు అందకుండా జారిపోయే బ్రహ్మపదార్థంలాగా తయారు అయింది. అది యేదో స్పష్టంగా చెప్పలేక పోయినా దాని కొన్నిలక్షణాలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. వాటిని బట్టి దానిని గుర్తుపట్టవచ్చును.

హిందూసంస్కృతిలో ముఖ్యమయినది స్త్రీ పట్ల దాని వైఖరి. ఋగ్వేదకాలంలో స్త్రీకి సంపూర్ణస్వేచ్ఛ, పురుషులతోపాటు సమానత్వం ఉన్నాయని కొందరు బహు గొప్పగా చెప్పకుంటారు. పరిశీలన చేస్తే ఆ స్వేచ్ఛ పరిమితిని, ఆ సమానత్వం కొంత వరకేనని తెలుతుంది. తరువాత అంతా స్త్రీ పతనమే. కాగా బౌద్ధయుగంలో సుమారు వెయ్యి సంవత్సరాలు స్త్రీ గాలిపీల్చుకుంది. కొన్ని వెసులుబాట్లు వచ్చాయి. శంకరాచార్యుల రాకతో, హిందూమత పునరుద్ధానంతో స్త్రీ జాతి మరల కష్టాలపాలయింది. ఈ ఆరోపణలు ఎంతవరకు ఆధారయుతాలో ముస్ముందు వచ్చే అధ్యాయాలలో తెలుసుకోచేయవచ్చు.

హిందూ వివాహ శాసనం (1955) ప్రకారం ఇవ్వబడిన నిర్వచనాన్ని బట్టి లేక హిందూ సంస్కృతి ఆధారంగా హిందూ సమాజాన్ని రూపు తేల్చవచ్చును. హిందూసమాజంలోని స్త్రీపట్ల ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, అభిప్రాయాలు వాటిని మలిచిన శ్రుతి, స్మృతి, ధర్మసూత్ర, ఇత్యాది మతగ్రంథాల సూక్తులు ఇందుకు ఉపకరిస్తాయి.

హైందవం అంటే హిందూసమాజం అని అర్థం చెప్పకొని సాగి పోవడం యుక్తియుక్తం.

అధ్యాయం

# 1 స్త్రీ మూర్తిత్వం

కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ రూపేషులక్ష్మీ క్షమయాధరిత్రీ
భోజ్యేషుమాతా శయనేషురంభా షట్కర్మ నిష్ఠా కులధర్మ పత్నీ॥
(పద్మపురాణం అధ్యాయం 47_55)

ఈ శ్లోక రచయిత వంశప్రసక్తి ఎక్కడా కానరాదు. కాని ఈ శ్లోకం హిందూ సమాజంలో బహుళ ప్రచారాన్ని సంతరించుకుంది.

పనిపాటలు చేయటంలో దాసిలాగా, ఆలోచన చెప్పేటప్పుడు మంత్రి వలె, ఓర్మిలో భూమిని పోలి, భర్తకు ఆహారం పెట్టేటప్పుడు తల్లితో సమానంగా, శయనంలో రంభకు దీటుగా, షట్కర్మలను చేస్తూ కులధర్మపత్ని సంచరించవలెనని తాత్పర్యం.

స్థూలంగా చూస్తే ఇలాంటి కోరిక మగవానికి ఉండటంలో తప్పేమిటని పురుషులందరికి అనిపిస్తుంది. ఈనాటి హిందూ సమాజంలోని పెక్కుమంది స్త్రీలు కూడా 'పోనీ! పాపం! మగవాడు ఆ మాత్రం ఆశపడకూడదా?' అని సమర్థిస్తారు. ఏదైనా ఆశించటం మానవధర్మం. అయితే కేవలం స్వార్థదృష్టి ఆ ఆశలో ద్యోతకమవుతున్నదా లేక మానవ సమాజ సంక్షేమ కాంక్ష ఆ భావంలో వెలువడిందా అనేది మీమాంస. ఈ శ్లోకంలోని భావం అంతా పురుషుడు కేంద్రంగా స్త్రీ అతని చుట్టూ నడయాడే రీతిగా ఉన్నది. ఎంతసేపూ తన విషయమే ఆలోచించాడు హిందూ పురుషుడు. ఇలాంటి వాక్యం స్త్రీకి అనుకూలంగా ఎవరికైనా, ఎక్కడైనా తటస్థించిందా? దివిటీలు వేసి వెతికినా కన్పించదు. కారణం ఒకటే ఒకటి. పురుష ప్రాధాన్యత కల సమాజాన్ని హిందూ సంప్రదాయాలు, ఆచారాలు, హిందూ సంస్కృతి ఊహించాయి; పోషిస్తున్నాయి.హిందూ సమాజం మాతృత్వాన్ని ఉగ్గడించింది. స్త్రీ సౌందర్యవతిగా వుండాలని ఆమె అలంకరణాదులతో తన అందాన్ని పోషించుకోవాలని అభిలషించింది. కాని ఆ మాతృత్వమే ఆమెకు శాపమయింది. ఆ అందమే

ఆమెను పురుషునికి పాదాక్రాంతను చేసింది. ఇలా అంటే చాలమంది హిందువులకు కోపం వస్తుంది. సహజమే! ఆత్మస్వరూపదర్శనం ఒక్కొక్కప్పుడు బాధాకరం. మానవుడు ఊహాలలో విహరిస్తాడు; ఆలోచనలలో తేలియాడ్తాడు. భావనా స్రవంతిలో మునిగిపోతాడు; తన్మయుడవుతాడు. వాస్తవాలను పరికించటమంటే ఉలిక్కిపడతాడు. హిందూ పురుషుడు ఇందుకు భిన్నంగా సంచరించలేడు. తను స్త్రీని అణచివేసి, ఆమె వ్యక్తిత్వాన్ని చిదిమివేసి ఆమెను తన స్వంత వస్తువుగా మలుచుకుంటున్నాడనే అంశాన్ని గుర్తించ నిరాకరిస్తున్నాడు. అందుకే కన్నులు మూసుకుంటున్నాడు. ఏమీ అన్యాయం జరగనట్లు సంచరిస్తాడు. ఇది అంతా చైతన్య స్థాయిలో పూర్తిగా మోసపూరితంగా జరిగే చర్య కూడా కాదు. తన ప్రగాఢ వాంఛలకు అనుగుణ్యంగా అచేతనంలో జరిగే ప్రక్రియ ఇది. కాగా చైతన్యపు మట్టంలో బహిర్గత రూపం తాలుస్తుంది.

హిందూమతం మాతృత్వాన్ని కొనియాడింది. తల్లిని గౌరవించింది. కాని మాతృత్వ విధ్యుక్త ధర్మ నిర్వహణ పేర స్త్రీని ఇంటికి పరిమితం చేసింది. సౌందర్యం స్త్రీని దోపిడీకి గురిచేసింది.[1] తల్లి అయిన స్త్రీ తన శిశువును పోషించాలి; పెంచాలి, సాకాలి; వారి మంచి చెడ్డలు చూడాలి. నలుగురు బిడ్డల తల్లికి అది ఒక మనిషి పెట్టు పని. పదిమంది బిడ్డలున్న స్త్రీ విషయం మరి చెప్పనక్కరలేదు. పదిమంది పిల్లల్ని కనమని పూర్వం నూతన వధువులను దీవించేవారు. అంటే అలాంటి తల్లి నలుగురు మనుష్యులకు దీటుగా పని చేయాల్సి వస్తుంది. ఆ పని అంతా ఇంట్లోనే జరుగుతుంది కదా! దాంతో ఆమె ఇల్లుదాటి అడుగు పెట్టటానికి ఆస్కారం ఉండదు. కుటుంబమే ఆమెకు ఇహమూ పరమూనూ. అందువలన ఆమె సాంస్కృతిక జీవితం కుంటుపడుతున్నది. సామాజిక వ్యవహారాలలో ఆమె కలుగజేసుకోవటానికి అవకాశం మృగ్యమవుతోంది. ఇక రాజకీయాలను గురించి వేరే చెప్పనక్కరలేదు. ఆమెకు ఇంచుమించుగా ప్రవేశము లేదు. ఒకరిద్దరు స్త్రీల పేర్లు ఉటంకించి దీనికి పూర్వ పక్షం చేయ ప్రయత్నించటం వృధాప్రయాస. దరహాం మీద పరిశీలన చేయాలి. అలాంటి అధ్యయన ఫలితమే ఈ వ్యాఖ్యలు.

క్రీ. పూ. 300 సం॥ నాటికి స్త్రీలకు వివాహమువేది తప్పని సరియైన సంస్కారమయింది. వేదకాలంలో ఉన్న ఉపనయనాది సంస్కారాలు ఆమెకు

కాకుండా పోయాయి. వివాహం స్త్రీ యొక్క విధ్యుక్త ధర్మమయింది. ఆమె బాల్యం, ఆమె విద్య, అన్నీ ఆమెను పెండ్లికి తయారు చేసాయి. అణగి మణిగి ఉండడం, విధేయత, సర్దుకుపోవటం ఆమెకు ఉగ్గుపాలతో నేర్పింది. హిందూసమాజం. ఆమె జీవితం వివాహంతో, దాంపత్యంతో, భర్తతో ముడి వేశారు. ఈ వివాహ బంధం స్త్రీని బానిస బంధంలోకి నెట్టనూవచ్చు లేక ఆమె వక్తిత్వాన్ని పెంచనూవచ్చు. కాని హిందూ వైవాహిక జీవితంలో స్త్రీ బానిసత్వంలోకి దిగజారింది. ఆమె బందీ అయింది. మనదేశంలో పది కాలాలపాటు నివాసం ఉండి చివరకు 'హిందు స్త్రీ' అనే గ్రంథం వ్రాసిన మహిళ ఎలా వివరించిందో గమనిద్దాం. "వివాహం వంశం కొనసాగించ డానికి సాధనం. వంశానికి ప్రాధాన్యత ఏర్పడింది....వంశానికి స్త్రీ రాణి, బానిస రెండూను. ఆమె కుటుంబం వల్ల జీవితాన్ని పొందుతున్నది. కుటుంబ కొసం జీవిస్తుంది. కనుక ఆమెయే కుటుంబం; కుటుంబమే ఆమె. ఆమె ఆర్థిక స్వాతంత్రాన్ని కోరదు. దానికోసం ఆరాటపడదు....భర్తయే దైవం, గురువు. కుటుంబం కోసం ఆత్మార్పణ చేసుకుంటుంది."[2] ధర్మశాస్త్రజ్ఞులు ఆమెకు పతివ్రతా ధర్మాన్ని నిర్దేశించారు. ఆ ధర్మ నిర్వచనం ఎంతవరకు వెళ్ళిందో, ఎంత వెర్రితలలు వేసిందో గమనించటం అవసరం.

"విశీలః కామవృత్తోవా గుణైర్వా పరివర్జితః
ఉప చర్యః స్త్రియా స్వాధ్యా సతతం దేవత్పతిః"[3]

భర్త యెంత శీలరహితుడయినను, కామప్రవృత్తి కలవాడయినను, ఏ సద్గుణములు లేనివాడయినను భార్య అతనిని దేవునిగా భావించి, పూజించ వలెనని దీని తాత్పర్యం. ఇది ఎవరో చెప్పినమాటకాదు. ఈనాటికి హిందూ సమాజానికి శిరోధార్యంగా ఉన్న సూక్తులను ప్రవచించిన మనువు చెప్పిన మాట. మరి భార్య శీలరహితయైతే దండనాది శిక్షలు నిర్ణయించిందే ఈ సమాజం. పాతివ్రత్యం విధించబడిందికాని 'పత్నీవ్రతం' అంటూ పత్ని యెడ భర్తయే ఉనికికల్గి యున్నాడు. భార్య అతనికోసం జీవించాలి. ఆమెకు అతనుతప్ప మరియొకటి లేదు. ఆమెకు వేరే వ్యక్తిత్వం లేదు. ఉన్నా ఆమె వ్యక్తిత్వం అతని వ్యక్తిత్వంలో లీనం అయిపోవాలి. వేరే వికసనాన్ని అభిల షించటం ధర్మ విరుద్ధం.

సీత, సావిత్రి, పార్వతి ఆదర్శమూర్తులుగా స్త్రీలోకానికి ప్రదర్శిత మయ్యారు. సీత రామునికోసం ఎన్నో కష్టాలకు లోనయ్యింది. తన ధర్మ నిర్వహణకు ప్రాధాన్యత ఇచ్చే భర్తకోసం ఎన్నో ఇడుమలలలో చిక్కింది. కాని ఏనాడూ రాముని నిందించలేదు. సావిత్రి భర్తకోసం యముడినే ఎదు ర్కొన్నది. పార్వతి శివునిభార్య. జన్మ జన్మలకూ శివుడినే పతిగా పడయ కోరింది. దక్షునికూతురుగా పతినింద భరించలేక సతి అయి ప్రాణత్యాగం చేసింది. హిమవంతుని కూతురుగా, పార్వతిగా పుట్టింది. తపస్సు చేయటంవలన —శంకరుని భర్తగాకోరి — ఉమ అయింది ఆకులుకూడా భుజించకుండా తపస్సుచేసినందుకు అపర్ణగా పేరుపొందింది. శారీరక సౌందర్యాన్ని ప్రద ర్శించి శంకరుని ఆమె భర్తగా పొందలేదు. ఆమె కష్ట సహిష్ణతను, పట్టు దలను చూపించి శంకరుని మెప్పుపొంది అతనిని భర్తగా పొందగలిగింది. ఈ ముగ్గురు స్త్రీలు భర్తకోసం కష్టాలుపడినవారే. అందులో దాక్షాయణిగా పార్వతి ప్రాణత్యాగం చేసిన స్త్రీ, వీరిని ఉదాహరణలుగా, ఆదర్శమూర్తులుగా, చూపటంలో ఆంతర్యం ఏమంటే భార్య భర్తకోసమే జీవించాలనే పరమార్థం స్త్రీలకు బోధించడమే.

## హిందూ స్త్రీకి వ్యక్తిత్వం ఉందా ?

"స్త్రీ భర్తలో ఐక్యమవుతుంది. ఆమె వ్యక్తిత్వం అతని వ్యక్తిత్వంలో లీనమవుతుంది. — ఆమె తనకుగాను హక్కులను కోరదు. అంటే ఆమెలో స్వతంత్రాలోచనాశక్తి, సృజనాత్మతలేదనికాదు. భర్తతో పోటీపడదు. అంతే."4 ఈ సందర్భంగా భోధాయన గృహ్య సూత్రం ఎమి చెప్పిందో చూద్దాము.

"అథాస్యా ఉపోత్థాయ, దక్షిణేన హస్తేన,

.... .... .... .... ....

.... .... .... .... ....

మయి సర్వాణి భూతాని, మయి ప్రజ్ఞాన మస్తుతే."

బో. గృ. సూ 1-4.

(వరుడు కుడిచేతితో వధువుయొక్క దక్షిణాంసమును గూర్చి బాహువునెత్తి, హృదయదేశమును స్పృశించి యిట్లు చెప్పుచున్నాడు. 'నా హృదయమందు నీ హృదయముండుగాక. నా చిత్తమందు నీ చిత్తముండుగాక. నా వాక్కు

ఏక మనస్కుడవై వినుము. నన్ననుసరించియే వ్రతము కలదానవగుము. నాతో సహచర్యవగుము. 'ఆమె కుడిచెవిలో ఇట్లు జపించుచున్నాడు. నీ మనస్సు నన్ను ప్రవేశించుగాక. నీ నేత్రము, భగము నన్ను ప్రవేశించుగాక. నీకు నాయందే సర్వభూతములు గన్పట్టుగాక. నాయందే నీకు ప్రజ్ఞానముండుగాక')

"శారీరకముగ రెండు వ్యక్తులైన స్త్రీ పురుషులు మానసికముగ నొకే వ్యక్తియగుటయే హిందూ దాంపత్య లక్షణం. జీవితకాలముననే కాక, మరణానంతరమున గూడ నిట్టి యైకముతో నుండుటయే ఆర్య దాంపత్య విశేషము"5 ఇది సనాతన అభిప్రాయమని త్రోసిపుచ్చవచ్చును. ఆధునిక కాలపువారు చెప్పిన విషయాలు ఇందుకు భిన్నం కావు. మహాకళా తపస్వి ఆనంద కుమారస్వామి ఈ విషయంలో ఏమన్నారో గమనిద్దాం.

"హిందూ సామాజిక శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం వివాహం సామాజిక సంబంధం; అలాగే నైతిక సంబంధం కూడాను. సంతానాన్ని కనటం ఋణాన్ని తీర్చటం. స్త్రీ పురుషుల ప్రతి కలయిక సాపేక్షతను తిరస్కరించటమే; కనుక శృంగార ప్రేమ సమాజవ్యతిరేకం.....హిందూ వివాహంలో విధ్యుక్త ధర్మ నిర్వహణవల్ల ఆనందం ఉద్భవిస్తుంది. ప్రాచ్య వివాహం సంప్రదాయబద్ధ ఏర్పాటుపై ఆధారపడుతుంది. అది యాదృచ్ఛికమైన స్పందన ప్రతి స్పందనలపై ఆధారపడదు. రామునివలె ప్రవర్తించుట, సీతవలె నడచుకొనుట లక్ష్యాలు. అంతేకాని 'వ్యక్తిత్వ వికాసం' లక్ష్యం కాదు. నియమం అంతకుముందే నిర్ణయించబడింది. భార్యాభర్తలు యథోచిత పాత్రలను నిర్వహించవలసిన వారు. అంతే. ఆ దృష్టిలో మనువు శాసనాలను మనం పరిశీలిస్తేనే వాటి అంతరార్థం మనకు గోచరిస్తుంది. భర్త యొక్క గుణాగుణాలతో భార్యకు ప్రసక్తి లేదు. ఆమె అతనిని దేవునిలాగా పరిగణించాలి. భర్తలో అనేక లోపాలున్నాయనే భావంతో భార్య అతనిని చిన్న చూపు చూడటం అంటే ఆదర్శమైన స్త్రీత్వాన్ని కాదని ఆమె తననే కించపరుచుకుంటున్నదన్న మాట. తన హోదాను తగ్గించుకుంటున్నదన్న మాట. పురుషుడు పవిత్రకులం శాశ్వత లీలాన్ని స్త్రీ ఆపేక్షించటం భర్త కొరకు మాత్రమే కాదు. ఆమె తనకోసమే అలా ఆశించాలి; అంతేకాదు, సమాజంకోసం దానిని కోరాలి. హిందూ సమాజం సమిష్టి నీతిపై ఆధారపడి వుంటుంది. ధర్మనిర్వహణాభావం శాశ్వతం కల్పడి.......అందుకే హిందూవివాహం అవిచ్ఛేద్యమయింది.

ప్రథమ కళత్రం వలన సంతానాన్ని పొందలేకపోతే మరో స్త్రీని వివాహమాడ మనటం తర్కబద్ధమైన ఆలోచన. హిందూ స్త్రీ కోరవలసింది స్వయం వ్యక్తీకరణకాదు. స్వస్వరూపదర్శనం. ఆ అవకాశాన్ని హిందూ సమాజం ఆమెకు ఇచ్చింది. 'స్త్రీత్వ' ప్రదర్శనకు సమాజం ఆమెకు వెసులుబాటు కల్పించింది.........జాతి జీవనాన్ని కొనసాగించటానికి స్త్రీ వాహిక; ప్రతీక కూడాను. జాతి వీరత్వాన్ని పోగొట్టకుండా శక్తిని విడదీయలేము; ప్రక్కదారి పట్టించలేము. ఆ శక్తినే స్త్రీ కొనసాగిస్తున్నది. వైశ్యుడు క్షత్రియుడనని అభివర్ణించుకోలేనట్లు, క్షత్రియుడు బ్రాహ్మణునిగా తనను చిత్రించుకోలేనట్లు స్త్రీ స్త్రీగా కాక మరో రకంగా సంచరించలేదు.........స్వేచ్ఛ అంటే స్వీయ వ్యక్తిత్వాన్ని నిర్ధారించుకోవటం కాదు........స్త్రీగా మనుగడ సాగించటానికి ప్రాచ్యదేశసామాజిక మత సంస్కృతి ఆమెకు అవకాశం ఇస్తున్నందు వలననే ఆమె ఈనాడు ఇలా (ఇంతగొప్పగా అని అర్థం॥ రచయిత) ఉన్నది. భారతీయుల ఆదర్శం కేవలం ఒక జాతికో లేక ఒక కాలానికో పరిమితం మయినది కాదు. ఎక్కడయితే స్త్రీ తనుగా స్త్రీగా వాస్తవానికి స్వేచ్ఛ పొంద గలదో అక్కడ ఆ ఆదర్శం సాక్షాత్కరిస్తుంది. ఎక్కడయితే తగినంత వీర ప్రధానమయిన మతమూ, కళ తమ సంస్కృతి ద్వారా ఆమెకు అవసరమైన రక్షణ ఇస్తాయో అక్కడ అది దర్శనమిస్తుంది.

........ఏ మేరకు అయితే స్త్రీత్వం అనే ఆదర్శాన్ని ఆమె కాదని తన స్వభావానికి భిన్నంగా ఎపుడు స్త్రీ సంచరించ పూనుకుంటుందో ఆమె తన శక్తిని కోల్పోతుంది.

తను కొన్ని ప్రత్యేక లక్షణాలను సంతరించుకున్నందువల్ల స్త్రీ తను పొందే శక్తికన్న తను ఆశించిన లక్షణాలను గుణాలను కలిగిన సంతానాన్ని నిరంతరంగా సృజించగలిగే శక్తి ఎంతో గొప్పది." 6

ఇవి ఉదాత్త ప్రవచనాలుగా కన్పించ వచ్చును. కానీ పూత మెరు గులు తొలగిస్తే తేలే అంశం ఒకటే ఒకటి. సంతానాన్ని కనడానికి స్త్రీ ఉద్దే శింపబడింది. ఆమె అందుకే తన జీవితాన్ని ధారపోయాలి. అదే ఆమె జీవితానికి సార్థకమూ సాఫల్యమూనూ. ఆమె కడుపు పండటమే ఆమె జీవి తానికి వరప్రసాదం. ఇది వ్యక్తిత్వ వికాసంకన్న గొప్పది. ఇది కేవలం ఆత్మ సాక్షాత్కారం. ఈ పొగడ్తల వెనుక ఉన్న పురుషాధిక్యతా భావం ఎంత కప్పిపుచ్చుకున్నా ఉబికి, పొంగి, పొరలి పైకి వస్తున్నది. మొదటి

భార్యకు సంతానం కలుగకపోతే పురుషుడు ద్వితీయ వివాహం చేసుకోవచ్చునట. మరి స్త్రీ .... కేవలం సంతానం కోసమే సుమండీ .... మరొక పురుషుని వివాహమాడవచ్చునా ?

ఈ ప్రశ్నను, ఏ స్త్రీ అయినా, వేస్తే అగ్నిపర్వతం బ్రద్దలయినంత ఆర్భాటం చేస్తారు పురుషపుంగవులు. స్త్రీ, పురుషులలో ఎవరి లోపం వలననైనా సంతానం కలుగకపోవచ్చని ఆధునిక విజ్ఞానం చెప్తున్నది. ఆ వియయం తెలియక మాట్లాడుతున్నారా కళాతపస్సులు. లేక తెలిసి ఇలా వ్రాస్తున్నారా తత్వవేత్తలు. ఇది మీమాంసంగా వదలివేద్దాము. సమాజ శ్రేయస్సు కోసం, జాతి వీరత్వాన్ని కొనసాగించే నిమిత్తం, మానవ సమాజపు మనుగడ కోసం భర్తను వదలి మారుమనువు చేసుకుంటానని ఏ స్త్రీ అయినా అంటే అమోదించగలదా పురుషలోకం. అపుడు ఆమెకు బోధింపబడిన "స్త్రీత్వం" అనే ఆదర్శం ఆమె వల్లిస్తే ఏమవుతుంది ?

ఇంతకూ యిక్కడ మరో తాత్వికాంశం ఉదయిస్తుంది. పైన ఉటంకించబడిన "ఆత్మ సాక్షాత్కారం" వ్యక్తి వికాసంలో భాగంకాదా ? వ్యక్తి వికాశం శారీరక మనో వ్యాపారాల ద్వారా "ఆధ్యాత్మికం" (SPIRITUAL) ద్వారా జరుగదా ? సంతానం కనటం కూడా స్త్రీ యొక్క వ్యక్తి వికాసంలో భాగమే. కాగా కొందరు స్త్రీలు ఒక అంశానికి మాత్రమే ప్రాధాన్యత యిస్తే మరికొందరు మరొక అంశానికి ప్రాముఖ్యతను ఆపాదిస్తారు. అది వారి ప్రతిభావ్యుత్పత్తులను బట్టి, ఇష్టాయిష్టాలను బట్టి ఉంటుంది. దానిని శాశ్వత విలువగా, శాశ్వత సత్యంగా ప్రతిపాదించనక్కరలేదు.

ఆనందకుమారస్వామి వెలిబుచ్చిన అభిప్రాయంలో ఒక అంశం గమనార్హం : భారతీయుల ఆదర్శం ఒక కాలానికి, ఒక 'ప్రాంతానికి పరిమితమయింది మాత్రం కాదు' అనే అభిప్రాయం సరియైనదే. కాని ఇంచుమించుగా ఒకే సామాజిక పరిస్థితులు ఉన్నప్పుడు కొద్దిపాటి తరతమ భేదాలతో ఇంచుమించుగా ఒకేతరహా సంస్కృతి, భావాలు విలసిల్లుతాయి. అందువలననే ప్రాచ్యదేశాలను గురించిన సర్వసామాన్య ధర్మం గా స్త్రీల "స్త్రీత్వాన్ని" గురించి నొక్కి పెట్టి ప్రసంగించడం జరుగుతున్నది.

స్త్రీలకు వ్యక్తిత్వం ఉంది కాని అది వారి "స్త్రీత్వం" ముందు తల వొగ్గాలని హిందూ సంస్కృతిని బలపరిచే వారి వాదన. అయితే స్త్రీకి ఆత్మ

గౌరవం ఉందా ? లేదని అంటే ఆమెను మనిషిగా చూడటం లేదన్నమాట. కనుక ఉందంటారు. అయితే అది ఎలా ప్రదర్శితమవుతుంది ? విధి నిర్వహణలో. భార్యగా విధుల నిర్వహణలో, పాతివ్రత్యపాలనలో, తల్లి గా బహు సంతానవతియై జాతిని పెంచడంలో. భారతస్త్రీకి విదేశీ వనితలకులేని భద్రత, ఆశ్రయం, రక్షణ ఉన్నాయని ఆమోదయుతంగా హర్షంవెలిబుచ్చిన మార్గరేట్ కార్‌మాచ్ ఏమన్నదో గమనించండి. "స్త్రీకి ఆత్మగౌరవం లేదని కాదు. ఆమె ఆత్మగౌరవం కుటుంబంతో తాదాత్మ్యం చెందడం వలన వస్తున్నది. పరస్పర ఆధారం' **(Matul Dependence)** వల్ల ఆమె ఆత్మగౌరవం ఉత్పన్నమవుతున్నది''7 మంటల సొగసు ముసుగు తొలగిస్తే ఆమె ఆత్మగౌరవం భర్త వల్ల, కుటుంబంవల్ల పుడుతుందని తెలుసుంది. భర్త లేని స్త్రీ, సంతానంలేని స్త్రీ నిరర్థకజీవి అన్నమాట.

ఇటీవల కొందరు హిందూ స్త్రీలు ప్రతిభావ్యుత్పత్తులను వెలరారుస్తున్నారు కదా. మరి ఇదంతా పైన చెప్పినదానికి విప్రతిపత్తి కదా అని ఎవరైనా అనవచ్చు. "కొందరు స్త్రీలు వ్యక్తులుగా తయారవుతున్నారు. అయినా చాలావరకు సమాజం నిర్ణయించిన పరిధిలోనే వారి వ్యక్తిత్వాలు వికసిస్తున్నాయి."8 ఇక్కడ ఒక సంఘటన గుర్తుకువస్తున్నది. ఒక ప్రముఖ మహిళ తన స్వభావాన్ని నిర్వచనంచేస్తూ 'నేను స్త్రీ విమోచనోద్యమకారిని కాదు. మానవవాదిని **(HUMANIST)**, అని చెప్పింది. ఈ మాటలు పై సూత్రాన్ని బలపరుస్తున్నాయేమో! భారతదేశంలో హిందూసమాజపు పరిధిని మించి మహిళ పురోగమించ వీలులేదా ? పరస్పర ఆదారం, సమిష్టి శ్రేయస్సు సమాజ పురోగతి ఇవి అన్ని స్త్రీకి శిరోధార్య మూలసూత్రాలని చెప్పబడినాయి. స్థూలంగా వీటిని ఎవరూ కాదనటానికి వీలులేదు. కాని వీటి వెనుక పురుషాధికారం, పురుషాధిక్యత తొంగిచూస్తున్నాయి. అక్కడే వస్తున్నది అసలు చిక్కు. స్త్రీని అస్వతంత్రగా చిత్రించాడు మనువు. ఆమెది సర్వదా పరాదీనపు బ్రతుకేనట.

" పితా రక్షతి కౌమారే భర్తారక్షతి యౌవ్వనే,
రక్షాన్తివార్ధక్యే పుత్రాన స్త్రీ స్వాతంత్ర్య మర్హతి." (మను 9-3

బాల్యమున తండ్రియు, యౌవనమున భర్తయు, వార్ధక్యమున, భర్త వానప్రస్థుడైనచో, పుత్రుడును రక్షింపవలెను. ఇది లౌకిక వ్యవహార కావచ్చును. ధర్మ నిర్వహణలో స్వతంత్రం ఉన్నదేమో ;

" అస్వతంత్రా ధర్మేస్త్రీ." (గౌతమ ధర్మ సూత్రం 18-1)
ధర్మంలో స్త్రీకి స్వాతంత్ర్యమే లేదు.

" భర్త అనుమతిలేనిదే స్త్రీ ఏ ధర్మము చేయుటకు వీలులేదు. ఉపవాసం, వ్రతం మున్నగునవి కూడ భర్త అనుమతితోనే జరుగవలయును. భర్త అనుజ్ఞలేకుండా చేయబడు వ్రతములు రాక్షసులకు చేరునని స్మృతులు చెప్పుచున్నవి."9

ఇది సనాతన పండితుల వాక్యం. వ్యక్తిత్వాన్ని, ఆత్మగౌరవాన్ని, స్వేచ్ఛను బాగా కుంచింపచేసినా స్త్రీలు — మనుషులు కాబట్టి — ఎదురు తిరుగుతారేమోనని భయపడినారేమో ధర్మశాస్త్రజ్ఞులు, 'నీతికోవిదులు' స్త్రీని దుర్మార్గంగా, అక్రమంగా, నీచంగా నిందిందించారు. ఆ నిందా వాక్యాలను కొన్నింటిని ఇచ్చట పొందుపరచటం జరుగుతున్నది.

"స్త్రీలు చంచల చిత్తలు" ఋగ్వేదం (X 95-15)
ఊర్వశి వదలివెళ్ళే పురూరవుడు చేసిన వ్యాఖ్య.

" స్త్రీ అసత్యానికి మారుపేరు" మైత్రాయణ సంహిత (I-10, 11)

" స్త్రీలు అసత్యం యొక్క అవతారమూర్తి" (రామాయణం)
సీత రాముని రక్షణార్థం పొమ్మంటే, అనవసరమని లక్ష్మణుడంటే, 'రాముడు చనిపోతే నీవు నన్ను పొందాలని చూస్తున్నావు' అని సీత అతనిపై నిందవేస్తే లక్ష్మణుడు కటకటపడి పలికినవి ఈ మాటలు. (III-45)

"స్త్రీలు క్రూరులు స్వార్థపరులు" రామాయణంలో కైకేయిని నిందిస్తూ ఆ సందర్భంలో ఉన్నది. (II 12-19)

" స్త్రీలలో మెరుపు యొక్క చంచలత్వం, ఆయుధం (కత్తి) యొక్క పదును, వేగయొక్క వేగం అన్నీ కలిసి ఉన్నాయి. (రామాయణంలో అగస్త్యుని పలుకులు( (II-13-67 )

సీతకు ఈ లోపాలు లేవని చెప్పాడని అల్టేకరు భావం. ఎదోఒక సందర్భంలో వెలిబుచ్చిన అభిప్రాయాలనీ, నిరాశా నిస్పృహలకు లోనైన పురుషులు ఉద్రేకపూరితులై వాడిన పదాలను నిక్కచ్చిగా, తీసుకోరాదని. అల్టేకర్ అభిప్రాయం వెల్లిబుచ్చారు.10

స్త్రీలను గురించి వెలువరించిన చెడు అభిప్రాయాలను కొన్నింటిని ఎగతాళిగా, తేలికగా అనేవారట. ఆ మాటలు మనస్సులోనుంచి రాలేదట.11 వాటికుదాహరణలు :-

"సుందరాకారుడై, సంగీత నాట్య శాస్త్రాలలో ప్రవీణుడైన పురుషుడు స్త్రీని తేలికగా లోబరుచుకోవచ్చును." (శతపథ బ్రాహ్మణం III 2, 3, 6)

" స్త్రీలు మనస్సులను అదుపులో పెట్టుకోలేరు "
(ఋగ్వేదం (III 33-17) ఇది ఇంద్రుని మాట.

ఇలా సర్దుదామని ప్రయత్నించిన ఆల్టేకర్‌కు కొన్ని వాక్యాలు చిక్కులను కలిగించాయి. స్త్రీల స్వభావాన్ని చెడుగా చిత్రించాలని ఉద్దేశపూర్వకంగా క్రీస్తు తరువాత స్త్రీలను గురించి వ్యాఖ్యానాలు చేసినట్లు ఆల్టేకరు అంగీకరించక తప్పలేదు."12

" స్త్రీ జీవితపరమార్థం ఇంద్రియ సుఖమే (మహాభారతం IV 39, 78)

" అనువైన ప్రదేశమూ, అవకాశమూ, ఆశ్రయమూ లేనందువలన మాత్రమే స్త్రీ గుణవంతురాలుగా ఉంటున్నది." పద్మపురాణం, సృష్టికాండం)

" స్త్రీల దుర్గుణాలను, లోపాలను వర్ణించాలంటే నూరు నాలుకలు కల మనిషికయినా నూరేండ్ల కాలం చాలదు" (మహాభారతం XIII 74, 78, 8)

" స్త్రీలతో చెలిమి అనేది లేదు. వారి హృదయాలు క్రూరమైనవి." (శతపథ బ్రాహ్మణం IX 5.1.9)

" స్త్రీలు దస్యుల సైన్యమూ ఆయుధాలు." (ఋగ్వేదం V 30-9)

" స్త్రీ, శూద్రుడు, శునకం, కాకి, అసత్యానికి, పాపానికీ, అంధకారానికి మారుపేర్లు." (శతపథ బ్రాహ్మణం)

" స్త్రీలను ఆధారపడేవారుగా చేశాడు దేవుడు. అందువలన వారు పురుషునిపై ఆధారపడుతారు" (శతపథ బ్రాహ్మణం)

" ఇదంతా పురుషులలో నిరాశావాదులు అన్ని దేశాలలో అన్ని కాలాలలో అన్న మాటలే"13 కానే 'ధర్మశాస్త్రాల చరిత్ర'లో అంటారు.

" స్త్రీయే పాపానికి మూలం." అని భీష్ముడు యుధిష్ఠరునితో చెప్తాడు." (మహాభారతం అనుశాసనపర్వం 40:4)

" స్త్రీలు అసత్య స్వరూపులు." మహాభారతం, అనుశాసనపర్వం 19.6)

" స్త్రీలకన్న దుర్మార్గమయినది మరేదిలేదు. కత్తిమొన, విషం, పాము, అగ్ని అన్నీ కలిస్తే స్త్రీ అవుతుంది. (మ. భా. అనుశాసనపర్వం 32-12, 29)

" లక్షమంది స్త్రీలలో ఒక్క పతివ్రత ఉంటుంది." (మ. భా. అనుశాసనపర్వం 19, 93)

" స్త్రీలను అదుపులో పెట్టలేము. పురుషులు వారివెంట పడటం లేదు కనుకను, తరువాత చుట్టూ పరిచారకులచేత పరివేష్టింపబడి యుండటం వలనను వారు భర్తలకు కట్టుపడి ఉంటున్నారు. (మ. భా. అ. ప. 38:16) రామాయణం ఈ విషయంలో తీసిపోలేదు.

" స్త్రీలు ధర్మంనుండి వెనుదిరిగినవారు, చంచల మనస్కులు కూౄరులు; విద్వేషం కలిగిస్తారు" (రామాయణం-అరణ్యకాండం 45.29.30)

" స్త్రీలకు శయనంమీద, పదవిమీద, ఆభరణాలమీద, అపరిశుద్ధ కాంక్షలమీద మోజు జాస్తి. వారు కోౄధాన్ని, నిజాయితీ లేమిని, దుష్ట ప్రవృత్తిని, దుర్మార్గపు నడతను కలిగిఉంటారు." (మనుధర్మశాస్త్రం-XI-17)

" మద్యపానం, దుష్ట సాంగత్యం, భర్తకు దూరంగా ఉండటం, తిరుగు మోతు తనం, పగలు నిద్రించుట, పరాయివారి ఇంట్లో ఉండటం ఇవి స్త్రీల నాశనానికి కారణాలు." (మనువు IX-13)

" స్త్రీలు భోగలాలసులు, చపలచిత్తులు, ప్రేమ రహితులు, పర పురుషుడు అందగాడైనా అనాకారియైనా వారికి బాధలేదు. పురుషుడైతే చాలు. భర్తను ద్వేషించి అతని వంచన జేరతారు." (మనువు-IX 14, 15)

" మగవానిని ప్రలోభపరచుటయే స్త్రీ నైజం. పండితుడయినా పామరుడయినా మగవానిని ప్రక్కదారిన పట్టిస్తారు పడతులు. అందుకే వివేకులు స్త్రీలపట్ల అజాగ్రత్తగా ప్రవర్తించరు." (మను IX 213, 214 : మహా భార. అ. ప. 48.37, 38)

" స్త్రీలకు ఉద్రేకం మగవానికన్న ఎనిమిదిరెట్లు."14 (బృహత్పరాశర)

ఈ నిందలను వ్యతిరేకించినవారు కాళిదాసు, బాణుడు, భ వ భూ తి, వరాహమిహిరుడు. కానీ వారి అసమ్మతికి విలువలేకుండా పోయింది. జాతక కథలలో ఒకదానిలో బోధిసత్వుడు ఇలా అంటాడు. "స్త్రీ చేత పరిపాలింప బడే దేశానికి అపకీర్తి సంభవిస్తుంది. స్త్రీ ఆధిపత్యానికి లొంగే పురుషులు అప్రతిష్ట పాలవుతారు."[15]

" స్త్రీలకు త్వరగా కోపం వస్తుంది; వారు ఉద్రేకపరులు, అసూయా పరులు. వారు మందబుద్ధులు." (సుల్ల వగ్గ —1.6)[16]

మనువు, శుక్రుడు, చాణుక్యుడు, యాజ్ఞవల్క్యుడు స్త్రీని తక్కువచూపు చూచారు.

కేవలం పురుష ధర్మశాజ్ఞులు స్త్రీని నిందిస్తే బాగుండదేమో! స్త్రీలచేత స్త్రీలను నిందింపచేశారు.

పరపురుషుని చూడనంతవరకే స్త్రీ పతివ్రతగా ఉంటుందని శివపురాణంలో అరుంధతిచేత అనిపించారు.

మహాభారతంలో నారద పంచచూడుల సంవాదం గమనార్హం. పంచచూడ గంధర్వ స్త్రీ. "స్త్రీని సర్వదుర్గుణాలతో దేవుడు సృష్టిచేశాడు. వాళ్ళను మించిన పాపకర్ములు లేరు. మరణం, నరకం వగయిరాలన్నింటితో స్త్రీ సరితూగగలదు. అసత్యంయొక్క అవతారమూర్తి ఆమె. శాస్త్రజ్ఞానం లేక, ఇంద్రియనిగ్రహంలేక స్త్రీలు ఎల్లప్పుడూ ఆభరణాలు, దుస్తులు, ఆహార, పానీయాలను గురించి ఆలోచిస్తుంటారు." (మ. భా. అ. ప. 30)

స్త్రీలు చంచలచిత్తులనీ, అవిశ్వాసులనీ ఒక స్త్రీ చెపుతుంది. (మ. భా. XIII 73.8)

"స్త్రీల కాముకత్వం తీవ్రమయినది. కామతృప్తితో వారు ఎంత నికృష్ట పురుషునితోనయినా సంగమిస్తారు." (మ. భా- XIII.73:17)

" వారు వావి వరుసలను, వివిధ నిషేధాలను పాటించరు. వారికి కావలసింది కామతృష్ణ తీరటమే" ఇలా సాగింది నింద.

దేవీ భాగవతంలోని ఈ దిగువ సూక్తులను మనం గుర్తించాలి. ఎందుకంటే ఒక స్త్రీని దేవతామూర్తిగా చిత్రించిన గ్రంధమది.

" స్త్రీలు స్నేహితులు కారు, శత్రువులూ కారు."

" స్త్రీ ప్రేమలో నిజాయితీ లేదు."

" స్త్రీలు జలగలు "

పురుషుల కసికి ఇవి పరాకాష్ట వ్యాకాలు. దీనికంతా ఒక వివరణ యిచ్చారు కానే పండితులు. స్త్రీలనింద అంతా స్త్రీలవల్ల నష్టపోయిన వారి నుండి, స్త్రీలపై కోపం ఉన్నవారినుండి వచ్చిందట. స్త్రీలను నిందించడానికి ఇలా వ్రాయలేదు. పాతివ్రత్యాన్ని, విధేయతను స్త్రీలలో వ్యాప్తిచేయటానికి ఇలా చేశారట.17 కానే పండితుని సంజాయిషీ యుక్తియుక్తంగా లేదు. ధర్మాలు చెప్పటానికి పూనుకున్న వ్యాసుడు, న్యాయసూత్రానుసారంగా ధర్మాన్ని వివరించడానికి పట్టంకట్టుకున్నామనే మన్వాదులు ఎందుకు ఈ దుశ్చర్యకు గడంగారు ? పురుష ప్రాధాన్యతకల సమాజంలో మగవారి పెత్తనాన్ని సుస్థిరం చేయటానికి చేసిన ప్రయత్నమిది. లేక మరోరకంగా ఆలోచిస్తే కుటుంబములో ఉండే స్త్రీలను నిందించి, బెదిరించి, అదిరించి లొంగ దీసుకుంటే తప్ప పురుషాధిక్యత నిలబడదని గ్రహించి చేసిన నిర్ణయం అది.

వైరాగ్య జీవితాన్ని ఆశించినవారు ఈ నిందకు పూనుకున్నారని చెప్పి తప్పించుకోవటానికి వీలులేదు. మహాభారత కాలానికి శ్రమణకుల ప్రభావం తగ్గింది. బౌద్ధం, జైనం తగ్గుముఖం పట్టాయి మనుధర్మశాస్త్రం పుట్టేనాటికి. వైదికధర్మాన్ని ప్రతిపాదించినవారు గార్హస్థ్య జీవితాన్ని నిరసించలేదు. కనుక స్త్రీని ప్రత్యేకంగా నిందించవలసిన పనిలేదు. అసలు సంగతి అది పురుషాధిక్య సమాజపు లక్షణం.

స్త్రీలు తమమీదినిందను పదేపదే విని అమాయకంగా అదంతా నిజమని నమ్మారు. ఆనాటికి స్త్రీకి ఉపనయనాదులు పోయాయి. చదువుకునే అవకాశాలు సన్నగిల్లాయి. పెండ్లికోసం జీవించటం మాత్రమే ఆశయమయింది. దానితో అజ్ఞానం ఉదయించింది. అజ్ఞానం వల్ల ఉదయించే మనోరుగ్మతలు వారికి కలిగాయి. వారికి ఆత్మ న్యూనతాభావం ఏర్పడింది. తమపై తమకే ఏహ్యభావం కలుగసాగింది. పురుష ప్రపంచపు భావాలను యథాతథంగా స్వీకరించారు. పురుషులు ప్రవచించిన విలువలను తమవిగా చేసుకున్నారు ఆ సంస్కృతీ భావాలు వారి మనస్సులలో స్థిరనివాసం ఏర్పరుచుకున్నాయి.

పతివ్రతా ధర్మాలను స్త్రీల చేతనే చెప్పించారు నేర్పుగా 'ధర్మవిదులు.' శంకరుని కోరికపై ఉమ పతివ్రతా ధర్మాలను వివరించింది. తన భర్తలపై తనకు గల ప్రాబల్యానికి కారణాలను ద్రౌపది సత్యభామకు విశదపరచింది. వాట్ని తరువాత వచ్చే అధ్యాయాలలో లోతుగా విచారించవచ్చును. తేలిన దేమంటే, జైళ్ళలో బందీలను కాపలాకాయటానికి బందీలను నియమిస్తారు. అలాగే ఒక దేశం మరో దేశాన్ని పాలిస్తుంటే విదేశస్థులు స్వదేశస్థులను పోలీసులుగా, సిపాయిలుగా వాడుకుంటారు. అదే పద్ధతిలో, స్త్రీలకు పాతివ్రత్యాన్ని ఉపదేశించి, వీరిలో సహజంగా ఉండే స్వేచ్ఛా ప్రియత్వాన్ని అణచి వేయటానికి స్త్రీలనే వినియోగించారు. స్త్రీలు తమ కాళ్ళకు తాము బంధాలు తగిలించుకోవటమేగాక తమ మనస్సులనుకూడ బందీకృతం చేసుకున్నారు. అలాంటి స్త్రీలు ఉపదేశికలై పురుష ధర్మశాస్త్రజ్ఞుల మెప్పును, పొగడ్తను పొందారు. 'పతివ్రత' అనే బిరుదును పొందారు. అమాయకంగా, అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతూ పురుషాధిక్య సమాజాన్ని అంటిపెట్టుకొని జీవయాత్ర చేస్తున్నారు.

ఎంతగా "డూడూబసవన్నా" అనటం నేర్పినా, క్రూరంగా దారుణంగా హింసిస్తే జంతువు అయినా ఎదురు తిరుగుతుంది. ఇక మనిషి సంగతి వేరే చెప్పనక్కరలేదు. మచ్చికయిన గొడ్డుకు కూడా పచ్చగడ్డి వేస్తేనే మంచిగా, దండిగా పాలు యిస్తుంది. ఈ సత్యాన్ని పశు పాలకులయిన ఆర్యులు గ్రహించకపోలేదు. అందుకనే స్త్రీలను గురించి కొన్ని అనునయ వాక్యాలు పలికారు.

" యత్ర నార్యాస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతా :
యత్రైతాస్తు నపూజ్యన్తే సర్వాస్తత్రా ఫలాః క్రియా :" (మను 3-56)

'స్త్రీలు ఏ గృహంలో పూజింపబడుచున్నారో అచట దేవతలు క్రీడించుచున్నారు. స్త్రీలు ఏ గృహమునందు పూజింపబడుటలేదో ఆ గృహమున చేయబడు సత్కర్మలన్నియు నిష్ఫలములు, అని ఆశ్లోకానికి అర్థం

" స్త్రీలనగా గృహమును ప్రకాశింపజేయు దీపములనియు, వారు సాక్షాత్తుగా లక్ష్మీదేవులే యనియు కూడా మనుస్మృతి చెప్పుచున్నది. (మను 9-27) కావున హిందూమతములో స్త్రీలకు గొప్ప గౌరవస్థానం కలదని చెప్పవలసి యున్నది', అని ఇటూవల్లభుల పురుషోత్తంగారిలాంటి సనాతనుల అభిప్రాయం.18

మనుధర్మశాస్త్రం ప్రకారం స్త్రీలను పూజించటమంటే ఏమిటి?

ఏ స్త్రీ అయితే పతివ్రతా లక్షణాలను తనవిగా చేసుకుంటుదో, ఏ స్త్రీ అయితే పురుషాధిపత్య సమాజాన్ని యథాతథంగా స్వీకరిస్తుందో, ఆ స్త్రీకి అన్నపానీయాదులకు ధన కనక వస్తువాహనాదులకు లోటురాకుండా చూడటం ఆ పనిని హిందూ పురుషులు ఈనాటికీ నెరవేరుస్తున్నారు. అలా దయతో, భూతదయతో ప్రవర్తిస్తున్నారు.

సనాతనుల బోధ గమనింపండి. "ప్రతి పురుషుడును స్త్రీకి కూడ కష్టసుఖములు కలవని గుర్తించి" 'దయాసర్వభూతేషు' అను ప్రధమాత్మ గుణమును స్త్రీపట్ల ముందుగ ఆచరణ యందుంచుట అత్యవసరము. భార్యను క్రూరముగ చూచుచు లోకమునంతను దయతో చూచినను భగవంతుడు హర్షింపడు, మీదుమిక్కిలి భార్యను ప్రేమతో చూచువానిని దేవతలాశీర్వదింతురని మన శాస్త్రములు చెప్పుచున్నవి.

" దేవదత్తాం ప్రియాస్వే భార్యాం విందం తేచ్ఛయాత్మనః
తాం సాధ్వీంబిభృయాన్నిత్యం దేవానాం ప్రియమాచరన్"

(మను 9-95)

ప్రియురాలైన భార్యను దేవతలు పురుషునికి యిచ్చారు. అతడు ఆమెను తన యిచ్ఛచే వివాహమాడటం లేదు. దేవతలకు ప్రియమాచరించుచున్నవాడయి అట్టి సాధ్వివి ఎల్లప్పుడు భరింపవలయును, అని తాత్పర్యం.19

సాధ్వియైన భార్యను పరిత్యజించిన వానికి ఘోరమైన ప్రాయశ్చిత్తములు విధింపబడినవి;

" సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యాతథైవచ
యస్మిన్నేవ కులేనిత్యం కళ్యాణం తత్రవైధ్రువం" (మను 3-60)

(ఏ గృహంలో భార్యతో భర్తయు, భర్తతో భార్యయు నిత్యము సంతుష్టులై యుందురో, ఆ గృహము నిత్యకళ్యాణముగా నుండుట నిశ్చయము).20

అలా యింటిలో శాంతి కోసం హిందూశాస్త్రజ్ఞులు జాగ్రత్తపడ్డారు.

భార్యను సరిగ్గాచూస్తే ఈ అధ్యాయం మొదట్లో చెప్పినట్లు ఆమె శక్తి వంచనలేకుండా 'ఆత్మ సంతృప్తితో' చాకిరీ చేస్తుంది; హిందూ పురుషునికి

సుఖానికి సుఖం, భోగానికి భోగం దక్కుతాయి. ఆమెకు చీరెలు, నగలు యిచ్చి, ఆమెచేత వ్రతాలు చేయించి (తన ఆయురారోగ్యాభివృద్ధి కోసం) ఆమెకు "గృహలక్ష్మి" అనే బిరుద ప్రదానంచేసి పబ్బం గడుపుకున్నారు హిందూ పురుషపుంగవులు.

హిందూ నాగరికతలో హిందూస్త్రీ స్థానాన్ని హిందూ సంస్కృతిపట్ల ఎంతో సానుభూతితో పరిశీలించిన ఆల్టేకరు చెప్పిన మాట :—

"స్త్రీల స్థితి గత రెండు వేల సంవత్సరాల నుండి దిగజారిపోయింది"[21]

" మధ్యయుగంలో ఆస్తిహక్కు విషయంలో స్త్రీ పరిస్థితి మెరుగయింది. మతం మొదలగు విషయాలలో స్త్రీ స్థితి హీనమయింది. శూద్రుల స్థితితో ఆమె స్థితి సమతుల్యమయింది."[22]

తరువాత బ్రిటిష్ యుగం సంగలోపడేవరకు స్త్రీల స్థితి అలాగే ఉంది.

వేదకాలంలో స్త్రీల పరిస్థితి మెరుగుగా ఉండి తరువాత బౌద్ధకాలంలో పతనమయిందని త్రిప్పికొట్టాడు అంబేత్కరు.[23]

ధర్మశాస్త్రాలు, పురాణాలు స్త్రీలకు ద్వితీయ స్థానం ఇచ్చాయి. భర్త నీడలో బ్రతికే మనిషిగా భార్యను మలిచాయి. కాగా ధర్మశాస్త్రాలలో అచ్చటచ్చట కనుపించే స్త్రీలకు అనుకూలమయిన మాటలు ప్రక్షిప్తాలు.[24]

ఎవరో కొద్దిమంది ఉదార స్వభావులు తప్ప తతిమ్మా సంహితకర్తలు, ధర్మశాస్త్ర రచయితలు, టీకాకారులు, భాష్యకారులు వీరంతా స్త్రీని నిరాదరణ చేసినవారే. కాగా, క్రీ. పూ. 2500 నాడు స్త్రీకి మతపరంగా, విద్యపరంగా, వివాహపరంగా కొంత స్వతంత్రత ఉండేది. అది పూర్తిగా నశించిపోయింది సనాతన హిందూ సమాజంలో. అయితే నాలుగువేల అయిదు వందల సంవత్సరాల మీద ఏమీ మార్పురాలేదా అంటే, మార్పు జరిగింది. అది మౌలికం కాదు. మెయిన్ అన్నట్లు, "హిందూమత, వ్యవహార సూత్రాలు శతాబ్దాల తరబడి మార్పుచెందుతూ వచ్చాయి. కొన్ని అంశాలలో అభివృద్ధి, కొన్నింట్లో పతనం బ్రాహ్మణుల ప్రాబల్యంవల్ల సంభవించింది. స్త్రీల శాసన సంబంధమైన ప్రతిపత్తికి భంగంకలిగే విధంగా సూత్రాలు — మరేయితర సూత్రాలు ఇలా మారలేదు — ఘోరంగా నష్టదాయకంగా మార్చబడినాయి."[25]

ఇంతవరకూ ప్రస్తావించబడిన హిందూ సమాజం బ్రిటిషువారు శాసనం ద్వారా ఐక్యం కలిగించుకోవడం ప్రారంభించేవరకు పరిణామం చెందిన సమాజం అని మనం గమనంలో ఉంచుకోవాలి. ఈ పరిణామానికి ఋగ్వేదం, అథర్వవేదం, శ్రౌత సూత్రాలు, గృహ సూత్రాలు, ధర్మసూత్రాలు, స్మృతులు, ధర్మశాస్త్రాలు వాటి వివరణలు, భాష్యాలు ఈ గ్రంధాలూ; ఇండోయిరాని యనుల వలస, హూణుల, శకుల దండయాత్రలు, ముసల్మానుల దాడులు, ముసల్మాను రాజ్యస్థాపన, పాశ్చాత్యుల దేశ ప్రవేశం ఇవన్నీకూడ హిందూ సమాజంపై ప్రభావం చూపాయి. అంతేగాక బౌద్ధ, జైన మతాలు దూడ కొంతలో కొంత హిందూ సమాజాన్ని మలిచాయి. చివరకు అవి హిందూ సమాజంలో భాగాలుగా మిగిలిపోయాయి.

హిందూ స్త్రీ మూర్తిత్వం యొక్క పరిణామాన్ని చారిత్రికంగా గమనించాలి. కేవలం ముమ్ముందుగా నిర్ణయించుకున్న సిద్ధాంతాలను బట్టి మదింపు వేసుకుంటే పూర్తి సత్యం బోధపడకపోవచ్చును. ఏదైనా స్త్రీ యొక్క వ్యక్తిత్వాన్ని గురించి రెండు రకాల అభిప్రాయాలు; దృక్కోణాలు ఉన్నాయి. స్త్రీ మానవిగా తన వ్యక్తిత్వ వికాసం కొరకు కృషి చేయవలసి యున్నది. అందులో భాగమే ఆమె తల్లిఅవడం. కాని, తల్లికావడమే ఆమె జీవిత పరమార్థం కాదు. అది ఆమె జీవితంలో ఒక అంశం. ఇది ఒక ఆలోచనా రీతి. మరొకటి మరో రకంగా ఉన్నది. స్త్రీ గాని, పురుషుడు గానిస మాజ శ్రేయస్సుకోసం తమ వ్యక్తిగత ఆకాంక్షలను సరిదిద్దుకోవాలి. సమాజం' మానవ సమాజం కొనసాగాలి. దానికి సంతానోత్పత్తి అవసరం. స్త్రీ మాత్రమే సంతానాన్ని కనగలదు. ఆమె మాత్రమే మానవజాతిని కొనసాగించగలదు. కనుక ఆమె అందుకోసం తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించాలి. విశిష్టమైన శక్తియుక్తులను వాడాలి. అంటే ఆమె తన స్త్రీత్వంపై నొక్కిపెట్టాలి. ఈ సందర్భంగా ఆమె పురుషుని సహకారం తీసుకోవాలి. అంతేకాదు స్త్రీత్వ సాక్షాత్కారాన్ని పొందాలి. అలా పొందటానికి ఆమె సంతానాన్ని కనడమే కాక, పెంచి పోషించాలి. అంటే అందుకు అవసరంగా - తప్పనిసరిగా - ఆమె ఇంటికి అంకితమయిపోవాలి. గృహిణిగా మారాలి. భర్తను గృహ యజమానునిగా చేసుకోవాలి. భర్తను - పోషణకర్త కనుక - పాతివ్రత్య ధర్మాన్ని నెరవేస్తూ పూజించాలి. చివరకు భర్తతోడిదే ఆమెకు లోకం కావాలి. భర్త ద్వారానే ఆమె తన వ్యక్తిత్వాన్ని వికసన చేసుకోవాలి. భర్త వ్యక్తిత్వంలో

తన వ్యక్తిత్వాన్ని సమ్మిళితం చేసుకోవాలి. అంటే చివరకు తనదంటూ వేరే వ్యక్తిత్వాన్ని ఆమె మిగుల్చుకోరాదు. ఈ ఆలోచనా స్రవంతిని హిందూ సమాజం ఆమోదించింది. దీనిని ఆచారాలతో సంప్రదాయాలతో బలపరుస్తున్నది. మత ప్రవచనాలతో గట్టి చేస్తున్నది.

మొదటి ఆలోచనా పద్ధతి ఆధునికమయినది. కనుక మొదటిది కావాలో, లేక రెండవదైన హిందూ సమాజ ఆలోచనా రీతి కావాలో భారతదేశ స్త్రీలు తేల్చుకోవలసిన సమయం ఆసన్నమయింది.

స్త్రీ యొక్క వివిధ దశలలో ఈ హిందూ సంస్కృతి ఎలా పని చేస్తున్నదో ముమ్ముందు నిశితంగా, గాఢంగా పరిశీలిద్దాం.

---

అధ్యాయం 1

## పాదదీపికలు

1) ఉపోద్ఘాతం : భారతీయ స్త్రీలు, సం॥ దేవకీజైన్
2) హిందూ స్త్రీ : మార్గరెట్ కార్మాచ్ (ఏషియా పబ్లిషింగ్ హౌస్ 1961)
3) మనుధర్మ శాస్త్రం 5 - 154
4) హిందూ స్త్రీ : మార్గరేట్ కార్మాచ్ - పుట 191 (ఏషియా పబ్లిషింగ్ హౌస్ 1961)
5) హిందూమతం : జటావల్లభుల పురుషోత్తం.
(పబ్లిషరు : జే. గోపాలం. కాకినాడ 1947) పు. 147, 148.
6) శివుని లాస్యం (The DANCE OF SIVA)
ఆనందకుమారస్వామి - పుట 86
(మార్గరేట్ కార్మాచ్ పుస్తకం పుట 137లో వుంది)
7) అదే పుస్తకం : పుట 178
8) ,,

9 హిందూమతం : పుట 143

10) హిందూ నాగరికతలో స్త్రీల స్థానం : ఆల్టేకర్
The Position of Women in Hindu Civilisation: Dr. A. S ALTEKAR MOTILAL BANARSIDASS, Delhi. Second Edition, Reprinted 1978 Page 319,

10) డిటో. పుట 320

12) డిటో. పుట 320

13) ధర్మశాస్త్రాల చరిత్ర : పి. వి. కానే
History of Dharma Sastras : P. V. KANE, (BHANDARKAR, ORIENTAL Research Institute. PUNE 1941 VOL 2, PART-I పుట 576.

14) డిటో పుట 578

15) అశోకరుద్ర వ్యాసం.
'CULTURE OF RELIGIOUS Influenc ASHOK RUDRA In "Indian Women" Devaki Jain, Publications Division 1975 Page 43)

16) డిటో పుట 43

17) కానే ధర్మశాస్త్రాల చరిత్ర వాల్యూమ్ 2 పార్టు 1 పుట. 581

18) హిందూమతం, జటావల్లభుల - పుట 157

19) డిటో : పుట - 149

20) డిటో : పుట - 151

21) ఆల్టేకరు - పుట 359

22) కానే ధర్మశాస్త్రాల చరిత్ర - పుట 582

23) హిందూ స్త్రీ ఉచ్ఛదశ, పతనం
The Rise and Fall of Hindu Women :
Dr. B. R. AMBEDKAR, Bheem Patrika Publishers (1977)

24) యుగయుగాల్లో భారతీయ మహిళలు
P. Thomas, Indian Women Through The Ages (ASIA Publishing House (1964)
అధ్యాయం : అంధకార యుగం.

25) సంస్థల చరిత్ర : మెయిన్
LECTURES ON EARLY HISTORY OF INSTITUTIONS : MAIN, 1914) పుట 326.

# కాలజ్ఞాన పట్టిక

క్రీ. పూ 3000 సం॥ : సింధు నాగరికత

క్రీ. పూ. 2500 : రుగ్వేదం
అధర్వవేదం

క్రీ, పూ. 1000 : మహాభారత కధా కాలం
రామాయణ కధ

క్రీ. పూ. 2500 నుండి క్రీ. పూ. వెయ్యి వరకు :
వేద సంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు

క్రీ. పూ, 1500 : కురల్



క్రీ. పూ. 800 నుండి క్రీ. పూ. 400 వరకు : శ్రౌత సూత్రాలు :-
ఆపస్తంబ, అశ్వలాయన, బౌద్ధాయన, కాత్యాయన, సాంఖ్యాయన వగైరాలు.
గృహ్యసూత్రాలు : అశ్వలాయన, ఆపస్తంబ వగైరా.

క్రీ. పూ. 600 - క్రీ. పూ. 300 : ధర్మసూత్రాలు, వశిష్ఠ, గౌతమ ఇత్యాది (కానే)

క్రీ. పూ. 800 - 700 : జైనమత స్థాపన

క్రీ: పూ. 600-500 : బౌద్ధం, మహావీరుడు

క్రీ; పూ. 5 శతాబ్దం : బౌద్ధాయనుడు

క్రీ. పూ.500 క్రీ, త. 500 : సూత్రాలు, ఇతిహాసాలు, తొలిస్మృతులు

క్రీ, పూ. 400 - 300 : కౌటిల్యుని అర్థశాస్త్రం )ఆల్టేకర్)

క్రీ, పూ. 300 - క్రీ. త. 100 : ,, ,, (కానే)

క్రీ. పూ. 326 : అలెగ్జాండరు దండయాత్ర

క్రీ. పూ. 400 - క్రీ. త. 100 : ధర్మసూత్రాలు

క్రీ. పూ. 2వ శతాబ్దం : మౌర్యను సామ్రాజ్య పతనం.

క్రీ. పూ. 200 క్రీ. త. 300 : విదేశీయుల దండయాత్రలు

క్రీం. పూ. 200 - క్రీ. త. 200 : మనుధర్మశాస్త్రం, మనుస్మృతి

క్రీ. త. 1, 2, శతాబ్దాలు : వాత్స్యాయన కామసూత్రాలు; శూ ద్రి కు ని మృచ్ఛకటికం

క్రీ. త. 200 - 1200 : ధర్మశాస్త్రాలు

క్రీ. త. 100 - 300 : యాజ్ఞవల్క్యస్మృతి

క్రీ. త. 100 - 400 : నారద స్మృతి

క్రీ. త. 200 - 500 : వైఖానస స్మార్త సూత్రం

క్రీ: త. 300 - 500 : బృహస్పతి స్మృతి

క్రీ. త. 300 - 600 : పురాణాలు :- వాయు, విష్ణు, మూర్కండేయ, కూర్మ, మత్స్య ఇత్యాది.

క్రీ. త. 400- 600 : కాత్యాయన స్మృతి

క్రీ. త. 500 - 587 : వరాహమిహిరుడు (బృహత్ సంహిత రచయిత)

క్రీ. త. 650 నుండి 755 : తంత్రవార్తిక : కుమారుడు

క్రీ. త. 7వ శతాబ్దం : బాణుడు

క్రీ. త. 600 - 900 : ఇతర స్మృతులు, కొన్ని పురాణాలు (కానే)

క్రీ. త. 500 - 1000 : ఇతర స్మృతులు (ఆల్టేకరు)

క్రీ. త. 7 నుండి 12వ శతాబ్దం : అంధకార యుగం. (ఆల్టేకరు)

క్రీ. త. 300 - క్రీ. త. 1200 వరకు : సంస్కృత నాటకాలు

క్రీ; త. 500 - 1800 వరకు : తరువాతి స్మృతులు, భాష్యాలు, వ్యాఖ్యానాలు, ధర్మకోశాలు ((ఆల్టేకరు)

క్రీ. త. 8వ శతాబ్దం : భవభూతి-మాలతీ మాధవం

క్రీ. త. 788 - 820 : శంకరాచార్యులు

క్రీ. త. 800 - 850 : విశ్వరూప (యజ్ఞవల్క్య స్మృతిపై భాష్యం)
క్రీ. త. 700 - 1150 : రాజతరంగిణి (కాశ్మీర చరిత్ర)
క్రీ. త. 900 : మేధాతిథి, మనుస్మృతిపై భాష్యం
క్రీ. త. 1100 : విజ్ఞానేశ్వరుని మితాక్షర.
(యాజ్ఞవల్క్య స్మృతిపై భాష్యం)
క్రీ. త. 11వ శతాబ్దం : మహమ్మద్ గజనీ దండయాత్ర.
క్రీ. త. 11వ శతాబ్దం : మహమ్మదుగజనీ దండయాత్ర
క్రీ. త. 1125 : అపరార్క : యాజ్ఞవల్క్యస్మృతిపై భాష్యం
క్రీ. త. 1192 : మహమ్మదు ఘోరీ
క్రీ. త. 1525 : తొలి ముస్లిం పాలన ముగియుట.
క్రీ. త. 1200 - 1800 : మధ్యయుగపు తరువాతి దశ.

అధ్యాయం

# 2 జననం, బాల్యం, విద్య

జననం :- శిశువు జన్మించినదనే వార్త వినగానే ప్రసవించిన తల్లి విన్నదనంతో కృంగిపోతుంది. తండ్రి చింతాక్రాంతుడవుతాడు, తాత ముత్తవ్వలు తల్లడిల్లిపోతారు. ఇది దరహంమీద జరిగే సంగతి. ఏదో కొలది కుటుంబాలలో తద్వ్యతిరేకంగా జరుగవచ్చును. కాని సర్వసాధారణంగా ఈ నాడు కూడ హిందూసమాజంలో ఈ భేదం కన్పిస్తూనే ఉంది. పరాయి ఇంటికి వెళ్ళే పిల్ల అని, పెండ్లి సందర్భంగా కట్న కానుకలను, ఇతరమైన విందులు వినోదాలకు ఎక్కువగా ధనం వ్యయం చేయవలసి వస్తుందని కుటుంబాలు భయపడటం తటస్థిస్తున్నది. అదే మగసంతానమయితే హర్షా మోదాలు వెల్లివిరుస్తాయి. అందరి ముఖాలు కళకళలాడతాయి. కాటికి కాలు జాచి కూర్చున్న నాయనమ్మనుండి ఇంట్లో తిరుగాడే కుమార్తె వరకు అందరూ సంతోష స్వాంతలవుతారు దానికి కారణాలు అనేకం. తలకు కొరివిపెట్టి, శ్రాద్ధాదులు నెరవేర్చేవాడని కొందరు, వంశోద్ధారకుడని మరికొందరు, సంపాదించి కుటుంబభారాన్ని మోస్తాడని తదితరులు ఇలా అందరూ తలా ఒక కారణాన్ని పురస్కరించుకొని ఆనంద సముద్రంలో తేలియాడతారు. చివరకు పురుడుపోసే మంత్రసాని పొందే బహుమతిలో కూడా తేడా ఉంటుంది. మగపిల్లవాడు కలిగితే ఆమెకు వచ్చే కట్నం (బొడ్డుకోసినందుకు వచ్చేది) లో ఆడపిల్ల కలిగినపుడు సగమే వస్తుంది. ఇలా పురుష సంతానాన్ని ఆహ్వానించ టము, స్త్రీ సంతానాన్ని అభిలషించక పోవటం ఈనాటికి ఆచారంగా వస్తున్నది. దీనికి పూర్వకాలంలో పునాదులున్నాయా లేదా అని విచారించడం అవసరం.

ఋగ్వేదకాలంలో స్త్రీ శిశు జనాన్ని దురదృష్టంగా భావించినట్లు దాఖలాలు లేవు. కాగా పురుష సంతానం కావాలని అనేక ఋక్కులున్నవి. "అయగ్నీః క్రొత్తది గాయత్రీ చందస్సుగలది యగు నీ సూక్తములో స్తుతింపబడిన వాడవై మాకు ధనమును కొడుకులుగల యన్నమును (కొడుకులు మనుమలుననిభావర్థము.) సంపాదింపుము"1

ఋగ్వేదంలో పలుసార్లు పురుషసంతానం కావాలనే ఆకాంక్ష వ్యక్తం చేయబడింది.[2] దీనిని బట్టి బాలిక యొక్క హోదా మరీ హీనమైనది కాదని తేలుతుంది. కాని బాలుని హోదాతో మాత్రం సమానం కాదు.[3]

అధర్వవేదంలో బాలిక పుట్టరాదని ఋక్కులున్నాయి. "ప్రజాపతి, అనుమతి, సినీవాలి గర్భమును రూపొందించావు. ఇంకొకచోట (ఇంకొక గర్భములో) స్త్రీ శిశువును ఉంచుము."[4]

"ఓ పింగ : ప్రసవంలో శిశువును రక్షించు. పురుషుని స్త్రీగా మార్చ నీయవద్దు." (అధర్వవేదం II-3, 23) అధర్వవేదంలో మంత్ర తంత్రాలకు ప్రాముఖ్యత ఇచ్చారు. గొడ్రాలితనం రాకుండా తాయత్తు (III-23,), పురుష సంతానం కలగటానికి ప్రార్ధన (VI-11) ఆడపిల్ల వద్దని ఆ ఋక్కులోనే అభ్యర్ధన, ఇవన్నీ అధర్వవేదంలో ఉన్నాయి.

బ్రాహ్మణాల కాలం సుమారు క్రీ. పూ 600 వరకు సాగింది. యజ్ఞ యాగాదులపై బ్రాహ్మణాలు దృష్టి నిలిపాయి. అప్పటికి మతమూ సామాజిక జీవితమూ బాగా పెనవేసుకొని పోయాయి. కుమారునికి విలువ పెరిగింది. "కుమారుడు మోక్షసాధనం." (ఐతరేయ బ్రాహ్మణం VII 13-16) భవిష్యత్‌ను సాధించుకోవటానికి, అంటే శాశ్వతత్వాన్ని పొందడానికి కుమారుడు అవసర మయినాడు. కుమార్తెలు బరువుగా ఎంచబడినారు. బాలిక జననం అక్కరలేదని క్రతువులు చేయసాగారు. అమావాస్యనాడు, పూర్ణిమనాడు అందుకొరకు చేయ వలసిన క్రతువులను తైత్తిరీయ సంహిత నిర్దేశించింది. ఈ తంతు అధర్వ వేదములలోని తంతును పోలియున్నది. శునశ్శేపుని కధలో నారదుడు హరిశ్చంద్రునితో ఇలా అంటాడు.

"భార్య సహచరి. కుమార్తె దుఃఖభాజనురాలు. కుమారుడు ఉన్నతోన్నత స్వర్గంలో దీపం." (ఐతరేయ బ్రాహ్మణం VII-13). అమావాస్య అధిష్ఠాన దేవత అయిన సినీవాలిని గర్భంలోని ఆడపిల్లను మగపిల్లవాడిగా మార్చమనే అభ్యర్ధన ఉన్నది.

ఉపనిషత్తుల కాలంలో ఆడపిల్ల కలగాలని కోరుకుంటూ దానికి కొన్ని క్రతువులను నిర్దేశించారు. బృహదారణ్యకోపనిషత్తు (11, 4, 18)

గృహ్యసూత్రాలు గృహమునకు సంబంధించిన సంస్కారాలను ఎలా

చేయాలో నిర్దేశిస్తాయి. గృహం అంటే భార్య అని, ఇల్లు అని రెండు అర్థాలు. ప్రతి వేదానికి సంబంధించి గృహ్యసూత్రం తయారు చేయబడింది. అలా అశ్వలాయన గృహ్యసూత్రం, శాంఖాయన గృహ్యసూత్రం ఋగ్వేదానికి సంబంధించినవి.....బౌద్ధాయన గృహ్యసూత్రం, ఆపస్తంబ గృహ్యసూత్రం కృష్ణ యజుర్వేదానికి సంబంధించినవి. గృహ్య సూత్రకారులలో పాతవాడు బౌద్ధాయనుడు. భరద్వాజుడు, ఆపస్తంబుడు, హిరణ్యకేసిన్ తరువాతవారు. ఆంధ్రదేశంలో అశ్వలాయన గృహ్యసూత్రం అమలులో ఉంది.5 శాంఖాయన గృహ్య సూత్రాలలో పురుషసంతానం కోసం గర్భాదానం శీమంతోన్నయనం అనే రెండు సంస్కారాలు పేర్కొనబడినాయి.6 గోభిల గృహ్య సూత్రం సామవేదానుసారం తయారయినది. వివాహమయిన తరువాత నూతన వధువు అత్తవారింటికి వస్తుంది. బ్రాహ్మణ స్త్రీలు ఆహ్వానిస్తారు. ఆమెను కూర్చోపెట్టి ఆమె ఒడిలో బాలుని పెడతారు. బహుశః ఆమె బాలుని కనవలెనని ఆకాంక్షకు అది ప్రతీక కాబోలు.7

గర్భాదానం అనే సంస్కారము గర్భానికి సంస్కారమా, లేక స్త్రీకి సంస్కారమా అని మీమాంస వచ్చింది. స్త్రీకి సంస్కారమని యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్య మితాక్షర చెపితే గర్భానికి సంస్కారమని విశ్వరూప వ్యాఖ్య ప్రకటించింది. ఏయే దినాలలో భార్యాభర్తలు సంగమిస్తే పురుష సంతానం కలుగుతుందో ఆపస్తంభ యాజ్ఞవల్క్య మన్వాదులు తెలియజెప్పారు. పుంసవనం అనే సంస్కారం పురుష సంతానాన్ని కనడానికి ఉద్దేశించబడినది.8 క్రతువులు చేయుటకు కుమారుడు అర్హుడు. కనుక పురుష సంతానాన్ని కాంక్షిస్తున్నారు. స్త్రీ జాతిపై ఆర్యులకు ద్వేషము లేదని ఆల్టేకర్ మహాశయుడు చెపుతూ ఆమె సుఖకరమైన, ఆనందప్రదమైన జీవితాన్ని గడపాలనే కోరికతోనే - కాదు అదుర్దాతోనే - ఆడపిల్ల పుట్టుకను వద్దనుకోవటం జరిగిందని వివరించారు.9 ఈ వాదన సమర్థనీయం కాదు. మతభావన పెల్లుబికి, శ్రాద్ధకర్మలకు, పితృఋణం తీర్చుకోవటానికి తాపత్రయం హెచ్చి కుమారులు కావాలని దేవతలను తెగ ప్రార్థించారంటే కొంతవరకు యుక్తి యుక్తంగా ఉంటుందేమో!

పుట్టిన ఆడపిల్లను చంపినట్లు ఋగ్వేదంలో అధర్వవేదంలో లేదు. అలాంటిది లేదు. బ్రాహ్మణాలలో మొదటిసారిగా ఈ ఆచారం కనిపిస్తుంది.10 సోమయజ్ఞంలో కొన్ని క్రతువులు ఉన్నాయి. పురుష శిశువును తీసుకొనివచ్చి స్త్రీ శిశువును వదలి వేసారట. "చివరి స్నానానికి వెళ్తారు. కుండలను అక్కడ ఉంచి

వాయుదేవుని నిమిత్తం వాటిని ఎత్తుతారు. అందువలన కుమార్తెను పుట్టగానే వదలివేసి కుమారుని ఎత్తుకుంటారు."11 ఈ సంగతి మైత్రాయణి సంహితలో కథక సంహితలో, ఉటంకించబడింది. ఇది స్త్రీ శిశుమరణాలకు సంబంధించినదని కొందరు పండితులు అంటున్నారు. ఆల్టేకరు మాత్రం ఇది ప్రసవసమయంలో మంత్రసాని చర్యకు సంబంధించినదని అంటున్నారు. మగపిల్లవాడు పుడితే మంత్రసాని పైకి ఎత్తుతుందట. ఆడపిల్లపుడితే నేలమీద పడుకోపెడుతుందట. ఈ వివరణను అంగీకరించినా, స్త్రీ శిశుమరణం రుజువు కాకపోయినా స్త్రీ పురుష వివక్ష రుజువవుతున్నది.

ఆడపిల్లలను పుట్టగానే చంపడం స్త్రీల గౌరవాన్ని కాపాడే నిమిత్తం తీసుకునే చర్య అని మన్‌మోహన్ కౌర్ అభిప్రాయం. ఈ దురాచారం ఉత్తర భారతంలో పలు ప్రాంతాలలో 1857-1900 మధ్య ఆచరణలో ఉంది. 'ఉన్నత' వంశస్తులు 'తక్కువ' కులస్తులకు పిల్లనివ్వటానికి అవకాశం ఆనాడు లేనందువలన కూడా ఈ ఆచారానికి బలం చేకూరుతుంది. ఉత్తరప్రదేశ్, పంజాబ్, రాజస్థాన్, గుజరాత్‌లలో ప్రబలంగా ఉండేది. ఇంచుమించుగా అన్ని వర్గాలలోను ఈ సామాజిక జాడ్యం ఉండేది. మొగలు చక్రవర్తి జహంగీరు ఈ ఆచారాన్ని పసిగట్టాడు. 17 వ శతాబ్దంలో దీనిని నిరోధించ జూచాడు. రాజస్థాన్‌లోని జయపూర్ రాజు 1755 లో దీనిని ఆపించ ప్రయత్నించాడు. బ్రిటిషువారు దీనిని అరికట్టడానికి 1795 లోను (రెగ్యులేషను 21), 1804 లోను (రెగ్యులేషను 3) పూనుకున్నారు. 1836 నాటికి మాళ్వా రాజపుటానాలో ఏటా 20, 000 మంది స్త్రీ శిశువులను హతమారుస్తున్నట్లు లెక్కలు వచ్చాయి. ఉత్తర్‌ప్రదేశ్‌లో 1869 సం॥లో పదిగ్రామాలలో 104 మంది బాలురు, ఒక బాలిక మాత్రం ఉన్నారట. మరో 27 గ్రామాలలో 284 మంది బాలురు 23 బాలికలు ఉన్నారట. 1970 లో (3 వ శాసనం) వచ్చిన శాసనం వల్ల కొంత తగ్గింది ఈ చెడ్డఅలవాటు.13 వేదకాలంనుంచి స్త్రీ పట్ల వివక్ష వల్లనే ఈ దుర్మార్గం సంభవించింది.

కుమార్తెలను ఋగ్వేదకాలంలో ముద్దుగా ప్రేమగా పెంచేవారు. ఆమెను 'దుహితృ' అనేవారు. ఆవు పాలు పిండుట, నెయ్యి చేయుట, పెరుగు చేయుట ఆమె ముఖ్యవిధులు. బట్టలు నేయుట, కుట్టుట, నీరు నింపుట, పైరులకు కాపలా కాయుట ఆమె చేసే ఇతరపనులు. ఆమె సోదరుడు

ఆమెకు రక్షకుడు. అందువల్ల తండ్రి తరువాత తండ్రి అంతవాడు. పోషణకు ఆమెకు తండ్రి ఆస్తిపై హక్కు ఉండేది. 14

ఋగ్వేదకాలంలో కన్య స్వేచ్ఛ కలిగి ఉండేది. వినోదప్రదర్శనలకు పండుగలకు ఆమె రాత్రిళ్లు వెళ్ళటానికి అవకాశమున్నది. ఉత్సవం పేరు 'సమన'. తెల్లవారిందాకా ఉత్సవం సాగేది. స్త్రీ పురుషులు స్వేచ్ఛగా తిరిగే వారు. ఒండొరులు కలసికొని స్వేచ్ఛగా మాట్లాడుకునేవారు. పురుషులనుండి స్త్రీలు దూరంగా వెళ్ళటం, వేర్పాటు లేవు. చిరునవ్వులు ఒలికిస్తూ కన్యలూ యువకులు తిరిగేవారు. ఆనాటి కన్య సిగ్గుతో కుంచించుకొని పోయేదికాదు. భయపడే వ్యక్తి కాదు. ప్రియుని సంకేత స్థలంలో కలసికోవడానికి వెను దీయదు ఆమె. బలహీనురాలుకాదు. సాహసి, స్వేచ్ఛాజీవి. ఆమెకు వ్యక్తిత్వం ఉండేది.14 అధర్వ వేదకాలంలో కూడ కన్యలు 'సమన' కు హాజరయ్యేవారు. ఆ రోజుల్లో కన్యకు 16 సం॥ నిండేవరకు వివాహమయ్యేది కాదు. దరిమిలా 8 సంవత్సరాల ఈడుకల పిల్లలకు పెళ్ళి చేయటం, తరువాత ముస్లిం దండ యాత్రలు, వీటివల్ల కన్యల స్వేచ్ఛ కుంటుపడింది. అయినా మతసంబంధ మైన ఉత్సవాలలో, జాతరలలో, ఊరేగింపులలో స్త్రీలు పాల్గొనటం జరుగుతూ వుండేది. అయితే ఇక్కడ ఒక అంశాన్ని విస్మరించరాదు. హిందూ సమాజం అనేక వర్గాలతో, వర్ణాలతో, కులాలతో కూడి వుండడం వలన ఆచారాలు సంప్రదాయాలు విభేదిస్తున్నాయి. ఆర్యులమని భావించే ద్విజుల పద్ధతి ఒకటిగా ఉంటే, తదితరుల ఆచారాలు వేరుగా ఉంటున్నాయి. అలాగే ధనవంతుల ఆచార వ్యవహారాలు ఒక కోవకు చెందుతాయి. శ్రామికుల అలవాట్లు మరో రకపువి. అయితే ఈ దేశ దౌర్భాగ్యం వల్ల శ్రామికులు, 'దిగువ' కులాలవారు వీరనుసరించే సామాజిక ఆచరణలను గురించి తగినంతగా పరిశోధన జరగ లేదు. కావ్యాలు ఎంత సేపూ నాగరికుల జీవితాలనే చిత్రించాయి. ధర్మశాస్త్రాలు 'కులీనుల' ను గురించి శ్రద్ధ వహించాయి. ఒక్క విషయం చెప్పి ఈ సంగతి (అంశాన్ని) ముగించవచ్చు. వేదకాలంలో కన్యకున్న స్వేచ్ఛ తరువాత తగ్గిపోయినదనేది పచ్చినిజం. విస్మరించరాని విశేషం.

విద్య :-

ఈనాటి హిందూ సమాజపు విద్యా రంగాన్ని తీసుకొని హైందవాన్ని మతింపు చేయటానికి వీలులేదు. ఎందుకంటే బ్రిటిషు పరిపాలనతోపాటు

వచ్చిన ఉదార వాద భావాలను త్వరగా గ్రహించి స్వంతం చేసుకున్నవారు హిందువులు. స్వాతంత్ర్యానికి పూర్వం, స్వాతంత్ర్యం తర్వాత అనేక పర్యాయాలు తమ వ్యవహార సూత్రాలను, కాండను శాసనాల ద్వారా ఎంతగానో మార్చుకున్నారు. స్త్రీ శిశు మరణ నిషేధంతో 18వ శతాబ్దంలో వారి ఆచార వ్యవహారాలలో ప్రభుత్వ జోక్యం మొదలయింది. దాంతో బ్రిటిషు వారి రాక తర్వాత వారు ఎంతగానో పురోగమించారు. అన్నిరకాలయిన విద్యను అభ్యసిస్తున్నారు. భారత రాజ్యాంగం ప్రసాదించిన వెసులుబాటును వినియోగించుకుంటున్నారు. ఈ దిగువ ఇచ్చిన పట్టికలు యీ వాదాన్ని సమర్థిస్తాయి.

| సం. | మద్రాసు | విద్యార్థులు | విద్యార్థినులు |
|---|---|---|---|
| 1826 | | 1,57,664 | 1623 |

1882 సం॥లో మద్రాసులో స్త్రీలలో అక్షరాస్యుల శాతం 0.5% కు తక్కువ. 1850 నాటికి స్త్రీల అక్షరాస్యత అత్యంత క్షీణస్థితికి వచ్చింది.15

(దీని కంటినూ స్టేట్‌మెంట్)

అక్షరాస్యత : 1901 - 1071[16]

| సం॥. | అక్షరాస్యులయిన పురుషుల సంఖ్య | పురుషుల మొత్తం జనాభాలో అక్షరాస్యుల శాతం | అక్షరాస్యులయిన స్త్రీల సంఖ్య | స్త్రీల మొత్తం జనాభాలో అక్షరాస్యుల శాతం | అక్షరాస్యుల్లో 1000 మంది పురుషులకు స్త్రీల సంఖ్య |
|---|---|---|---|---|---|
| 1901 | 14, 690080 | 9. 83 | 996341 | 0. 69 | 68 |
| 1911 | 16, 938815 | 10. 56 | 1, 600763 | 1. 05 | 94 |
| 1921 | 19, 841438 | 12. 21 | 2, 782213 | 1. 81 | 140 |
| 1931 | 23, 969751 | 15. 59 | 4, 169105 | 2. 93 | 132 |
| 1951 | 45, 610143 | 24. 95 | 13, 650683 | 7. 93 | 299 |
| 1961 | 77, 939833 | 34. 44 | 27, 578928 | 12. 95 | 354 |
| 1971 | 111, 911000 | 39. 51 | 48, 699191 | 18. 44 | 435 |

1981 లో పురుషులలో అక్షరాస్యుల శాతం :

స్త్రీల శాతం :

ఈ లెక్కలు భారత ప్రజలందరికీ వర్తిస్తాయి. హిందువులు జనాభాలో అత్యధిక సంఖ్యలో ఉన్నారు కనుక, ఇంచుమించుగా వీటిని హిందువులకు సంబంధించిన లెక్కగా పరిగణించవచ్చును. మతాలవారీ లెక్కలను ప్రభుత్వం తయారు చేయటం లేదు. ఈ సందర్భంగా ఒక్క అంశాన్ని విస్మరించరాదు. పట్టణాలలో అక్షరాస్యత ఎక్కువ, అలాగే శ్రామికవర్గంకన్న తదితర వర్గాలలో ఎక్కువ. ఇవి దరహంమీద లెక్కలు. అయినా కొంతగా కొంత పరిస్థితిని విశదం చేస్తాయి. వీటిని దిక్సూచి క్రింద పరిగణించవచ్చు: పురోగతి ఎలా, ఎంత వేగంగా ఉందో కొంతవరకు తెలియజేస్తున్నాయి ఈ లెక్కలు.

స్త్రీలలో ఒకరు హైకోర్టు న్యాయమూర్తి, మరొకరు రాష్ట్రప్రభుత్వ మంత్రి, వేరొకరు కేంద్రప్రభుత్వమంత్రి అయినంత మాత్రాన ప్రగతి చాలదు. ఒక రాష్ట్రప్రభుత్వ కార్యదర్శి, మరొక కేంద్రప్రభుత్వ కార్యదర్శి, ఒక శాఖాధిపతి, ఒక శాస్త్రజ్ఞురాలు, ఒక పండితురాలు- వీరినిచూచి మురిసిపోతే లాభంలేధు. జనాభాలో సగం మంది స్త్రీలుంటే, 100కి ఒకరిద్దరిని చూచి భ్రమించటం పొరపాటు. అయితే 1850 తో పోలిస్తే ప్రగతిపథంలో మనం చాల పయనించినట్లు. అందులో హిందువుల స్త్రీల వాటా ఎంతో ఉంది. కాగా 1850 వరకు సాగిన హైందవం యొక్క చరిత్ర పరిశీలన ఈ సందర్భంగా చేస్తేనే హిందూ సమాజంలో నిండినిబిడీకృతమైన భావాలు ఎలాంటివి ఉన్నాయో తేలుతుంది. ఇప్పటికీ స్త్రీ విద్యపట్ల, ముఖ్యంగా శ్రామికవర్గాలలో, 'దిగువ' కులాలలో ఉన్న వైముఖ్యానికి కారణాలు ద్యోతకమవుతాయి. సమస్య అవగాహన అవుతుంది. కనుక వెనుకకు మళ్ళి చూడటం అవశ్యకర్తవ్యం.

రుగ్వేదకాలంలో ప్రకృతిని గురించి గానంచేసేవారు. కవులు, ఋషులు సంఖ్యలో బాగా వృద్ధిచెందారు. ఆనాడు లిపిలేదు. వల్లెవేయటం ద్వారా సాహిత్యాన్ని భద్రపరుచుకున్నారు. బోధకూడా అలాగే సాగేది. స్త్రీ విద్య ఆ సమాజానికి అవసరం అయింది. వారు పరాయి దేశానికి వలస వచ్చారు. స్థానికులతో యుద్ధాలు, కొట్లాటలు జరిగాయి. వారు అరణ్యాలను దాటిపోయి జనపదాలను నిర్మించుకోవాల్సి వచ్చింది. అందువల్ల స్త్రీ పురుషులు పరస్పరం సాయం చేసుకోవాల్సిన పరిస్థితి కలిగింది. అందుచేత స్త్రీ

విద్యకు ప్రాధాన్యత వచ్చింది.

"విద్యావతియైన అవివాహిత కుమార్తెను పండితుడైన పురుషునికి ఇచ్చి వివాహం చేయవలెను. బాల్యంలో ఆమెకు వివాహం చేయాలని ఆలోచించ వలదు." ( రుగ్వేదం III. 55,16 )

" బ్రహ్మచర్యం పాటించి చదువు పూర్తి చేసిన యువతిని పండితుడైన పురుషునికి ఇచ్చి వివాహం చేయవలెను." (రుగ్వేదం VIII–1 )

బ్రహ్మచర్యం అంటే అధ్యయనం చేస్తానని ప్రమాణం చేయటం, దానిని పాటించటం. పెండ్లికి ముందుగా విధిగా జరిగేది విద్యాసముపార్జన. క్షత్రియ స్త్రీలు ఆయుధ విద్యను, యుద్ధవిద్యను నేర్చుకునేవారు. భాష, సాహిత్యం, లలిత కళలన్నీ స్త్రీలకు అందుబాటులో ఉండేవి. స్త్రీలు కవులుగా. రుషులుగా పేరుపొందారు. ఘోష, లోపాముద్ర, ఆపాల, రోమశ, సూర్య వీరు గణనీయులు. స్త్రీలు సంగీతాన్ని అభ్యసించేవారు. సోమరసాన్ని పిండేటప్పుడు పాటలు పాడేవారు. ( రుగ్వేదం IX 66, 8). పాటతో పదం కలపటం ప్రేణఖం (రుగ్వేదం VII 87, 5; 88; 3). నృత్యం వృత్తిగా స్వీకరించిన వారున్నారు. ఆచ్ఛాదనలేని వక్షస్థలంతో నాట్యంచేసేది నాట్యగత్తె. (రుగ్వేదం I 92,4). యుద్ధాలలో స్త్రీలు పాల్గొనేవారు. ఖేలుని భార్య విస్పల యుద్ధంలో కాలు పోగొట్టుకున్నది. ముద్గలుని భార్య ముద్గలాని శత్రువులను తరిమికొట్టింది. ఆర్యులు వచ్చేనాటికి దేశవాసులుగా ఉన్నదస్యులు స్త్రీలను యుద్ధరంగంలోకి తెచ్చేవారు. ఇంద్రుడు (ఆనాడు ఆర్యుల నాయకుడు) వృత్రాసురుని తల్లిని చంపాడు. (రుగ్వేదం V 30, 9).

"విదథ" అనేది శిష్టుల సభ. పద్యపఠనం, రుక్కులగానం, పురాణ కథా, శ్రవణం, యజ్ఞయాగాది క్రతువులపై ప్రసంగాలు జరిగేవి. వివాహ మపుడు పెండ్లికుమార్తె విదథలో ప్రసంగించేది. (రుగ్వే. X 85, 26)

స్త్రీ ఆనాడు దివ్యగాయనిగా, ప్రతిభావంతురాలయిన రుషిగా, విద్య నార్జించి 'అధికారి'గా తయారయ్యేది.

రుగ్వేదంలో కొన్ని రుక్కులను స్త్రీలు వ్రాశారని చెప్పబడుచున్నది. అవి పలురకాలు.

(i) పూర్తిగా. స్త్రీలచే సృజింపబడినవి.

(ii). కొంత భాగం స్త్రీలవని చెప్పబడినవి.

(iii) స్త్రీ రుషులు వ్రాశారని చెప్పబడినా ఎవరివి అనే విషయంపై అనుమానం ఉన్నవి.

అపాల ఇంద్రుని కొనియాడుతూ రుక్కు చెప్పింది. విశ్వావర అగ్నిని స్తోత్రం చేసింది. లోపాముద్ర, శశియాసి రెండవ కోవకు చెందినవారు. ఘోష, కక్షీవతి, సూర్యసావిత్రి, ఇంద్రాణి, శ్రద్ధ, కామాయని, శచిపౌలోమి, సర్పరాణి, ఊర్వశి వీరు మూడవ కోవకు చెందినవారు. ఘోష తప్ప అందరూ దేవతా స్త్రీలే.18

స్త్రీలకు ఉపనయనం ఉండేది. ఆ కర్మలో ఆమె నడుముకు పలుపు (యోక్త్ర) కట్టేవారు. కర్మలలో పాల్గొనడానికి ఆమెకు ప్రవేశం కల్పించ టానికి అది చిహ్నమట. ఉపనిషత్తుల కాలంలో బ్రహ్మజ్ఞాన సముపార్జన విషయంలో పురుషులతో సమదీటుగా ఉన్న స్త్రీలు గార్గి, మైత్రేయి, వదవ ప్రాథితేయి. విద్యార్థినులు రెండు రకాలు. జీవితాంతం మతశాస్త్రాన్ని అధ్యయనం చేసేవారు 'బ్రహ్మవాదినులు'. వివాహమయ్యేవరకు విద్యను ఆర్జించేవారు సద్యోద్వాహులు.

కాశకృత్స్నవ మీ మాంసపై ఉద్గ్రంథం వ్రాసింది. ఆమెను అనుసరిం చిన పండిత స్త్రీలను కాశకృత్తనలు అని పిలిచేవారు.

ఆత్రేయ వేదాంతాన్ని అధ్యయనం చేసిన పండితురాలు. వాల్మీకి, అగస్త్యుడు వీరి వద్ద ఆమె విద్యను ఆర్జించింది. తరువాత బౌద్ధంలో అనేక మంది స్త్రీలు సంఘంలోచేరి సన్యాస జీవితాన్ని గడిపారు. 'తేరీగాధ' అనే గ్రంథాన్ని అలాంటి స్త్రీలు రచించారు. అందులో 32 మంది అవివాహితులై సంఘంలో చేరినవారు. 10 మంది వైవాహిక జీవితాన్ని గడిపి విసిగి వేసారి సంఘంలో చేరినవారు, చాలా మంది స్త్రీలు ఉపాధ్యాయవృత్తి చేపట్టారు. వారిని 'ఉపాధ్యాయలు' అని పిలిచేవారు. భాగవత పురాణంలో దాక్షాయణున్ని కుమార్తెలు మతశాస్త్రంలో తత్వశాస్త్రంలో, పండితులని వ్రాయబడినది.1 క్రీ. పూ. 300 వరకు స్త్రీ విద్య విషయంలో హిందూ సమాజం శ్రద్ధ వహిం చింది. గాధా సప్తశతిలో అనేకమంది కవయిత్రుల పేర్లు కానవస్తాయి. రేవ, రోహ, మాధవి, అనులక్ష్మి మొదలగువారు అలాంటివారు. సంస్కృత కవుల చరిత్రలలో పెక్కుమంది స్త్రీలపేర్లు ఉటంకించబడినాయి. మారుల, మోరికా, సుభద్రా ఆకోవకు చెందినవారు. ప్రియదర్శిని, శకుంతలా, కాదంబరిలాంటి కావ్యాలలో నాయికులు లలితకళలలో ప్రవీణలు. అయితే వారు ఎక్కువగా

రాజవంశీకులు. శాతవాహనుల కాలపు నాయనికా (క్రీ, పూ. 2వ శతాబ్దం) ప్రభావతీగుప్త 'వాకాటక వంశం' : (క్రీ. త. 4వ శతాబ్దం), చాళుక్యవంశపు విజయభట్టారిక (క్రీ. త. 7వ శ.), కాశ్మీర్‌కు చెందిన సుగంధ, దిద్దా (క్రీ.త. 10వ శతాబ్దం) పరిపాలనా దక్షులు. క్షత్రియ కుటుంబాలలో శస్త్రవిద్య నేర్పేవారు. కాకతీయ రుద్రమదేవి ఇందుకు తార్కాణము. కర్నాటకలో, రాజపుత్ర స్థానంలో, మరాటా దేశంలో ఇట్టివారు, తటస్థిస్తారు. వయసు వచ్చిన ఆడపిల్లలు గృహ నిర్వహణలో ఎక్కువ బాధ్యత తీసుకునేవారు. శకుంత, కుంతి అలా విధి నిర్వహణచేసి అతిధి అభ్యాగతులను ఆదరించారు.

వేదకాలంలో, పురాణ కాలంలో స్త్రీలు కందుకక్రీడలో పాల్గొనేవారు. బంతి ఆటద్వారా తగినంత శరీరవ్యాయామాన్ని పొందేవారు (మహాభారతం V 93, 63; III, 112,16). ఈ ఆటలు రామాయణంలో, 'కామసూత్రం'లో అభివర్ణితమయినయి.20

సహవిద్య :- సర్వసామాన్యంగా వేదకాలంలో ఆడపిల్లలు ఇంట్లో పెద్దలవద్ద విద్యను అభ్యసించేవారు. అన్నలు, తమ్ములు, అక్కలు, చెల్లెళ్లు కలసి చదువుకునేవారు. ఉపాధ్యాయులు తక్కువ సంఖ్యలో ఉన్నందున ప్రత్యేక శిక్షణ కావలసివచ్చినపుడు పురుష ఉపాధ్యాయులవద్ద విద్యార్థులు, విద్యార్థినులు కలసి విద్యార్జన చేసేవారు। రాముని కుమారులు లవకుశలతో పాటుగా ఆత్రేయి చదువుకున్నట్లు భవభూతి విరచితమైన ఉత్తరరామ చరితంలో ఉన్నది. కహాడ సుజాతలు, రురుప్రియంవదలు; సహాధ్యాయులు, తక్షశిలకు విద్యార్థినులు వెళ్ళి చదువుకున్నట్లు జాతక కధలలో లేదు. అంటే ఎక్కువ దూరం వెళ్ళి స్త్రీలు విద్యాభ్యాసం చేయలేదని తెలుస్తుంది. కామందకి, భూరివసు, దేవరాతలతో కలసి చదువుకున్నట్లు భవభూతి రచించిన మాలతీ మాధవం చెప్పుచున్నది. ఏదయినా ఉన్నతవిద్య 'ఉన్నత' కుల సంజాతులకు సంపన్నులకు మాత్రమే పరిమితమయినదని చెప్పవచ్చును.21

**స్త్రీ పురుషుల ఆటపాటలు :-**

వేదకాలంలో కన్య సామాజిక ఉత్సవాలన్నింటిలో పాల్గొనేది. భర్తను వెతుక్కోవటానికి ఆమె 'సమన'కు వెళ్ళేది. (రుగ్వే - VII 2,5), తల్లులు, కుమార్తెలను అలంకరించి పంపేవారు. అచ్చట వరులు తమకు కాబోయే భార్యల అభిమానాన్ని చూరగొనడానికి ప్రయత్నిచేవారు. (రుగ్వే IV 58,

8: ఋగ్వే VII 2, 5). 'సమనలు' సాధారణంగా వసంత ఋతువులలో ఏర్పాటయ్యేవి. తాళధ్వనులు చెలరేగేవి. యువతీయువకులు చెట్టాపట్టాలు వేసుకొని నృత్యం చేసేవారు. పగలు గుర్రపు పందెములు, రధాల పోటీలు జరిగేవి. రాత్రివేళ ఇతర వినోదాలు-నృత్యగాన విశేషాలు సాగేవి.

భారతకాలంనాటికి స్త్రీ పురుషులు కలసి ఆడటం ఆగిపోయింది. క్రీ.శ. 1, 2 శతాబ్దాల కాలంనాటి కామశాస్త్రంలో నాగరికుల జీవిత సరళి విశదీకరించబడింది. నాగరికుల గృహాన్ని రెండు భాగాలు చేస్తారు. అంతఃపురం లాంటి దానిలో భార్యలు నివశిస్తారు. ముందుభాగమందున్న ఇల్లు పురుషుని ఆధీనంలో ఉంటుంది. దానిలోకి భార్యలకు ప్రవేశం లేదు. యజమాని ప్రియురాండ్రయిన నాయికలకు మాత్రమే ప్రవేశం వుండేది. గణిక సామాన్యంగా నాయికగా ఉంటుంది. నాగరికుడు నెలకొకసారి 'గోష్ఠి సమవాయం' ను సమావేశ పరుస్తాడు. దానికి నాగరికులు తమ ప్రియురాండ్రతో విచ్చేస్తారు. అక్కడ శృంగార కవిత్వ పఠనం మొదలయినవి సాగుతాయి. నెలకు రెండుసార్లు 'సమపానకం' జరుగుతుంది. అచ్చట చేరిన, స్త్రీ పురుషులు మత్తుపానీయాలను సేవిస్తారు. ఈ రెండుగాక నాగరికులువారి ప్రియురాండ్రయిన గణికలు విహారాలకు వినోదాలకు ఇతర ప్రదేశాలకు వనాలకు, ఉద్యానవనాలకు వెళ్తారు. కనుక స్త్రీ పురుషులు కలసి తిరగడమనేది గణికలకు మాత్రమే సాధ్యం చేయబడిందని గ్రహించాలి. శూద్రకుని మృచ్ఛకటికంలో కొన్ని విషయాలు వెలికివస్తున్నాయి. ఈ గ్రంధం కూడా క్రీ. శ. 1, 2 శతాబ్దాల నాటిది. గృహిణులకు ఉండే గౌరవ మర్యాదలను చూచి వేశ్యలు అసూయపడేవారు, వేశ్యల స్వేచ్ఛను, వైభవాన్ని చూచి గృహిణులు ఈర్ష్యాళువులయ్యేవారు.

ధర్మశాస్త్రయుగం, పురాణకాలం స్త్రీకి అంధకార యుగాలని చెప్పవచ్చును. స్త్రీని చూస్తే భయం, స్త్రీని నిరసించడం, ఆమె స్వేచ్ఛను అరికట్టడం, ఆమెను విద్యాజ్ఞానాలకు దూరంగా ఉంచటం, ఆమె పురుషుని అంటిపెట్టుకొని బ్రతికేలాగు చేయడం ఇవి ఆనాటి పురుషుల చర్యలు.22 ఇట్టి పరిస్థితులలో వివాహితులు కలసి మెలసి తిరగడమనేది జరగడం అసంభవం.

ముస్లింయుగంలో పర్దా అవతరించింది. భార్యలను రక్షించుకోవడమే పురుషుని కర్తవ్యంగా పరిణమించింది. విందులు, వినోదాలకు స్త్రీ దూరమయింది.

ఆధునిక కాలంలోకూడ కొండజాతులలో, కొన్ని ప్రాంతాలలో ఆదివాసులలో తప్ప మరెచ్చటా స్త్రీ పురుషుల నాట్యాలు సంగీతాలు లేవు. నగరవాసులలో ఐరోపియను సంస్కృతిని సంతరించుకున్న వర్గాలలో తప్ప మరెచ్చటా కానరావు. సినిమాలలో ప్రదర్శితమయ్యే దృశ్యాలు వాస్తవ జీవితాలలో కానరావు. బహుశః అందుకనే కాబోలు పెండ్లికాని యువతీ యువకులు కలిసి మెలిసి ఆడిపాడుతుంటే సామాన్య ప్రజానీకం మహా ఆసక్తితో తిలకించడం జరుగుతున్నది. స్త్రీ పురుషులు పాల్గొనే సభలు, సమావేశాలలో కూడ వారిరువురు విడివిడిగా కూర్చొనడం మాట్లాడుకోవటం జరుగుతున్నది. ఇది అంతా క్రీ. పూ 300 కాలం నుండి జరిగిన స్త్రీ పతన ఫలితమే.

సెక్సు పరిజ్ఞానం :- సెక్సు పరిజ్ఞానాన్ని కన్యలకు అందించే ప్రత్యేక కృషి జరిగినట్లు నిదర్శనాలు లేవు, కాగా వాత్స్యాయముని కాలానికి వేశ్యా సంగమం ప్రతిష్టాకరం అయింది. దానిలో కామశాస్త్రం తతిమ్మా శాస్త్రాల వలె అధ్యయన విషయమయింది. మరల 10, 12 శతాబ్దాలలో నిర్మించబడిన దేవాలయాలలో—ముఖ్యంగా సూర్యదేవుని పరంగా వచ్చిన దేవాలయాలలో— స్త్రీ పురుష శృంగార ఘట్టాలు చిత్రితమయినాయి. ఇవి తాంత్రిక మత ప్రభావ ఫలితాలా? లేక సెక్సు పరిజ్ఞానాన్ని అందించడానికి వాహికలా అనేది మీమాంస.

ధర్మశాస్త్రాలను పరికిస్తే 16 సంస్కారాలను ద్విజులకు విధిక్ర్పతం చేశారు. అందులో కొన్ని సెక్సు సంబంధమైనవే. స్త్రీని కేవలం భార్యగా, తల్లిగా చూడటంతో ఒకరంగా ఆమె జీవితంలో సెక్సుకు ప్రాధాన్యత ఇచ్చినట్లే. వివాహం స్త్రీకి తప్పనిసరియైన సంస్కారమయింది వేదకాలం అంతరించే నాటికి. రజస్వలానంతరం 'వివాహాలలో గర్భాదానం చతుర్థికర్మ. అంటే పెండ్లిలో నాలుగవనాడు జరిగే కర్మ. రజస్వల కాకముందు పెండ్లి అమలులోకి వచ్చిన తరువాత ఇది వేరే ప్రత్యేకంగా ఒక సంస్కారమయింది. ఏదైనా గర్భాదానపు మంత్రాలు సంస్కృతం తెలిసిన స్త్రీలకు సెక్సు పరిజ్ఞానాన్ని కొంత అందిస్తాయి. ఈనాడు వాటిని తెలుగులో వ్రాస్తే భారతీయ

సంస్కృతిని ఆరాధించే పెద్దలే అశ్లీలమని, అసభ్యమని గగ్గొలు పెట్టగలరు. అసలు స్త్రీ జీవితం కొందరి దృష్టిలో రజోదర్శనంతోనే ప్రారంభమవుతుంది. రజస్వల అయితే ఉత్సవాలు, విందులు, వినోదాలు ఈ అంశాన్ని రుజువు చేస్తున్నాయి. వైఖానస స్మార్తసూత్రాలలో పేర్కొనబడిన గర్భాదానం, పుంసవనం, గర్భరక్షణ. సీమంతోనయనం[23] ఇవన్నీ సెక్సుకు సంబంధించిన సంస్కారాలే.

ఆదిమ సమాజాలలో రజోరక్తం అంటే భయం ఉండేది. అది కొన్ని సమాజాలలో వెర్రితలలు వేసింది. హిందూ సమాజంలో అస్పృశ్యతకు దారి తీసింది. బహిష్టు అయిన స్త్రీ 4 మూరల దూరంలోను, ప్రసవించిన స్త్రీ 8 మూరల దూరంలోను ఉండవలెనని బృహస్పతి నిర్దేశించాడు.[24] ఇది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. ఇలాంటి భావాలు ఎన్నో దర్శనం ఇస్తాయి ధర్మశాస్త్రిలలో. మున్ముందు వివాహం అనే అధ్యాయంలో దీనిని గురించి సవివరంగా చర్చించవచ్చు. ఆధునిక విజ్ఞానానికి ఈ భావాలు దూరమని తెలియజెప్పడానికే దీనిని ఉటంకించడమైనది.

## అధ్యాయం 2

# పాదదీపికలు

1. ఋగ్వేదము : మం 1 అనువాకం 4. సూక్తం 12
   ఋక్కు 121.
   ఆంధ్రవేదములు - ఋగ్వేదము ప్రథమ సంపుటము
   (వినయాశ్రమము 1940) పుట 25.
2. ఋగ్వేదం **I - 91, 20; 92, 13**
   **III 1, 23; X 85, 25; 41, 42, 45**
3. వేదకాలంలో స్త్రీలు : శంకుతలా రావు శాస్త్రి
   **Women in the vedic Age : Sakuutala Rao Sasty. (Bheratiya vidada Bhavan 1952)**
   పుట 2

4. అధర్వవేధం VI 11, 3
5. వేదకాలంలో స్త్రీలు : శకుంతలరావు శాస్త్రి; పుటలు 116, 117
6. డిటో పుట 132
7. డిటో పుట 168
8. ధర్మశాస్త్రాల చరిత్ర : కానే, పుట. 218
9. హిందూ నాగరికతలో స్త్రీల స్థానం : ఆల్టేకర్; పుట 6
10: వేదకాలంలో స్త్రీలు : శకుంతలరావు శాస్త్రి; పుట 42
11. తైత్తిరీయ సంహిత VI 5, 10; మైత్రాయిణ సంహిత IV 6, 4
12. భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలు : మన్ మోహన్ కౌర్
(Women in India's freedom struggle)
: MANMOHAN KAUR
Sterling Publishers Delhi-1985) :
పుట 1.
13. డిటో పుటలు 7 - 11
14. ఋగ్వేదకాలంలో స్త్రీలు : ఉపాధ్యాయ
Women in Rigveda : UPADHYAYA (1932)
అధ్యాయం - 2
15. ఆల్టేకరు పుటలు 24, 25
16. స్టేటస్ కమిటీ రిపోర్టు : పుట 265
'Towards Equality' (Report of the committee of status of women in India) : Govt of India, social welfare Dec 1974.
17. ఉపాధ్యాయ : పుట 189.
18. వేదకాలపు స్త్రీలు : శకుంతలారావు శాస్త్రి : పుట 29.
19. డిటో పుట 79.
20. ఆల్టేకరు పుటలు 11-13
21. ఆల్టేకరు 1 వ అధ్యాయము
22. యుగయుగాలలో భారతీయ మహిళలు : పి. థామసు
అధ్యాయం 8
23. ధర్మశాస్త్రాల చరిత్ర : కానే పుటలు 195-197
24. డిటో డిటో - 174

అధ్యాయం

# 3 వివాహం

మానవ సమాజపు తొలిదశలో వివాహవ్యవస్థ ఏర్పడలేదు. తరువాత గుంపు పెళ్ళిళ్ళు అమలులోకి వచ్చాయని మార్గన్ చెప్పాడు. అలాకాక ఏక భర్తృత్వ, ఏక భార్యాత్వ సంబంధాలుండేవని వెస్టర్‌మార్క్ మరో భావాన్ని ప్రతిపాదించాడు. కాని ఈ రెండో వాదనకు తగిన ఆధారాలు లేవు. మొదట్లో స్వైరవిహారం ఉండేదని నిర్ణయించుకోవచ్చు. పెండ్లి శారీరక వాంఛలను, మానసిక అవసరాలను తీర్చేదని డి. యన్. మజుందార్ అనే సామాజిక మానవ శాస్త్రజ్ఞుడు అంటాడు. "ఒక పురుషుడు లేక అనేకమంది పురుషులు ఒక స్త్రీ లేక అనేకమంది స్త్రీలతో పెట్టుకున్న సంబంధాన్ని సంఘాచారము లేక శాసనం గుర్తించాలి. ఆ సంబంధం ఏర్పరచుకున్న వ్యక్తులకు, అంతే కాక, వారి పిల్లలకు కూడా హక్కులను, బాధ్యతలను నిర్ణయించేదిగా ఉండాలి" అ సంబంధాన్ని వివాహమనవచ్చునని వెస్టర్ మార్క్ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.1 మొదట్లో మాతృస్వామ్యం ఉండేది. తల్లిద్వారా సంతానాన్ని గుర్తించడం, తల్లియే కుటుంబానికి కుదురు కావటం దానికి లక్షణాలు. ఈ వ్యవస్థలో తల్లికి, మేనమామకు ప్రాముఖ్యత ఉంటుంది. ఈ వ్యవస్థ దక్షిణాదిన మళయాళ దేశంలో పూర్వం నాయర్లలోను, ఉత్తరాదిన ఖాసీలు ఈశాన్యాన ఖాసాలు మొదలయినవారిలోను ఉండేది. పురుషుని ఆధీనంలోకి స్త్రీ వచ్చిన తరువాత పితృస్వామ్య వ్యవస్థ వచ్చింది. తండ్రికి ప్రాధాన్యత పెరిగింది తండ్రిద్వారా ఆస్తి సంక్రమణం జరిగింది.

ఆర్యులు వచ్చేనాటికి దేశంలో అనార్యులు నివాసమున్నారు. వారిలో వివాహ సంబంధం కేవలం లౌకికం. తమిళులు అనార్యులు. వారి ప్రాచీన గ్రంధాలయిన 'తొల్కాపియం', 'సిలప్పానికరం' లలో సంతానప్రాప్తి కోసం పురుషునితో సంబంధం పెట్టుకునేవారు. అది ప్రేమ వివాహం. అది స్త్రీల స్వంత విషయం. పురుషునికి బిడ్డలయెడ ఆర్థిక పరమైన బాధ్యతలు లేవు. ఆర్యను దండయాత్రలను ఆపినవారు అసురులు, రాక్షసులు. వారిలో బలి, బాణుడు ముఖ్యులు. హిడింబి, ఉలూపి వివాహమాడినా పుట్టింటనే ఉన్నారు.

అది మాతృస్వామ్య లక్షణం. అనార్యులలో స్త్రీలకు ఎక్కువ స్వేచ్ఛ ఉండేది. నీలగిరి తోడాలలో బహు భర్తృత్వం ఉన్నది. సంతానానికి తండ్రి ఎవరో తల్లి 7 వ మాసపు గర్భిణీగా ఉండగా నిర్ణయిస్తారు. అంటే తండ్రికి, బిడ్డకు కేవలం ఆర్థికపరమైన సంబధమేకాని శారీరకసంబంధం లేదన్నమాట.

మానవ నాగరికత పురోగమించిన దశలో సంస్కృతీ ప్రభావం వలన కుటుంబ వ్యవస్థ ఉద్భవించిందని రుగ్వేదకాలపు స్త్రీలను గురించి పరిశోధన చేసిన ఉపాధ్యాయ అంటారు. వివాహ వ్యవస్థ పుట్టుక, పరిణామాలను గురించిన కథలు మహాభారతంలో ఉన్నాయి. దీనిని గురించి వివరించుకునే ముందుగా కుటుంబ వ్యవస్థ ఎలా అవసరమయిందో పరిశీలించాలి. రుగ్వేద కాలానికి పూర్వం, శర్మిష్ట యయాతితో చెప్పినమాట గమనార్హం. తన స్నేహితురాలి భర్త తనకూ భర్తేనని శర్మిష్ట యయాతితో అంటుంది. అంటే వివాహం అనే వ్యవస్థ అప్పటికి స్థిరపడలేదన్నమాట.

కుటుంబ ఆవసరానికి కారణాలు :-

I) ఆర్యులకు చుట్టూ శత్రువులు. వారి సంఖ్య హెచ్చుగా ఉండేది. అందువల్ల ప్రతి ఆర్యుడు పదిమంది సంతానాన్ని కాంక్షించేవాడు.

II) ఆర్య రక్తం యొక్క పవిత్రతను నిలబెట్టాలని తాపత్రయం.

III) పితృరుణం తీర్చుకోవటానికి సంతానం అవసరం.

IV) సంచార పద్ధతిని దాటి ఆర్యులు స్థిరపడ్డారు.

కుటుంబాన్ని చక్కదిద్దటానికి ఇల్లాలు కావాల్సివచ్చింది. భార్య తనఅత్త మామలకు, ఆడబిడ్డలకు పశుపక్షాదులకు సామ్రాజ్ఞి. (రుగ్వే.X-10,85) కనుక తాత్కాలిక సంబంధంవల్ల వచ్చిన స్త్రీ కాక కుటుంబంతో మమేకమయ్యే భార్య కావాలి. వివాహం సామాజిక, ఆర్థిక అవసరమయింది.[2]

తొలిదశలోని ఆర్య స్త్రీలలో వివాహిత స్త్రీకి కూడా కొంత లైంగిక స్వేచ్ఛ ఉండేది. అతిథిని ఆమె తన లైంగిక సంబంధంతో తృప్తిపరచవలసి ఉండేది. అలా చేయబోయిన తల్లిని చూచి కటకటపడి శ్వేతకేతు అనే రుషి ఆ ఆచారాన్ని ఖండించాడు. దీర్ఘతమస్సు గ్రుడ్డివాడు; వివాహితుడు.

భార్యను పరపురుషులతో సంపర్కం పెట్టుకొని ధనార్జన చేయనిచ్చేవాడు. అలా కొంతకాలం సాగింది. ఆమె అప్రతిష్ట పాలయింది. ఆ జీవితానికి ఇక స్వస్తి చెపుతానని పట్టుపట్టింది. కాదు కూడదన్నాడు భర్త. దాంతో పత్ని కుమారులు కలిసి అతనిని కట్టి పడవేసి నదిలో పారవేశారు. తరువాత అతడు బయటపడి, బ్రతికి, వివాహిత స్త్రీలకు పరపురుష సాంగత్యం కూడదని కట్టడి చేశాడు. ఇలా ఉద్దాలకుడు, శ్వేతకేతువు, దీర్ఘతమస్సుడు అనే ఋషులు వివాహిత స్త్రీల లైంగిక సాంగత్యాన్ని భర్తలకే పరిమితం చేశారు. వరుణ ప్రఘాస యజ్ఞంలో భార్యాభర్తలిరువురూ పాల్గొంటారు. భర్త భార్యను ఇలా అడుగుతాడు "నీ ప్రియుల పేర్లు చెప్పుము". ఆమె ఆ పేర్లను చెప్పగానే ఆమె పరిశుద్ధ అవుతుందట. దీనినిబట్టి ఒకనాడు జారత్వం ఉండేదని తెలుస్తుంది.

ఋగ్వేదకాలంలో రాజకీయ కారణాల వలన వివాహ వ్యవస్థ ఏర్పడితే తరువాత పితృరుణం తీర్చుకోవడానికి మగ సంతతి కావలసి వచ్చి వివాహం యొక్క అవసరం అలా అన్వయం చేసి చెప్పుకున్నారు. అన్ని సంస్కారాల లోకి ముఖ్యమైనదిగా స్త్రీలకు వివాహం నిర్దేశింపబడింది. పదాలకు అర్థాలను మనం గమనిస్తే వివాహ వ్యవస్థ లక్షణాలు గోచరమవుతాయి. ఉద్వాహం అంటే తల్లి దండ్రుల ఇంటినుండి వధువును తీసుకొని వెళ్ళుట. వివాహమంటే భార్యగా చేసుకొనుటకు తీసుకోని వెళ్ళుట. పాణిగ్రహణం అంటే వధువు యొక్క చేతిని వరుడు గ్రహించుట. దేవతలకు బలులు ఇవ్వడానికి, సంతానం కోసం, గృహస్థ ధర్మ నిర్వహణ కొరకు ఇల్లాలు అవసరమట.

ఎన్ని రకాల వివాహాలు? :- బ్రాహ్మం, గాంధర్వం. రాక్షసం, అసురం, ప్రాజాపత్యం, ఒప్పందపు పెళ్ళి ఋగ్వేదకాలంలో అమలులో ఉన్నట్లు తెలుస్తుంది. కన్య ఎంపిక చేసిన వరునికే ఇచ్చి సాదారణముగా వివాహం చేసేవారు తల్లి దండ్రులు. ప్రాజాపత్య వివాహం ప్రబలంగా ఉండేది. ఇది సాలంకృత కన్యాదానం. పెండ్లికుమార్తెకు తల్లి దండ్రులు కట్నం (Dowry) ఇచ్చేవారు. అంతేకాని పిల్లను అమ్మే ప్రసక్తి లేదు. వధువుకు మంచం, పెట్టే, నిత్యావసర వస్తు సామాగ్రి ఇచ్చేవారు.ఇ ది ఆమె స్త్రీ ధనం. దీనినే కట్నం అనేవారు. పిల్ల సమ్మతితో నిమిత్తం లేకుండా వరుడు ఆమె బందుగులకు బహుమతులను ఇచ్చి వివాహమాడటం అసుర బ్రాహ్మం అని

అని చెప్పేవారు కన్య బంధుగులకు బహుమతులు ముట్టాయి కనుక అసురం. తల్లి దండ్రిలు వివాహం చేశారు కనుక బ్రాహ్మం. ఇతర దేశాలలో కన్యను కొనడం ఉండేది. మనదేశంలో ఆర్యులు వివాహకాలమందు కన్యకు కట్నం ఇస్తారు. ఒక గాంధర్వం తప్ప ఏరకపు పెండ్లి అయినా వివాహ క్రతువు ప్రాజాపత్యం పద్ధతిలో జరగవలసినదే. ఒక పందెంలో గెలిచినవానిని వరించు స్వయంవర పద్ధతి. అశ్వినులు పందెంలో గెలిచి 'సూర్య'కు భర్తలయినట్లు కథ ఉన్నది. గాంధర్వ వివాహం పేరు ప్రత్యేకంగా చెప్పలేదు. కాని ఒక కథను బట్టి అలాంటి వివాహ విధానం ఉన్నట్లు తేలుతుంది. విమద బ్రాహ్మణ రుషి. కామద్యు రాజన్య స్త్రీ. వారి వివాహానికి తల్లిదండ్రిలు అంగీకరించలేదు. అంత ప్రేమికులు పారిపోయి కాపురం చేయసాగారు. దానిని తల్లిదండ్రులు తరువాత ఆమోదించారు. పురుమిత్రి రాజకుమార్తె కామద్యును అశ్వినులు ఎత్తుకొనిపోయి విమదునికి వివాహం చేసినట్లు ఒక కథ వున్నది. పురూరవుడు ఊర్వశి వీరి పెళ్లి ఒప్పందపు పెళ్ళి. ఇది సాహచర్య దాంపత్యం. ఉషస్సు సూర్యుల మాట చెర్చి అవి అవి మాతృస్వామ్యాల వ్యాఖ్య. ఏమయినా ఒప్పందపు వివాహాలు అమలులో ఉన్నట్లు ఇది నిదర్శనము. గృహ్యసూత్రాలలో ఆశ్వలాయన గృహ్యసూత్రం ఋగ్వేదానికి సంబంధించినది. దానిలో అష్టవిధ వివాహాలు పేర్కొనబడినాయి. బ్రాహ్మ, దైవ, ప్రాజాపత్య, ఆర్ష, గాంధర్వ, అసుర, పైశాచ, రాక్షసాలు అవి. సాలంకృత కన్యాదానం బ్రాహ్మం. శ్రౌతాగ్నులలో యజ్ఞము చేయించే ఋత్విజునికి ఇచ్చి వివాహం చేస్తే అది దైవం. స్త్రీ పురుషులు ఇరువురు ధర్మనిర్వహణార్థం జరిగే పెండ్లి ప్రాజాపత్యం. ఆర్షవివాహంలో కన్య తండ్రికి ఒక గోవును ఒక వృషభాన్ని వరుడు ఇస్తాడు. ఇవి ఉన్నతమైన వివాహాలట. బ్రాహ్మ వివాహం వల్ల జన్మించిన కుమారుడు 12 తరాలవరకు పితరులకు సద్గతులు కలిగిస్తారట. దైవ వివాహం వల్ల కలిగిన కుమారుడు 10 తరాలకు, ప్రాజాపత్య వివాహఫలమైన కుమారుడు 8 సంవత్సరాలవరకు, ఆర్ష వివాహపు సంతానమైన పురుషుడు 7 తరాలవరకు పితరులను తరింపచేస్తారట.[3] తతిమ్మా నాలుగు రకాల వివాహాలు చెల్లుతాయి కాని అంతగా గౌరవ ప్రదమైనవి కావు. ఇరువురి ఒప్పందంపై జరిగేవి గాంధర్వ వివాహం. కన్యతండ్రికి ధనం ఇచ్చి కన్యను వివాహమాడేది అసురం. కన్య బంధువులు నిద్రపోవుచున్నపుడో లేక శ్రద్ధ వహించనపుడో కన్యను దొంగలించుకొని పోయేది పైశాచం. కన్య బంధువులను చంపి లేక వారి తలలను చీల్చి

కన్య యున్నూ వారున్నూ దుఃఖించుచుండగా కన్యను బలవంతాన ఎత్తుకొని పోవటం రాక్షసం.

అర్ధశాస్త్ర కాలంనాటికి పైశాచం యొక్క అర్థం కొద్దిగా మారింది. స్త్రీ నిద్రిస్తున్నపుడో స్త్రీ మతి లేకయున్నపుడో (చిత్తచాంచల్యం) సంగమించిన పురుషునితో వివాహంగా చెప్పబడింది. అర్ధంలో తండ్రికి కొంత లాభం రెండు ఆవులు వస్తాయి. అసుర వివాహంలో ధనం వస్తుంది. కనుక ఆ వివాహాన్ని తండ్రి జరిపించినా అది అధార్మికం. అర్ధశాస్త్రంలో ప్రాజాపత్యం రెండవదిగాను, దైవం నాల్గవదిగాను, గాంధర్వం అయిదవదిగాను, అసురం 6 వదిగాను చెప్పబడింది. ఆర్ష, రాక్షస పైశాచాలు వరుసగా 3, 7, 8 వవి. బ్రాహ్మనిది మొదటిస్థానం. మనుధర్మశాస్త్రంలో వరుసక్రమం మారింది. 1, 3, 7, 8 స్థానాల విషయంలో మార్పులేదు. కాగా దైవం 2 వదిగాను ప్రాజాపత్యం 4 వదిగాను, అసురం 5 వదిగాను, గాంధర్వం 6 వదిగాను పేర్కొనబడినది. మనుధర్మశాస్త్రం అర్ధశాస్త్రం కన్న తరువాతది అని గుర్తు ఉంచుకుంటే ఈ మార్పుకు కారణం ద్యోతకమవుతుంది. కౌటిల్యుడు ధార్మ్య వివాహాలపై దృష్టి సారించాడు. లౌకిక వివాహాలను కాదనలేదు. మనువు వివాహానికి ధర్మాన్ని జోడించాడు. మొదటి నాలుగు వివాహాలను పవిత్రం చేశాడు.

మహా భారత కాలంలో అష్టవిధ వివాహాలే గాక స్వయంవరం కూడా ఉండేది. కాని అది క్షత్రియులకు పరిమితం. అవి మూడు తెరగులవి. కేవలం వరపరీక్షకు సంబంధించినది మొదటిది. మత్స్యయంత్రాన్ని కొట్టాలనే నియమం అలాంటిది. ద్రౌపది స్వయంవరం దానికి నమూనా. స్త్రీ తన ఇచ్ఛ వచ్చిన పురుషుని ఎన్నుకోనుటకు వీలు కల్పించేది రెండవది. దమయంతీ స్వయంవరం దానికి మచ్చుతునక. ప్రకటింపబడిన స్వయం వరంలో అచ్చటికి చేరిన రాజులను జయించి కన్యను తెచ్చుకొనుట మూడవది. కళింగ రాజకుమార్తెను స్వయంవరంలో దుర్యోధనుడు తతిమ్మా రాజులతో పోరాడి తెచ్చుకొనుట దీనికి ఉదాహరణ. సుభద్రార్జునుల వివాహం రాక్షస వివాహం. ఈ పద్ధతి వివాహంలో వరుడే యుద్ధం చేయనక్కరలేదు. అతని తరఫున మరెవరైనా పోరాడవచ్చును. సూనుడు దేవకిని తెచ్చి వసుదేవునకు వివాహం చేసాడు. భీష్ముడు అంబిక, అంబాలికలను తెచ్చి విచిత్రవీర్యునకు

వివాహం చేసాడు. ఈ విధానంలో ఒక నియమం పాటించాలి. ప్రధాన మయిన స్త్రీని చెరపట్టరాదు. అంబ సాళ్వరాజుకు నిశ్చితమయిన స్త్రీ. అందు వలన భీష్ముడు ఆ విషయం తెలియగానే వదలివేశాడు. యుద్ధంలో ఓడి పోయిన స్త్రీలను చెరపట్టటం రాక్షసమే కృష్ణుడు అలా 16 వేలమంది స్త్రీలను సంపాదించాడు. గంగా శంతనులది ఒప్పందపు పెండ్లి. పరాశర మత్స్య గంధులది, శంతన సత్యవతులది, యయాతి దేవయానులది, శకుంతలా దుష్యంతులది గాంధర్వ వివాహాలు. అసుర వివాహం కొన్ని ఆర్యుల తెగలలో ఉండేది. కాని మొత్తంమీద నిరసించినట్లు కన్పడుతుంది. భీష్ముడు శుల్కం ఇచ్చి మాద్రిని పాండురాజుకు భార్యగా కొన్నాడు. సావిత్రి తనే భర్తను వెదకికొన్న స్త్రీ. ఇలా జరగటం చాల అరుదు. ఈ కథ కల్పితం కావచ్చును.[4]

స్మృతులను పరిశీలిద్దాం. దైవం బ్రాహ్మణులకు మాత్రమే వర్తిస్తుంది. ఋషులు పైశాచాన్ని, రాక్షసాన్ని క్రమబద్ధం చేశారు. అయితే పైశాచాన్ని ఖండించారు. ఆడపిల్ల క్షేమంకోసం పైశాచానికి గురి అయిన అమ్మాయికి మరల పెళ్ళి చేయవచ్చని వశిష్టుడు చెప్పాడు. బౌద్ధాయనుడు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య వివాహాలు బ్రాహ్మణులకు పనికివస్తాయని అన్నాడు. మనువు లెక్కవేరు. ఆసురం వైశ్యులకు, శూద్రులకు వర్తిస్తుంది. క్షత్రియులకు గాంధర్వం, రాక్షసం ఆమోదయోగ్యాలు. పైశాచం ఏ వర్ణస్థులకూ పనికిరాదు.

శాసనాలవల్ల పరిస్థితి మారిందాకా బ్రాహ్మ, అసురాలు మాత్రం చెల్లే వివాహ రీతులు. 1961 లో వరట్న నిషేధశాసనం వచ్చింది. బాలికల విక్రయం అంతకు క్రితమే నిషేధించబడింది. కాగా 'ఓలి' పేరుతో లాంచన ప్రాయమైన శుల్కం ఆచారంగా కొన్ని కులాలలో సాగుతున్నది. కన్యాదానం, పాణిగ్రహణం, సప్తపది ఒకనాడు వివాహానికి - వైదిక కర్మ ప్రకారం జరిగే వివాహానికి తప్పనిసరిగా అవసరమయ్యేవి. ఈనాడు హిందువుల వివాహ శాసనం ప్రకారం వధూవరులలో ఏ ఒకరి ఆచారం ప్రకారము వివాహం జరిగినా చెల్లుతుంది.

పెండ్లిని ఎవరు కుదురుస్తారు ?

వేదకాలంలో సాధారణంగా కన్య తన వరుని తానే ఎంపిక చేసుకోటానికి వీలు కలిగేది. కాగా తల్లిదండ్రుల సలహాకు ఆమె నిర్ణయంలోబడి ఉండేది. ఆమె సోదరునికి ఆమె అలవాట్లపై కొంచెం అదుపు ఉండటం కలదు. అతడు తన చెల్లెలు పెడత్రోవన పోకుండా గమనిస్తుండేవాడు సోదరుడు, తండ్రి లేని కన్య తానే స్వతంత్రించేది. తల్లిదండ్రులు బ్రతికి ఉంటే వారి సమ్మతి విధిగా కావాలి. కాని సర్వసాధారణంగా ఆమె కోరికను వారు మన్నించేవారు. శావశ్వ పురోహితుని కుమారుడు. అతడు రాజకన్యను వివాహమాడకోరాడు. తల్లిదండ్రులు అతడు బీదవాడనే కారణంతో అంగీకరించలేదు. పెండ్లి అప్పటికి ఆగిపోయింది. (రుగ్వే VI 61, 52; VI 61, 81, 82). శశియాసి ఆనే రాజకన్యకు అతడు వరుని కుదిర్చాడు. ఆమె అతనికి సంపద ఇచ్చింది. ఆ సంపదను చూపి శావశ్వుడు రాజకన్యను, ఆమె తల్లిని అంగీకరింపచేసి వివాహం చేసుకున్నాడు. తల్లిదండ్రులు కన్యను వివాహ విషయంలో సరియయిన మార్గాన నడిపేవారు. కాని ముఖ్యపాత్ర కన్యదే (అధర్వ. VI 61, 1). తల్లిదండ్రులు యువకులను ఇంటికి విందుకు పిలిచి తమకు ఇష్టమైన స్త్రీ ప్రేమను సంపాదించుకోమనేవారు. అక్కడ చేరిన పురుషులలో కన్య తన వరుని ఎన్నుకునేది. (రుగ్వేదం X 27, 12). తల్లిదండ్రులు మధ్యవర్తులు మాత్రమే. (రుగ్వే. X 78, 4; 85, 15, 23)[5]. వేదకాలంలో కన్యకు షుమారు పదునారేండ్లు వచ్చినపుడే వివాహప్రసక్తి వచ్చేది. ఈలోగా ఆమె విద్యను అభ్యసించేది. కనుక కొంత ఇంగిత జ్ఞానం ఆమెకు ఉంటుందని తలపోసినట్లు తెలుస్తున్నది.

ఎప్పుడయితే రజస్వలాత్పూర్వ వివాహాలు అమలులోకి వచ్చాయో, లేక రజస్వల కాగానే వివాహం చేయడం ఆరంభించారో కన్యయొక్క జోక్యం తగ్గిపోయింది. తల్లిదండ్రుల ఇష్టాయిష్టాలకే ప్రాముఖ్యత వచ్చింది.

ఈ నాటికి హిందూ సమాజంలో 100 కి 95 వివాహాలు తల్లిదండ్రుల ఎంపికతోనే జరుగుతున్నవి. ఉన్నతస్థాయి పట్టభద్రులైన స్త్రీలకు, ముప్పది సంవత్సరాల వయస్సు వచ్చిన కన్యలకు తండ్రులు సంబంధాలకోసం సంవత్సరాల తరబడి అన్వేషించటం చూస్తున్నాం. కాగా ప్రేమవివాహాలు లేకపోలేదు. వాటి సంఖ్య బహుస్వల్పం.

<u>వివాహ వయఃపరిమితి</u> :- ఈనాడు శాసనం వివాహమాడేటప్పటికి కన్యకు 18 సం॥ నిండాలని అంటున్నది. 1929 లో శాసనం రూపేణ బాల్య వివాహ నిరోధం వచ్చినపుడు కన్యకు 14 సం॥ నిండాలని నియమం విధించారు. క్రమేపి వయస్సును పెంచుకుంటూ వచ్చారు. ఇటీవల శాసనం కొద్దిగా మారేవరకు శాసనానికి బలంలేదు. కేవలం వ్యక్తిగతమైన ఫిర్యాదు మీదనే ఆధారపడవలసి వచ్చేది. ఏదయినా శాసనాన్ని ఖాతరు చేయని వర్గాలు చాల అధికంగా ఉన్నాయి. సనాతన బ్రాహ్మణులు, గ్రామాలలో నివసించే కొన్ని కులాలవారు ఇంకా బాల్యవివాహాలు చేస్తున్నారు. ఆడపిల్ల రజస్వల కాకముందే పెళ్ళిళ్ళు చేస్తున్నారు. శూద్రులని పిలువబడేవారిలో ఎక్కువమంది మొదటినుండి రజస్వలానంతర వివాహాలు చేసేవారు. కాగా కొందరు మాత్రం బాల్యవివాహ దురాచారాన్ని అనుసరిస్తున్నారు. ఇది 'సంస్కృతీ కరణ' ప్రభావమా, మరొకటియా అనే దానికి ఇంకా పరిశోధన చేయవలసి వుంటుంది. బ్రాహ్మణులవలె సంచరించవలెనన్న ఆకాంక్షతో కొన్ని కులాలవారు బ్రాహ్మణుల ఆచారాలను అనుసరించ ప్రారంభించారు. దాంతో బ్రాహ్మణులు అలవాటుగా పాటించే దురవాట్లు తదితరులకు సంక్రమించాయి ఇది శోచనీయ పరిణామం. తెలంగాణాలో 'శూద్ర' వర్ణంలో కొన్ని కులాలు ఇప్పటికీ బాల్య వివాహాలు చేస్తున్నారు. పదిసంవత్సరాలలోపు వయస్సుగల పిల్లల మెడలలో మంగళ సూత్రాలు కనిపిస్తున్నాయి. ఈ భావాన్ని వదిలించ డానికి మున్ముందుగా ఈ భావం ఎలా పుట్టిందో, ఎలా పరిణామం చెందిందో తెలిసికోవాల్సిన పరిస్థితి వుంది.

వేదకాలంలో వివాహాలు రజస్వల అయినతరువాత జరిగినవే. కన్యకు ప్రేమ అంటే ఏమిటో అవగాహన అయ్యేది. క్రతువుల అర్థం తెలిసేది; పరిజ్ఞానం ఉండేది. కన్య బాగా ఎదిగి శోభనానికి, గర్భధారణకు తగిఉండేది. (రుగ్వే. X 25; 41, 42, 43, 45, 46.) దీర్ఘమైన వివాహ క్రతువులో శోభనం ముఖ్యభాగం (రుగ్వే. X 85). ఆమె ఎదిగిన స్త్రీ అనే భావంలోనే వివాహ తంతు ఉండేది. (రుగ్వే. VII 55, 8), కన్యా, కనా, కానీనక, కన్యానా ఇవి అవివాహిత స్త్రీలకు పేర్లు. జవ్వని అంటే యువతి. ప్రియునితో కలవగల స్త్రీ; మరియు వయస్సు వచ్చిన అవివాహిత స్త్రీ. యోష, యోషన్, యోషణ, యోషిత్ ఇవి వివాహానికి తగిన వయస్సువచ్చిన స్త్రీ పేర్లు కాబట్టి రజస్వలానంతర వివాహాలు మాత్రమే ఉండేవని తెలుతుంది.

బాల్య వివాహాల ప్రసక్తి లేనేలేదు. 'విశ్వావసు' కథవల్ల కూడా ఇది రుజువు అవుతుంది. స్త్రీకి మానవభర్త ఆయిదవవాడు. మొదటి నలుగురు దేవతలు. మొదటి భర్త వరుణుడు. ఆమె పసితనంలో రక్షకుడు. రెండవభర్త సోముడు ఆమె కన్యత్వ సిద్ధికి కారకుడు. రజస్వల కావటం అతని ఆధ్వర్యంలోనే. మూడవభర్త ఆమెలో సంతాన వాంఛను ప్రేరేపించేవాడు. విశ్వావసు నాలుగవ భర్త. ఇతడు గంధర్వుడు. కామానికి అధిష్ఠాన దేవత. విశ్వావసు రూపును పెళ్ళి పాన్పుమీద ఉంచుతారు. పెళ్ళికుమారుడు గంధర్వుని వెళ్ళి పొమ్మని ప్రార్థిస్తాడు. వేదకాలంలో ప్రకృతి శక్తులను ఆరాధించటం విరివిగా జరిగేది. అందుచేత స్త్రీ యొక్క శారీరకాభివృద్ధిని కాపాడే దేవతలను ఊహించారు. దీనినిబట్టి ఆ కాలపు పెళ్ళి ఈడేరిన ఆడపిల్లలకే జరిగేదని నిర్ణయమవుతుంది.[6] ఈనాటికి గర్భాదానపు మంత్రాలలో ఈ నలుగురు భర్తల స్ఫురణ ఉన్నది. 'అష్టవర్షాత్ భవేత్కన్య' అంటూ పెండ్లి నాలుగవ రోజు చదివే గర్భాదానం మంత్రాలలో ఈ ప్రస్తావన చేస్తారు. ఆచారం పేర ఎంత అసంబద్ధపు పనులు జనులు చేస్తారో ఊహించలేము.

క్రీ. పూ. 4 వ శతాబ్దం నుండి కన్యలకు చిన్నవయస్సులో వివాహం చేయాలనే వాదన ప్రారంభమయింది. అనేకమంది యువతులు పెండ్లి చేసుకోకుండా జైనమతంలో చేరడం, సన్యాసినులు కావడం, బౌద్ధ సంఘాలలో చేరడం హిందూ సమాజ నాయకులకు కలవరం కలిగించి ఉండవచ్చును. అందువలన ఈ అభిప్రాయాన్ని ప్రచారం చేశారు. ఉపనయన సంస్కారం స్త్రీకి తీసివేసి వివాహమొక్కటే ఆమె విధిగా పాటించవలసిన సంస్కారంగా చెయాలని ప్రయత్నించారు. మనువు బాల్య వివాహాలను ప్రోత్సహించినా సరియైన సంబంధం దొరకకపోతే జీవితాంతం స్త్రీని కన్యగా ఉండవచ్చని చెప్పాడు (మను IX 89). క్రీ॥ త॥ 100 సంవత్సరాలవరకు రజస్వలా పూర్వ వివాహాలు, మంచివా, కావా అనే చర్చ సాగింది. క్రీ.త. 200 నుండి రజస్వల కాకముందే వివాహం చేయాలనే భావం ప్రబలమయింది.[7] రజస్వల కాకముందు వివాహం చేయకపోతే కన్య తల్లిదండ్రులు నరకానికి పోతారని యాజ్ఞవల్క్యుడు అన్నాడు. ఆ సందర్భంలో తల్లికి, తండ్రికి, సోదరునికి ముగ్గురికి నరకం చెప్పాడు యముడు. పన్నెండవయేడు రాగానే పిల్లకు తండ్రి పెళ్ళి చేయకపోతే పితృదేవతలు ఆమె బహిష్టు రక్తాన్ని త్రాగుతారని పరాశరుడు అన్నాడు. ఇవన్నీ బ్రాహ్మణులకే వర్తించే సూత్రాలు. బాలికలకు 4 సం॥ నుండి 10 సం॥ లోపల వివాహం చేయమని బ్రహ్మపురాణం ఆదేశించింది.[8]

ఇదంతా ఎందుకు జరిగింది? ఆనందమయ జీవితం గడపటానికి వివాహమనే అంశాన్ని వెలికితోసి కేవలం పితృదేవతల ఋణం తీర్చుకోవటానికి సంతానం, అందులో పురుష సంతానం ఎలా కలుగుతుందనే విషయంపై అశాస్త్రీయ ఆలోచలు, సంతానం త్వరగా కలగాలని ఆదుర్దా ఇవన్నీ రజస్వల అయ్యే కాకముందే వివాహం జరిపించాలనే భావానికి పోద్రిదిచేశాయి. స్త్రీ ఋతుమతియైన తదుపరి 4 నుండి 16 వ రోజు వరకు పురుష సంతానం కనడానికి ఆస్కారం ఉన్న దినాలు అని నమ్మేరోజులు అవి. అందులో అమావాస్య, పౌర్ణమి, చతుర్దశి నిషేధాలు. స్త్రీకి రజోదర్శనమయిన తరువాత సరిసంఖ్య కల దినాలలో పురుష సంతానం కలుగుతుందని ఆపస్తంభుడు, మనువు, యాజ్ఞవల్క్యుడు చెప్పారు.9 ఋతుకాలంలో స్త్రీ తలంచిన పురుషుని రూపంలో సంతానాన్ని పొందును. ఋతుస్నాతయైన స్త్రీ భర్తను మాత్రమే చూడవలెనని శాసిస్తుంది. అలాకాక ఆమె పరాయి పురుషుని చూస్తే ఆ పురుషునిలాంటి సంతానాన్ని కనే ప్రమాదం ఉందని వైఖానసస్మార్త సూత్రం చెపుతుంది. ఇవన్నీ అశాస్త్రీయ భావనలు.

రజస్వల అయినవెంటనే ఆమె గర్భధారణ శారీరకంగా బాగా తగ్గి ఉంటుందనేది మరో పొరపాటు అభిప్రాయం రజస్వల అయిన తరువాత కూడ స్త్రీలు శారీరకంగా, మానసికంగా ఎదుగుతారు. రజస్వల అయిన స్త్రీకి తదుపరి గర్భధారణకు అవకాశం ఉన్నా, ఆ సంతానం బలిష్టంగా ఉండాలంటే ఆమెకు ఇంకా కొంత వయస్సు రావాలి. సంతానం కోసం పడే తహతహలో పూర్వీకులు ఈ విషయాన్ని మరచిపోయారు. అందుకని ఆమె ఋతుమతి అవడమే తరువాయి ఆమెకు పెండ్లి చేసి శోభనం చేయించి అత్తింటికి పంపే వారు. స్త్రీ యొక్క ఋతువు ఒక్కటి కూడా నష్టం కారాదని భావం. అందుకే కొన్ని ఏర్పాట్లు చేశారు. కన్య రజస్వల అయిన తరువాత 3 సంవత్సరాలలోపల ఆమెకు తండ్రి పెళ్ళిచేయకపోతే, ఆమె తనే స్వతంత్రించి వివాహమాడవచ్చును. (వశిష్టుని ధర్మశాస్త్రం 17. 67 - 68; మనుధర్మశాస్త్రం IX-90; బౌద్ధాయనుని ధర్మశాస్త్రం IV 1-13) ఆ గడువును మూడు నెలలకు కుదించాడు గౌతముడు. (గౌతమ ధర్మసూత్రం 18-20). అదే విషయాన్ని విష్ణుధర్మ సూత్రం 25-40, 41 చెప్పింది.10

ఇంగ్లీషువారు భారతదేశంలో పరిపాలన ప్రారంభించేనాటికి హిందూ స్త్రీలకు 8 లేక 9 సం॥ వయస్సులో పెళ్ళిళ్ళు అయ్యేవి. బాల్యవివాహాల వలన స్త్రీలు త్వరగా తల్లులు కావటం వలన శారీక పెరుగుదల వుండదు. అవయవాలు పెరుగుదల తగ్గటం వలన అవి కావాల్సినంతగా విప్పారని కారణంగా తల్లులు ప్రసవాల సందర్భంగా మరణాల పాలయ్యేవారు. అలాగే శిశుమరణాల సంఖ్య ఎక్కువగా ఉండేది. భార్యలకు చదువుకోవటానికి ఆస్కారం లేనందున వారి గోష్టి, సాంగత్యం భర్తలకు నచ్చక వారు వేశ్యా గమనానికి ఉత్సాహం చూపేవారు. అలా ఒకటేమిటి, అనేక అనర్థాలు సంభ వించాయి; సంభవిస్తున్నాయి బాల్యవివాహాలవల్ల.

వధూవరుల లక్షణాలు :-

వేదకాలంలో కన్య విద్యావతి. వివాహమాడతలచుకున్న కన్యలను సద్యోవధువులనేవారు. కనుక ప్రజ్ఞా పాటవాలు కలిగిన స్త్రీని ఆశించటం కద్దు. పెండ్లి మంత్రాలలో "నీవు ఈ ఇంటికి సామ్రాజ్ఞివి. నీ అత్తమామలు నీ చెప్పుచేతలలో ఉంటారు" అనేవి ఉన్నాయి. దీనినిబట్టి గృహనిర్మాణ విద్య ఆమెకు తెలిసివుండాలని తేలుతుంది. భర్తయొక్క పశుపక్ష్యాదులపైన ధానిసలపైన ఆమెకు పెత్తనం ఇచ్చేవారు. అంటే ఈ ఆధిపత్యాన్ని నిర్వ హించగల నేర్పును ఆమె తన పుట్టినింట నేర్చుకొని వుండాలన్నమాట.

భార్యను 'జాయ' అంటారు. అంటే ఆమెలో భర్త తిరిగి పుడతాడు. కనుక భార్య కాబోయే స్త్రీ శుభలక్షణాలు కలిగి ఉండాలని. వంశం, శుభలక్షణాలు, విద్య, ఆరోగ్యం చూడాలని ఆపస్తంబ గృహ్యసూత్ర వాక్యం. అప్పటిదాకా బ్రహ్మచారిగానే వుండాలని బౌద్ధాయన ఉవాచ, మంచి వంశం, మంచి శీలం. దేహ సౌందర్యం, పేరు; పాండిత్యం, సంపద, బంధువర్గం ఉండా లని యముడు చెప్పాడు. కులం. పాండిత్యం, బలం, యవ్వనం, ఆరోగ్యం, అండదండలు, అర్థితం (కోరబడినది) సంపద అవసరమని బృహత్ పరాశరలో ఎనిమిది లక్షణాలు పేర్కొనబడినాయి. సద్వంశంపై నొక్కి పెట్టాడు మనువు. పురుష సంతానం లేని వంశంలో పిల్ల వద్దన్నాడు. ఇంతా చెప్పి వంశం చెడ్డదైనా, అప్రతిష్టాకరమైనా ఆడపిల్ల రత్నం లాంటిదయితే అభిలషణీయమన్నాడు మనువు. సంపద, పాండిత్యాలను సమతూకంగా చూసింది మహాభారతం. తెలివి తేటలు, అందం, మంచి శీలం, శుభ

లక్షణాలు, ఆరోగ్యం వీటిపై నొక్కి పెట్టాడు అశ్వలాయన గృహ్యసూత్రంలో. బాహ్య అభ్యంతర లక్షణాలు శుభప్రదంగా ఉండటం మంచిదని మనువు అభిప్రాయం. అతిగా మాట్లాడే కన్య వద్దని హితవు చెప్పాడు మనువు. సంపద, అందం, తెలివితేటలు, కుటుంబం ఎన్నదగిన అంశాలుగా నిర్ణయించింది భారద్వాజ గృహ్య సూత్రం. వంశం, తెలివితేటలు ఉంటే తతిమ్మావి వదలివేయవచ్చనే భావం ప్రకటన చేయబడింది. విద్య, పాండిత్యం, ప్రజ్ఞ (తెలివితేటలు) ఇవి ముఖ్యమని మానవ గృహ్య సూత్రం తెలియజెప్పింది. వధూవరులు ఒకే కులానికి చెంది వుండాలని గౌతముడు, మనువు శాసించారు. వధువుకు సోదరుడు తప్పని సరిగా ఉండాలని మానవ గృహ్యసూత్రం విశదీకరించింది. 'సోదరుడు లేని స్త్రీ లాగా కళా కాంతులు పోయి' (అధర్వ I - 17 - 1) అనటంలో అదేభావం కన్పడుతుంది. పుత్రికా పుత్రుడు మాతా మహునికి పిండ ప్రదానం చేయాలి. తండ్రికి పిండప్రదానం చేయడు. కనుక వద్దన్నారు.[11]

ఎంపికలో విధి నిషేధాలు :-

ఒకే కులంలో వివాహమాడవలెనని లేక ఒకే జాతిలో వివాహమాడవలెనని ఒక సూత్రం. ఒక గుంపును దాటి మరియొక గుంపులో వివాహమాడవలెనని మరియొక సూత్రం. ఈ రెంటికీ సమన్వయం జరిగింది హిందూ సమాజంలో. సగోత్ర సపిండులతో వివాహం పనికిరాదన్నారు. కాని మానవ సమాజంలో మొదటినుండి ఈ ఏర్పాటు లేదు. సోదరీ సోదరుల వివాహాలు ఈజిప్టులో జరిగేవి. బ్రహ్మ తనకుమార్తె సరస్వతిని చేసుకున్నాడు. యముడు యమిని వివాహమాడాడు. ఇది పాతచరిత్ర. కాగా వేదకాలంలో గోత్రం అంటే గోశాల అని అర్థం. ఆనాడు ఒకే గోశాలలో కట్టివేసుకునే వారి వంశాల మధ్య వివాహం పనికిరాదని నియమం ఉన్నట్లు సాక్ష్యాధారాలు లేవు. క్రీ. పూ 600 సం॥ నికి పూర్వం ఈ రకపు నిషేధాలు లేవు. సగోత్ర వివాహాల నిషేధం అనార్య జాతుల ఆచారమై ఆర్యుల ఆమోదాన్ని పొంది ఉండవచ్చును.[12] అనార్యులలో ప్రతి గుంపుకు ఒక జంతువు చిహ్నంగా ఉంటుంది, కనుక ఆ జంతువు చిహ్నంగాకల గుంపులో వివాహమాడేవారు కాదు. గోత్రం అనేది ఋషుల పేర్లమీదుగా వచ్చినదని ఆల్టేకర్ అంగీకరించాడు. బ్రాహ్మణులకు గోత్రాలు ఉన్నాయి. తతిమ్మా వర్ణాలవారు పురోహితులైన బ్రాహ్మణుల గోత్రాల పేరును వాడేవారు.

ఏదైనా గోత్రాలకు చెందినవారు విపరీతంగా పెరిగిపోయిన ఈ రోజుల్లో సగోత్ర వివాహాల పట్ల పట్టుపట్టటం పొరపాటు అభిప్రాయం. సగోత్ర, సప్రవర (ఋషుల పేర్లు ఉంటాయి) వివాహాలు చెల్లుతాయని శాసనం బ్రిటిషు వారి హయాంలో వచ్చింది.

సపిండ వివాహాలు నింద్యం. పిండం అంటే దేహంలో అణువు అని అర్ధం. ఒక పూర్వీకుని నుండి వచ్చిన స్త్రీ పురుషులలో వివాహ సంబంధాలను నిషేధిస్తుంది ఈ సూత్రం. ఉదాహరణకు మేనత్త మేనమామల సంతానం వివాహమాడరాదు అని ఆపస్తంభుడు అంటే, దక్షిణాదికి చెందిన బౌద్ధాయనుడు ఆమోదించాడు. వాసుదేవ కృష్ణుని రుక్మిణి, అర్జునుడు సుభద్ర ఇలాంటి సంబంధాలు. ఇవిగాక విరుద్ధ సంబంధాలను కూడదన్నారు. ఉదాహరణకు భార్య సోదరి కుమార్తెను వివాహమాడరాదు. ఆమె తన కూతురితో సమానం వరుసకు. కూతురును వివాహమాడరాదు కనుక, పనికిరాదు. ఆరోగ్య సూత్రాలు, సామాజిక సామరస్య సూత్రాలు పాటించవలసినదే. ఆస్తులు నిలువుకోవటానికి, దగ్గర సంబంధాలు కలుపుకోవటానికి ఆరోగ్యసూత్రాలను పాటించక పోవటం అవివేకం.

<u>వర్ణాంతర వివాహాలు</u> :- వర్ణం వేరు. కులం వేరు. వేదకాలంలో కులాలు లేవు. వర్ణాలున్నాయి. వైదిక వాఙ్మయంలో వర్ణాంతర వివాహాలు కన్పడతాయి. చ్యవనుడు సుకన్య (క్షత్రియ స్త్రీ) ని వివావామాడినట్లు శత పథ బ్రాహ్మణంలో ఉంది. అలాగే రాజు వైశ్యస్త్రీని పెండ్లాడినట్లు శ్యావస్వుడు (బ్రాహ్మణ) రధావీతి దార్భాను పెండ్లాడినట్లు వరుసగా శతపథ బ్రాహ్మణంలో, ఋగ్వేదంలో కధలు ఉన్నాయి. ఆపస్తంభ ధర్మసూత్రం అదే వర్ణంలో వివాహం చేసుకోమని హితవు చెప్పింది.

వేదకాలంనాటికి బ్రాహ్మణ రాజన్య వర్ణాలు ఏర్పడ్డాయి. సామాన్యులను 'విశ' అని పిలిచేవారు. వారే వైశ్యులయినారు. ఎక్కువమంది ఋషులు బ్రాహ్మణులనుండి వచ్చారు. వర్ణవ్యవస్థ ముదురు పాకాన పడలేదు. కలసి భోజనం చేయటం, అంతర్వర్ణ వివాహాలు ఉండేవి. అనులోమ ప్రతిలోమ వివాహాలు జరిగేవి. కాకపోతే ప్రతిలోమ వివాహాలు తక్కువ. కక్షివాన్, విమద వీరంతా బ్రాహ్మణ ఋషులు. వీరు రాజన్య స్త్రీలను వివాహమాడారు.

తతిమ్మా వర్ణాలవారికి బ్రాహ్మణ పురుషుడు తగినభర్త అని అధర్వవేదం చెపుతుంది. (అధర్వ IV 17, 8, 9) అంగీరస రుషి కుమార్తె శాశ్వతి అనంగుడనే రాజును భర్తగా పొందింది. అంగీరసుని కుటుంబపు బ్రాహ్మణస్త్రీ శ్వాణయరాజును పెండ్లి చేసుకున్నది. దేవయాని యయాతిని పతిగా స్వీకరించింది. ఇవి ప్రతిలోమ వివాహాలకు నిదర్శనాలు. ఆర్యగృహిణి తన వెంట అత్తవారింటికి దాసీస్త్రీలను తెచ్చేది. వారిని యజమాని లైంగికంగా వాడుకొనేవాడు. అలా కలిగిన సంతానం దాసీపుత్రులు. ఈ దాసీస్త్రీలు ఆర్యులు జయించిన అనార్యుల స్త్రీలు. ఓడిపోయిన అనార్యులను దాసులని పిలిచేవారు. వర్ణాంతర వివాహానికి కారణాలు :- 1) ప్రేమ స్వేచ్ఛాయుతమగుట 2) భాగస్వామిని తామే ఎన్నుకొనుట హక్కు కలిగియుండుట. యజుర్వేదంలో శూద్రులకు ఆర్యులకు గల వివాహ సంబంధ ప్రసక్తి ఉంది. అధర్వ వేదంలో దాసిన పురుషుడు తన భార్యను- అంటే ఆర్యగృహిణి ప్రేమనుపొందకుండా మంత్ర తంత్రాలున్నాయి. కుటుంబపు దాసిన పురుషుడు యజమాని విధవరాలిని హక్కుగా పెండ్లాడవచ్చనే పురాతన సంప్రదాయాన్ని అశ్వలాయన శ్రౌత సూత్రం (IV 2, 18) పేర్కొన్నది. రక్తపు పవిత్రతను ఎంత పదిలపర్చాలన్నా గౌతముడు వర్ణాంతర వివాహ సంతానం యొక్క పేర్లు ఉటంకించాడు.13 అర్థశాస్త్ర కాలానికి వర్ణవ్యవస్థ ఇంకా బిగవలేదు. కాగా బ్రాహ్మణ వర్ణానికి ఆధిక్యత ఉంది. మనుధర్మ శాస్త్ర కాలానికి బ్రాహ్మణ్య శ్రేష్ఠత మరింత గట్టిపడింది. తమ వర్గ రక్షణ చేసుకున్నారు పకడ్బందీగా. బ్రాహ్మణ వర్ణంలోనుండి ఆస్తి జారిపోకుండా ఏర్పాట్లు జరిగాయి. బ్రాహ్మణ భార్య సంతానానికి ఇల్లు, సేద్యపు పనిముట్లు ఇతోధిక సౌకర్యాలు. జన్మవల్ల, విజ్ఞానంవల్ల భాష్యం చెప్పే అధికారం సంపాదించిన బ్రాహ్మణులు తమకు అనుకూలమైన జీవిత విధానాన్ని తదితరులపై రుద్దారు. అందుకు అనువైన ఆచారాలను, వ్యవస్థలను సృష్టించారు.14 బ్రాహ్మణుడు బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్ర వైశ్య స్త్రీలను వివాహమాడవచ్చని, క్షత్రియుడు క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలను పెండ్లాడ వచ్చని, వైశ్యుడు వైశ్య శూద్ర స్త్రీలను ఉద్వాహమాడగలరని, శూద్రుడు శూద్రస్త్రీని పరిణయమాడవచ్చని మనువు చెప్పాడు యాజ్ఞవల్క్యుడు ఒక వర్ణపు పురుషుడు 'దిగువన' ఒక వర్ణము స్త్రీని పెండ్లి యాడవచ్చని చెప్పాడు. కాని ద్విజుడు శూద్రస్త్రీని ఎట్టి పరిస్థితులలోను

భార్యగా స్వీకరించరాదన్నాడు. 'ఉన్నత' వర్ణపు పురుషుడు 'నీచ' జాతి స్త్రీని స్వీకరించటం అనులోమ పద్ధతి. అలాకాక 'ఉన్నత' వర్ణపు స్త్రీ 'నీచ' జాతి పురుషుని భర్తగా పడయుట ప్రతిలోమ విధానం. క్రీ. శ. 10 వ శతాబ్దం వరకు వర్ణాంతర వివాహాలు జరిగాయి. అప్పటివరకు ద్విజులలో పెద్దగా- సాంస్కృతిక తేడాలు లేకపోయినందున అలాంటి వివాహాలు సాగాయని ఆల్టేకరు భావం. తరువాత సాంస్కృతిక విభేదాలు పెరిగినందున నిషేధం వచ్చిందని ఆయన అభిప్రాయం.

బ్రిటిషువారు వచ్చిన తరువాత ప్రతిలోమ వివాహాలు చెల్లవని, అనులోమ వివాహాలు చెల్లుతాయని తీర్పులు వచ్చాయి. దరిమిలా వర్ణాంతర వివాహాలను చట్టబద్ధం చేస్తూ శాసనం వచ్చింది. 1955 హిందూ వివాహ శాసనం ప్రకారం వర్ణం, కులం, పట్టింపు కాదు; దానికి అడ్డంకులుండరాదు.

## వరకట్నం, కన్యాశుల్కం :-

వరుడు ఆడబిడ్డ తండ్రికి లేక సంరక్షకునికి కొంత ధనమిచ్చి ఆడ పిల్లను పెళ్ళిచేసుకోవటం అసుర వివాహ పద్ధతి. తండ్రికి లేక సంరక్షకునికి ఇవ్వబడిన పైకాన్ని శుల్కం అంటారు. అసుర వివాహాన్ని శాస్త్రకారులు గర్హించారు. ఆడపిల్లను అమ్మటం మహా దురాచారంగా అభివర్ణించారు. వేదకాలంలో పిల్లను అమ్మే ప్రసక్తి లేదు. బౌద్ధకాలంలోని సన్యాసినులు వ్రాసిన 'తేరీగాధ'లో ఇసిదాసి అనే ఆమె తండ్రి శుల్కం తీసుకున్నట్లు ఆమె చెప్పింది. మహాభారతంలో శల్యుడు మాద్రిని పాండురాజుకు వివాహం చేయటానికి శుల్కం తీసుకున్నాడు. ధర్మశాస్త్రకర్తలు ఈ ఆచారాన్ని నిశితంగా ఖండించారు. ఆడపిల్లలను అమ్మిన వారి సంరక్షకులు ఘోరమైన నరకానికి పోతారని బౌద్ధాయనుడు ప్రకటించాడు. ఆ స్త్రీ అతని భార్య కాబోదని శాసించాడు (బౌద్ధాయన I, 11, 20 - 1). ఆమె తండ్రి గోత్రంలోనే ఉంటుందని, ఆమె కుమారులు తండ్రి పితరులకు తర్పణాలు విడవడానికి హక్కులేదని అత్రి చెప్పాడు (అత్రి 384). అలా ఆడపిల్లను విక్రయించిన వాని ముఖం చూడరాదని పద్మపురాణం శాసించింది. (పద్మ, బ్రహ్మకాండ 24, 26). ఈ దురాచారాన్ని రూపుమాపాలని తంజావూరు 15 వ శతాబ్దంలో ఒకంబడిక చేసుకున్నారట.15 20 వ శతాబ్దంలో కూడ ఆంధ్ర బ్రాహ్మణులు ఈ ఆచారాన్ని పాటించారు. కనుకనే గురజాడవారి

'కన్యాశుల్కం' నాటకం వెలిసింది. అంతేకాదు ఆంధ్రబ్రాహ్మణులు కేరళ నుండి బ్రాహ్మణ కన్యలను కొనుగోలు చేసి తెచ్చి భార్యలనుగా చేసుకునేవారు. అట్టివారిని సమాజం వెలివేయలేదు. వారు పురోహితులుగా కూడ వ్యవహరించిన సందర్భాలున్నాయి. ఇపుడు ఈ ఆచారం బ్రాహ్మణులలో అంతరించింది. కాగా శూద్రులలో 'ఓలి' అనే పేరుతో సాగుతున్నది. ఆమె మారుమనువు చేసుకోవాలంటే ఓలిని మొదటి భర్తకు తిరిగి ఇచ్చివేయాలి. శాసనాలు ఎలా ఉన్నా ఈ ఆచారం సాగుతున్నది. కాగా ఓలి లాంఛనం క్రింద పరిణమించింది కాని స్త్రీ యొక్క బజారు ధరకాదు. ఇది గ్రుడ్డిలో మెల్ల క్రింద లెక్క. స్త్రీని విక్రయించిన అలవాటుయొక్క అవశేషము ఓలి. ఇది అనార్యుల ఆచారమని చెప్పవచ్చును.

## వరకట్నం :-

ఈనాడు వరకట్నపు చావులు స్త్రీలలో ఎక్కువవుతున్నాయి. వరకట్నం చాలదని, ఇంకా తెమ్మని బాధించే అత్తమామలు, భర్తల పెట్టే బాధలు భరించలేక స్త్రీలు ప్రాణత్యాగానికయినా ఒడికట్టున్నారు లేక అత్తమామల చేత, భర్తలచేత చంపబడుతున్నారు. వరకట్న నిషేధ శాసనం 1961 లో ఆమోదింపబడినా, ఇటీవల సవరింపబడినా పరిస్థితులలో మార్పులేదు. ఇది హిందూ సమాజానికి పెద్దమచ్చ.

వేదకాలంలో పరిస్థితిని గమనిద్దాం. శారీరక సౌందర్యం, లలితకళలలో కృషి ఉన్న కన్యలకు పెళ్ళి తేలికగా జరిగేది. ఆమెకు సంపద ఉంటే భర్త దొరకడం సుగమం. (ఋగ్వే X 27, 12). ఆమెకు కొంచెం సౌందర్యలోపం ఉంటే అది ఆమె తెచ్చే కట్నంతో సరిపోయేది. కాపున ఋగ్వేదకాలంలో కట్నం అంటే తల్లిదండ్రులు కుమార్తెకు ఇచ్చే ధన, కనక, వస్తు, వాహనాదులు అన్నమాట. అంతేగాక వరునికి ఇచ్చేది కాదు. ప్రాచీన హిందువులలో వరకట్నం లేదు. ద్రౌపది, సుభద్ర, ఉత్తర తమతోపాటు అత్తవారింటికి గుర్రాలను, ఏనుగులను, సొమ్ములను తెచ్చారట. విశాఖ అనే వ్యాపారస్తుని కుమార్తెను అత్తవారింటికి పంపినపుడు వరునికి విలువగల బహుమతులను పిల్లతండ్రి పంపినట్లు జాతక కథలలో ఉంది. రాజకుమారుల వివాహ సమయంలో బహుమతులు ఇచ్చినట్లు శాసనాలు ఉన్నాయి, రఘువంశంలో దీని ప్రసక్తి ఉన్నది. వీటిని వరకట్నం

అని పిలవటానికి ఆల్టేకరు సమ్మతించడంలేదు. స్మృతులలో వరకట్నాన్ని గురించి ఒప్పందాలు కనపడవు. కన్యను దానంచేసేటప్పుడు దక్షిణ ఇవ్వాలి కనుక కొద్దిపాటి పైకం వరునికి ఇచ్చేవారు. క్రీ. శ. 13, 14 వ శతాబ్దం నాటికి రాజస్థాన్‌లోని రాజపుత్రులలో వరకట్నం ఘోరంగా పెరిగిపోయింది. 19 వ శతాబ్దం మధ్య కాలంనుండి వరకట్నం దారుణరూపం తాల్చింది. శాసనం వచ్చేవరకు పళ్ళెంలో రూపాయల రూపంలో వరకట్నం పోసి వరునికి కుమ్మరించేవారు. ఇపుడూ ఆచారం ఉందికాని రహస్యంగా సాగుతున్నది. అయితే బహిరంగ రహస్యం. ఎవరూ కేసుపెట్టరు; ఎవరూ సాక్ష్యం చెప్పరు. దీని పునాది స్త్రీ పురుషుల అసమానత్వంలో ఉంది. స్త్రీ ఆర్థికంగా బలపడి, మానసికంగా స్థయిర్యం సంపాదించుకొని, ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించుకున్ననాడు గాని ఈ దురాచారం హిందూసమాజాన్ని వదలదు.

వృద్ధకన్య (అవివాహిత స్త్రీ) :-

వేదకాలంలో స్త్రీకి ఉపనయనం, వివాహం రెండు ముఖ్య సంస్కారాలు ఉంటే ఉపనయనాన్ని తీసివేసి వివాహాన్ని తప్పనిసరి సంస్కారంగా చేశారు. తరువాత వివాహం కాని స్త్రీలకు సామాజికంగా గౌరవం తగ్గింది. స్వాతంత్ర్యానంతరం స్త్రీల వివాహ వయః పరిమితి పెంచడం, వారు విద్యకు ఎక్కువ ప్రాముఖ్యతను ఇవ్వడం, ఉద్యోగాలపట్ల శ్రద్ధ వహించడం, ఉన్నత విద్యను అభ్యసించేనాటికి వయస్సు చాల మళ్ళటం, ఆ స్థితిలో 'గంతకు తగిన బొంత' యని ఎవరినో ఒకరిని వివాహమాడ నొల్లకపోవటం వీటివల్ల సమాజంలో — హిందూ సమాజంలో అవివాహిత స్త్రీల సంఖ్య పెరుగుతున్నది. దాంతో వారి తాలూకు అనేక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. వీరు మాత లవటానికి సమాజం అనుమతిస్తుందా లేదా అనేది మీ మాంసగా తయారయింది. ఒంటరిగా జీవితం గడపవలసిన వీరికి సమాజంలో భద్రత ఎంతవరకు ఉంటుంది. గౌరవం ఎంతవరకు లభిస్తుంది. అనేవి చర్చనీయాంశాలు అయినాయి. వీరికి సాంస్కృతిక సామాజిక జీవితం అందుబాటులో ఉంటుందా లేదా అనేది సందేహాస్పదమయింది. వేదకాలంలో అసలు ఈ వర్గం ఉన్నదా? ఇలాంటి వారు వేదకాలంలో కనిపిస్తే వారు ఎలాంటి జీవితం గడిపారు? ఈ ప్రశ్నకు సమాధానాలు ఆసక్తిదాయకాలు.

వృద్ధకన్యలు తండ్రి ఇంట్లో నివసించేవారు (రుగ్వే I 117, 7; X 39, 3; X 40, 5). వృద్ధులు అయిన తరువాత కూడా వివాహమాడేవారు. 'కక్షివాన్' 'ఘోషా' అనే రాజకన్యను వివాహమాడాడు. ఆమెకూడా వృద్ధురాలే (రుగ్వే I 117, 7; I 2, 17, 7; I 10, 39, 3; I 40, 5). ఆనాడు 'పరివెట్టా'అనే ఆచారంఉండేది. పెద్దవాళ్ళ తర్వాత చిన్నవాళ్ళు వివాహమాడాలి. అవివాహిత మాతలు సంఘబహిష్కారానికి భయపడి పిల్లలను చీమల పుట్టలపై పారేశారు. (రుగ్వే IV 19, 9).

జాతకాలు :- గృహ్యసూత్రాలు, ధర్మసూత్రాల రోజుల్లో జాతకాలను చూచేవారుకాదు. క్రీ. త. 400 వరకు వాటిని గట్టిగా పట్టించుకునేవారు కాదు. పెళ్ళి ముహూర్తాలకు నక్షత్రాలను మాత్రం చూచేవారు. క్రీ॥ త 400-900 మధ్య జ్యోతిష్యం బలపడింది. అప్పుడు జాతకాలు పెళ్ళిళ్ళలో పాత్ర వహించటం ప్రారంభించాయి. సంబంధాలను కలపడమో లేక చెడగొట్టటమో వాటివని. క్రీ. త 700 లోని దశకుమారచరిత్రంతో జ్యోతిష్యాన్ని సంప్రదించి నట్లు ఉన్నది.16

ఈ జాతకాలపై వ్యామోహం విపరీతంగా పెరిగింది. ఇంచుమించుగా అన్ని దినపత్రికలూ, వారపత్రికలూ వారఫలాల జోస్యాలను వేయటం చూస్తున్నాము. ఇతరత్రా అన్నిలక్షణాలు బాగున్నా జాతకాలు కుదరలేదని పెండ్లి సంబంధాలను తమ కుమార్తెలకు పోగొట్టుకున్నవారిని చూస్తున్నాం. జాతకాలు కుదిరాయన్న నంబరంతో చేసిన పెండ్లిండ్లలో వరుడు సంవత్సరం నిండకముందే చనిపోతే బాలవిధవను ఇంటిలో కుంపటిలాగా పెట్టుకొని కాలక్షేపం చేస్తున్న తల్లిదండ్రులు కోకొల్లలు. పట్టాభిషేకానికని పెట్టిన లగ్నం సీతారాముల వనవాసానికి ఎందుకు దారితీసింది? అన్న ప్రశ్నకు సమాధానం దొరకదు. జ్యోతిషము మానవ జీవితంతో చెలగాటమాడుతున్నది. దీనిని ప్రపంచంలోని సుమారు నూటపదిమంది మేధావులు నిరుపయోగమని ప్రకటించారు. తెలిసినవారు దీనిని వ్యతిరేకిస్తున్నారు. దాని మంచి చెడ్డలను విచారించడానికి అందరు ప్రజలకు తీరిక, అవకాశం, తగిన ఓపిక లేవు. దాంతో సంప్రదాయకంగా దానిని తమ జీవితాలలో పాటించేవారు అధిక సంఖ్యలోనే ఉన్నారు. ఖగోళశాస్త్రజ్ఞానము, జ్యోతిర్గణితము సరియైనవే. జ్యోతిష్యం వేరు జ్యోతిర్గణితం వేరు. సూర్య, చంద్ర గ్రహణాల కాలాన్ని

లెక్కకట్టి కలిగినంత మాత్రాన సూర్య, చంద్రాదులు ప్రతి ఒక్క మానవ జీవితాన్ని శాసిస్తాయనడం ఎంతవరకు సబబు? అలా జరిగితే మానవ సంకల్పానికి శక్తి లేకుండా పోదా? మానవ జీవితం ముమ్మందుగా నిశ్చయింప బడినదై మానవ పురుషప్రయత్నాన్ని వమ్ము చేయదా? అపుడు 'కర్మ' సిద్ధాంతం ఏమవుతుంది? ఏదయినా ఈ విషయాన్ని హిందూ సమాజం పట్టించుకోవలసిన అగత్యం ఉంది.

పెండ్లితంతు :-

ఈనాడు పెండ్లితంతు వివిధ ప్రాంతాలలో, వివిధ కులాలలో వేరువేరు రకాలుగా దర్శనమిస్తోంది. వాటికి హిందూ వివాహ శాసనం (1955) ఆమోద ముద్రవేసింది. వధూవరులలో ఏ ఒకరి ఆచారం ప్రకారం జరిగినా వివాహం సక్రమంగా ఉన్నట్లే. బౌద్ధుల ఆచారం వేరు. జైనుల పద్ధతి వేరు, అలాగే బ్రాహ్మణ వర్ణస్థుల విధానం వేరు. శూద్రుల సంప్రదాయం వేరు. వడియ రాజ కులపు పెండ్లికి, ముదిరాజుల ఇంట జరిగే పెండ్లికి మార్పు కనిపిస్తుంది. సప్తపదిని అందరూ పాటించాలని లేదు. పాటిస్తే ఏడడుగులు వేయాలని మాత్రమే నిబంధన. ఇంత వెసులుబాటు శాసనంద్వారా కల్పింపబడినా బ్రాహ్మణ పౌరోహితుని ఆధ్వర్యంలో అర్థంకాని భాషలో—సంస్కృతంలో— వివాహాలు జరుగుతున్నాయి. అందుచేత పెళ్ళిమంత్రాల అర్థాలు కనీసం వధూవరులకు అర్థం కాకుండా పోతున్నది. పెళ్ళిలో చేసే ప్రమాణాలు కేవలం మంత్రాలుగా మిగిలిపోతున్నాయి. ఈ పద్ధతికి నిరసనగా ఎన్నో సంస్కరణోద్యమాలు వచ్చాయి. బ్రాహ్మణ పౌరోహితునికి బదులు అబ్రాహ్మణ పౌరోహితుడి ఆధర్వం, సంస్కృతంలో బదులు తెలుగులాంటి ప్రాంతీయ భాషలలో పెండ్లి, పురుషునికి ప్రత్యామ్నాయంగా స్త్రీ పౌరోహిత్యం చేయడం, ఈనాటికి పనికిరాని భావాలను వెలివేసి కేవలం వస్తు ప్రధానమైన ఒడంబడికలు ప్రమాణాలు రంగం మీదికి వచ్చాయి. ఇంతగా మార్పు వస్తున్నా అధిక సంఖ్యాకులు పౌరోహితుల ఆధ్వర్యంలోనే వివాహాలు జరిపిస్తున్నారు. ముఖ్యంగా రెండు సందర్భాలలో వివాహం, మరణం ఈ రెంటికి సంబంధించిన కర్మ కాండలో హిందూ సమాజం మతగురువులను మించిపోలేక పోతున్నది.

పెండ్లితంతులో స్త్రీకి సంబంధించిన ముఖ్య ఘట్టాలను మాత్రమే పరిశీలించపూనటం సరియైన చర్య. లేకపోతే గ్రంధం పెరుగుతుంది. కార్యసిద్ధి నెరవేరదు.

ఋగ్వేదకాలంలో పాణిగ్రహణం, ఊరేగింపు, గృహప్రవేశం మాత్రం ఉండేవి. కన్యాత్వ రాక్షసుని వదిలించేవారు. ఆమె పెండ్లి సమయంలో కట్టిన వసనాన్ని పురోహితునకు దానం ఇచ్చేవారు. అత్తింటికి పోయే త్రోవలో ఆటంకాలు రాకూడదని ప్రార్థనలు సాగేవి. అందరినీ వచ్చి పిల్లలను చూడమని అభ్యర్థనలు ఉండేవి. (ఋగ్వే X-33) దీనిని 'సుమంగళి' అనేవారు సంతానం ఇమ్మని పురోహితులు అగ్నిని ప్రార్థించేవారు. 'నీవు నాతో కలసి వృద్ధాప్యాన్ని చేరుకొనుము' అని వరుడు వధువును కోరేవాడు. అశుభంకాని సమయంలో భర్త యింటిలో వధువు ప్రవేశిస్తుంది. "నీ భర్త తండ్రిపైన, నీ భర్త తల్లిపైన, అధికారం చలాయించుము. నీ భర్త అక్కచెల్లెళ్ళ మీద, తమ్ములమీద నీదే సర్వాధికారం (ఋగ్వే X 36) అని పురోహితుడు చెప్తాడు. తరువాత వధూవరులిరువురు కలసి దేవతలను ప్రార్థిస్తారు 'మన హృదయాలను కలపాలని' వాటి తాత్పర్యం. ఆమె పశువులను తాకుతుంది. ప్రేమతో గృహయాజమాన్యాన్ని స్వీకరించటానికి ఇదిగుర్తు. తరువాత ఆమెను ఆవరించి ఉన్న వరుణుని, సోముని, అగ్నిని. గంధర్వుని మంత్రాలతో ప్రార్థించి పంపివేసిన తదుపరి, భార్యాభర్తలు దాంపత్య జీవితాన్ని ఆరంభిస్తారు. వేదకాలంలో మంగళసూత్ర ధారణ లేదు.

అధర్వ వేదకాలానికి స్త్రీలస్థితి దిగజారింది. స్త్రీకి వివాహం విధి అని భావించే స్థితి వచ్చింది. వృద్ధ కన్యల జీవితం కష్టతరమయింది ఋగ్వేదపు చివరికాలంలోనే. వారిని నరకానికి ప్రభువైన యమునికు వివాహం చేసినట్లుగా భావించేవారు (ఋగ్వేదం I 14, 2). అధర్వ వేదాన్ని తరువాత భారత దేశానికి వలసవచ్చినవారు తెచ్చారని, ఆ వేదపు ఆచారవ్యవహారాలు ఋగ్వేదం ప్రాచీనమయినవని, కాగా భారతదేశంలో ఉనికి విషయంలో ఋగ్వేదపు ఆర్యుల తరువాతవని గ్రహించాలి. చాలకాలం వరకు ఋగ్వేదపు ఆర్యులు అధర్వ వేద ప్రామాణ్యతను అంగీకరించలేదు. వివాహం పూర్తి అయ్యేవరకు వరుడు వధువును చూడకూడదని ఆచారం ఋగ్వేదంలో లేదు. దానికి అధర్వ వేదంలో స్థానం కలిగింది. అధర్వవేదపు వివాహ పద్ధతిలో 'అస్మారోహణం' ఉంది. వధువు రాయిపై కాలూని నిల్చోవాలి. అంటే ఆమె రాయివలె స్థిరత్వం కలిగి పవిత్రమైన వైవాహిక జీవితాన్ని గడపవలెనని ఆశయం. యజుర్వేదంలో అగ్నిచుట్టూ ప్రదక్షిణం, సప్తపదిచోటు చేసుకున్నాయి. ఈనాటి సప్తపదికీ, శాంఖాయన గృహ్యసూత్రంలో చెప్పబడినదానికి తేడా

గమనించండి. "ఒక పదంతో పసరు కొరకు, రెండు పదములతో రసంకొరకు (సోమలత రసంకొరకు), మూడు పదములతో సంపద వృద్ధికొరకు, నాలుగు పదములతో సౌఖ్యం కొరకు, అయిదు పదములతో సంతానం కోసం, ఋతువుల నిమిత్తం ఆరుపదములు, ఏడుపదములతో స్నేహాన్ని ఆశించివేయుము. నీవు నా యెడల విశ్వాసంతో ఉండుము" ఈ మాటలను వరుడు వధువుతో అంటాడు.[17] మంత్ర బ్రాహ్మణంలోని సప్తపది ఉన్నపద్ధతినే బౌద్ధాయనుడు (యజుర్వేద పద్ధతి) అనుసరించాడు. 'నీవు నా స్నేహితురాలివి' అని వరుడు వధువుతో అని తనతో ఏడడుగులు ఆమెను నడిపిస్తాడు. విష్ణుపరంగా ప్రార్థనా యుతంగా తన ఆశను వెలిబుస్తాడు వరుడు. "నీ మొదటి అడుగును ఆహారం కోసం విష్ణువు వేయప్రోత్సహించును గాక"

రెండవ పదం బలం కోసం, మూడవపదం వ్రతాల నిమిత్తం, 4 వ పదం స్నేహాన్ని ఆశించి, 5 వ పదం పశువులకొరకు (ఆనాడు పశువులు ముఖ్యసంపద), 6 వ పదం సంపదను కోరి, ఏడవపదం ఏడుగులు ఆచార్యుల కోసం అని వరుడు చెప్తాడు. 'ఇలా ఏడడుగులు వేసిన నీవు నా స్నేహితు రాలివిగా ఉండుము. నేను నీ స్నేహాన్ని అనుభవించ గలుగుదును గాక.[18]

పాణిగ్రహణంలో వరుడు వధువు హృదయ దేశమందు తన హస్తాన్ని ఉంచి ఇలా అంటాడు :-

"నీ హృదయం నా హృదయమందు ఉండుగాక. నీ చిత్తం నా చిత్త మగుగాక. నీవు హృదయపూర్వకంగా నా వాక్కులను విందువుగాక. నీవు నన్ను అనుసరింతువుగాక. నీవు నా సహచరిగా ఉందువుగాక" (బౌద్ధాయన I 4, 1)

కన్యాదానం హిందూ వివాహంలో ప్రముఖమైన తంతు. తల్లిదండ్రులు కన్యను వరునికి అప్పగిస్తారు. తండ్రి అంతవరకు కన్యపై తనకు ఉన్న హక్కులను వరునికి ధారపోస్తాడు.

కన్యాధాన పద్ధతి హిందూ మతాన్ని ఎంతగానో అభిమానించే మహాత్మా గాంధి నిరసించాడు. తండ్రి కన్యకు రక్షకుడు, కాని యజమాని కాదు. కన్యాదానం చేసే హక్కు తండ్రికి కూడా లేదన్నాడు మహాత్ముడు.[19]

పాణిగ్రహణ మంత్రంలో 'నీవు నా మాట వినుము' అంటాడు వరుడు. సప్తపదిలో నీవు నన్ను అనుసరించుము. అనే భావం ప్రస్ఫుటంగా ఉంది. కన్యాదానం విషయం సరేసరి. అధికారాన్ని అల్లుడికి దత్తం చేస్తాడు. తిట్టుకున్నా సరే, కొట్టుకున్నా నరే ఉలకడు పలకడు. అందుకనే ఇన్ని స్త్రీల హత్యలు, ఆత్మహత్యలూ. ఈ పెండ్లి తంతులోనే నిండి నిబిడీకృతంగా ఉంది పురుషాధిక్య భావన. అది ఈనాడు కూడా ఆదరణీయమా? అనేది చర్చనీయాంశం. ఈ అంశాన్ని మరచిపోయి హిందూ సమాజ వివాహరీతులు 'ఔన్నత్యాన్ని' పొగడడం పొరపాటు కాదా?

హిందూ సమాజంలో దక్షిణాదిన మాంగల్య దారణకు ఎనలేని ప్రాముఖ్యత ఇస్తున్నారు. విద్యావంతులైన స్త్రీలు కూడా తమ వైవాహిక దశకు చిహ్నంగా తాళిని ఏరికోరి మెడలో కట్టించుకుంటున్నారు. అసలు దీని ప్రసక్తి మొదటిసారిగా శౌనకస్మృతి (I - 1) లో కనిపిస్తుంది.20 సూత్రాన్ని కన్య మెడలో కాక మొక్కకు కటేవారు.21 కన్య మెడలో మంగళసూత్రం కట్టడం అనేది అనార్య ఆచారం. దీనికి తమిళదేశంలో ప్రాముఖ్యత మరీ ఎక్కువ. సుముహూర్తం అంటే తాళి కట్టినవేళయే. తాళికట్టే పద్ధతి 11 వ శతాబ్దంలో స్కాందపురాణంలో మనకు దర్శన మిస్తుంది. అంటే ఇది సుమారు తొమ్మిది వందల సంవత్సరాల ఆచారం మాత్రమే.

అధ్యాయం 3

# పాదదీపికలు


1. మానవ వివాహాల చరిత్ర : వెస్టర్ మార్క్
   (History of Homan Marrages Vol 1. Page 26)
2. ఉపాధ్యాయ : వివాహం అనే అధ్యాయంలో
3. ఆశ్వలాయన గృహ్యసూత్రం I 6. 1-4
   (వేదకాలపు స్త్రీలు : శకుంతలాశావు శాస్త్రి పుట 121)
4. యుగయుగాలలో భారతీయ స్త్రీలు : పి. థామస్
   6 వ అధ్యాయం.

4. ఉపాధ్యాయ : 'వివాహం' అనే అధ్యాయంలో
6. డిటో డిటో
7. ఆల్టేకరు : 2 వ అధ్యాయం పుటలు 53-56
8. పి. థామస్ : 8 వ అధ్యాయం
9. ధర్మశాస్త్రిలు : కానే పుట 205
10. డిటో పుట 525
11. డిటో పుటలు 429 - 435
12. ఆల్టేకర్ : పుట 74
13. ధర్మశాస్త్రిలు : కానే పుటలు 447, 448
14. హిందూస్త్రీ Hindu Women
Normative model : Probhati
Mukherjee - (1978) Page 103
15. లఘు అశ్వలాయన స్మృతి 15-33
16. బౌద్ధాయన గృహ్యసూత్రం V. 5 కానే వాల్యూమ్
2 పార్టు 1, పుట 537
17. ఆల్టేకరు పుటలు 40, 41
18. డిటో పుట 72
19. వేదకాలపు స్త్రీలు : శకుంతలరావు శాస్త్రి పుట 124
20. డిటో పుట 135
21. స్త్రీలు : మహాత్మా గాంధి : పుట 63
Women : M. K, Gandhi (Navajivan
Publishing House, Ahmedabad - 14. (1964)



అధ్యాయం

# 4 వైవాహిక జీవితం

ఈనాడు హిందువులలో అధిక సంఖ్యాకుల ఇళ్ళలో పురుషునిదే పెత్తనం. పేరుకు స్త్రీ గృహలక్ష్మి. అన్ని ముఖ్యమైన నిర్ణయాలు చేసేది అతడే. స్థిరాస్తి సంపాదన, దాన్ని భద్రపరచటం, చరాస్తి ఎలాంటిది కావాలో నిర్ణయించటం, పిల్లల పెళ్ళిళ్ళు, విద్య, ఒకటేమిటి ఇంచుమించుగా అన్నీ అతని హక్కు భుక్తాలే. కొన్ని కుటుంబాలలో ఏయే పదార్థాలు వంట చేయాలో తేల్చేది అతడే. అతడు భుజించిన తరువాత ఏమైనా మిగిలివుంటే పిల్లలకు పెడుంది తల్లి. వారు తినగా ఇంకా ఏమయినా—మిగిలితే ఆమె తింటుంది. లేకపోతే మజ్జిగ నీళ్ళతో లేక గంజినీళ్ళతో తృప్తిపడుతుంది. ఆరోగ్యనిపుణులు ఈ విషయమై గగ్గోలు పెట్టున్నారు. స్త్రీకి పోషకాహారం చాలినంత లేదని ఆందోళన చేస్తున్నారు. అధిక సంతానం వలన ఆమె ఆరోగ్యం దెబ్బతింటున్నదని ఎలుగెత్తి చాటుతున్నారు. ఆమె కేవలం చాకిరీ చేసే యంత్రంగా మారిందని స్త్రీ విమోచనోద్యమకారులు పదే పదే ప్రకటిస్తున్నారు. ఈ స్థితి ఇలా ఉండటానికి హిందూ మనస్తత్వం కారణభూతమా? అనేది పరిశీలించాలి.

<u>భార్యను గురించి వర్ణనలు</u> :- శుభం తెచ్చునది కనుక ఆమె 'కళ్యాణి' (ఋగ్వే III 53. 6). భర్త ఇంటికి ఆశీస్సులను తెచ్చునది కనుక ఆమె 'శివతమా' (ఋగ్వే X 85, 37). పశువులకు సౌభాగ్యాన్ని తీసుకొని వచ్చేది (ఋగ్వే X 85, 43; 44). కళ్ళల్లో క్రూరత్వం లేక, భర్తను చంపేదిగా కాక, పశువులకు శుభం చేకూర్చేదిగా, దేవతలను ప్రేమించేది, సంతోష స్వాంత, వీరమాత, పశుపక్ష్యాదులకు క్షేమం కలుగజేసేది (ఋగ్వే X 84,44) భర్త సంతోషాన్ని పంచుకునేది, అతనిని కౌగలించేది (ఋగ్వే X 89, 37). భార్యసామ్రాజ్ఞి (ఋగ్వే X 85, 46). భార్యయే కుటుంబం, గృహం అని విశ్వామిత్ర ఉవాచ. ఋగ్వే III. 53, 4)

కుటుంబానందం, దాంపత్య ప్రేమ అనే పదాలు ఋషుల గానాలలో కనిపిస్తాయి. ఆర్యులది ఒక రకమైన సమతుల్య జీవితం. దేవతల పట్ల

యజ్ఞ, యాగాదుల విషయంలో కఠిననియమాలు, మరల కుటుంబంలో ప్రేమతో కూడిన దాంపత్య జీవితం ఈ రెండూ పెనవేసుకొని ఉన్నాయి.[1] "భర్తను అంటిపెట్టుకొని ఉంటుంది. అల్లుకున్న కౌగిలిలో ఇరువురు ప్రేమఫలాన్ని, ఆనందాన్ని పొందుతారు. ఋగ్వే I 105. 2). దోషరహితమైన శీలం కల భార్యను 'అనవద్యనారి' అని అభివర్ణించారు. ఇంద్రానివలన ఇంద్రునికి బలమట (ఋగ్వే 159, 4). భార్య వీరాంగన కావాలట.

ఈ సందర్భంలో పునశ్చరణగా కన్పించినా వివాహాన్ని ఏయే శాస్త్ర విదులు ఎలా పరికించారో గమనించటం అవసరం. దేవతలయెడ హోమ విధులు, ప్రేమ జీవితం గడపటం ఆర్యుల ఆశయం. (ఋగ్వే VII 31, 9) దానికి అనుగుణమైనది గృహస్థ ధర్మం. అథర్వవేద సమాజంలో పితృ దేవతలకు పిండప్రదానం ముఖ్యమైనది. అందువల్ల కుమారులనుకనటానికి భార్య అవసరమయింది. కనుక తన పిల్లల తల్లి కావటానికి భార్యను స్వీకరించాడు పురుషుడు. మత విధిని నేరవేర్చటానికి సాయపడే స్త్రీ భార్య అని బ్రాహ్మణాల కాలంలో భావించేవారు. ఉపనిషత్తులలో గార్గి - యాజ్ఞవల్క్యల సంభాషణ, మైత్రేయి యాజ్ఞవల్క్యల సంవాదం ఎన్నదగినవి. గార్గిని యాజ్ఞవల్క్యుడు ఎంత బెదరించినా ఆమె పట్టుపట్టి బ్రహ్మజ్ఞాన సారాన్ని తెలుసుకుంది. బ్రహ్మలోకం ఎక్కడ ఉంది? అని ప్రశ్నించిన గార్గిని ఇలాంటి ప్రశ్నలు కొనసాగిస్తే చనిపోతావన్ని బెదిరించిన యాజ్ఞవల్క్యుడు ఆమె కోరికను మన్నించక తప్పలేదు. అలాగే ధన కనక వస్తు వాహనాదులు అక్కరలేదు, బ్రహ్మజ్ఞానాన్ని తనకు తెలియ జేయమని కోరిన మైత్రేయిని మొదట్లో వారించినా చివరకు ఆమెకు బ్రహ్మ స్వరూపం తెలియజెప్పక అతనికి తప్పలేదు. అంటే కేవలం భర్తను సంతోష పెట్టటమేకాక ఇతరత్రా జ్ఞాన సముపార్జన స్త్రీ విధియని భావించే భార్యలు ఉండే వారన్నమాట. తన ఆదర్శాల సాధనకోసం జీవితం సాగించే ప్రయత్నంలో భర్తలు భార్యల సహకారాన్ని అర్థించేవారు మాంత్రి బ్రాహ్మణ కాలంలో. మంత్రి బ్రాహ్మణం గృహ్య సూత్రాలకు పూర్వపుకాలపు గ్రంధం. కేవలం సంతాన ప్రాప్తియే గాక మతరంగంలో భార్యాభర్తల సహకారానికి, ఏకత్వానికి వివాహం ఉద్దేశింపబడింది. అశ్వలాయన గృహ్య సూత్రాల ప్రకారం వివాహం కేవలం సంతానం కొరకు మాత్రమే కాక కుటుంబ జీవితంలోని భౌతిక సుఖాలు లక్ష్యంగా కలది. బౌద్ధాయనుడు

మాతృత్వానికి ప్రాధాన్యత ఇచ్చాడు. అగ్నిసాక్షిగా జరిగిన వివాహంలో స్త్రీ జీవితం పురుషుని జీవితంలో లీనమయిపోతుంది.2

బహు భార్యాత్వం :- ఏకభర్తృత్వం, ఏక భార్యాత్వం రుగ్వేదకాలంలో ఉన్న నియమము. యజ్ఞయాగాది క్రతువులలో భార్య ప్రక్కన ఉండేది. భార్యను గురించి ఏకవచనములోనే చెప్పారు (రుగ్వే I 124, 7). భర్త శవం ప్రక్కన ఒకే భార్యపడుకునేది (రుగ్వే X 18, 8) బహు భార్యాత్వం పురాతన సంప్రదాయం. కాగా వేదకాలపు చివరి రోజుల్లో అది కనపడుతుంది. దస్యుల స్త్రీలను చెరపట్టేవారు. రాజులు సామంతులు వారి ఆస్థాన పురోహితులు బహు భార్యాత్వాన్ని పాటించారు. సామాన్యులు ఏకభర్తృత్వ, ఏక భార్యాత్వ విధానాన్ని అనుసరించేవారు. 'సపత్ని' అనే పదం. 'ద్విజాని' (ఇద్దరు భార్యలు కలవాడు) అనే పదాలు వైదిక వాఙ్మయంలో కనిపిస్తాయి (రుగ్వే X 101, 11; రుగ్వే III 1, 10). ఇంద్రుడు తన భార్యల మధ్య 'రాజీవుని' వలె వుండెను (రుగ్వే I 62, 11; రుగ్వే I 71, 1; రుగ్వే I 104. 3) బ్రాహ్మణాల కాలం నాటికి రాజులకు నల్గురు భార్యలుండేవారట. 'మహిషి' అంటే పట్టపురాణి (ఆస్థానంలో అధికారం కలిగియుండేది). 'పరివ్యక్త' ఆమె స్థానం రాజకీయ కారణాల వలన పెరగడం తరగడం కలదు. 'వావాత' రాజుకు ఇష్టురాలైన భార్య. నాలుగవది 'పాలాగలీ'. రుషులు అనేకమంది భార్యలను వివాహమాడేవారు. కక్షివాన్, చ్యవనుడు అలాంటివారు. బహు భార్యాత్వం అనుమతింపబడిన ఆచారం. కాని అది అంత ప్రబలంగా లేదు. ఆర్యుల సామాజిక వ్యవస్థ బహు భార్యాత్వానికి అనుకూలంగా లేదు.3 మహా భారతంలో అర్జునునికి ద్రౌపది, సుభద్ర, ఉలూపి భార్యలు. కృష్ణునికి ఎనిమిది మంది భార్యలు-రుక్మిణి, సత్యభామా, ఇత్యాదులు. రామాయణంలో దశరధునికి ముగ్గురు భార్యలు. ఇలా సాగింది హిందూ సమాజ ధోరణి. మదరాసు రాష్ట్రంలో 1948 దాకా, భారత దేశంలో 1955 దాకా హిందూ పురుషునికి ఏక కాలంలో ఎంతమందయినా భార్యలుండవచ్చును.

బహుభర్తృత్వం :- అశ్వినులు, మరుత్తులు, వైశ్యదేవులు బహుభర్తృత్వ కుటుంబాలకు నమూనాలని చెప్తారు. కాని వారు ప్రకృతి సంఘటనలకు ప్రతీకలు. కనుక 'ముక్కస్యముక్క: అర్థం చెప్పి బహుభర్తృత్వం ఉందనటం సరియైనది కాదు. అవి ఆనాటి సామాజిక అలవాట్లను బట్టి వచ్చిన ఉపమానాలు కనుక బహు భర్తృత్వం వేదకాలంలో లేనట్లేనని ఉపాధ్యాయ నిర్ధారించారు.

ఉదయం, సాంయత్రిం 'సూర్య' ను పొందియుండుట, మేఘాలు (మరుత్తులు) రోదసి (మెరుపు) ని పొందియుండుట అలాంటివి.

బహు భర్తృత్వం అనార్య సంప్రదాయం.[4] ఇది రెండురకాలు. ఒకటి సోదరులందరూ ఒకే భార్యను క లి గి యు ం డ డ ము (Fraternal Polyanoty) ఇది డెహ్రిడూన్ జిల్లాలోని ఘూసాలు పాటించిన ఆచారం. రెండవది రక్తసంబంధంలేని పురుషులు ఒకే భార్యను కలిగియుండడం (Nonfraternal Polyandry). ఇది నీలగిరిలోని తోడాలలోను సిక్కిం, టిబిట్‌లలో ఉండేదట. ఈ రెండూ ముఖ్యంగా ఆర్థికపరమైన ఏర్పాట్లు. పాండవులు అయిదుగురు ద్రౌపదిని వివాహమాడటం అలాంటిది. దృపదుడు ఈ వివాహానికి అంగీకరించలేదు. ఉతనికి అనేక విధాల నచ్చజెప్పారు. కుంతి ఆదేశం, దేవతలే పాండవులుగా పుట్టారని వ్యాసుడు చెప్పటం, ద్రౌపది శివుని పూజించి భర్త కావాలని అయిదుసార్లు అడగటం, సంప్రదాయం ఇవన్నీ దృపదుని అంగీకరింపజేసాయి. 'జటిల' అనే స్త్రీ ఏడుగురు రుషుల భార్యగా ఉన్నట్లు కథ చెప్పారు. ఇంతకూ ద్రౌపది నిరసన తెల్పినట్లు ఎక్కడా లేదు. మరెక్కడా బహుభర్తృత్వ ఆచారాలు కన్పట్టవు. ఒకనాడు సమాజపు తొలి దశలో వావి వసరులు లేని దశనుండి వివాహం ఉద్భవించినపుడు ఈ రకపు వివాహం కూడా ప్రారంభమయి ఉండవచ్చును; పురుషాధిపత్య స్థాపనతో బహు భార్యాత్వం స్థిరపడింది. బహు భర్తృత్వం క్షీణించింది. కాకపోతే సంతానం లేకుండా అన్న చనిపోతే సోదరుని ద్వారా - నియోగం ద్వారా - సంతానం కనవచ్చుననే పద్ధతి (Levirate) బహు భర్తృత్వ వివాహపు అవశేషమేమో! బహు భర్తృత్వం వేదంలో లేదు. ఐతరేయ బ్రాహ్మణం దానిని నిషేధించింది. పాండవులు ఆర్యేతరులు అయివుండవచ్చని కానే అభిప్రాయం. ఆర్యులలో ఒకతెగ యేమోనని ఆల్టేకరు ఊహ.

<u>భార్య విధులు :-</u> ఆధునిక కాలంలో కూడ, అంటే స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్న ఈ రోజుల్లో కూడ స్త్రీలు బండెడు ఇంటిచాకిరీ గృహిణులుగా తామే చేస్తున్నారు. హిందూ పురుషులు (దరహంమీద విషయం) కొంచెం కూడా భార్యలకు సాయం చేయరు. ఇది ఎందువల్ల సంభవిస్తుంది? సమాజ పరిణామాన్ని పరికిస్తే సమాజం నాలుగువేల ఏండ్లనుండి పురుషాధిపత్యం

క్రింద సాగుతున్నదని తెలుతుంది. కనుకనే ఈ ఆచారం. దీనివెనుక బలంగా కొనసాగింపబడుతున్నది. ఇన్నివేల సంవత్సరాలుగా స్త్రీకి మేధ ప్రక్షాళనం (బ్రెయిన్ వాష్) జరిగింది. అదే సక్రమమైనదని ఆమె భావిస్తున్నది. నాటినుండి ఈనాటివరకు అది తన కర్తవ్యమని తలపోస్తున్నది. భార్యాభర్తలు ఇరువురు ఇంటి వెలుపల పనిచేస్తున్నట్లుగానే (విడివిడిగానే అనుకోండి) ఇంట్లోపనిని ఉమ్మడిగా చేసుకోవాలనే భావన ఆవిడకు కూడ వెగటుగా, విపరీతంగా తోస్తున్నది. మహిళా దశాబ్దం పూర్తి అయిన తరువాత కూడా భారత మహిళ - అందులో ముఖ్యంగా హిందూ మహిళ - పాత సంప్రదాయపు భావాలనే పట్టుకొని వ్రేలాడుతున్నది ఇది ఒక అంశానికి ఉదాహరణ మాత్రమే కనుక అసలు చారిత్రను పరిశీలిద్దాం.

వేదకాలంలో :-

గృహిణి అగ్ని ఆరిపోకుండా చూడాలి. భర్తతో కూడి అగ్నిని పూజించాలి. (రుగ్వే V 43. 15). క్రతువులన్నింటికి అర్య గృహిణి హాజరు కావలసిందే (రుగ్వే X 86, 10). పదిమంది వీరులను కనవలెను. (రుగ్వే X 85, 45); మొదట్లో సామాజిక అవసరాలకోసం ఈ విధిని నిర్ణయించారు. తరువాత దీనికి మతాన్ని, దర్మాన్ని జోడించారు. ఆమె గృహపత్ని. అందరిని నిద్రలేపాలి. అత్త మామలను, అడబిడ్డలను, మరదలను కనిపెట్టి ఉండాలి. ఆమె మానవులకు, పశువులకు తల్లి లాంటిది. (రుగ్వే I 66, 3). పండుగలకు, పబ్బాలకు వెళ్ళాలి. (రుగ్వే X 86, 10). ఇంట్లో వున్న స్త్రీ బానిసలపై ఆమెదే పెత్తనం. వారిని వధువులని పిలిచేవారు. ఆమె గృహపత్ని కనుక ఆమె గార్హపత్యాన్ని నిర్వహిస్తుంది. ఆమె భర్తకు సహధర్మిణి. ఆమెకు నచ్చని విషయం ఉంటే ఆమె అసమ్మతి తెలుపవచ్చును. అన్యాయమని ఏలుగెత్తి చాటవచ్చును; గొణగవచ్చును. ఆ కాలంలో ఆమె అణగి, మణగి ఉండవలసిన స్త్రీ కాదు. అవసరం వస్తే యుద్ధానికి వెళ్ళిన స్త్రీలున్నారు. ఖేలుని భార్య యుద్ధానికి వెళ్ళి భర్త సరసన పోరాడుతూ తన కాలును పోగొట్టుకుంటే, అశ్వినులు ఆమెకు ఇనుపకాలును సమకూర్చి పెట్టారు.5

భార్య భర్త భుజించిన తర్వాత భోజనం చేయవలెనని శతపధ బ్రాహ్మణంలో ఉన్నది. భార్యయొక్క విధులను గురించి స్మృతులు,

పురాణాలు, ధర్మకోశాలు ఎక్కువగా వ్రాసాయి.6 భర్తకు విధేయురాలిగా ఉండాలి. భర్తను దైవంగా చూడాలి. (శతపథ బ్రాహ్మణం IV 1. 5. 9.) సుకన్య నా భర్తను (చ్యవనుని) వదలిపెట్టను అని అంటుంది. భర్త నపుంసకుడయినా, పతితుడయినా, కుంటివాడయినా, వ్యాధిగ్రస్తుడయినా, భార్య భర్తను ద్వేషించరాదు. శంఖలిఖిత స్మృతి -చూడదు పుట 562-కానే) దుష్టుడైనా, పరస్త్రీ వ్యామోహితుడయినా, సద్గుణవంతుడు కాకపోయినా గుణవంతురాలయిన భార్య భర్తను దేవుని వలె పూజించవలెను. (మను- V. 154) భార్యలు భర్త ఆజ్ఞలను శిరసావహించవలెను. (యాజ్ఞవల్క్యుడు I . 17) భర్త భార్యకు యజమాని, దైవము. పతి సేవల వల్లనే ఆమె ఉన్నతోన్నతి పొందగలదు. (రామాయణం అయోధ్యాకాండ 24.26,27)

మనుస్మృతిలో పంచమ అధ్యాయంలో స్త్రీల కట్టుబాట్లను గురించి ఇలా వివరించబడింది:-

1. బాల్యముగానుండినను, యవ్వనముగా నుండినను, వార్ధక్యముగా నుండినను స్త్రీలు తమ తమ ఇండ్లయందునూ తమ మనస్సు పోయినట్లు ఏకార్యమునూ చేయరాదు.

2. బాల్యమందు తండ్రి యాజ్ఞయందును, యౌవనమునందు పతి యాజ్ఞయందును, పతిగతించిన వెనుక బిడ్డల యాజ్ఞయందును నుండవలయును గాని స్త్రీలు స్వాధీనముగా నెప్పుడూ నుండరాదు.

3. తండ్రి, పతి, బిడ్డలు, వీరలను వదలి తానుమాత్రము ఒంటరిగా నుండవలయునని ఎప్పుడూ స్త్రీ దలంప కూడదు. అట్లు వారలను వదిలి స్వతంత్రురాలుగా నుండెడి స్త్రీ పుట్టిన కులము, చొచ్చిన కులము రెంటిని నిందలపాలు చేయుచున్నది.

4. ఎల్లప్పుడు తన యింటి కార్యమందు సామర్థ్యము కలదిగాను, సంతోషము కలదిగానూ, యింటనున్న వస్తువులను పరిశుద్ధ పరచునదిగానూ అధిక వ్యయమందు మనస్సులేనిదిగా నుండవలయును.

5. తండ్రి లేక తోడబుట్టినవాడు యామెను ఎవ్వనికి వివాహమునకై ఇచ్చుచున్నాడో వాడు జీవించియుండువరకు, వానికి ఈమె శుశ్రూష యచే

వలయును. వాడు చనిపోయిన వెనుకనూ వ్యభిచారము చేయక వానికి శ్రాద్ధము మొదలగు వానిని జేసికొనుచుండవలయును.

6. స్త్రీలకు వివాహకాలమందు శాంతిహోమము ఇవి యన్నియు నిష్టసిద్ధి కొరకు చేయబడుచున్నవి. నిశ్చితార్థమందు చేసెడు వాగ్దానమే పురుషుడు యాజమాన్యమును సూచించుచున్నది.

7. ఋతుకాలమందును, తక్కిన కాలమందును విధిప్రకారం వివాహం చేసుకొని భర్తయైనవాడు స్త్రీలకు ఇహమందు సుఖము నిచ్చుచున్నాడు. విధిప్రకారం అతని ననుసరించి నట్టులైన పరమందును సుఖము కలుగుచున్నది.

8. భర్త దురాచార వంతుడై యుండినను, అన్యస్త్రీ లోలుడై యుండినను, సద్గుణములేనివాడై యుండినను, పతివ్రతాస్త్రీ వానిని దైవముగా పూజింపవలయును.

9. స్త్రీలకు పంచమహాయజ్ఞము, ఉపవాసము, వ్రతము, మొదలగు ధర్మములు ప్రత్యేకముగా లేవు భర్తకు శుశ్రూష చేయుటచేతనే స్వర్గమందు గౌరవము పొందుచున్నారు.

10. పరలోకమందు అపేక్ష గలస్త్రీ తన భర్త యుండినను, గతించినను వానికి విరోధమగు కార్యము చేయరాదు.

11. భర్త గతించిన పిదప పరిశుద్ధమైన నీరు, దుంపలు, ఫలములు, లేత చిగుళ్ళలాంటి స్వల్పాహారములచే కాలము గడపవలయును కాని కామేచ్ఛ చేత మరియొక పురుషుని పేరు చెప్పరాదు.

12. పతి గతించిన వెనుక తాను జీవించి యుండువరకు ఓర్పుకలదిగాను, పరిశుద్ధమైనదిగాను, బ్రహ్మధ్యానము గలదిగాను, మధుమాంస భక్షణ చేయనదిగాను, పతివ్రతాధర్మమును అపేక్షించునదిగా నుండవలయును.

13. పతి కాలము చేసిన యనంతరము బ్రహ్మచర్య వ్రతముగల పతివ్రతాస్త్రీ సంతానములేక యుండినను వాలఖిల్య, సనకాది బ్రహ్మచారులవలె స్వర్గమొందుచున్నది.

14. ఏ స్త్రీ స్వర్గలోకము నొందుటకొరకు పుత్రుడు కావలయునని పతి గతించిన వెనుక మరి యొకనితో సంపర్కము చేయుచున్నదో ఆమె ఈ లోకమందు నిందింపబడుచున్నది. ఆలాగు పుట్టిన పుత్రునిచే పుణ్యలోకమును చెందనేరదు.

15. పతివ్రతా స్త్రీలకు రెండవ వివాహమును గురించి ఏ శాస్త్రములోనూ చెప్పబడలేదు.

16. నికృష్టుడైన తన భర్తను విడిచి ఉత్కృష్టుడగు మరియొకనిని యే స్త్రీ పొందుచున్నదో ఆమె నిందలపాలగును.

17. స్త్రీ వ్యభిచారము చేయుటచేత లోకమునందు నిందింపబడుటయే గాక గతించిన పిదప గుంటనక్కగా జన్మించి తెల్ల కుష్టు మొదలగు వ్యాధుననుభవించును.

18. ఏ స్త్రీ మనోవాక్కాయముల నర్పించుకొని వ్యభిచరించకుండునో ఆమె పతిలోకమునకు చెందును. మహాత్ములచే పతివ్రత యనియు చెప్ప బడును. పుణ్యలోక ప్రాప్తి కలుగును.

19. రాజులు యోచించుచోట స్త్రీలుండరాదు. పండితులు సమావేశములలో పాలుపంచుకోరాదు.

20. భార్య గతించినట్టులైన విధిప్రకారం ద్వితియ వివాహము చేసుకొని తన జీవితకాలము యొక్క రెండవ భాగమును గృహస్థాశ్రమము నందుండి గడపవలయును.

ఎనిమిదవ అధ్యాయం :-

21. పురుషుడు తాను సంపాదించి తెచ్చిన ద్రవ్యమును కాపాడుట, వ్యయము చేయుట, పాత్రలు మొదలగు వానిని శుద్ధిచేయుట, దేవిపూజ మొదలగు వానికి ఏ సహాయమైన కార్యము చేయుట, భక్ష్య భోజ్యములను పక్వె పరచుట, మొదలైన యవశ్యములగు కార్యములు భార్యకు నేర్పి ఆమెయొక్క మనస్సు ఇతర విషయములందు పోకుండునటుల చేయవలయును.

22. స్త్రీలకు చంచల స్వభావము, నిలకడలేని మనస్సు పుట్టుకతోనే ఉండుట వలన పురుషుల యొక్క రక్షణవలన వారు సశించుటలేదు.

23. ఏడుపు, ఆసనము, అలంకారము, కామము, కోపము, అబద్ధము, ద్రోహచింత, వీనిని స్త్రీల నిమిత్తమే మనువు కల్పించినాడు.

24. స్త్రీలు పాతివ్రత్యము లేమియు, నిలకడలేని మనస్సును, స్నేహము లేమియు స్వాభావికముగా కలిగినవారు కావున పురుషులచేత పాలింపబడి యుండినను వారలను విరోధించుచున్నారు.

25. కల్లు త్రాగుట, దుష్టులతో స్నేహము, పురుషుని విడిచి వేరు గ్రామమునకు పోవుట, కారణములేకయే అచ్చటచ్చటికి పోవుట, తాను ఇష్టమైన చోట నిద్రించుట, పొరుగిండ్లకుబోయి కూర్చుండి యుండుట స్త్రీలకు నిందాహేతువైన కార్యములు.

26. స్త్రీలు మిక్కిలి వ్యభిచార దోషము గలవారని యనేక శ్రుతులయందును, శాస్త్రములయందును చెప్పబడినది.

27. పురుషునిమాట చొప్పున నడవని యాడది లోకులచే నిందింపబడి, నక్కగా పుట్టి, పాపబంధముచే కష్టపడును. ఇలాంటి స్మృతులు చక్కగా మనకు దర్శనమిస్తాయి. స్మృతికర్తలు 24 మంది వున్నారు వారంతా రూపాల తేడాలతో వారివారి రచనా పాటవంతో, చమత్కృతులతో స్త్రీని కించపరచే భాషతో, వైవిధ్యంతో రచించబడ్డాయి మన ధర్మశాస్త్రాలన్నీ

భర్త భార్యయొక్క దేవుడు, ఏకైక బంధువు. అతడే ఆమెకు గమ్యం (మ. భారతం. అనుశాసన పర్వం 146. 55).

భర్త పరదైవతం (మ. భా. అశ్వమేధికపర్వం 90. 51). "భార్యకు భర్తయే దైవం. ఆమెకు గమ్యం" (మత్స్య పురాణం 210. 18).

భర్త భార్యను సంపూర్ణంగా శాసించడం ధర్మసమ్మతమైనదని కణ్వుడు శాకుంతలంలో అంటాడు. ఇదే భావాన్ని, మనువు V 150 - 156, యాజ్ఞవల్క్య I 83-87, విష్ణుధర్మశాస్త్రం 25-22, మ. భా. వనపర్వం 233.19.58

(ద్రౌపది), మహా. భా. అను. 123 (శాండిలీ), వేదవ్యాసస్మృతి II 20-32, వృద్ధ హారీత XI- 84, స్మృతి చంద్రిక (వ్యవహార కాండ), మదన పారి జాతంలలో పలుచోట్ల చెప్పటం జరిగింది. 'భార్య ఎల్లపుడు చిరునవ్వుతో ఉండాలి. చురుకుగా ఉండాలి. ఇంటిపనులలో తెలివి తేటలు ప్రదర్శించాలి. పాత్రలు శుభ్రంగా ఉంచాలి. అవి తళతళా మెరుస్తుండాలి. దుబారా ఖర్చు చేయరాదు. (మనువు V 150.) 'మద్యపానం, దుష్టుల సహవాసం, భర్తను విడిచి నివసించటం, తీర్థయాత్రలకు వెళ్ళటం, పగటినిద్ర, ఇతరుల ఇళ్ళల్లో ఉండటం - ఈ ఆరు వివాహిత స్త్రీకి చెడుగు కలిగిస్తాయి.' (మను XIX 13) 'భర్త బంధుగుల ఇళ్ళల్లో భార్య ఎక్కువకాలం ఉండటం అప్రశస్తం.' (మ. భా ఆది. 74. 12)

'పేరు, శీలం రెండూ పోతాయి' (అభిజ్ఞానశాకుంతలం 77-19) మార్కండేయ పురాణం 77-19 లో ఇదే భావాన్ని వెలిబుచ్చింది.

మనువు V - 150 లో చెప్పినవి కాక అదనంగా యాజ్ఞవల్క్యుడు ఇలా చెప్పాడు.

1) భర్తకు ఇష్టమైనవి (ప్రియమైనవి, లాభం చేకూర్చేవి) చేయాలి.
2) భర్త తల్లిదండ్రుల పాదపద్మాలకు నమస్కరించాలి.
3) మర్యాదగా ప్రవర్తించాలి.
4) ఇంద్రియ నిగ్రహం పాటించాలి.

శంఖలిఖిత స్మృతి ప్రవచించిన వాక్యాలు :-

1) భర్త లేక పెద్దలు పొమ్మంటే తప్ప ఇల్లుదాటరాదు.
2) చక చకా నడవరాదు.
3) (వ్యాపారి, సన్యాసి, వృద్ధుడు, వైద్యుడు కాక) బంధుత్వం లేని పురుషునితో మాట్లాడరాదు.
4) బొడ్డును కన్పింపరాదు,
5) పాదములవరకు జీరాడేలా చీర కట్టుకోవాలి.

6) స్తనాలను బహిర్గత పరచరాదు.

7) చేయిగాని, వస్త్రంకాని అడ్డం పెట్టుకోకుండా బిగ్గరగా నవ్వరాదు.

8) భర్తను గాని, అతని బంధుగులనుగాని ద్వేషించరాదు.

9) వేశ్యల సాంగత్యం కూడదు.

అలాగే జూదమాడే స్త్రీలతో, సన్యాసినులతో, అదృష్టం చెప్పు స్త్రీలతో మంత్రాలు, తంత్రాలు చేసే స్త్రీలతో, రహస్యక్రియలు చేసే వారితో, దుష్టులతో సాంగత్యం చేయరాదు. అలాంటి సాంగత్యం వలన మంచి వంశంలోని స్త్రీల శీలం దెబ్బతింటుందని వివేకవంతులు చెప్పుచున్నారు."

విష్ణుధర్మశాస్త్రం (25. 1-6) ఇలా చెప్పింది.

1. భర్త చేసే వ్రతాలు మాత్రమే భార్య చేయాలి.

2. వస్తువులను భద్రం చేయాలి.

3. ప్రేమ సంపాదించటానికి మంత్ర తంత్రాలను వాడ ప్రయత్నించ రాదు.

4. శుభ ప్రవర్తన యెడల శ్రద్ధ వహించాలి.

బృహస్పతి (IV 1. 32)

1. భర్త, పెద్దలు లేవకముందు పెందలకడ లేవాలి.

2. భర్త, పెద్దలు భుజించిన తరువాత తను భోజనం చేయాలి.

3. వారికన్నా తక్కువ ఎత్తుకల పీఠంపై కూర్చోవాలి.

'భర్త అనుమతితో మాత్రమే ఆమె వ్రతాలు, ఉపవాసాలు, పూజలు,' నోములు చేయాలి. (శంఖలిత స్మృతి).

'భర్తను సరిగా చూచుకునే భార్య హరిలోకానికి చేరగలదు. [భాగవతం VII 11-25,)

స్కాందపురాణం బ్రహ్మకాండం ధర్మారణ్యవిభాగం 7 వ అధ్యాయంలో పతివ్రతా లక్షణాలుగా పేర్కొనబడిన అంశాలు :- [క్రీ. శ 600-900]

1. భర్త పేరును ఆమె ఉచ్చరించరాదు. అలా చేస్తే ఆమె భర్త వయస్సు పెరుగుతుంది. అంటే పేరు ఉచ్చరిస్తే ఆయుఃక్షీణమవుతుందన్నమాట.
2. భర్తను నిందించి పరపురుషుని పేరు ఉచ్చరించరాదు.
3. ఆమె దండింపబడినా ఆమె పెద్దగా విలపించరాదు. చిరునవ్వు నవ్వాలి.

"కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, శయనేషు రంభా, భోగ్యేషు మాతా...." [పద్మపురాణం-అధ్యాయం 47-55]

భర్త గ్రామాంతరం వెళ్తే భార్య ప్రవర్తన ఎలా ఉండాలో వేదవ్యాసుని ముఖపరంగా విందాము.

"ఆమె ముఖం పాలిపోయి ఉండాలి. బాధతో కన్పడాలి. పూర్తిగా భోజనం చేయరాదు. దేహాన్ని కృశింప చేయాలి." [వేదవ్యాస స్మృతి II-52]

పతివ్రత అంటే ఎలాంటిదో బృహస్పతిస్మృతిలో వివరించబడినది :-

1. భర్త వ్యథలో ఉంటే తను వ్యథ చెంచాలి.
2. భర్త సంతోషంగా ఉంటే తను సంతోషంగా ఉండాలి.
3. భర్త పరాయి ఊరు వెళ్ళినపుడు కృశించిన దేహం కలది.
4. ,, ,, మురికి వస్త్రాలు ధరించేది.
5. భర్త చనిపోతే చనిపోయేది.

"మతవిషయాలలో భార్య భర్తకు సహకరించాలి" [మనువు]

"భర్త సమ్మతి లేకుండా స్వతంత్రంగా ఆమె మత కర్మలు చేయరాదు". [మను V-155]

దమయంతి, శాండిలీ, సావిత్రి, ధర్మవ్యాధోపాఖ్యానంలో కౌశికునికి హితబోధ చేసిన మహిళ, గాంధారి, అరుంధతి, అనసూయ, సత్య, మేనా [చివరి ఇరువురు స్కాందపురాణంలో వారు] కానే అభిప్రాయం ప్రకారం పేరుగాంచిన పతివ్రతలు.

బుద్ధుడు అంగుత్తర నికాయంలో వెలిబుచ్చిన విషయాలు :-

1. కుటుంబంలో పొద్దుననే లేచి, ఇంటిపని అంతా పూర్తి చేసి, అందరి కన్నా చివరగా నిద్రకు ఉపక్రమించవలెను. సుందరముగా వస్తువులను తీర్చిదిద్దడం ఆమె విధి.

2. మీ భర్త గౌరవించే వారిని మీరూ గౌరవించాలి.

3. మీ భర్త చేతివృత్తులను మీరూ పాటించాలి. ఇంటిలోని పనివారిని దయతో, కరుణతో చూడాలి.

4. వెండి బంగారు వస్తువులను భద్రపరచుకోవాలి. ఇట్లు చేసిన స్త్రీలు దేవలోకానికి పోతారు.7 బౌద్ధంలో విధేయత, విశ్వాసపాత్రతలపై నొక్కు ఉన్నది. భార్యాభర్తలు ఇరువురు వ్యక్తులు. ఇద్దరూ ఒకటి కాదు. విడదీయరానివారు కాదు. అయితే ఇరువురి మధ్య సహకారం స్ఫురింపచేయబడింది. స్వామిభక్తి, పెద్దలయెడ విధేయత, గృహ నిర్మాణంలో సమర్థత, శాంతిప్రియత్వం ఆదర్శగృహిణి ధర్మాలు. పాతివ్రత్యం అందులో లేదు. బౌద్ధం క్రీ. పూ. 500 సం॥ నాటిదని జ్ఞాపకం ఉంచుకోవాలి.

శకుంతల భార్యయొక్క స్వరూపాన్ని ధర్మశాస్త్రపరంగా వివరించింది. "పురుషుని ఆనంద ప్రాప్తికి ఆమె కారకురాలు". భార్య భర్త అర్ధాంగి; ముఖ్య స్నేహితురాలు. క్రతువులలో తండ్రివలె అనారోగ్య సమయంలో తల్లివలె, బహిష్కార సమయాల్లో ఆమె భర్త వెంట ఉంటుంది. కష్టాలలో ప్రక్కన ఉంటుంది. మరణంలో యమలోకంలో కలుస్తుంది. ముందుగా చనిపోతే అతనికోసం ఉంటుంది. కుమారుని రూపంలో భర్త తిరిగి పుడ్తాడు. ఆమె అతని క్షేత్రం. ఉక్కపోస్తున్న మనిషి స్నానంచేసి సేదదీర్చుకున్నట్లు భార్య సాంగత్యంలో అతడు బాధనుండి, దుఃఖాన్నుండి విముక్తుడవుతాడు. రుషులు కూడా స్త్రీలు లేకుండా సంతానాన్ని పొందలేరు. కనుక ఏ పురుషుడు భార్యను కష్టపెట్టరాదు; బాధపెట్టరాదు. మ. భా. ఆ. 297. 45; మహా.భా ఆదిపర్వం 68, 69 విరాటపర్వం 2 : 14)

భార్యయొక్క గొప్పతనాన్ని గురించి, బాధ్యతను గురించి శివుని భార్య ఉమ చెప్పిన సంగతులు :-

"భర్త మంచి పనులలో ఆమె అతనికి చేదోడు వాదోడు అవుతుంది. మంచి స్వభావము, మధుర భాషణం, సుందరమైన రూపం, మలిన రహిత శీలం కల స్త్రీ తన శిశువును చూచినట్లే భర్తను చూచుకోవాలి (విధి నిర్వహణ చేసే స్త్రీ మతాన్ని పాటించినట్లు); నిజంగా పరిశుద్ధ. భర్త మొక్కుబడులను

తనూ చెల్లించాలి. దేవునివలె భర్తను సేవించవలెను. భర్తనే ధ్యానించవలెను. పరపురుషుని కలలో కూడ అభిమానించరాదు. ఎల్లప్పుడూ సంతోషంగా ఉండాలి. తనను దౌష్ట్యంగా చూచినా, ఉదాసీనంగా చూచినా, నవ్వుతూ కళ కళలాడుతూ ఉండాలి. అలాంటి స్త్రీ నీతిమంతురాలు. పురుషనామం కల చెట్టునైనా. సూర్యునినైనా, చంద్రునినైనా అభిమానదృష్టితో చూడని స్త్రీ గుణవంతురాలు. బీదవాడైనా, అనారోగ్యవంతుడైనా, భర్తను తన శిశువు లాగా చూచే స్త్రీ సద్వర్తనం కలది. ఇంద్రియ నిగ్రహం కలిగి భర్తను శ్రద్ధా భక్తులతో సేవించునది మంచి స్త్రీ. తన బీద బంధులగులను ఆదరించి తన భర్త అవసరాలకన్న తన అవసరాలను తక్కువగా అంచనా వేసుకునే స్త్రీ మంచి మనిషి. ప్రొద్దుననే లేచి ఇంటిలో అగ్నిని వెలిగించి, ఇంటిని పరిశుభ్రం చేసి, దేవతలను స్తుతించి, పూజించి, అతిథి అభ్యాగతులను సేవించి సేవకులకు, తనపై ఆధారపడే వారికి భోజనం పెట్టి, చివరకు తను భుజించే స్త్రీ సత్ఫలమును పొందును. తన అత్త మామలను తల్లిదండ్రులవలె చూడగల స్త్రీ సన్యాసులవలె శ్రేష్ఠురాలు. కష్టయుతమైన మొక్కుబడులను చెల్లించుకునే స్త్రీ, ఎల్లపుడు భర్త యోగక్షేమాలను కాంక్షించే స్త్రీ భర్త సద్గతిలో పాలు పంచుకొనును. భర్త యెడ శ్రద్ధా భక్తులు వివాహిత స్త్రీ యొక్క శ్రేష్ఠగుణం. ఆమెకు అదేతపస్సు; ముక్తి. స్త్రీకి భర్త యేదైవం. అతడేఆమెకు హితుడు. అతడే ఆమెకు ఆశ్రయం. భర్తలకు మించి ఆశ్రయమివ్వగల లేక శరణాగతులయిన దేవతలు స్త్రీకి లేరు, భర్త దయ ఆమెకు స్వర్గధామం. భర్త బీదవాడైనా వ్యాధిగ్రస్తుడైనా లేక శత్రువులచేతికి చిక్కిన వాడైన, బ్రాహ్మణుల శాపానికి గురి అయినవాడైనా, అనౌచిత్య కార్యాన్ని, అధర్మకార్యాన్ని, చేయమని భార్యను ఆజ్ఞాపిస్తే దానివలన ప్రాణహాని కలిగే ప్రమాదం ఉన్నా ఆమె నిస్సంకోచంగా ధర్మ నిర్వహణ కోసం ఆ పనిని చేయాలి; ఆ కార్యాన్ని నిర్వర్తించాలి.'' (మ. భా. అనుశా. 134. 6, 10, 30, 35) (మ. భా. అనుశా. 134. 32 - 55).

శకుంతల అభిభాషణకు, ఉమ ప్రవచనాలకు ఎంతో తేడా ఉంది. భర్తకు హితవుచెప్తూ మాట్లాడింది శకుంతల. తోటి స్త్రీలను తక్కువచేసి మాట్లాడింది ఉమ. ఇక ద్రౌపది ఉపదేశాలు పరిశీలిద్దాము. నీవు ఎలా నీ భర్తలను వశవర్తులను చేసుకున్నావు? అని సత్యభామ ద్రౌపదిని అడిగితే ద్రౌపది చెప్పిన జవాబు. "భార్య మూలికలను, మందులను, మాకులను వాడు

తున్నదని తెలిస్తే మంచంకింద ఉన్న పామును చూచినట్లు భర్త తన భార్యను చూస్తాడు. చూచి వణికిపోతాడు. భయానికి లోనైన మనిషికి శాంతి, ఆనందం లభిస్తాయా? మందువల్ల, మాకులవల్ల పెద్దరోగాలు వస్తాయని వింటున్నాం. శత్రువులను చంపటానికి విషాహారాన్ని పంపుతారు. అజ్ఞానులైన స్త్రీలు తమ చేతలవల్ల నీరు, కుష్ఠు, పక్షవాతం, నపుంసకత్వం లాంటి వ్యాధులను భర్తలకు కలుగజేస్తారు మందులూ, మాకులూవాడి. కనుక ఓ స్నేహితురాలా; నేను నా భర్తలను ఎలా అదుపులో ఉంచుకుంటున్నానో తెలిసికో. నా భర్తలకు, నా పత్నులకు ఎలాంటి దురుద్దేశమూ,అసూయా లేకుండా శ్రద్ధతో దయతో సేవచేస్తాను; నా భర్తలు భుజించువరకు నేను స్నానం చేయను; భు జిం చ ను. సేవకులు భోజనం చేసేవరకు నేను భోజనం చేయను. పొలంనుండో, అడవినుండో, లేక సభనుండో ఏ భర్త తిరిగివచ్చినా ఎదురుపోయి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి ఇంటిలోకి తెస్తాను. ఇంటిని, పాత్రలను పరిశుభ్రంగా ఉంచుతాను. కుటుంబానికి పుష్టికరమైన ఆహారాన్ని తయారుచేస్తాను. సరిఅయిన వేళల్లో నేనే వారికి వడ్డిస్తాను. ఏనాడు కోపంగా, ఉద్రేకంగా మాట్లాడను. చెడ్డస్త్రీల పద్ధతులను అనుసరించను. సోమరిపోతుతనం స్త్రీలలో ఉండే చెడ్డగుణం. దానిజోలికి నేనుపోను. ఉపయోగకరమైన పనిచేస్తూ ఎల్లప్పుడూ పనిలో నిమగ్నమయి ఉంటాను. వాకిలిముందు తారట్లాడను. వీధులలో విహారానికి పోను. ఉద్యానవనాలలో వాహ్యాళికిపోను. ఆరోగ్యవంతమైన పరిహాసం మాత్రమే నాలో నవ్వు తెప్పిస్తుంది. భర్తలకు దూరంగా ఉండే నాకు బాధగా ఉంటుంది. బలత్కార కారణాలవలన నేను భర్తలకు దూరమయితే నేను పూలను పెట్టుకోను. చందనాది సౌందర్య పోషక ద్రవ్యాలను వాడను. నా భర్తల యోగక్షేమాలను ఆశించి వ్రతాలూ, తపస్సూ చేస్తాను. నా భర్తలు వేటినైతే త్రాగదలచరో, తినదలచరో, ఇచ్చగించరో వాటిని నేనూ త్యజిస్తాను." (మ. భారతం. ఆరణ్య పర్వం 5-222, 223).

ఈ సందర్భంలో ఒక విచిత్రమైన అంశాన్ని గుర్తుంచుకోవాలి. స్త్రీల చేత వారికి నష్టదాయకమైన ధర్మాలను చెప్పించుట. బ్రహ్మచారులచేత పలికించుట రెండవది. యుధిష్ఠరుని కోరికపై మార్కండేయుడు కౌశికుని కధచెప్పి పతివ్రతా ధర్మములను ఎరిగించెను. (మ. భా ఆరణ్య పర్వం పంచమాశ్వాసం). భీష్మ, యుధిష్ఠర సంవాదంలో భీష్ముడు లక్ష్మి, రుక్మిణిల

ప్రశ్నోత్తరములను గురించి వివరించెను. 'భర్త యెడల విశ్వాసం, క్షమించ గల శక్తి, పవిత్రత, సత్యనిరతి గలవారు సత్యగుణ సంపన్నులుగా ఉండి దేవతలను, బ్రాహ్మణులను పూజించెదరు. తమ సౌందర్యమును జాగ్రత్తగా పోషించుకొందురు. ఇలాంటివారు లక్ష్మికి ఇష్టులు. పరిశుభ్రత పాటించని వారిని, కుచ్చితులను, వినయములేని వారిని తగాదాపరులను, తిండిపోతులను, మత్తులను, నిద్రితులను లక్ష్మి అసహ్యించుకొనును. వారు ఎక్కువగా ఇతరుల ఇళ్ళలో నివసింతురు. భర్తకు విరుద్ధంగా మాట్లాడి తొందరపాటుగా సంచరింతురు. (మ. భా. అనుశాసనపర్వం-11) భీష్మ యుధిష్టర సంవాదంలో శాండిలి, సమనుల సంభాషణ వచ్చింది. 'నీవు ఎలా స్వర్గవాసివి అయ్యావు?' అనే ప్రశ్నకు శాండిలి సమాధానము. ఇది శాండిలి ఉవాచ. భీష్ముడు చెపు తున్నాడు. 1] భర్త యెడల విశ్వాసం 2] భర్త ఏ పనిచేస్తే తను అది చేసేది. 3] భర్తతో పరుషంగా ఏనాడు మాట్లాడి ఎరుగదు. 4] అతనికి ఇష్టంలేని ఆహార పానీయాలను వర్జించేది. 5] భర్త ఊరిలో లేనప్పుడు అలంకరణ మానుకునేది. 6] భర్త గ్రామాంతరం నుండి తిరిగివచ్చినపుడు శ్రద్ధగా సేవచేసేది. 7] వాకిలిముందు నిలుచుండి మాటలాడి ఎరుగదు. 8] ఉదయాననే లేచి విధి నిర్వహణ చేసేది. దేవతలను, పితృదేవతలను, బ్రాహ్మణులను, అత్తమామలను పూజించేది. కుటుంబ బాధ్యతలను నిర్వర్తించి, దాంపత్య ధర్మములను నెరవేర్చేది. [మ. భా. అను. 124] 'భర్త యెడల అవిధేయత చూపిన స్త్రీని కుక్కలకు ఆహారంగా వేయవలెను [మనుస్మృతి VIII- 371]. వివాహం తప్పని సరియైన సంస్కారమని చెప్ప డానికి సుభ్రుగాలవి సుతుల కధ తార్కాణం (మ. భా. శల్యపర్వం-ద్వితీయా శ్వాసం, తెలుగు భారతం. 207-212)8.

<u>ఆదర్శ స్త్రీలు</u> :- ద్రౌపదికి భర్తయెడల విశ్వాసము ఉండుటవలననే ఆమెకు కీర్తి వచ్చినది. ధృతరాష్ట్ర, సంజయ, విదురులు, ఆమెను పొగిడి 'సతి' అని బిరుదు ఇచ్చారు. మరీ ధృతరాష్ట్రుడు ఆమెను సాధ్వియనీ, పతివ్రత యనీ పొగిడాడు. ద్రౌపదిశీలంలో లోపాలున్నాయి. ఆమెకు అర్జునుడంటే ప్రేమ. అందుకే ఆమె బొందితో స్వర్గానికి పోలేదు. అహల్య, కుంతి, ద్రౌపది, మండోదరి పంచకన్యలు. వారిని స్మరిస్తారు కన్యలు. అహల్య చేసిన తప్పుకు పశ్చాత్తాపం చెందిన స్త్రీ. తార అన్నదమ్ములలో వేరువేరు సమ యాలలో కాపురం చేసినా మంచి కార్యాలోచన పరురాలు. కుంతి కన్యగా

తల్లి అయిన స్త్రీ. ద్రౌపది పంచభర్తృక.9 వీరందరిలో ఒక్క మండోదరి శీలవతిగా ఎంచవచ్చును. కాని మండోదరికి అంగదుడు కుమారుడని ప్రతీతి. పతివ్రత అంటే భర్తకు విధేయురాలు అని, తన జీవితాన్ని యావత్తు భర్త శ్రేయస్సుకు ధారపోసినవ్యక్తి యని తెలుతుంది. కన్యలకు పుట్టినింట అణగి మణగి ఉండుట (విధేయత), విధినిర్వహణ, సర్దుకుపోవటం నేర్పుతుంది హిందూ సమాజం. విధికింద వివాహాన్ని నిర్ధారించి, వైవాహిక జీవితంలో స్త్రీ యొక్క వ్యక్తిత్వాన్ని చిదిమివేసింది పాతివ్రత్యం పేర. ఈ పాతివ్రత్య భావం హిందూ స్త్రీలకు నరనరాన జీర్ణించిపోయింది. అందువలన వారు ఆత్మస్వరూపదర్శనం చేసుకోలేని స్థితిలో ఉన్నారు.

<u>మాతృత్వం</u> :- హిందూ వివాహానికి లక్ష్యం సంతానప్రాప్తి. కనుకనే ఈనాటికీ పెళ్ళయిన 4, 5 ఏండ్లకు స్త్రీకి సంతానం కలుగకపోతే తల్లిదండ్రులు ఒకవైపు, అత్తమామలు మరొకవైపు తహతహ లాడతారు. పైపెచ్చు ఇప్పుడున్న శాసనం ఏకభర్తృత్వ ఏక భార్యాత్వ వివాహాన్ని మాత్రమే అనుమతించడం వలననూ, సంతానం లేదనే కారణం వల్లనూ, కోర్టులో విడాకులు పొందడానికి అవకాశం లేనందునను అలాంటి స్త్రీని గొడ్రాలని ఈసడించడమూ, హింసించడమూ ఇప్పటికీ జరుగుతున్న నిత్యసత్యాలు. సంతానంలేని స్త్రీ ఆ హింసను భరించలేక ఆత్మహత్య చేసుకోవడమూ లేక అత్తమామలూ, భర్త కలిసి ఆమెను హత్యచేయడమూ అచ్చటచ్చటా ఈనాటికీ జరుగుతుతూనే వున్నాయి. 1948 సంవత్సరానికి పూర్వం ఆమెయే భర్తను బతిమిలాడి మరో స్త్రీతో అతనికి వివాహం చేయించటమో లేక అతడే ద్వితీయ వివాహం చేసుకోవటమో జరిగేది. చట్టప్రకారం ఇప్పుడది సాధ్యం కాక పోవటంతో భార్య జీవితానికే ప్రమాదం ఏర్పడే స్థితి కలుగుతున్నది. సంతానం కలుగక పోవటానికి భార్యా భర్తలలో ఇరువురిలో ఎవరైనా శారీరకలోపం కారణభూతం కావచ్చును. అలాంటప్పుడు కేవలం ఊహపై ఆధారపడి - అదైనా అజ్ఞానపు ఊహ - మరో అమ్మాయిని భార్యగా తెచ్చు కోవాలని ప్రయత్నించడం ఏమి సబబు? లోపం భర్తది కావచ్చును కదా! అలా ఆలోచించిన భార్య తను ద్వితీయభర్తను వివాహం చేసుకుంటానంటే అతడు అంగీకరిస్తాడా? సమాజం ఆమోదిస్తుందా? అత్తమామలు హర్షిస్తారా? ధర్మశాస్త్రజ్ఞులు వెసులుబాటు కల్పించారా? లేదు. ఎందుకని? హిందూ సమాజం పురుషాధిపత్య సమాజం కనుక. అతని పురాతన భావాలు అతని

మేధస్సును అలా మలిచాయి కనుక. భార్య క్షేత్రము. పురుషుడు క్షేత్రజ్ఞుడు క్షేత్రానికి యజమాని. పొలంలో వేసిన ప్రతి విత్తనమూ మొలవాల్సిందే. మొలవకపోతే పొలంయొక్క లోపం. అంతేకాని విత్తనం యొక్క లోపం కాదు. మరో పొలంలో విత్తనం వేస్తే మొలుస్తుంది. ఇదీ ఆలోచనా ధోరణి. కనుక ద్వితీయ వివాహానికి సన్నాహాలు జరిగేవి పూర్వం. ఇప్పటికీ గొడ్రాలయిన భార్యను ఎలాగైనా వదిలించుకోమని సలహా చెప్పే అత్తలు అనేకమంది ఉన్నారు. కేవలం సంతానం వివాహం యొక్క లక్ష్యంగా పరిగణింపబడటంతో వచ్చింది ఈ చిక్కు. భార్యాభర్తలు ఇద్దరు వ్యక్తులు, వారి ఇరువురి సాంగత్యం ఇరువురికీ లాభకరం. ఇరువురి సన్నిహితత్వం వలన ఇద్దరి జీవితాలు సుసంపన్నం అవుతాయి. వారి వైవాహిక జీవిత ఫలంగా - ప్రేమ ఫలంగా - సంతానం కలుగుతుందని, అంతేకాని వైవాహిక జీవితం యొక్క శ్రేష్ఠతను సంతానం లేనందువలన నాశనం చేసుకోవలసిన అగత్యం లేదని హిందూ సమాజం భావించటంలేదు. ఎంతసేపూ పితరులకు సద్గతులు కలిగించాలి, అందుకొరకు కుమారులను కనాలి అనే యావతప్ప మరో ధ్యాస లేదు. ఇలాంటి పొరపాటు భావనయొక్క ఫలితమే గొడ్రాలు యైన భార్యను ఈసడించడం, హింసించడం. ఈ హింసను శాసనాలు ఆపలేవు. ఇది అనుక్షణం సూటిపోటి మాటలతో జరిగేది. మామూలుగా మానసిక హింస రూపం తాలుస్తుంది. ఈ అవాంఛనీయ పరిస్థితి మారాలంటే హిందూ సమాజం మారాలి. అంటే వివాహం యొక్క లక్ష్యాన్ని మరల నిర్వచనం చేసుకోవాలి. ఇదంతా కేవలం పాశ్చాత్య సంస్కృతీ ప్రాభవ మని, హిందూ సమాజ ప్రాశస్త్యాన్ని గుర్తించలేని గుడ్డితనమని, కేవలం దుష్ప్రచారమని, ఇంతకన్న అర్ధరహితమయిన ప్రవర్తన మరొకటి లేదని సనాతన విదులు తీవ్రంగా విమర్శిస్తారు. ఈ సమస్యపైనున్న విరుద్ధ అభిప్రాయాలను మదింపు వేసేముందు హిందూ సమాజ వైఖరిని, సంప్ర దాయాన్ని చారిత్రకంగా అధ్యయనం చేయాలి.

వేదకాలం :- ధర్మ సమ్మతంగా వివాహం అయిన తల్లిదండ్రులకు పుట్టటం ధర్మం. (ఋగ్వే VII 20, 6) ఈ మాటను ఎవరూ కాదనలేరు. కాగా వివాహమంత్రాలలోనే దేవతలకు చేసే ప్రార్థనలు గమనించండి- 'ఈ దంపతులకు సంతానం ఇమ్మ' అని పురోహితుడు అంటాడు. 'ప్రజాపతి

మనకు సంతానం ఇచ్చుగాక....అని భర్త భార్యతో అంటాడు గృహప్రవేశ సందర్భంగా. "పదిమంది మగపిల్లలను కనవలసినది. నీ భర్త 11 వ పురుషుడు" అని అంటాడు పురోహితుడు. కుటుంబంలో 11 మంది పురుషులు కావాలని ఆకాంక్ష. ఆర్యులు జాతిని పెంచే నిమిత్తం వివాహ మాడేవారు. వారికి ఆనాడు అధిక జనాభా అవసరం. అనార్యుల సంఖ్య అత్యధిం. పైగా వారితో ఎడతెగని యుద్ధాలు. మగవారు చనిపోవటం తరచుగా సంభవించటం జరిగేది. కనుక మగపిల్లలు కావాలి. భార్య ఇందుకు ఉపయోగపడాలి. ఆర్యులు పశుపాలకులు; వ్యవసాయ దారులు. వారి పరిజ్ఞానం కేవలం సంతానాన్ని అపేక్షించటానికి ప్రోద్బలం చేసింది. ఆప్యాయత, ప్రేమ సంతాన ప్రాప్తిని సాధించే సోపానాలు. అంతే. వేద కాలంలో సంతానం కావాలని ఎంత అభిలాష ఉందో గమనించండి. భర్త కారాగారంలో ఉండే పురుకుత్సాని ఇతరునిద్వారా కుమారుని కన్నది (ఋగ్వే IV 42, 8). పురంది వధ్రిమతి భర్త నపుంసకుడైతే పరపురుషుని ద్వారా సంతానాన్ని పొందింది. అలాంటివి ఋగ్వేదం I 1, 116, 13; I 117,24; VI 62, 7; X 39, 7; X 65, 12 లలో కనిపిస్తాయి. భర్త బలహీను డయితే విమద అశ్వినీ దేవతల సహాయంతో సంతానవతి అయింది. (ఋగ్వే X 39, 7). మరో బలహీనుని భార్యకు సంతానం కలుగజేయటానికి అశ్వినులు హిరణ్య హస్తుని ఇచ్చారు; (ఋగ్వే I 117, 24). దీనిని నియోగం అనవచ్చు. ఈ నియోగాన్ని ఏ జ్ఞాతి అయినా చేయవచ్చును. కాని భర్త సోదరుని (దేవరను) ఎక్కువగా ఎన్నుకునేవారు. భర్త బ్రతికియున్న అతనికే అగ్రస్థానం. అమ్మాయికి పెండ్లి చేసేటప్పుడు (భర్త పుంసత్వాన్ని గురించి తెలియనప్పుడు) ఆమెను 'దేవృకామ' అని అభివర్ణించేవారు. (ఋగ్వే X 85: 44) అంటే 'దేవర' కొన్ని సందర్భాలలో కాబోయ్యే భర్త అని సూచించడం, (ఉత్తర హిందూ స్థానములో పదిన మరది (భర్త చిన తమ్ముడు ఈనాటికి వెటుసరసాలాడుతుంటారట). భర్త జ్యేష్ట సోదరుని ఏ విధవరాలు వివాహమాడరాదు. (ఈ వివరణ అంతా 'ఋగ్వేదంలో స్త్రీలు' అనే తన పుస్తకంలో ఉపాధ్యాయ 108-110 పుటలలో ఇచ్చారు).

బ్రాహ్మణాల కాలంనాటికి పూర్తిగా దృష్టిమారింది. లేక మారినట్లు కనుపడిందో గమనిద్దాం. పితృదేవతల పూజ పెరిగింది. వారికి భోజనాదులు అవసరమయినాయి. శ్రాద్ధాదులు వెలిశాయి. దానికి మగపిల్లవాడు చేయదగు

క్రతువే ముఖ్యమయింది. కారణం ఊహించడం క్లిష్టంకాదు. అది పితృస్వామ్య సమాజం. ఆడపిల్ల వివాహమయిన తరువాత భర్త ఇంటికి వెళ్ళి కాపురం చేస్తుంది. కుమారుడు ఇంట్లో నివసిస్తూ వంశాన్ని కనిపెట్టుకొని ఉంటాడు. కనుక పితృదేవతలకు తర్పణం ఇచ్చే బాధ్యత అతనికి కేటాయించటం సబబు. ఇలా మగపిల్లవాని ప్రాముఖ్యత, మరో కారణాన్ని పురస్కరించు కొని, పెరిగింది. అవి బహుభార్యాత్వం అమలులోఉన్న రోజులు. రాజన్యులు, రుషులు, సామంతులు బహు భార్యాత్వాన్ని అనుసరించేవారు. సమాజాన్ని శాసించి పాలించేది వారే. సమాజానికి ధర్మశాస్త్ర విశదీకరణచేసేది బ్రాహ్మణుడు. దానిని అమలు జరిపించేది క్షత్రియుడు. వీరద్దరూ కలసి తమకు ఏది ఆనుకూలమో, తమ దృష్టిలో ఏది ఉచితమో దానిని ఆందరికి తలలమీద రుద్దారు. మగసంతానంపై కాంక్ష పెంచారు. అయితే మగ సంతానం ఎలా కలుగుతుందో ఖచ్చితమైన జ్ఞానం వారికి లేదు. అంతా ఊహ మాత్రమే. కనుక సంతానాన్ని కనవలసినదని ఆదేశించారు. సంతానాన్ని కంటూపోతే మగపిల్లలు కలుగకపోరని వారి ఆశ. ఇలా మతదృష్టితో సంతానాభివృద్ధికి రాచబాట వేసి దానికి కావలసిన భావనిర్మాణాన్ని చేశారు. సన్యాసాశ్రమం అనేది వేదకాలంలో లేనేలేదు. గృహస్థాశ్రమానికి విలువ హెచ్చుగా ఇచ్చారు.

గృహ్యసూత్రాలు :- గర్భాదాన, గర్భాలంబన, పుంసవన, సీమంతో న్నయన వీటితాలూకు కర్మకాండ సంతానం యొక్క ప్రాముఖ్యతను విశదం చేస్తుంది. రజస్వల కాగానే వివాహం అనే సూత్రిక సంతానం కోసం తా త్రయాన్ని తెలుపుతున్నది.

అర్థశాస్త్ర కాలం నాటికి క్రీ. పూ. 4, 3 శతాబ్దాలు. రుతుకాల సంగమం విధిగా సంతాన ప్రాప్తికి దోహదమనే అభిప్రాయం ప్రబలంగా ఉండేది. రుతు కాలంలో భార్యా సంగమం చేయని పురుషునకు 96 పణములు జరిమానా వేయాలని కౌటిల్యుడు శాసించాడు. భర్త విదేశాలకు వెళ్ళి అతని జాడ తెలియకపోయినా భార్య మరల వివాహమాడవచ్చునన్నాడు. ఆదంతా విడాకుల విషయం చర్చించేటపుడు విపులంగా తడివిచూద్దాం. కాగా రాజకార్యంపై వెళ్ళిన భర్త కోసం భార్య వేచియుండవలెను. కాని ఆమె బంధువుద్వారా సంతానం కనవచ్చును. భర్త సన్యాసం పుచ్చుకుంటే భర్త సోదరుని వలననో

లేక బంధువు వలననో ఆమె సంతానాన్ని కనవచ్చును. ఇదంతా సంతాన ప్రాప్తికి ఇచ్చే ప్రాధాన్యత కాక మరేమిటి? భర్త చనిపోయినపుడు, లేక వ్యాధి గ్రస్తుడయినపుడు ఆమె నియోగం ద్వారా సంతానాన్ని కనవచ్చును. ఈ విషయాన్ని వివరంగా చర్చించేముందు ఎన్నిరకాల పుత్రులున్నారో లెక్కిద్దాం. పురుషునికి 11 మంది కుమారులు వుండవచ్చు. 1) ఔరసుడు తనకు జన్మించినవాడు. 2) పుత్రికా పుత్రుడు [దహోత్రుడు] [కుమారులు లేక పోతే ఒక కుమార్తెను పేర్కొంచే ఆమె కుమారుడు] 3) క్షేత్రజుడు 4) గూఢజుడు [బంధువు ఇంట్లో తన భార్యకు రహస్యంగా కలిగినవాడు] 5) అపవిద్ధుడు (బంధువులచేత వదలివేయబడినవాడు). 6) కానీనుడు [భార్య కన్యగా ఉన్నపుడు కలిగినవాడు] 7) సహోఢుడు (పెండ్లి సమయంలో భార్య గర్భిణీగా ఉంటే కలిగినవాడు) 8) పునర్భవుడు (వితంతువుకు రెండవ భర్త వలన కలిగినవాడు. 9) దత్తుడు (తల్లి దండ్రులచేత ఇవ్వబడినవాడు) 10) ఉపాగతుడు (తనంతట తను వచ్చినవాడు లేక బంధువులచేత కుమారునిగా పరిగణింపబడినవాడు.) 11) కృతకుడు (కుమారునిగా పరిగణింపబడినవాడు. నియోగాన్ని, దత్తతను అనుమతించే ఆచారాలను కౌటిల్యుడు తక్కువచూపు చూచాడు. కాని క్షేత్రజుడు, గూఢజుడు, కానీనుడు, సహోఢుడు ఆమోదింపబడినారు. అంటే భార్యయందు తన అనుమతితో ఇతరులవల్ల కలిగిన సంతానాన్ని ఆమోదించాడు ఆనాటిభర్త. అలాగే పెళ్ళికాకముందు ఆమెకు కల్గిన సంతానాన్ని, ఆమె పెండ్లినాడు ఆమె గర్భంలో ఉన్న సంతానాన్ని, ఆమె బంధుగుల ఇంట రహస్యంగా కనిన సంతానాన్ని కాదనలేదు ఆనాటి ధర్మశాస్త్ర విదులు. ఇది భారత కాలంనాటి ఆచార అవశేషము. భారతకథ క్రీ. పూ. 1500 సం॥ ప్రాంతంలో జరిగిందని కొందరు, వెయ్యి సంవత్సరాల ప్రాంతంలో జరిగిందని మరికొందరు అంటున్నారు. ఏదయినా భారత కాలం అర్థశాస్త్ర కాలానికి మున్ముందే. భారతంలో కర్ణుడు కానీనుడు. ధర్మరాజు, భీముడు, అర్జునుడు కుంతిద్వారా పాండురాజు కుమారులు. వారు క్షేత్రజులు. నకుల సహదేవులు మాద్రిరాజు పాండురాజు కుమారులు. వారు క్షేత్రజులే. ఆనాటి సంస్కృతీ నాగరికతల ప్రకారం పురుషునికి సంతానం కావాలి. తన క్షేత్రమైన భార్య యందు పరపురుషునివల్ల కలిగినా ఆ ఫల్యం తనదే. ధృతరాష్ట్ర పాండురాజులు వ్యాసునికి అంబిక అంబాలిక వలన నియోగం ద్వారా జనించినవారు. అయితే అప్పటికి వారు విధవలు. అంటే సంతానానికి పూర్వీకులు యిచ్చిన ప్రముఖ స్థానం తెలుస్తున్నది. మహా భారత

కాలంలో నియోగం ద్వారా ముగ్గురు కుమారులను కనవచ్చుననే ఆచారం అమల్లోవుంది.

మనుధర్మశాస్త్రం :- మనువుకూడా 12 మంది కుమారులను పేర్కొన్నాడు. మనువు కౌటిల్యుని తరువాతి కాలంవాడు. అతడూ 'క్షేత్రజుని' గూఢోత్పన్నుని (గూఢజుడు), కానీనుణ్ణి, సహోడుని పేర్కొన్నాడు.

గూఢోత్పన్నుణ్ణి మినహాయిస్తే ఔరసుడు కాక అందరూ సామాజిక సంతానమే, మనువు విధవా వివాహాన్ని నిషేధించాడు. స్త్రీకి ఒకేసారి వివాహం జరగాలన్నాడు. అర్థశాస్త్రంలోని క్షేత్రజునికన్నా మనుస్మృతిలోని క్షేత్రజునికి ఎక్కువ స్థానం ఉన్నది. మనువు విధిలేక నియోగపద్ధతిని ఆమోదించాడు. అయితే నియోగం ద్వారా ఒకే మగపిల్లవానిని కనమన్నాడు. నియోగం అనేది విధవరాలికి భర్త ద్వారా సంతానం లేకపోతే జరుగవలసిన ప్రక్రియ.

ఇప్పటికీ వధూవరులను ఆశీర్వదించేటపుడు 'వంశాభివృద్ధిరస్తు,' 'పుత్ర పౌత్రాభి వృద్ధిరస్తు' అని దీవిస్తారు. 'సంతాన ప్రాప్తిరస్తు' అనికూడా దీవిస్తారు. జనాభా సమస్య మహమ్మారిలా తయారయినా ఇదే దీవన. ఇద్దరు అత్తలు కలసినచోట 'నీ కోడలు నీళ్ళుపోసుకుందా' అని అడుగుతారు. అంటే నెలతప్పిందా? గర్భం వచ్చిందా? అని దానిఅర్థం. వైఖరి మారలేదనటానికి ఇది నిదర్శనం.

మాతగా తల్లిహోదా :- సంతాన ప్రాప్తిని ఇంత గొప్పగా భావించిన హిందువులు తల్లిని గౌరవించటంలో ఆశ్చర్యంలేదు. మాతృత్వాన్ని సాధించేది మాతగనుక ఆమెకూ గౌరవం కాస్తో కూస్తో వస్తుంది. మాతృత్వంపై ఎనలేని గౌరవం, అభిమానం ఉన్నాయికదా! మాతా పితలు అంటాము. తల్లిదండ్రులు అంటాము. కనుక తల్లికే ప్రధాన స్థానం అని ఒక వాదన ప్రతిపాదింపబడుతున్నది. బహిష్కృతుడైన తండ్రిని వదలివేయవచ్చును. కాని పతితయైన తల్లి కుమారునికి బహిష్కృతురాలు కాదు. (వసిష్ట ధర్మ సూత్రం 13. 47); పదిమంది ఉపాధ్యాయులకన్న ఆచార్యుడు మిన్న. వంద మంది ఆచార్యులకన్నా తండ్రి మిన్న. తండ్రికన్నా తల్లి వేయిరెట్లు ఎక్కువ' (మను. II-145). 'తండ్రికన్నా పదిరెట్లు పైగా తల్లి ఎక్కువ,

తల్లి భూమికన్నా గొప్పది. తల్లిలాంటి గురువు మరియొకరు లేరు' (మ. భా అనుశాసనపర్వం 105. 14-16).[9] పిల్లల సంఖ్యను బట్టి ఆమె గౌరవం పెరుగుతుంది. ఇంద్రాణి అనే కవయిత్రి మనువు. కుమార్తె పద్మను ఇరవై మంది పిల్లలను కన్నందులకు పొగిడింది (ఋగ్వే X 86-23). తల్లిని ఇంత గొప్పగా పొగిడి హిందూ మతం అవిభక్త కుటుంబంలో భర్త ఆస్తిలో ఆమెకు వాటా లేకుండా చేశారు. కేవలం మనవర్తి మాత్రం ఉండేది. 1937 లో శాసనం ద్వారా ఆమె భర్త వంతు (చనిపోయేనాటికి విభాగాలు చేసుకుంటే వచ్చే భాగం) ఆమెకు పరిమిత హక్కులతో వచ్చే సౌకర్యం చేశారు. తరువాత 1955 హిందూ వారసత్వ శాసనం ప్రకారం భర్త వంతు (ఇందాకటి లెక్కన) ఆస్తిని ఆమె అత్త తోను, కుమారులతోను, కుమార్తెలతోను సమంగా పంచుకోవాలి. అలా వచ్చే వాటా బహుస్వల్పం. కాగా అది సర్వహక్కులతో వస్తుంది. ఇదీ తల్లిని గౌరవించిన విధానం.

హిందువులు గౌరవించేది మాతృత్వాన్ని కాని మాతను మాత్రం కాదు. పరశురాముడు తన తండ్రి జమదగ్ని ఆదేశం ప్రకారం తన తల్లి రేణుక తలనరికి చంపాడు. ఇది పితృస్వామ్య సమాజాన్ని సుస్థిరం చేసే ప్రయత్నంలో భాగమని మనం నిర్ధారించవచ్చు.

భర్త విధులు :- వైవాహిక జీవితంలో భర్తకు విధులు లేవా? అని సందేహం కలుగవచ్చు. ఉన్నాయని పేర్కొన్నారు ఋషులు.

'భర్త భార్యను మార్దవంగా పిలిచినట్లు నేను దేవుని పిలుస్తున్నాను.' (ఋగ్వేదం. P 160 విల్సన్. ఋగ్వేదం).

'భర్త భార్యను ప్రేమించినట్లు నా ప్రార్ధనను అభిమానించు' (ఋగ్వేదం) అని పురుషుడు దేవుని ప్రార్ధించాడు.

"భర్త భార్య గొంతుకను ప్రేమించినట్లు నా గేయాలను అభిమానించు" అని దేవతలను అర్థిస్తాడు ఋగ్వేదమానవుడు.

'భర్త బాధ్యతలు కుటుంబాన్ని అంటిపెట్టుకొని ఉంటాయి. ఆమెను రక్షించుకోవటానికి అతడు యుద్ధభూమికి ఇష్టపూర్వకంగా వెళ్తాడు.'

ఇది వేలకాలపునాటి మాట.

స్త్రీలు పూజింపబడుచోట దేవతలుందురు. స్త్రీలు పూజింపబడనిచోట సర్వక్రియలు నిష్ఫలము' (మను 3. 5. 6)

'భార్యచే సంతోషం పొందు భర్తయు, భర్తచే సంతోషం పొందు భార్యయు గల కులమున నిత్యము ధ్రువముగా కళ్యాణము కలుగును'. (మను 3-6-8)[10]

మరి పురుషుడు ఈ ఆదర్శమునకు నిలిచినాడా? లేదు. అంతేకాదు, పెండ్లినాడు ప్రమాణం చేస్తాడు. ధర్మార్థకామముల భార్యను విడువనని ప్రమాణం చేస్తాడు. కాని ఆ ప్రమాణాన్ని పాటించడు. పాటించని పురుషులను సమాజం శిక్షించలేదని ఆల్టేకరు పండితుడు కటకటపడతాడు.[11] బహుభార్యాత్వ విధానాన్ని నిరోధించటానికి ప్రయత్నాలు జరిగాయని ఉదాహరణలు చూపుతాడు. అయితే వేదకాలంలో బహు భార్యాత్వం ఉందని అంగీకరిస్తాడు. తమ సంపదకు, పేరు ప్రతిష్ఠలకు, సామాజిక హోదాకు బహు భార్యాత్వం తగునని ధనవంతులు భావించేవారట. అథర్వ వేదంలో సపత్నులు భర్త ప్రేమను పొందటానికి మంత్ర తంత్రాలను ఆచరించటం కలదు. మనువుకు 10 మంది భార్యలట. ఐతరేయబ్రాహ్మణంలో హరిశ్చంద్రునికి వందమంది భార్యలట. భార్య కనుక హద్దుమీరి పరపురుష సంపర్కాన్ని ఆశిస్తే ఆగ్రహించేవారు ధర్మశాస్త్రజ్ఞులు. సంతానం లేకపోతే భార్యయే సవతిని తెచ్చుకోమని భర్తను పోరుపెట్టాలట (కామసూత్రం VI -2). పదిఏండ్లకు కూడా పిల్లలు కలుగకపోతే అలా చేయాలట. ఆడపిల్లలు కలగడమో లేక పుట్టిన పిల్లలు చనిపోవడమో జరిగితే మరి మూడు ఏండ్లు ఆగాలట.[12] కొంచెం వెసులుబాటు ఇచ్చారు పురుషులకు. ఎంత కాదంటున్నా పూర్తి అవకాశాన్ని పొందారు వారు. భార్యను నిరాదరణ చేయటం అన్యాయమని మహాభారతం ఘోషించింది.[13] కుమారుని కలిగిన స్త్రీని విడనాడరాదని ఆపస్తంబసూత్రం (II 5, 11, 12) చెప్పింది. తగిన కారణం లేకుండా భార్యను వదలివేయడం మహా పాపమని మహాభారతం చెప్పింది (XII-58,13). అలాంటి పురుషుడు న్యాయస్థానంలో సాక్ష్యం ఇవ్వడానికి అనర్హుడని నారద స్మృతి ( I, 180) ప్రకటించింది. కాని ఈ మహాకావ్యాలను ఎవరూ

ఖాతరు చేయలేదు. భార్యను నిష్కారణంగా వదలివేసి లేక ఆమె ఉండగానే మరి ఒక స్త్రీని భార్యగా పొందటం ఆచారంగా చెలరేగింది.

గృహ్యసూత్రాలన్నింటిలో ఒక్క పారాస్కర గృహ్యసూత్రం మాత్రమే బహు భార్యాత్వాన్ని సమర్థించింది. మొదటిదశ ధర్మసూత్రాలు ఈ పద్ధతిని కాదనలేదని, తతిమ్మా గృహ్యసూత్రాలు (బహుశః పురాతన మైనవి) ఆ విషయం పట్టించుకోలేదని శకుంతలారావు శాస్త్రి అభిప్రాయం (పుట 156).

భార్య సమ్మతిమీదనే భర్త ద్వితీయ భార్యను స్వీకరించాలని మనువు చెప్పాడు. కాని ఆ సమ్మతి ఎప్పుడూ అతనికి లభిస్తుంది. అంతగా ఆత్మ గౌరవం కల స్త్రీ సమ్మతించడానికి నిరాకరిస్తే అప్పటికీ అతడు ద్వితీయ కళత్రాన్ని తెచ్చుకోవచ్చును. కాని ఆమె కోపగించుకొని భర్త గృహాన్ని సాధారణంగా వదలిపెట్టి పోరాదు. అలా పోతే ఆమెను బలవంతంగా ఇంటిలో ఉంచవచ్చును. కాగా ఆమె మనవర్తిని భర్తనుండి అడగని షరతుతో ఆమె వెళ్ళి తల్లిదండ్రులవద్ద నివసించవచ్చును. ఇదీ మనుధర్మ [illegible] రచయితగారు స్త్రీలపట్ల చూపిన ఔదార్యము! వివాహం వల్ల భార్యపై భర్త ఆధిపత్యం ఏర్పడినదనే సిద్ధాంతం వల్ల ఈ ధోరణి వస్తున్నది. దీనిని శాకుంతలంలో కాళిదాసు అంగీకరించాడు (శాకుంతలం V - 26). దీనితో పతివ్రతా తత్వాన్ని స్థిరపరచి తమ సద్వర్తనానికి గోరీ కట్టారు చాలమంది భర్తలు. ఇలా 'హిందూమతంలో భార్యాభర్తలు సమానులు' అని చెప్పేవారి వాదన వీగిపోతుంది.

వేర్పాటు : పరదా :-

మనం ఈనాడు 20 వ శతాబ్దపు చివరలో ఉన్నాము. మహిళా దశాబ్దన్ని పూర్తిచేసుకున్నాం. ఐ క్య రా జ్య స మి తి స్త్రీల పురోగతికి దోహదం చేస్తున్నది. 2000 సం॥ నాటికి ఎంతో అభివృద్ధి రావాలని పథకాలు వేస్తున్నారు. ఇలాంటి సమయంలో పరదా పద్ధతి హిందువులలో వ్యాప్తంగా ఉండడం శోచనీయం. దక్షిణాదిన ఆ బాధ లేదు. మొదటినుండి దక్షిణాదిన వేర్పాటు, పరదాలేవు. అనార్యులు ప్రబలంగా ఉన్న ప్రాంతం దక్షిణాపథం. ఆర్యావర్తం (వింధ్యకు ఉత్తరాన ఉన్న ప్రాంతం) లో గుజరాతు, రాజస్థాను,

ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్‌లలో ఈ ఆచారం నేటికి పరిస్ఫుటంగా ఉన్నది. మేలిముసుగు వాడకంగా చలామణీ అవుతున్నది. మామలయెదుట, భర్త జ్యేష్టసోదరుని యెదుట కోడలు ముఖం కన్పడేలా నడయాడదు. ఇది ఇంట్లో సంగతి. బయటికి వస్తే చెప్పనక్కరలేదు. మనిషిని గుర్తించ డానికి వీలు లేనంతగా ముఖంమీదకు మేలిముసుగు లాక్కుంటారు. దక్షిణాదిన కూడా నలుబది ఏబది సంవత్సరాల క్రితంవరకు బ్రాహ్మణ వనితలు పర పురుషునితో తలుపుచాటున ఉండి మాట్లాడటం ఆచారం. ఆర్యుల ఆచారాలు దక్షిణాది బ్రాహ్మణులు తమ స్వంతం చేసుకున్నారు కదా! కాక వారే ఉత్తరం నుండి వలస వచ్చిన ఆర్యులా? ఈ మీమాంస ప్రస్తుతానికి మనకు అనవసరం.

ఈ ఆచారాలు కేవలం ముసల్మానుల ఆచారాలను హిందువులు అనుస రించటం వల్ల ఆమలులోకి వచ్చాయని కొందరి అభిప్రాయం. ముసల్మానులు ఉత్తర భారతానికి క్రీ. శ. 11 వ శతాబ్దంలో వచ్చారు. కనుక అంతకు పూర్వం ఈ పద్ధతి అమలులో ఉన్నట్లు సాక్ష్యాధారాలు దొరికితే ఇది హిందువుల ఆచార మని చెప్పక తప్పదు.

జమీందారీ సమాజంలో అంటే భూమి మాత్రమే ఉత్పత్తి సాధనంగా ఉన్న సమాజంలో ధనవంతులు తమ స్త్రీలను శ్రమకు - ఇంటి వెలుపల శ్రమకు దూరంచేశారు. వారికి ఆర్థికంగా భద్రత కల్పించి వారిని ఇంటి లోపలి భాగాలలో, అంతఃపురాలలో బంధించారు. ఇలా అంటే చాల మందికి ఆగ్రహం కలుగవచ్చు. కాని ఇది పచ్చినిజం. దాసదాసీలను సమకూర్చారు. అంతటితో ఆగక వారికి రక్షకులను నియమించారు. కాపలావారు ఇతర పురుషులైతే తమ స్త్రీల శీలం పెడదారిన పడ్తుందేమోనని భయపడి నపుంసకులను కాపలా పెట్టారు. ఈ పరిణామం అన్ని సమాజాలలో జరిగింది. హిందూ సమాజం దానికి భిన్నంకాదు. ఏ కాలంలోను కష్టజీవులకు పరదాలు, మేలి ముసుగులు, బురఖాలు కుదరవు. వారు పొలాలలో, బహిరంగ ప్రదేశాలలో శ్రమ చేయవలసి ఉంటుంది. వారిని పరపురుషులు చూడరాదనే నియమం ప్రవేశపెడ్తే వారికి పని దొరకదు. పని లేకపోతే తిండి దొరకదు. ఏ సమాజం లోని కష్టజీవుల స్త్రీలు అసూర్యం పశ్యలుగా ఉండలేరు. ఎండ కన్నెరగని మహిళలు కానేరరు. ఈ అంశాన్ని మనసులో ఉంచుకోవటం అవసరం.

వేదకాలంలో వివాహమప్పుడు వధువును కళ్యాణ మంటపానికి విచ్చేసిన పెద్దలందరికీ చూపిస్తారని ఒక పండితుడు అంటే, అలాకాదు వరుని ఇంటికి పోయేటప్పుడు పరపురుషులు చూడటం తటస్థిస్తుందని మరో పండితుడు వాదిస్తాడు. ఏమైనా వేదకాలపు ఆర్య మహిళ మేలి ముసుగును కూడా వాడలేదు. పురుషులతో పాటు విద్యను గురువులవద్ద అభ్యసించింది. సభలలో ప్రసంగించేది. విదథలలో (పండిత సభ) ఉపన్యసించేది. సామాజిక ఉత్సవాలలో పాల్గొనేది. సమనలకు (ఉత్సవం లేక జాతర) యజ్ఞయాగాది క్రతువులకు వెళ్ళేది. కాగా సభలలో స్త్రీ పురుషులు కలసి కూర్చునే వారా లేక విడివిడిగా కూర్చునేవారా అనే ప్రశ్నకు సమాధానం చెప్పటానికి ఆధారాలు లేవు. ఈనాటి కొండజాతుల స్త్రీలలాగా కన్యలు యువకులతో చెట్టపట్టాలు వేసుకొని నృత్యం చేసినట్లు దాఖలాలు (ఋక్కులో) ఉన్నాయి కనుక స్త్రీలు ప్రత్యేక స్థలాలతో కూర్చొని యుండరని ఊహించవచ్చును. అటు గ్రీకు దేశపు (హోమరుకాలపు) స్త్రీల స్థితికీ, ఆ కాలపు ఈజిప్టు దేశపు స్త్రీల పరిస్థితికి భిన్నంగా మధ్యేమార్గంగా ఆర్యస్త్రీల స్థితిగతులు ఉన్నాయని, సభ్యత వినయం అనే నియమాలకు లోబడి ... కాలంలో స్త్రీలకు స్వేచ్ఛ ఉందని (పరదాలాంటి పద్ధతులకు ఆమె బంధీ కాదని) ఉపాధ్యాయ తన అభిప్రాయం వెలిబుచ్చారు.[14]

తమ మనవర్తిని సాధించుకోవడానికి స్త్రీలు న్యాయస్థానాలకు వెళ్ళే వారిని నిరుక్తం (క్రీ. పూ. 500) చెప్తున్నది.[15] వరుని ఇంటికి పోయే త్రోవలో ఇతరులు వధువును చూడవచ్చని అశ్వలాయన గృహ్యసూత్రం I - 8. 7 చెప్తుంది.[16]

రామాయణంలో అయోధ్యకాండలో సీతను అయోధ్యాపురవాసులు చూచినట్లున్నది. ఆపదల సమయంలో, కష్టకాలంలో, యుద్ధాలలో, స్వయంవరాలలో, యజ్ఞాలలో, పెళ్ళిళ్ళలో స్త్రీలు పరులకంట పడడం నింద్యంకాదు. (రామాయణం అయోధ్యాకాండ 116. 28) ఆకాశ దేవతల కంటకూడా పడని సీత ఈ రోజున నగరవాసుల దృష్టిన పడవలసి వచ్చినది కదాయని (అరణ్యవాసానికి పోయేటప్పుడు) అయోధ్యానగర వాసులు వాపోయారట. భారత యుద్ధం ముగిసిన తర్వాత ధృతరాష్ట్రుని స్త్రీ జనం ఆరణ్యానికి వెళ్ళేటపుడు కూడ ఇలాంటి మాటే పుట్టిందట. ఈ మూడు ప్రక్షిప్తాలని ఆల్టేకరు అభిప్రాయం.[17] కౌసల్య; సుమిత్ర, కైకేయి చిత్రకూటానికి వెళ్ళినపుడు

వారిని పదిమందీ చూచారు. సీత అయోధ్యానగర వీధులలో వెళ్ళేటపుడు పరులు తనను చూస్తున్నారని ఇబ్బంది పడలేదు. కుంతి, గాంధారులు ఘోషాను పాటించలేదు. ద్రౌపది స్వయంవరం అయిన తరువాత సభలలోకి రాలేదని కానే పండితుడు (పుట 598) అంటే ఆమె ఋతుమతియై ఉన్నందున బాధపడిందని ఆల్టేకరు పండితుడు అంటాడు (పుట 169).

గౌతమబుద్ధుని భార్య యశోధర పరదాను పాటించలేదు. ఆమె పరదాను త్యజించింది. రామాయణ కాలంలో పరదా అంతఃపురాలకు పరిమితమని పి. థామస్ ('యుగ యుగాలలో భారతస్త్రీలు' రచించిన వారు) అభిప్రాయం. కామసూత్రాల కాలంలో (క్రీ. త 1, 2 శతాబ్దాలు) స్త్రీలు భర్త యింటి భాగంలోకి రారాదు. అతడు ఏర్పాటుచేసే విందులు వినోదాలకు పోరాదు. నపుంసకులను అంతఃపుర రక్షకులనుగా ఏర్పరచటం జరిగింది. ధర్మశాస్త్ర కాలంతో స్త్రీకి విషాదయుగం ఆరంభమయింది. ఆమె స్వేచ్ఛ అరికట్టబడింది. భాసుని నాటకాలలో (క్రీ. త 200), హర్షుని నాటకం 'నాగానందం' లో (క్రీ. త 625) కన్యలు మేలిముసుగు వేసుకున్నట్టులేదు. కాని వివాహిత మేలిముసుగు ధరించేవారు.

ముసల్మానులు రాకపూర్వము కూడ మేలిముసుగు వాడాలని వాదించిన వారు క్రీ. పూ. 100 నుండి ఉన్నారని తెలుతుంది. కాగా కొంతమంది రాజులు పాటించారు. మరికొందరు పాటించలేదు. కధాసరిత్సాగరంలో రత్నప్రభ అనే స్త్రీ తన భర్త స్నేహితుడు కూడా తన ఆంతరంగిక గృహాంతర్భాగానికి రారాదని అసమ్మతి తెల్పిందట. క్రీ. త 15, 16 శతాబ్దాలనుండి మేలిముసుగు పద్ధతి వేర్పాటు ఉత్తరప్రదేశ్, బెంగాలు, బీహారు లలో పెరిగిందని ఆల్టేకరు అభిప్రాయం. క్రీ. త. 11 వ శతాబ్దం వరకు కొద్దిమందికే పరిమితమని ఆయన అభిప్రాయం. ఇది సరియైనది కాదు. బాల్యవివాహాలు అమలులోకి వచ్చి, విద్యకు స్త్రీలు దూరం చేయబడినప్పుడు వారిని రక్షించుకోవటానికి వారి స్వంతవారులు, యజమానులు, (భర్తలు) వారి స్వేచ్ఛకు ఆటంకం కలిగిస్తూ పరదాను ప్రవేశపెట్టి ప్రయత్నించటంలో ఆశ్చర్యంలేదు. ధనవంతుల స్త్రీలకు, రాజకుటుంబాల మహిళలకు పరదా వచ్చి ఉంటుంది. తతిమ్మా వారికి మేలిముసుగు నిర్ణయమై ఉంటుంది.

సంచార స్వాతంత్ర్యం వేరు. పరదావేరు. మేలిముసుగు ధారణవేరు. హిందూ స్త్రీలకు దేవాలయాల దర్శనానికి అభ్యంతరం ఏనాడూ లేదు. ముస్లిం స్త్రీలు భారతదేశంలో మశీదులకు పోరాదు. క్రైస్తవ స్త్రీలు చర్చిలకు పోతారు. హిందూ స్త్రీలు దేవాలయాలకు వెళతారు. మత ఉత్సవాలకు హాజరవుతారు. భర్తలతో కలసి, కుటుంబీకులతో కలసి తీర్థయాత్రలకు వెళ్తారు. నదులలో సముద్రాలలో సచేల స్నానాలు చేస్తారు. కాని మేలిముసుగు మాత్రం వదలటంలేదు ఉత్తర భారతదేశంలో. స్త్రీలకు పతివ్రతా బోధ, బాల్య వివాహం పెంచటం, పైగా స్త్రీ స్వభావాన్ని ఎడా పెడా నిందించటం ఇవన్నీ స్త్రీ పురుషులు దేవాలయాలలో, పురాణ కాలక్షేపాలలో, నాటక ప్రదర్శనలలో కూడ కలసి కూర్చోవడానికి వీలులేని పరిస్థితి కల్పించింది. కాగా ముస్లింలలో బురఖా ఉన్నది. హిందువులలో అదిలేదు. మేలిముసుగు మాత్రమే ఉన్నది. ఇది హిందూ సంస్కృతికి అనుగుణమే కాని బాహ్యవిషయం కాదు.

అధ్యాయం 4

# పాదదీపికలు

# వైవాహిక జీవితం

1. ఋగ్వేదకాలంలో స్త్రీలు : ఉపాధ్యాయ
   భార్య, తల్లి అనే శీర్షికగల 5 వ అధ్యాయం పుట 137
2. వేదకాలంలో స్త్రీలు : శకుంతలారావుశాస్త్రి పుట 171
3. ఉపాధ్యాయ : పుటలు 111 - 119
4. మహాభారతంలో వివాహమూ, సమాజము : కడియాల జగన్నాథ శర్మ
   Marriage & Society in Mahabharata ;
   unpublished thesisr of kadiyala jagannatha Sarma.
5. ఉపాధ్యాయ 5 వ అధ్యాయం.

6. కానే : ధర్మశాస్త్రాల చరిత్ర పుట 561
డిటో పుటలు 556, 564 - 567.

7. యుగయుగాలలో భారతీయ స్త్రీలు : పి. థామస్.
3 వ అధ్యాయం బౌద్ధం : స్త్రీలు.

8. హిందూ స్త్రీ : ప్రభాతి ముఖర్జీ : 2 వ అధ్యాయం.
డిటో

9. కానే : ధర్మశాస్త్రాల చరిత్ర VOL 2 పార్ I, పుటలు 580, 581

10. ఆర్షధర్మ సూత్రాలు : చర్ల గణపతి శాస్త్రి
స్త్రీ ధర్మములు పుట 109

11. హిందూ నాగరికతలో స్త్రీ స్థానం : ఆల్టేకరు పుట 104

12. బౌద్ధాయన ధర్మసూత్రం (112, 4, 6) : ఆల్టేకరు పుట 106

13. మహాభారతం XII 272, 36 : ఆల్టేకరు పుట 106

14. రుగ్వేదకాలపు స్త్రీలు : ఉపాధ్యాయ. పుట 196

15. ఆల్టేకరు : పుట 167

16. కానే. ధర్మశాస్త్రాల చరిత్ర. సంపుటం 2 భాగం 1
పుట 596

17. ఆల్టేకరు : పుట 168



అధ్యాయం

# 5 వైధవ్యం

వివాహిత స్త్రీ పురుషులలో ఎవరో ఒకరు ముమ్ముందుగా చనిపోక తప్పదు. పురుషుడు చనిపోతే అతని భార్య 'విధవ' అవుతుంది. స్త్రీ చనిపోతే భర్త 'విధురుడు' అవుతాడు. కాని హిందూ సమాజంలో 1856 కు పూర్వం తిరిగి వివాహమాడటానికి స్త్రీకి అవకాశం లేదు. హిందూ విధవా వివాహ శాసనం 1856 తో బ్రిటిషు పాలన కాలంలో వచ్చింది. అంతకుక్రితం హిందూ విధవా వివాహాన్ని ధర్మశాస్త్రాలు నిషేధించాయి ఇంచుమించుగా క్రీస్తు శకారంభంనుండి. పురుషునికి అలాంటి ఇబ్బంది లేదు. 1955 వరకు (ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో 1948 వరకు) అప్పటివరకు తన వీలును బట్టి, ఆర్థిక పరిస్థితులను బట్టి, సామాజిక హోదాను బట్టి పురుషుడు ఎంతమంది స్త్రీలనయినా భార్యలుగా స్వీకరించవచ్చును. అలాంటి పరిస్థితులలో విధురుడు పునర్వివాహానికి తయారపటంలో ఆశ్చర్యం లేదు. అలా జరిగేది. బ్రతికి నన్నాళ్ళు భార్యపై ప్రేమ ఒలకపోసి, ఆమె దినవారాలు కాగానే పెండ్లి కుమారులుగా సిద్ధపడిన పురుషులు వాస్తవ జీవితంలో ఎందరో. ఇదంతా పురుషులకొక పద్ధతిని, స్త్రీలకు మరియొక విధానాన్ని సూచిస్తున్నది. ఇది హిందూ సమాజం అనుసరించిన ద్వంద్వ నీతిలో ముఖ్యభాగం.

హిందూ వనితకు వైధవ్యం భయానక స్వప్నం. ఆమె భర్త కన్నా ముమ్ముందుగా చనిపోవాలని కోరుకుంటుంది. పసుపు కుంకుమలతో దాటిపోవాలని ఆమె ఆకాంక్షిస్తుంది. వైధవ్య జీవితంలో తను పడే బాధలను తలచుకొని అలా ఆమె భావిస్తుందా? లేక భర్త మీది అనురాగంతో ఆమె అలా తలపోస్తున్నదా? అనే మీమాంస కొందరికి రావచ్చును. దానిపై శుష్క వాదోపవాదాలు చేసే ముందు, సతీ సహగమనం లాంటి హిందూ దురాచారాన్ని గురించి చర్చించేముందు హిందూ విధవ జీవితాన్ని గురించి తెలుసుకోవటం తప్పనిసరి అవుతుంది.

ఒకదశలో హిందూ విధవకు రెండు మార్గాంతాలు ఉండేవి. వైధవ్యంతో కాలం గడపటం ఒకటి. భర్త తమ్ముని వివాహం చేసుకోవటం మరియొకటి. ఇది వేదకాలపు స్థితి. మరో దశలో ఆమె విధవగా జీవితం కొనసాగించటం ఒకటి లేక పునర్వివాహం (ఎవరితోనైనా సరే) చేసుకొని జీవితాన్ని వెళ్ళబుచ్చడం మరియొకటి. అలా చేసుకున్న స్త్రీని 'పునర్భువు' అనేవారు. మరల జన్మించిన మనిషి అని అర్థం. రెండవ పెండ్లివలన ఆమె పునరుజ్జీవనం అయినదన్నమాట. అలాకాక, ఆమెకు పురుష సంతానం లేకపోతే తన భర్త సోదరుని వలననో (మామూలుగా కనిష్ఠ సోదరుడు గ్రాహ్యుడు), లేక అతడులేని పక్షంలో సపిండుని వలననో, వీరిరువురు లభించనిచో కులములోని వాని సాయంతోను పెద్దల అనుమతితో 'నియోగం' ద్వారా పురుష సంతానం కనటం మూడవపద్ధతి. ఇవి అర్థశాస్త్రపు కాలం క్రీ. పూ. 4, 3 శతాబ్దాలలో చలామణీలో వుండేవి. మనువు రంగం మీదికి వచ్చాక పునర్వివాహాన్ని నిషేధించాడు. కాగా విధవరాలైన స్త్రీకి రెండే మార్గాలు. ఒకటి వైధవ్యంలో భర్తను స్మరిసూ 'ధర్మకామ' (ధర్మాన్ని అపేక్షించునది) అనే బిరుదుతో కాలం గడపటం. లేకపోతే 'నియోగం' ద్వారా ఒక్క పురుష సంతానాన్ని మాత్రం కనటం. ఇది మనుస్మృతిలో (క్రీ. శ 1, 2 శతాబ్దాలు) గ్రంధస్థం చేయబడిన విషయం. తరువాత కాలపు పరిస్థితి విధవలకు మరీఘోరం. వైధవ్య జీవిత విధాన నిర్దేశంపేర ఆమెకు కఠిన నియమాలను విధించారు. సతీ సహగమన ప్రాశస్త్యాన్ని గురించి ఆమెకు నూరిపోశారు. ఆమెను బలవంతాన కూడా తగలేశారు. 'సతి' అని బిరుదు ఇచ్చి ప్రశంసించారు. సతీ సహగమన నిషేధ శాసనం వచ్చేవరకు ఇది బాహాటంగా విస్తృతంగా సాగించి. అంటే 1829 వరకు కొనసాగిందన్నమాట. తరువాత 1856 లో విధవా వివాహశాసనం వచ్చేవరకు విధవ బాధాకరమైన వైధవ్యాన్ని అనుభవించవలసి వచ్చేది. తరువాత సంస్కర్తలు ఈశ్వర చంద్ర విద్యాసాగర్ లాంటి వారలు విధవా వివాహాలను చేయించ నడుం కట్టారు. ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో బాలవిధవల వివాహాలు చేయించిన ఘనత కదుకూరి వీరేశలింగం గారికి దక్కింది. శాసనం అనుమతించినా విధవలను వివాహమాడటానికి వారి సంస్కృతి అడ్డువచ్చేది. తాము బిడ్డల తండ్రులయినా తమకు మాత్రం అనాఘ్రాత పుష్పం కావాలి. అలాంటి ద్వంద్వనీతి విధవా వివాహానికి పురుషులు ఉద్యుక్తులు అవటంలేదు. అభ్యుదయ కాములు కొందరు ముందుకు

వచ్చినా వారిలో హెచ్చుమంది బాలవిధవలను మాత్రమే వివాహ మాడటానికి ఇష్టపడుతున్నారు.

ఈ సమస్యను మరొక దృక్కోణం నుండి అర్థం చేసుకోవచ్చును. ఇది హిందూ సమాజపు మొత్తం యొక్క సమస్యా, లేక కొలదిమంది సమస్యా అనేది చర్చనీయాంశం. 'శూద్రుల' లో మారుమనువు ఆచారం ఉన్నది. కనుక వైధవ్యం పెద్ద సమస్యగా వారికి పరిణమించలేదు. హిందూ సమాజం 'ద్విజులను' శ్రేష్ఠులుగా పరిగణించినంత కాలం వారి ఆచార వ్యవహారాలు దానిని ప్రభావితం చేస్తాయి. 'సంస్కృతీ కరణ' పేరుతో తదితరులు వారిని అనుకరిస్తారు. వారి ఆచారాలను అనుసరిస్తారు. అక్కడ పెద్దప్రమాదం ఉందని గ్రహించాలి. వాస్తవ పరిస్థితులను గమనించటానికి కొన్ని లెక్కలను పరిశీలించవచ్చును. హిందూ సమాజంలో 13.9 శాతం వారు ఏనాడు విధవా వివాహాన్ని ఆమోదించి ఆచరణలో పెట్టలేదు. ఇది 1931 గణాంక లెక్క. మనుషుల లెక్కలో చూస్తే సుమారు కోట్ల లక్షల మంది అలాంటివారు ఉన్నారన్నమాట. 1951 గణాంక లెక్కల ప్రకారం భారతదేశంలో 2 కోట్ల 20 లక్షల విధవలున్నారని తేలింది. అంటే వెయ్యిమంది స్త్రీలలో 123 మంది విధవలు. విధురులు 3. 70 శాతం. విధవలు 10. 8 శాతం. 1971 గణాంకలెక్కల ప్రకారం 2 కోట్ల 30 లక్షల విధవలు, 80 లక్షల విధురులు ఉన్నారు. 1971 గణాంక లెక్కలను బట్టి 15 సం॥ నుండి 40 సం॥ లోపు వయస్సుకల స్త్రీలలో 50. 31 శాతం విధవలు. అలాగే 1971 లెక్కల ప్రకారమే 15 సం॥ నుండి 49 సం॥ వయస్సు కలవారిని తీసుకుంటే 100 మంది విధవలుంటే 46 మంది విధురులు ఉన్నారని తేలుతున్నది. సమస్య ఎంత జటిలమో కనిపిస్తున్నది.[1]

వేదకాలం :- విధవలు ఉండేవారు. భర్తను పోగొట్టుకొని పునర్వివాహం చేసుకొనని స్త్రీలు వారు. 'నారీర విధవా సుపత్నీ' అని వ్రాయబడినదానికి అర్థం ఏమంటే ఇక స్త్రీకి భర్త చనిపోయినపుడు పునిస్త్రీలు (ముత్తయిదువులు) అలంకరించుకొని విధవ ఇంటికి వెళ్తారు. బహుశః ఆమెను అలంకరించి నూతన జీవితంలో అడుగు పెట్టించటానికేమో! భర్త చనిపోగానే భర్త కనిష్ఠ సోదరునికో, లేక జ్ఞాతికో ఆమెను ఇచ్చి వివాహం చేస్తారు. ఆ ప్రక్రియ ఇలా జరుగుతుంది. స్మశానానికి విధవ వెళ్తుంది. చితిమీద భర్త శవాన్ని

పెట్టే ముందు ఆమె భర్త శవం ప్రక్కన పడుకుంటుంది. (మరీ పురాతన సమాజాలలో పురుషుడు చనిపోతే అతని భార్యను అతనితోపాటు పూడ్చి పెట్టటం లేక తగలెయ్యటం జరిగేది. ఈ ఆచారం ఈజిప్టు, ఈనాటి జర్మను ప్రాంతంతో ఉండేదట. ఆర్యులు భారతదేశానికి వలస రాకముందు వారిలో ఉండేదేమో! ఆమె భర్త శవాన్ని మోసుకొని వచ్చినవారు చుట్టూ ఉంటారు. నారీ రవిధవా (నారి + అవిధవా) అంటే పునిస్త్రీలు ఆమెను అలంకరిస్తారు. పురోహితుడు ఇలా అంటాడు. "ప్రాణమున్న ఈ ప్రపంచంలోకి రా. నీవు ఎవరి ప్రక్కన శయనించావో అతనిలో జీవంలేదు. నీకు ఇపుడు చేయి అందించినవాడు నీ భర్త. అతనితో సతీత్వం నీ విధి." (రుగ్వే X-8). భర్త సోదరుడు ఆమెకు చేయి అందించి వివాహమాడతాడు. చనిపోయిన అతని శవంనుండి విల్లంబు పుచ్చుకుంటాడు. (అది యుద్ధాల కాలం, దస్యులతో పోరాటకాలం) సంతానం కనే వయస్సులో వున్న విధవలను అలా కృశించి పోనివ్వటం సమాజానికి నష్టం. ఒక్కరోజు కూడా ఆమె విధవగా ఉండరాదు. (కర్మాంతరాలు పూర్తి కాకుండానే ఆమె ముత్తయిదువు అవుతుంది) ఈ వివాహం అపకర్మలలో భాగం.[2] యుద్ధాల రోజులు కనుక చావులు వారికి అంత బాధాకరం కాదేమో! అశ్వినులను 'ఉదయం సాయంత్రం మీరు ఎక్కడ ఉంటారు? రాత్రికి ఎక్కడా విశ్రాంతి తీసుకుంటారు? అని అడిగితే 'విధవరాలు భర్త సోదరుని పాన్పువైపు నడిపించినట్లు, వధువు వరుని ఆకర్షించినట్లు' అని ఉపమానాలతో సమాధానం చెప్పారు. (రుగ్వే X 40, 2) భర్త సోదరుడు దేవర. భార్యను 'దేవృకామ' అనేవారు అంటే మరదితో కలవాలని ఉబలాటపడేది అని అర్థం. అందువలననే ద్వితీయ వివాహంలో భర్తృ విహీన 'దేవర' ను చేపట్టుంది. ఇతర విధవలు పునర్వివాహం చేసుకోవచ్చును. (రుగ్వే I 124, 57). భర్తజాడ తెలియని స్త్రీ విధవతో సమానం. మరల ఆమె వివాహమాడవచ్చును. (రుగ్వే VI 49, 8) ద్వితీయ వివాహానికి మంత్రతంత్రాలు లేవు. విధవలను తగలెయ్యడం ఇండో యూరో పియను యోధుల కుటుంబాలలో ఉండేది. దేనిని అధర్వ వేదంలో పురాణ ధర్మంగా (అధర్వ XVIII 3, 1) పేర్కొని ఖండించటం జరిగింది. బహుశః ఆమెను సతీసహగమనానికి తీసుకొని వెళ్ళే ముత్తయిదువుల ఊరేగింపే ఆమె పునర్వివాహానికి దోహదం చేసే ఊరేగింపుగా మారిందేమో![3] రుగ్వేదంలో కనుపించే మిగతా విధవలు సంతానం కలిగే వయస్సు దాటిన వారై యుండా

లని ఉపాధ్యాయ ఊహ.4 విధవ వివాహమాడితే ఆమె సంపూర్ణమైన భార్య; ప్రేమ, సంతానం, సౌభాగ్యం ఆమెహక్కు.5

బౌద్ధంలో సతీసహగమనం లేదు. యవ్వనులైన స్త్రీలు పెండ్లాడేవారు. పునర్వివాహం ఉన్నది. జైనుల పద్ధతి ప్రకారం సతీసహగమనాన్ని కొందరు స్త్రీలు పాటించేవారు. మహా భారతాన్ని క్రి. త 200 లో వ్రాశారని 'కానే', క్రి. పూ. 200 సం॥ లో అది వ్రాయబడిందని 'కీత్' వ్రాశారు. మహా భారత కాలంలో విధవా వివాహాలు సింద్యం. రామాయణ కాలంలో సతీ సహగమనం ఉండేది. కుశధ్వజుని భార్య సతీసహగమనం చేసిందట. కౌటిల్యుని అర్థ శాస్త్రంలో 'వేదన', 'నివేశ', 'గమన' అనే పదాలు కనిపిస్తాయి. 'వేదన' అంటే పునర్వివాహం. 'నివేశ' :- భర్త కాని పురుషునితో కాపురం చేయటం. 'గమన' :- ఇంకొక పురుషుని దగ్గరకు లైంగికానుభవంకోసం వెళ్ళుట. విధవ తిరిగి వివాహమాడవచ్చును. వివాహమాడుట ఇష్టంలేనిచో వైధవ్యాన్ని అనుభవించవచ్చును. విధవ తిరిగి వివాహమాడితే శుల్కం తిరిగి ఇవ్వ వలెను. భర్త ఆస్తి అతని కుటుంబీకులకు తిరిగి ఇవ్వవలెను. స్త్రీ ధనం మొదటి భర్త కుమారులకు చెందును. నివేశ, గమన ఆచారాలను పాటించిన స్త్రీ తన స్త్రీ ధనాన్ని ఉంచుకోవచ్చును. కన్యలుగా ఉన్న విధవలు, ...వ విధవలు, భర్త కుటుంబాలలోనే గాక మరియొకనిని మామ (భర్త తండ్రి) అనుమతితో వివాహం చేసుకోవచ్చును. కాని అనుమతి సాధారణంగా దొరకదు. అందువల్ల ఈ అవకాశాన్ని వినియోగించుకోవటానికి విధవలకు వీలు కలుగ లేదు. పునర్వివాహం చేసుకొనని విధవకు గౌరవం హెచ్చు. ఆమెను 'ధర్మకామ' (ధర్మాన్ని కాంక్షించేది) అని పిలిచేవారు. (అర్థశాస్త్రం 2.14,15)

మనుధర్మశాస్త్రం :- భర్త చనిపోయినా పునర్వివాహం పనికిరాదు. అప్పుడే ఆమెకు భర్త సరసన స్వర్గలోకంలో స్థానం ఉంటుంది.

కామసూత్రం :- వాత్స్యాయనుని కాలంలో విధవా వివాహాలు ఉండేవి. భర్త ఇంటిలో పునర్భువుకు పెద్దగా గౌరవం ఉండేది కాదు.

నారద స్మృతి మూడురకాల పునర్భువులను చెప్పింది. గర్భాదానం కాని వివాహిత, భర్త చనిపోతే భర్త సోదరుడు లేక భర్త బంధుగులచేత మరియొకరికి (సపిండునకే) ఇవ్వబడినది ఈ కోవకిందికి వస్తారు. యాజ్ఞవల్క్యుడు

రెండురకాల పునర్భువులను పేర్కొన్నాడు. గర్భాదానం కాని అవివాహిత, గర్భాదానం అయిన వివాహిత యని రెండు తెఱగులు. పరాశర స్మృతిలోని 'నష్టేమృతే' అనే శ్లోకం కలియుగానికి వర్తిస్తుందని కొందరు (IV - 30) వర్తించదని కొందరు వాదోపవాదాలు చేశారు. మొత్తంమీద సంస్కరణ వాదుల ప్రయత్నాలు పరాశర స్మృతి వచనం నుండి బలాన్ని పుంజుకున్నాయి. ముస్లిం యుగంలో జాట్ శిక్కులలో విధవరాలు భర్త సోదరుని, అతడు లేకపోతే ఆ కులపు వానిని వివాహమాడవచ్చునసే ఆచారం ఉండేది.

నిన్న మొన్నటి వరకు బాల్యవివాహాలు ప్రబలంగా ఉండటం వలన, స్త్రీ కాపురానికి వచ్చిన కొలది కాలానికే తల్లికావటం వలన, ఆమె భర్త చని పోయినా పిల్లల బాధ్యత ఆమెకు ఉండడంతో ఆమె పునర్వివాహానికి పూనుకునే పరిస్థితి లేదు. ఆలస్యంగా వివాహమాడే కుటుంబాలలో కూడా స్త్రీకి త్వరగా గర్భధారణ జరగటంతో పురుషునికి మామూలుగా కల్గే స్వేచ్ఛ వితంతువుకు లభించదు. ఆమెను పిల్లలతో సహా భార్యగా స్వీకరించకలవారు, వివాహ మాడినా ప్రధమ సంతానాన్ని ఆదరంగా చూడగలవారు బహు అరుదుగా కనిపిస్తారు. అందువలన శాసనం వెసులుబాటు కల్పిస్తున్నా విధవా వివాహాలు విరివిగా జరగడానికి అవకాశాలు లేవు.

మహా సంస్కర్తలుగా పేరుపొందిన ప్రజానాయకులు విధవా వివాహాలను కొన్ని షరతులకు లోబడి ఆమోదించటం కూడా వాటి వ్యాప్తికి ప్రతి బంధక మైనది. అక్షత యోనియు అక్షత వీర్యుడు పునర్వివాహమాడవచ్చని, క్షత యోని స్త్రీకి క్షతవీర్య పురుషునకు పునర్వివాహం కూడదని, ఇది ఆర్యమతమని దయానంద సరస్వతులవారు సత్యార్థ ప్రకాశికలో వ్రాశారు. స్వాతంత్ర్యోద్యమ సమరంలో లక్షలమందిని నడిపించిన మహాత్మాగాంధి సుమారు నలుబది సంవత్సరములు ప్రజా ప్రబోధం చేశారు. ఆయన అభిప్రాయాలు గమనిద్దాం. "జీవిత భాగస్వామి తన యెడ చూపిన ప్రేమను అనుభవించిన స్త్రీ చైతన్య వంతంగా, ఇష్టపూర్వకంగా వైధవ్యాన్ని స్వీకరిస్తే అది జీవితానికి హుందా తనాన్ని ఇస్తుంది, సౌకుమార్యాన్ని కలిగిస్తుంది; కుటుంబాన్ని పవిత్రం చేస్తుంది. మతాన్ని ఉత్కృష్ట స్థానానికి చేరుస్తుంది. అలాకాక మతం వల్లనో లేక ఆచారం వల్లనో నెత్తిన రుద్దబడిన వైధవ్యం భరించలేని భారమవుతుంది. రహస్యపద్ధతులు ఆశ్రయించే పాపంగా

కుటుంబాన్ని అపవిత్రం చేస్తుంది; మతాన్ని మలిన పరుస్తుంది."8 బాల విధవలకు వాస్తవంగా వివాహం జరగనట్లేనని ప్రకటించి బాలవిధవల పెళ్ళిళ్ళు చేయమని బోధించాడు. "విధవా వివాహాలు భారీ ఎత్తున సాగించమని నేను ఏనాడు అనలేదు. బాలవిధవలు (15 సం॥ లోపువారు)- ఈ దుఃఖ భాజనులు, శోచనీయస్థితిలో ఉన్నవారు - పతివ్రతా ధర్మం అంటే ఏమిటో తెలియనివారు. వారు (భర్త) ప్రేమను చవిచూడనివారు........."9 "బాల విధవ ఒక్క సంఖ్యలో ఉన్నా అన్యాయాన్ని సరిచేయాలి."10 ఈ ప్రవచనాల వల్ల అసలు సమస్య మరుగున పడిపోయింది.

సతీసహగమనం :- భర్త చనిపోతే అదే చితిపై స్త్రీ కాల్చుకొని చనిపోతే దానిని సహగమనం అంటాం. ఋగ్వేదకాలంలో సహగమనం లేదని తెలుసుకున్నాం. బౌద్ధమతానుయాయులలో స్త్రీల సహగమనం లేదు. జైనులలో కొందరు ఈ ఆచారాన్ని ఆమోదించారు. రామాయణ కాలంలో సహగమనం జరిగింది. వాత్స్యాయనుని కాలంలో అనుమరణం ఉండేది. భర్త ఎక్కడో చనిపోతే ఆ వార్త విని చితి పేర్పించుకొని అందులో దూకి లేక పరుండి భార్య చనిపోవటం అనుమరణం అంటాము. 'సతి' విధవయొక్క విధియని ఆంగీరసుడు చెప్పాడు. బ్రాహ్మణులకు అనుమరణం నిషేధం చేశారు. క్షత్రియ స్త్రీలు అందులో ముఖ్యంగా రాజపుత్ర స్త్రీలు దీనిని పాటించేవారు. ఋగ్వేదంలో 'అగ్రే' అనే పదాన్ని 'అగ్నే' అని సనాతనులు మార్చి వేదకాలంలో సహగమనం ఉన్నదని సమర్థించచూచారని మాక్సు ముల్లరు (హిందూ సంస్కృతిపై గౌరవం కల మాక్సు ముల్లరు) వ్యాఖ్యానించాడు. ఆ భావం తప్పని, అసలు ఆ మంత్రం విధవకు వర్తించదని కానే పండితుడు వివరించాడు (ఋగ్వే X - 18-7). హుమాయూన్ సంతానం పొందే వయస్సు దాటిన విధవల సహగమనాన్ని ఆపించ ప్రయత్నించాడు. అక్బర్ చక్రవర్తి బలవంతాన ఏ స్త్రీ చేత సహగమనం చేయించకుండా అధికారులను నియోగించాడు. బ్రిటిషువారు 1829 లో శాసనం చేశారు. కాగా ఏ పదిఏండ్లకొకసారిగా మారుమూల గ్రామాలలో ఇప్పుడూ అలాంటి సంఘటన అరుదుగా జరుగుతున్నాయి. సతీసహగమనానికి ప్రామాణిక ఆధారం లేదన్నాడు మనుస్మృతి భాష్యకారుడు మేధతిధి., విధవను బ్రతికి ఉండి భర్తకు తర్పణాలనిమ్మన్నాడు విరటుడు. దేవణ్ణభట్టు (క్రీ. శ. 12 వ శతాబ్దం) దక్షిణాదివాడు. సతీసహగమనం తక్కువ

స్థాయి ధర్మమని అభిప్రాయం వెలిబుచ్చాడు. ఆ ఆచారాన్ని నిరసించాడు. కాదంబరి రచయిత బాణుడు (7 వ శతాబ్దపు వాడు) ఇలా భావప్రకటన చేశాడు :- "ప్రియునితో మరణించటం నిష్ప్రయోజనం. మూర్ఖులు అవలంబించే ఆచారమది. మోహంవల్ల చేసే పొరపాటు. అది తొందరపాటు చర్య. బ్రహ్మాండమైన తప్పిదం. చనిపోయినవారికి అది ఏమేలు చేయదు. అతడు స్వర్గానికి పోవటానికి, నరకానికి పోకుండా ఆది ఉపకరించదు. చనిపోయిన. వారితో విధవను కలపదు. చనిపోయిన వ్యక్తి తన కర్మఫలం ప్రకారం నిర్ణయమైన ప్రదేశానికి పోతాడు. చితిపై చనిపోయి ఆత్మత్యాగం చేసేవారు ఆత్మహత్యా పాతకులకు కేటాయించబడిన నరకానికి వెళ్తారు. అలాకాక బ్రతికి ఉంటే చనిపోయిన వ్యక్తి ఆనందం కోసం తగిన తర్పణాలు ఇచ్చి తనకూ, చనిపోయిన వ్యక్తికీ మంచి చేయవచ్చును (సద్గతులు కలుగజేయవచ్చును). అతనితో చనిపోయినందువల్ల ఎవరికీ ప్రయోజనం లేదు." ఎంతో హేతుబద్ధమైన మానవీయమైన భావం సంపుటం.

సతీ సహగమనం ఇంచుమించుగా అదృశ్యమైన ఈ రోజుల్లో దీనిని గురించి ఈ మాత్రమైనా ఎందుకు ముచ్చటించవలసి వచ్చిందంటే, బెంగాలులో విధవలకు ఆస్తి లేకుండా చేయటానికి వారిని పురికొల్పి సహగమనం చేయించిన బ్రాహ్మణులు, చితిలో దూకిన రాజపుత్ర స్త్రీలకు భావాలను కల్గించిన సనాతనుల దుర్మార్గాన్ని వెలికితీసే నిమిత్తమే ఇన్నాళ్ళుగా సాగిన దుర్మార్గాన్ని ఆమోదించి పోషించిన హిందూ సంప్రదాయాన్ని నిరసించుటమే నేటి మన కర్తవ్యం.

<u>నియోగం :-</u> పురుషుడు నిస్సంతుగా చనిపోతే విధవ పునర్వివాహం చేసుకోకుండా నియోగంద్వారా చనిపోయిన భర్తకు సంతానాన్ని కనడం జాతి సంఖ్యను పెంచడానికి ఒక ఏర్పాటు. ఇది ప్రస్తుతం ఆమలులో లేదు. దీనిని గురించి వివరంగా వ్రాయవలసిన పనిలేదు. కాగా దీనిని ప్రోత్సహించిన ధర్మ శాస్త్రవిదులు, దీనికి హద్దులు, పరిమితులు విధించిన ధర్మశాస్త్ర రచయితలు వీరి ఉద్దేశాలను (దురుద్దేశాలనటం సబబేమో!) బహిర్గతం చేయుడానికి ఆ పరిశీలన అవసరం. కాగా దరహంమీద సాగించటం యుక్తి యుక్తం.

భర్త చనిపోతే భర్త సోదరుని వలన, అతడు లేకున్న సపిండుని వలన, అతడూ లేకున్న సప్రవరుని వలన, అతడూ లభించనిచో తన వర్ణము వాని వలన విధవ తన భర్తకు నియోగం ద్వారా సంతానం కనవచ్చని గౌతమ ధర్మ సూత్రం (18. 4-14) చెప్తుంది. విధవ క్షేత్రం. క్షేత్రికుడు భర్త. బీజినుడు నియోగితుడయిన పురుషుడు. ఇక్కడ ఒక నిబంధన ఉన్నది. పెద్దల అనుమతి కావాలి. ఇరువురు కుమారులను మాత్రమే పొందాలి. విధవరాలి వయస్సును గురించి నియమం ఉన్నది. ఆమె రజస్వల ఆయి 16 సంవత్సరాలు దాటరాదు. (వశిష్ట ధర్మసూత్రం 17. 56-65).

చనిపోయినవాని, లేక నపుంసకుని లేక నయంకాని వ్యాధిచేత పీడింప బడే వాని భార్యకు మాత్రమే నియోగం జరగవలెను. (బౌద్ధాయన ధర్మ సూత్రం II - 2-17).

ఒకే కుమారుని పొందవలెను (మనువు IX - 59-61) కౌటిల్యుడు విధించిన నియమాలు గమనార్హం. రాజుల విషయంలో . 1) భర్తకు బ్రతికి లేక చనిపోయిన పిల్లలు ఉండరాదు. 2) కుటుంబ సమావేశంలో గురువులు నిర్ణయించాలి. 3) భర్త సోదరుడో, సపిండుడో, లేక సగోత్రికుడో నియోగితుడు కావాలి. 4) నియోగితుడు ధర్మనిర్వహణచేయాలి కాని కామ పేరితుడు కారాదు. 5) నియోగితుడు దేహానికి నెయ్యి పూసుకోవాలి. ఆమెతో సంభాషించరాదు. ఆమెను ముద్దిడరాదు. ఆమెతో క్రీడించరాదు. 6) ఒకరిద్దరు కుమారులు కలుగువరకు మాత్రమే ఈ ఏర్పాటు వుంది. 7) విధవ యవ్వనవతియై యుండవలెను. ముసలిది, గొడ్రాలు, ముట్లుడిగినది, వ్యాధిగ్రస్తురాలు, గర్భిణీ, ఇష్టపడనిది కారాదు. 8) ఒక కుమారుడు కలిగిన తర్వాత వారి సంబంధం మామ కోడళ్ళ సంబంధాన్ని పోలియుండును. షరతులకు భిన్నంగా నడిస్తే శిక్ష వేయవచ్చును. సంతానం క్షేత్రకునిది కాదు; నియోగితునిది (అర్థశాస్త్రం III - 7-40). మనువు కూడా నియోగాన్ని వర్ణించాడు. కాని ఖండించాడు. అయినా దానిని శాస్త్రసమ్మతం చేశాడు. నియోగం ఆనార్య సంప్రదాయమట (కొందరి అభిప్రాయం). హిందూ సమాజాన్ని కట్టుదిట్టం చేయటానికి నియోగాన్ని మనువు ఆమోదించవలసి వచ్చిందని ప్రతిభా ముఖర్జీ అభిప్రాయం. ఇది కేవలం ఆస్తిని వంశంలో

నిలపటానికి చేసిన ఆలోచన. మహాభారతంలో నియోగంవలన అంబిక అంబాలిక కుమారులను పొందారు. విధవలకు పునర్వివాహాన్ని కాదని తాత్కాలిక సంబంధంగా నియోగాన్ని ఏర్పాటు చేసాడు మనువు. ఈ ధర్మ విదుల దృష్టిలో స్త్రీ కేవలం సంతానం కనే యంత్రం. కనుకనే నియోగాన్ని గురించి ఇన్ని అసహ్యకరమైన నిబంధనలు పెట్టారు. కౌటిల్యుని 'నివేశం' పద్ధతికి మనువు 'నియోగ పోలిక ఉన్నది. మనువు సోదరి కుమారుడిని వారసుడిగా చేశాడు. సోదరుడు లేని స్త్రీని వివాహమాడవద్దన్నాడు. ఎందు కంటే అతనికి వారసులుండరు కనుక. దాంతో నియోగపద్ధతి పెరిగింది. తెలిసి ఆస్తిని పోగొట్టుకోరుకదా! వివాహం అవిచ్ఛేద్యం. వంశం కొనసాగాలి. ఆస్తి వంశంలో ఉండాలి. ఇవి మనువు సూత్రాలు కనుక నియోగం (ఎంత ఇష్టంలేదని చెప్పినా) అవసరమయింది; రోజురోజుకూ ఈ ఆచారం పెరిగింది. చివరకు విశ్వరూప (యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్యాత) ఈ కాలానికి పనికి రాదని ఖండించాడు. క్షత్రియులకు, శూద్రులకు పరిమితం చేశారు. జనాభా పెరుగుదల ఆవశ్యకత కూడా ఈ ఆచారాన్ని పోషించింది కొన్ని వందల సంవత్సరాలు. ఈ ఆచారం నశించడం సమాజ ఆరోగ్యానికి అత్యవసరం. ఇంతగా స్త్రీలను అవమానించిన ఆచారం, స్త్రీలను సాధనాలుగా వాడిన మహరుషులు ఇతర సమాజాలలో లేరేమో! విధవ సంతాన ప్రాప్తికోసం భర్త సోదరుని వివాహమాడటాన్ని ప్రోత్సహించిన సమాజాలు ఉన్నాయి కాని స్త్రీ యొక్క ఉద్వేగాలకు, స్పందన, ప్రతిస్పందన భావాలకు విలువలను ఇవ్వకుండా, కేవలం ఆమెను తమ ప్రయోజనాలకు వాడుకోవడం హిందూ ధర్మశాస్త్ర విదులకే చెల్లును. స్త్రీ భర్త ఆస్తి అనే పాతకాలపు భావానికి ప్రతీక అయిన పాత ఆచారానికి ఇది అవశేషమని కానే పండితునీ భావం.[12] పితృరుణం తీర్చటానికి కుమారుని కొరకు ఆరాటమని ఆయన అభిప్రాయం. ఏ ఆరాటానికైనా మంచీ చెడ్డా ఉండాలికదా! సభ్యతను సంస్కారాన్ని పాటించాలి కదా! బహుశః పితృస్వామ్య సమాజాన్ని వ్యవస్థీకృతం చేయదలచిన వారికి ఇవి లెక్కకు రావేమో!

<u>విధవ జీవితం</u> :- హిందూ సమాజంలో నికృష్ట జీవిగా బ్రతికిన మనిషి, బ్రతుకుతున్న మనిషి విధవ. తనకు కావలసిన మనిషి లేకుండా పోయాడు. వెంటనే ఆభరణాదులు పోతాయి. తిండి కరువు అవుతుంది. గౌరవం నశిస్తుంది. విధవ ముఖావలోకనం దురదృష్టాన్ని తెస్తుందట.

వదిమందిలోకి పోవటానికి వీలులేదు. పండుగలలో, పబ్బాలలో ఎవరికంటి పడకుండా తప్పించుకొని తిరగాలి. విరూపిని చేస్తారు. ముఖ్యంగా బ్రాహ్మణ వర్ణంలో [ఒక్క వైష్ణవులు తప్ప] ఆమెకు ముండనం చేస్తారు. జుత్తులేని ఆమె తల అందవికారం అవుతుంది. భర్త ఉండగా ఆమె ఇంటికి రాణి. కుటుంబానికి సామ్రాజ్ఞి. ప్రతి చిన్నదానికి ఆమె ఆశీర్వచనం కావాలి; ఆమె ఇచ్చే హారతులు, అందించే ప్రసాదాలు కావాలి. పరిస్థితి ఒక క్షణంలో మారిపోతుంది. ఎవరికీ అక్కరలేని మనిషి అవుతుంది. ఎవరికంట పడరాని పనికిమాలిన మనిషిగా మారిపోతుంది. ఈ మాటలు కేవలం ఉద్రేకపూరిత వచనాలు కావు.హిందూ ధర్మశాస్త్రజ్ఞులు ఆమెకు విధించిన శిక్షను గమనించండి. అది శిక్షకాదు ఆమెకు రక్ష అంటారు వారు. ఆ మాట ఎంత సబబో ఆలోచించవలసిన విషయం అనన్నమయింది.

విధవాధర్మం :- విధవ అనే పదం ఋగ్వేదంలో IV - 18,12; X - 7; X - 40. 2, X 40.8 ఋక్కులలో వాడబడింది. "మరుత్తుల వేగంతో భూమి భర్తను కోల్పోయిన స్త్రీ వలె కనిపిస్తుంది" [ఋగ్వే I 87-3].

దుఃఖం వల్లనో తమయెడల ఇతరులు దుర్మార్గంగా ప్రవర్తిస్తారనో లేక ఎవరైనా తమరిని చెడుస్తారని భయంవల్లనో విధవలు తల్లడిల్లే వారన్న మాట.13 "ఒక సంవత్సరము విధవరాలు తేనెను, మాంసాన్ని, మద్యాన్ని, ఉప్పును త్యజించాలి. నేలపై పరుండాలి. తరువాత, ఆమెకు కుమారుడు లేకపోతే, పెద్దలు అంగీకరిస్తే, తన భర్త సోదరుని ద్వారా కుమారుని కన వచ్చును." [బౌద్ధాయన ధర్మసూత్రం II 66-68]. మౌద్గలాయనుడు ఆరు నెలలు గడువు మాత్రమే పెట్టాడు. వసిష్టుని ధర్మసూత్రం అలాంటి యేర్పాటే చేసింది. [17-55-56] మనువు చాల ఓపికగా, శ్రద్ధగా ఆమె విధులను వివరించాడు. "భర్త చనిపోయిన స్త్రీ ఆమెకు ఇష్టం అయితే, కందమూల శాకాదులు తింటూ బ్రతకాలి. పరాయి పురుషుని నామం కూడా ఉచ్చరించ రాదు. ప్రమాణాలను [పెళ్ళినాటి ప్రమాణాలను] పాటించాలి; బ్రహ్మచర్యాన్ని అవలంబించాలి. నిగ్రహంతో సంచరించాలి. భర్త యెడ భక్తి శ్రద్ధలతో వారికి నిర్దేశింపబడిన మహోన్నతమైన ప్రవర్తనా నియమావళిని అనుసరించాలి. తనకు కుమారుడు లేకపోయినా, భర్త తదనంతరం ఇలా ప్రవర్తించిన విధవరాలు శౌనకునిలాగా స్వర్గానికి పోతుంది." [మనువు V 157-160].

ఈ అంశంలో పరాశరుడు మనువుతో ఏకీభవించాడు. వృద్ధహారీతుడు ఆమెను గురించి చాల జాగ్రత్త వహించాడు :-

"జుట్టు దువ్వుకోరాదు. తాంబూల సేవనం చేయరాదు. పూలను ముడుప రాదు. సుగంధ ద్రవ్యాలను వాడరాదు. ఆభరణాలను ధరించరాదు. రంగు చీరెలను కట్టరాదు. కంచు కంచంలో భోజనం చేయరాదు. రెండు వేళలా భోజనం చేయరాదు. కంటికి కాటుక కూడదు. తెల్లని వస్త్రాన్ని ధరించాలి. కోపాన్ని, ఇంద్రియాలను నిగ్రహించుకోవాలి. మోసాన్ని, జిత్తులమారి ఎత్తులను ఆమె చేపట్టరాదు. సోమరిపోతు తనాన్ని, నిద్రను వర్జించాలి. పరిశుద్ధంగా ఉండాలి. శీలవతియై ఉండాలి. హరిసేవలో మునిగి తేలాలి. రాత్రివేళ నేలమీద కుశ దర్భచాపపై శయనించాలి. మనసును ఏకాగ్రతగా ఉంచుకోవాలి. సద్వర్తనుల సాంగత్యం చేయాలి" [వృద్ధ హారీత స్మృతి IX 205-210].

ఆమె నూనెతో తలంటుకొని స్నానం చేయరాదని, సన్యాసి కారాదని ప్రాచేతనుడు.14 స్కాంద పురాణం [కాశీఖండం అధ్యాయం 4. 71-106] విధవ విధులను విశదీకరించింది. 'ఆమె రవిక ధరించరాదు. చనిపోయే టప్పుడు కూడా ఎద్దుబండి ఎక్కరాదు.' ఆమె సన్యాసి కాకూడదు కాని సన్యాసిలాగా జీవించాలి.15

ముండనం :- ఈ ఆచారం క్రీ. శ. 14 వ శతాబ్దంలో అమలులోకి వచ్చిందని కానే పండితుడు అంటే క్రీ. శ. 12 వ శతాబ్దంలోనని ఆల్టేకరు పండితుడు అంటాడు.16 బహుశః మొదట్లో ఇది బ్రాహ్మణులలో వ్యాపించి, తదుపరి ఇతర వర్ణాల వారికి వ్యాప్తి చెంది యుండవచ్చును.

ఋగ్వేదంలో 'వికేశి' [చిందర వందరగా జుత్తు ఉన్న స్త్రీ], అథర్వ వేదంలో 'వికేశి' 'వికీర్ణకేసి' అనే పదాలు మాత్రం ఉన్నాయి. శవంతో విధవలు స్మశానానికి వెళ్లారు. కాని ముండనం సంగతిలేదు. ఏదైనా క్షత్రియ విధవలు జుట్టు తీయించుకోరు. విధవ'సతి'కాక బ్రతికితే త్యక్త కేశ అయి తపస్సు ద్వారా దేహాన్ని కృశింపచేయవలెను. (II - 53)

త్యక్త కేశ అంటే మూడు అర్థాలున్నాయి. కేశాలంకరణ చేయుట యందు శ్రద్ధలేనిది, గోవధ చేస్తే 2 వేళ్ళ వెడల్పున జుత్తును తీసివేసిన స్త్రీ, శిరోముండనం చేయించుకున్న స్త్రీ. వేదవ్యాసుడు ఏ అర్థంలో ఆ పదాన్ని వాడాడో చెప్పటం కష్టం. 1 వ అర్థం కావచ్చును లేక 3 వ అర్థం కావచ్చును. విధవ శిరోముండనం చేయించుకోకపోతే భర్త పరలోకంలో బానిసత్వంలో ఉంటాడట [స్కాందపురాణం - కాశీఖండం 4-64].17 శ్రీ వైష్ణవులలో ఈ ఆచారం లేదని తెలుసుకున్నాం. వారి సంహితలు [శంభు సంహిత, మనుసంహిత, హయగ్రీయ సంహిత] ఈ ఆచారాన్ని స్పష్టంగా నిషేధించాయి.18 శిరో ముండనం చేయించుకున్న స్త్రీ నరకానికి పోతుందని వారి మతాధికారులు బెదరించినా ఈ దురాచారం శ్రీ వైష్ణవులలో కూడా కొద్దిగా ప్రాకిందని అల్టేకరు అభిప్రాయం. గౌతమస్మృతి I - 5 ఈ ఆచారాన్ని ఖండించింది. వేదాలలో దీని ప్రసక్తి లేదు. గృహ్యసూత్రాలు దీనిని గురించి చెప్పలేదు. మను, యాజ్ఞవల్క్యులు దీని విషయమై మౌనం వహించారు. భర్త చనిపోయినపుడు ఒక్కసారి మాత్రం విధవ శిరో ముండనం చేయించుకోవాలని చెప్పారు. అంతేకాని జీవితాంతం శిరో ముండనం చేయించుకోమని ఆదేశించలేదు. మితాక్షర, అపరార్కులలో దీని ఊసేలేదు. క్రీ. శ. 10, లేక 11 శతాబ్దాలలో ఈ పద్ధతి మొదలయి ఉండవచ్చును. విధవలు యువతులు కావటం వలనలో, లేక విధవలను వికార రూపులను చేస్తే వారిని శీలవంతులుగా అట్టే పెట్టటం తేలిక అనో, లేక బౌద్ధ జైన, సన్యాసినులు పద్ధతిని అనుసరించియో ఈ విధానాన్ని ప్రవేశ పెట్టి వుంటారు. ఈనాటికీ శ్రీ వైష్ణవులలో 'తెంగళి' శాఖవారికి, గౌడ వితంతువులకు ఈ ఆచారం లేదు. తెలుగు దేశంలో బ్రాహ్మణ వితంతవులు శూద్రులలో కొందరు ఈ ఆచారాన్ని ఇప్పటికీ పాటిస్తున్నారు. దీనిని స్త్రీ జన ద్వేషి ఎవడో ప్రతిపాదించి ఉంటాడు.

<u>ముగింపు</u> :- వేదధ్యాయనాన్ని స్త్రీకి నిషేధించి ఆమెను శూద్రునితో సమతుల్యం చేసి ఆమెను సంతాన సాధన యంత్రంగా వాడి, అంటితో ద్వేషము పోక, వితంతు అయిన తరువాత ఆమెను వికారిని చేసి, మత సంస్కృతిని ఆమెకు జీర్ణింపజేసి తద్వారా అంధవిశ్వాసాన్ని ఆమెలో పెంచారు హిందూ సంప్రదాయవాదులు.19 ఆమెలో హేతుత్వ బుద్ధిని చిదిమి వేశారు

అసలు మధ్యయుగమే అంధకారయుగం. ఆ యుగంలో ఈ ప్రక్రియ పరాకాష్ఠకు చేరింది. స్త్రీ మనస్సుకు వేసిన సంకెళ్ళ నుండి ఆమె ఇంతా విడివడలేని స్థితిలో ఉంది. విధవా వివాహ చట్టం వచ్చినా పురుష పుంగవుల ఆలోచనా ధోరణి మారలేదు. స్త్రీల మనస్తత్వం ఎగదని స్థితిలోనే ఉంది; మార్పును వ్యతిరేకిస్తున్నది. ఈ దుర్భర శోచనీయ పరిస్థితి ఎన్ని దశాబ్దాలు ఇంకా ఇలా కొనసాగాలో! తలుచుకుంటే హృదయం బ్రద్దలు కాక తప్పదు; విముక్తికై పోరాడక తప్పదు.

అధ్యాయం 5

## పాదదీపికలు

1. స్టేటస్ కమిటీ రిపోర్టు (1974 భారత ప్రభుత్వం) పుటలు 77 నుండి 79
2. ఋగ్వేదంలో స్త్రీలు : ఉపాధ్యాయ-పుట 102
3. డిటో పుట 105
4. డిటో పుట 107
5. డిటో పుట 107
6. కానే : ధర్మశాస్త్రాల చరిత్ర : పుట 634 2 వ వాల్యూము 1 వ భాగం
7. సత్యార్థప్రకాశిక : దయానంద సరస్వతి పుట 142
8. సర్వోదయ : మహాత్మగాంధీ-నాల్గవ భాగం పుట 10
   Sarvodaya ; M. K. Gandhi (Navjivan Publishing House, Ahmedabad – 14 (1954) (young India' Dt. 5-8-196)

9. డిటో యంగ్ ఇండియా - 19-8-196
10. డిటో యంగ్ ఇండియా - 2-9-196
11. యుగయుగాలలో భారతీయ స్త్రీల చరిత్ర : పి. థామస్ -
రెండవభాగం 'ప్రాచీన స్త్రీ విమోచన ఉద్యమకారులు'
12. కానే : ధర్మశాస్త్రాల చరిత్ర : పుట 606
2 వ వాల్యూము 1 వ భాగం
13 డిటో పుట 583 (12 వ అధ్యాయం)
2 వ వాల్యూము 1 వ భాగం
14. డిటో డిటో పుట 584
15. డిటో డిటో పుట 586
16. హిందూ నాగరికతలో భారత స్త్రీల స్థానం : ఆల్టేకరు పుట 161
17. ఆల్టేకరు పుట 160
18. డిటో పుట 161
19. చూడండి డిటో 358



అధ్యాయం

# 6 విడాకులు : పునర్వివాహం

శాస్త్రప్రకారం హిందూ వివాహం రద్దుకాపటానికి వీలుకానిది. స్త్రీకి ఇది గొడ్డలిపెట్టు. అభ్యుదయ వాదుల ఆందోళన ఫలితంగా వివాహం రద్దుకు అవకాశాన్ని కల్పిస్తూ బొంబాయి, ఉమ్మడి మద్రాసు రాష్ట్రాలలో వరుసగా 1947, 1948 సంవత్సరాలలో రాష్ట్ర శాసన సభలు చట్టాలను రూపొందించాయి. తరువాత 1955 లో భారతదేశం యావత్తుకూ వర్తించే శాసనం వచ్చింది. అయితే శాసన సమ్మతం కాకపోయినా అనుభవంలో 1947 కు పూర్వమే ఒకరకమైన విడాకులు అమలులో ఉన్నాయి.

భార్యా భర్తలు ఇరువురు బతికి ఉన్నపుడు ఏవో కొన్ని కారణాల వలన వారి వివాహం ఆచరణలో రద్దుకాబడితే అది అనుభవానికి వచ్చిన విడాకుల క్రిందనే లెక్క. అలాంటి సంఘటన జరుగక పోలేదు. ఈ విషయాన్ని కూలంకషంగా పరిశీలించటం అవసరం. విడాకులు వచ్చినపుడు భార్యా భర్తలు పునర్వివాహం చేసుకోవటానికి వీలు వుంటుంది. విడాకులు లేనపుడు కూడా కొన్ని పరిస్థితులలో భార్య పరపురుష సంగమానికి వీలు కలిగింది. అది నియోగం ద్వారా జరిగేది. దానిని క్రిందటి అధ్యాయాలలో తడివి చూచాము. కనుక దాని ప్రసక్తి ఇపుడు అనవసరం. కనుక 'నియోగం' క్రిందకు రానివి పునర్వివాహాలక్రింద పరిగణింపబడేవి వాటిని గురించి మాత్రమే ఈ అధికరణంలో చర్చించటం సమజసంమని అనిపించింది.

భర్తజాడ తెలియకపోతే భార్య విధవతో సమానం. కనుక ఆమె మరల వివాహమాడవచ్చును. (రుగ్వే VI - 49, 8) కాని, రెండవ పెండ్లికి మంత్ర తంత్రాలు లేవు.1 బౌద్ధులకాలంలో ఇషిదాసి మూడు వివాహములు చేసుకున్నట్లు 'తేరీగాధ' లో ఉన్నది.2 73 మంది బౌద్ధ సన్యాసినులు వ్రాసిన గ్రంధమది. అందులో ఎక్కువమంది పురుషులచేత మోసగింపబడిన

వారు లేక నిరాదరణ చేయబడిన వారు. 'తేరి' అంటే 'జ్ఞానవృద్ధ' (జ్ఞానముతో వృద్ధులైన వారు). 'గాథ' అంటే పాట. తేరీ ఉత్పలవర్ణ తెలియక తన కూతురు భర్తనే రెండవ భర్తగా స్వీకరించినది.3 క్రీ. పూ. 400 నుండి క్రీ. త. 100 వరకు ధర్మసూత్రాలు వ్రాసిన వారు భర్త జాడ తెలియని స్త్రీ ఏడు సంవత్సరాలు వేచియుండాలని ఆల్తేకరు వ్రాశాడు.4 భర్త సన్యాసి అయినా, ఇల్లువదలి ఎక్కడికి వెళ్ళిందీ తెలియకపోయినా ఏడు తీర్థముల తర్వాత ఆమె భర్త యొక్క ఏకోదరులలో ఎవరో ఒకరిని ఎంపిక చేసుకొని అతనితో కాపురం [నివేశం] చేయవచ్చును. అందులో భార్య లేని కనిష్టునే ఎంచుకోవలెను. వారెవ్వరూ లేకపోతే సపిండులలో ఒకరితో కాపురం ఉండ వచ్చును. గర్భవతి అయితే ఒక సంవత్సరం ఆగవలెను. [తీర్థం అంటే నెల; ముట్టుకు ముట్టుకు మధ్య ఉన్న గడువు]. ఇది అర్థశాస్త్ర విహితం.5 భర్త మత సందర్భంగా విదేశాలకు వెళ్ళి అతని జాడ తెలియకపోతే భార్య ఎనిమిది సంవత్సరాలు వేచియుండాలని, జ్ఞానం, పేరు ప్రఖ్యాతుల కోసం అతడు వెళ్ళియుంటే ఆరు సంవత్సరాలు వేచియుండాలని, మరొక భార్యతో ప్రేమ కలాపాలు సాగించటానికి వెళ్ళియుంటే మూడు సంవత్సరాలు వేచి యుండాలని మనువు ఆదేశించాడు [మను IX - 76]. అలా గడువు మేరకు వేచియున్న తరువాత భార్య ఏమి చేయాలో మనువు చెప్పలేదు. కాని ఇలా వేచివుండమని చెప్పటంలో అర్థం తరువాత అతడు మరణించినట్లు ఆమె భావించుకొని పునర్వివాహం చేసుకోవచ్చుననే అర్థం స్ఫురిస్తుంది. కాని పునర్వివాహానికి మనువు వ్యతిరేకి. కాగా ఆమె నియోగానికి అర్హురాలు. అంతేనని తోస్తున్నది. ఒక స్త్రీ ఒక పురుషునికి నిశ్చితార్థం అయిన తదుపరి వివాహం కాకుండా అతడు చనిపోతే ఆమె పునర్వివాహం చేసుకోనగునని [గర్భాదానం కాకపోతే] ఒక శాస్త్రకారుడు చెప్పాడు. అదే తర్కంమీద నిశ్చితార్థం అయిన తరువాత పురుషుడు వెళ్ళిపోయి అతని జాడ తెలియక పోతే స్త్రీ మరల వివాహమాడవచ్చని తేలికిగా నిర్ణయానికి రావచ్చును. గాంధర్వ, అసుర, రాక్షస, పైశాచికాలు అధార్మ్యవివాహాలు. అలా వివాహాలు చేసుకున్నవారు విడాకులు పొందవచ్చునట. (అర్థశాస్త్రం III - 3) కాకపోతే కొన్ని ఇబ్బందులకు లోను కావాలి. స్త్రీ ధనం పోతుంది. తనుగా 'నివేశం' నకు ఆమె తలపడినా ఆమెకు ధన నష్టం. (అర్థశాస్త్రం III 4-26; 2.15; 3. 21-23) బీదరికం వల్ల పునర్వివాహం చేసుకుంటే తప్పులేదట. ఇరువురి

ఇష్టం ప్రకారం విడాకులను అధార్మ్య వివాహాలలో కౌటిల్యుడు అంగీకరించాడు. నారదదుడు, పరాశరడు కొంత వెసులుబాటు చూపించారు. 'శూద్ర కమాలా కార' రచయిత నారదుడు 17 వ శతాబ్దంలో శూద్రులకు విడాకుల సౌకర్యం ఉందన్నాడు. పరాశరుని భాష్యకారులు పరాశరుడు చూపిన ఔదర్యాన్ని కాలరాచారు. 'నష్టేమృతే'6 శ్లోకానికి విపరీతార్థాలు చెప్పారు. సన్యాసి అయితే, అతనిజాడ తెలియకపోతే నని అర్థం. ఏదైనా పరాశరుని వాక్యం కలి యుగానికి వర్తించదని త్రోసివేశారు సనాతనులు.7

బ్రాహ్మణ సంప్రదాయంలో విడాకుల కేసులు గ్రంథస్థం కాలేదు. బౌద్ధవాఙ్మయంలో పెక్కు కానవస్తాయి. 'కానా' అనే స్త్రీ తనఇంట లేనపుడు భర్త ద్వితీయ కళత్రాన్ని తెచ్చాడు. ఆమె ఆత్మగౌరవానికి ఆఘాతం కలిగింది. భర్తతో కాపురం చేయనన్నది. బుద్ధుని ఆదేశంపై ఒక రాజు ఆమెను పెంపుడు కుమార్తెగా స్వీకరించి ఒక సామంతునికి ఇచ్చి వివాహం చేశాడు. (ధమ్మపదం II - 82). భార్య అక్కరలేదన్న అల్లుళ్ళను బ్రతిమాలటానికి శూద్ర కుటుంబాలలోని తండ్రులు ఆసక్తి చూపేవారు కాదు. కన్హాదిపాయన జాతకంలో ఒక కథ ఉన్నది. ఒక స్త్రీ భర్తతో ఇలా అంటుంది. 'నీవు అంటే నాకు ప్రేమలేదు. మన కుటుంబంలో అలాంటి ఆచారం అంటే స్త్రీ పునర్వివాహం చేసుకునే ఆచారము లేదు కనుక నేను మళ్ళీ పెళ్ళి చేసుకోదలచలేదు." దీనిని బట్టి 'ఉన్నత' వర్ణాలవారు విడాకుల వెసులుబాటును వాడుకోవటానికి విముఖులుగా ఉండేవారని తెలుతున్నది. ఈ కథలో ఆత్మగౌరవం కల స్త్రీలు వ్యవహరించిన తీరు ప్రశంసాపాత్రం.

భర్తల చేత పరిత్యజింపబడిన భార్యల శోచనీయస్థితి చాల అసంతృప్తి కరమని, హిందూ సంస్కృతికి భిన్నమని ఆల్టేకరు పండితుడు అభిప్రాయం వెలిబుచ్చాడు.8 మనువును అంగీకరిస్తే, మనుధర్మశాస్త్రం హిందూ సంస్కృతికి అద్దం పడుతుందనుకుంటే ఆ అభిప్రాయం సరియైనదే. కొన్ని ఆదేశాలు ఇచ్చి, కొన్ని నిబంధనలు ఏర్పరచి, కొన్ని నియమాలు విధించి, వాటిని పాటించనందువల్ల అనర్థాలు సంభవిస్తే, అవి అన్ని హిందూ సంస్కృతికి భిన్నమని తప్పించుకొనడానికి వీలులేదు. చేసింది పురుషాధిక్య

పురుష పుంగవుల పెత్తనం. స్త్రీలకు బాధ కలుగకుండా ఎలా ఉంటుంది, నిప్పులో చెయ్యిపెట్టి కాలిందని బాధపడి ఏమిలాభం? పాశ్చాత్యుల పద్ధతి, ఆలోచనలు వద్దని ఆల్టేకరు హెచ్చరించాడు. కాని కాలగమనం ఆగలేదు. విడాకులను అంగీకరిస్తూ శాసనం 1955 లో వచ్చింది. ఈ పని చేసింది హిందూ సంస్కృతి అంటే ఏమిటో తెలిసీ తెలియని విదేశీయులు కారు. హిందూ సంస్కృతీ పద ఘట్టన క్రింద నలిగిపోయిన స్త్రీమూర్తుల ఆక్రందనలూ, హాహాకారాలూ, భీషణ గర్జనలూ, ఆ శాసన ఆవిర్భావానికి దారి తీసినయి. ఆ శాసనం సమగ్రమయిందా లేక దానిలో లోటుపాట్లున్నాయా, దానిని ఎలా సవరించాలి, అనే అంశాలను ముస్ముందు వచ్చే అధ్యాయంలో పరిశీలించడం సముచితం.

అధ్యాయం 6

# పాదదీపికలు

1. ఋగ్వేదంలో స్త్రీలు : ఉపాధ్యాయ : 4 వ అధ్యాయం
2. వేదకాలంలో స్త్రీలు : శకుంతలారావుశాస్త్రి పుట 93
3. డిటో పుట 96
4. హిందూ నాగరికతలో స్త్రీలు : ఆల్టేకర్ పుట 84
5. అర్థశాస్త్రం III - 4.29
6. పరాశర స్మృతి IV - 30
7. కానే : ధర్మసూత్రాల చరిత్ర : 2 వ సంపుటం,
   1 వ భాగం, పుట 611
8. ఆల్టేకర్-పుట 87

అధ్యాయం

# 7 జారత్వం, వేశ్యలు, దేవదాసీలు

ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా జారత్వం నింద్యమే. వివాహం నాడు సతీపతులు పరస్పర విశ్వాసంతో మెలగుతామని ప్రమాణాలు చేస్తారు కదా! కనుక వారు ఇరువురూ ఒకరు మరియొకరి యెడ సంపూర్ణ విశ్వాసంతో సంచరించవలసియుంటుంది. ధర్మార్థ కామములయందు నిన్ను వితనాడసని పురుషుడు ప్రమాణం చేస్తాడు. కలిమి లేములయందు, కష్టసుఖాలందు చేదోడు వాదోడుగా ఉంటూ స్నేహితురాలిగా, సహచరిగా, ప్రియురాలిగా, భార్యగా ఉంటానని ఆమె ప్రమాణం చేస్తుంది. ఇద్దరు కలసి చేసే ఏ పనికైనా పరస్పర విశ్వాసమూ నమ్మకమూ ముఖ్యము. అలాంటప్పుడు ఇరువురి కలయికకు పరాకాష్ట అయిన కుటుంబంలో విశ్వాసం సడలరాదు ఏ పరిస్థితుల్లోనైనా. ఈ దాంపత్య రహస్యాన్ని అన్ని దేశాలవారూ, సమాజాలవారూ, సంస్కృతులవారూ గ్రహించారు; గ్రహిస్తున్నారు. కాగా చిక్కల్లా ఎక్కడ వస్తున్నదంటే ఆయా దేశస్థులు, ఆయా సమాజాలవారు తమ మూల విశ్వాసాలకు, మౌలిక భావనలకు అణిగి మణిగి ఉండే స్థితిలో కుటుంబ జీవితాన్ని సాగిస్తారు. కనుక కుటుంబం ఆ మౌలిక భావ ప్రపంచపు పరిధిలోనే ఉనికి కలిగి సాగిపోవలసి ఉంటుంది. ఈ చారిత్రిక పూర్వరంగాన్ని గుర్తిస్తే దురవగాహనకు, లేక పొరపాటుగా అర్థం చేసుకోవడానికి అవకాశం ఉండదు.

జారత్వమన్నా, వ్యభిచారమన్నా ఒకే అర్థం. పెండ్లినాటి జీవిత భాగస్వామితో కాక ఇతరులతో ప్రేమ వ్యవహారం పెట్టుకోవడం, సాంగత్యం నెరపడం, లైంగిక సాన్నిహిత్యాన్ని పొందడం జారబత్వమనిపించుకుంటుంది. ఈ పని భార్య చేసినా, భర్త చేసినా తప్పే. ఈ విషయంలో ఏ విధమైన అనుమానానికి తావులేదు. సమాజంలో ఉత్పత్తి విధానంలో పురుష ప్రాముఖ్యత పెరిగిన కొలదీ సమాజంలో అధికారం పురుషాయత్తమైనది.

పురుషుడు వేటాడి పశువులను చంపి తెచ్చినన్నాళ్ళు, స్త్రీ అడవిలో కందమూల ఫలాదులను ఏరి తెచ్చినన్నాళ్ళూ అంటే ఇరువురూ ఆహార సముపార్జన చేసినన్నాళ్ళూ పెద్దగా వ్యత్యాసాలు—వారిహోదా విషయంగా—రూపొంద లేదు. తరువాత కూడా ఆమె పొలంలో విత్తనాలు వెదజల్లి పైరు పండించినంతకాలం ఆమె ప్రాముఖ్యత తగ్గలేదు. పశుపాలనా బాధ్యతను ఆమె నిర్వహించినంతకాలం ఆమె అంతస్తు క్షీణించలేదు. కాగా పొలంలో అతడు నాగలితో వ్యవసాయం ఆరంభించినప్పటినుండి పురుషునికి అహం భావం మెండయింది. తనే సర్వమై సంచరించాడు. ఆమెను బానిసగా చేశాడు. ఆమెను లొంగదీసుకున్నాడు. ఆమెకు తన భావాలు నూరి పోశాడు. పితృస్వామ్య వ్యవస్థ నెలకొల్పాడు. ఆస్తి తన పిల్లలకు సంక్రమించాలన్నాడు. భార్య కనే సంతానం తన సంతానం అని గట్టిగా నిర్ధారణ కావటానికి ఆమె పరపురుషులతో సాంగత్యం నెరపరాదన్నాడు. ఆమె శరీరాన్ని, మనస్సును, తన అదుపులోకి తెచ్చుకున్నాడు. తను, ఆమె ఇద్దరూ ఋజుమార్గాన జీవితాలు సాగించాలని చెప్పాడు మొదట్లో. తరువాత తనకు స్వేచ్ఛ ఉందన్నాడు. ఆమెకు ఆ స్వేచ్ఛను నిరాకరించాడు. ఆమెకు పతివ్రతా ధర్మాలు నేర్పాడు. ఎట్టి పరిస్థితులలోను ఆమెకు పునర్వివాహపు ఆలోచన పనికిరాదన్నాడు. ఆమె సంతానం తనది అన్నాడు. ఆమెను తన క్షేత్రమని నామకరణం చేసాడు. తను క్షేత్రికుడట. తన సమ్మతితో ఆమె ఎవరివల్ల సంతానాన్ని పొందినా ఆ సంతానం తనదేనట. ఇదీ ప్రమాదకరమని భావించి తదుపరి ఆమెకు ఎట్టి పరిస్థితులలోను పర పురుష సాంగత్యాన్ని నిషేధించాడు. చివరకు చచ్చి సాధించాడన్నట్లు చనిపోయిన తరువాత కూడా తననే స్మరించమని, తనకోసమే బ్రతకమని, పిండప్రదానాలు చేయించమని, శ్రాద్ధకర్మలు చేయించి, సద్గతులు కల్పించమని ఆదేశించి ఆమెకు వైధవ్యం కల్పించాడు. ఇదీ హిందూ పురుషుని జైత్ర యాత్ర వర్ణన.

పురుషుడు రెండురకాలుగా జారుడవచ్చును. వేశ్యా సంగమం ఒకటి. ఇతరస్త్రీల పొందు సాధించుకొనుట రెండవది. మొదటి దానిని గురించి తదుపరి గ్రహిద్దాము. ప్రస్తుతం రెండవస్థితిని చర్చనీయాంశం చేద్దాము. భర్త వ్యభిచరిస్తే తప్పులేదు. భార్య అలాంటి భర్తకు కూడా దోహదం చేయాలట. కుష్ఠురోగ పీడితుడైన తన భర్తను సుమతి తట్టలో

పెట్టుకొని వేశ్యవద్దకు తీసుకొని వెళ్తుంది. తోవలో అతని కాలు ఒక ముని శిరస్సుకు తగుల్తుంది. సూర్యోదయం కాగానే తల వ్రక్కలయి చస్తావని అతగాడు శపిస్తాడు. అంత సూర్యోదయం కాకుండా తన పతివ్రతా మహిమ వల్ల సుమతి అపుతుంది.[1] ఈ కథ మార్కండేయ పురాణంలోని కథ. పతివ్రతా మహాత్మ్యాన్ని వెలికి తీయటానికి ఈ కథను ఉటంకించటంలేదు. భర్తలు వ్యభిచారులుగా ఉండేవారని వారికి భార్యలు ఆ స్థితిలో కూడ సేవలు చేసేవారని నిర్ధారణ చేయటానికి మాత్రమే ఈ కథా ప్రసక్తి వచ్చింది. అసలు పురుషులకు జారత్వంతో సాధారణంగా పనిలేదు. శాశ్వత సంబంధాన్ని వారు ఆశిస్తే ఆ నచ్చిన స్త్రీని భార్యగా తెచ్చుకుంటారు. తాత్కాలిక సంబంధంతో తృప్తిపడ తలిస్తే వేశ్యలు అందరికి ప్రణయాన్ని పంచి ఇవ్వడానికి - పణం తీసుకొని సుమండీ:- సిద్ధంగా ఉన్నారు. ఏటు వచ్చీ చిక్కు లల్లా స్త్రీకే. ఒకటి విడాకులకు అవకాశం లేదు. వివాహ విచ్ఛేదానికి వీలులేదు. పునర్వివాహానికి అసలే వెసులుబాటు లేదు. అందువల్ల మనస్సును నిగ్రహించుకోలేని స్త్రీలు, దేహ వాంఛలను అదుపులో పెట్టుకోలేని స్త్రీలు జారత్వానికి దిగజారుతారు. భర్తకు ఎప్పుడో అప్పుడు తెలుస్తుంది. రహస్యవర్తనం బయటపడుతుంది. క్రూరుడైన భర్త ఆమెను చీల్చి చెండాడుతాడు. ఉదారుడైన పురుషుడు ఆమెను కొద్దిపాటి దండనతో వదిలివేస్తాడు. ఏదైనా అతడు అలా సంచరించాలో ఆనాటి సమాజం అతనికి మార్గదర్శకం చేస్తుంది. రహస్య ప్రియుల, జారుల ప్రసక్తి ఋగ్వే I - 66-4; I - 117-18; I - 133-3 లలో కనిపిస్తుంది.

ఈ సమస్య ఆనాటిదీ, ఈనాటిదీ కూడాను. ఇప్పటికీ వ్యభిచారం అయిన భార్యను చంపే మగధీరులు పత్రికలలో, సంఘ జీవితంలో దర్శన మిస్తారు. వ్యభిచారం దాంపత్యంలోని తోటి స్త్రీ లేక పురుషునిపట్ల నేరమే. కాదు కాదు ద్రోహమే. అది నిస్సంశయమైన అంశం. కాగా అది వైవాహిక రంగంలో తప్పిదమా లేక సాధారణ శిక్షాస్మృతి క్రింద వచ్చే నేరమా అనేది మీమాంస, మొదట్లో హిందూ సమాజం వ్యభిచరించిన భార్యల పట్ల ఉదారంగానే ప్రవర్తించింది. తదుపరి వైఖరి గట్టిపడింది. ఈ భావం యొక్క చారిత్రక గమనాన్ని పరికిద్దాం. జారత్వానికి అలవాటుపడిన స్త్రీ తన తప్పిదాన్ని అంగీకరిస్తే వ్రత కర్మలలో కూడ పాల్గొన వచ్చని, అలా వేదకాలంలో స్త్రీలను ఉదారంగా చూచారని శతపథ బ్రాహ్మణం చెప్తున్నది.[2]

వ్యభిచరించిన భార్యను ఇంటినుండి వెళ్ళగొట్ట నవసరం లేదు. ఆమె ప్రాయశ్చిత్తం చేసుకుంటే చాలు. ఆమెకు భోజనం పెట్టాలి. ఆమె నేల మీద శయనించాలి. మురికి వస్త్రాలు ధరించాలి. ఆమె బహిష్ఠు అయిన తరువాత శుచి అవుతుంది. అయితే ఆమెకు గర్భిణీ వచ్చినా, ఆమె గర్భ స్రావం చేసుకున్నా ఆమెను వదలివేయాలి.[3] (గౌతమ ధర్మ సూత్రం 22 - 35). గౌతముడు క్రీ. పూ. 600 - 300 కాలపు వాడు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యస్త్రీలు శూద్రునితో వ్యభిచరిస్తే—సంతానం కనకపోతే— ప్రాయశ్చిత్తం చాలును. ఆమెను ఇంట్లోనుంచి వెడలనడప పనిలేదు. కాగా ఈ దిగువ పేర్కొన్న నాలుగురకాల భార్యలను మాత్రమే వదలి వేయాలి. 1) భర్త శిష్యునితో వ్యభిచరించిన స్త్రీ. 2) భర్త గురువుతో పోయిన స్త్రీ. 3) భర్తను చంపబోయిన స్త్రీ. 4) చర్మకారునితో సంగమించిన స్త్రీ.[4] జారత్వానికి లోనయిన భార్య తల గొరించి, చెడిపోయిన తిండి పెట్టి, ఆమెను భర్త ఇంటిలోనే ఉంచాలని నారదుని మాట.[5] ఏ స్త్రీ అయినా తక్కువ కులపు వానితో వ్యభిచరిస్తే ఆమెను కుక్కలకు (ఆహారంగా) వేయాలి.[6] (మనువు VIII - 371, గౌ. ధ. సూ 23-14, మహాభారతం శాంతి పర్వం 165-64) స్త్రీ అలవాటుగా జారిణియైనచో మాత్రమే ఆమెను వదలి వేయాలని పరాశరుడు చెప్పాడు.[7] (పరాశర స్మృతి X - 35). జారత్వం వలన ఆమె గర్భం ధరిస్తేనే ఆమెను వదలివేయమన్నాడు యాజ్ఞవల్క్యుడు.[8] (యాజ్ఞవల్క్య స్మృతి I - 72). ఇటువంటి సందర్భాలలో స్త్రీ కన్న పురుషునిదే తప్పు అని మహా భారతం చెప్తుంది.[9] జారుడు మరీ తక్కువ జాతి పురుషుడైనపుడు మాత్రమే స్త్రీనిఇంటినుండి వెళ్ళగొట్టాలని పరాశర మాధ వీయంలో చాతుర్వింశతిమతం X - 28 చెప్తున్నది.[10] అలాకాని పక్షంలో ఆమెను ఇంటిలోనే వేరుగా ఉంచి మత కర్మలకు, హక్కులకు, సదుపాయాలకు దూరంగా ఉంచాలి.[11] (మితాక్షర యాజ్ఞవల్క్య స్మృతిపై భాష్యం I - 72). నెలసరి ముట్టు అయిన తరువాత మరల ఆమె వ్యభిచరించక పోతే తప్పుచేసిన భార్యను భర్త స్వీకరించాలి.[12] (వేదవ్యాస స్మృతి II - 49-50)

క్రీ. శ. 11 వ శతాబ్దం తరువాత స్త్రీల ఈ తప్పిదాలను కఠినంగా చూడసాగింది సమాజం పై సూత్రాలను కాదనలేక అవి అన్నీ మానసిక వ్యభిచారానికి మాత్రమే వర్తిస్తాయని యాజ్ఞవల్క్య స్మృతిపై భాష్యం

(అపరార్కు) చెప్పింది.[13] (అపరార్క - యాజ్ఞ. స్మృ I - 72). పరాశర స్మృతిపై వ్యాఖ్య వ్రాసిన మాధవాచార్యులు ఉదారవైఖరి అవలంబించమని వాదించాడు. (పరాశర స్మృతి V - 2).[14] కులం కాని వానితో వ్యభిచరించిన స్త్రీ సంతానాన్ని కంటే బహిష్టతో పవిత్రురాలవుతుంది. తరువాత భార్యగా ఆమెను స్వీకరించవచ్చును. పిల్లను ఎవరికైనా ఇచ్చివేయాలి.[15] (అత్రి), దేవలుడు చెప్పినమాటలివి. · అత్రి స్మృతికర్త. దేవలుడు ధర్మశాస్త్ర విదుడు. స్మృతికర్త) చెరచబడ్డ స్త్రీ బహిష్టు అయినతర్వాత ఆమె పరిశుద్ధ అవుతుందని అత్రి ప్రకటించాడు.[16] (అత్రి 197-198). మ్లేచ్ఛులచేత చెరచబడిన స్త్రీ గర్భం ధరిస్తే ఆమెను ఎలా పరిశుద్ధను చేయాలో చెప్పాడు.[17] వాస్తవానికి ఈ చివరి రెండు వాక్యాలు చెరచబడిన స్త్రీకి సంబంధించినవి; జారిణికి సంబంధించినవి కావు. ఆమె ఇష్టాఇష్టాలతో సంబంధం లేకుండా ఘోరం జరిగిపోతుంది ఈ సందర్భాలలో. అత్రి, దేవలుడు ఉదారవాదులని రుజువు చేయటానికి వీటిని ఇచ్చట ఉటంకించటం జరుగుతున్నది. (వీరివైఖరి 1947 లో దేశవిభజన సందర్భంగా మహాత్మాగాంధి అవలంబించిన వైఖరిని స్ఫురణకు తెస్తున్నది).

"బలవంతాన ఎత్తుకొని పోబడిన స్త్రీలు ఏ నేరమూ చేయలేదు. వారికి అప్రతిష్ఠలేదు. అటువంటి వారిని ఇంటిలోకి హృదయపూర్వకంగా ఆహ్వానించి వారిపై ప్రేమాభిమానాలు చిందించి వారికి వివాహం చేయాలి."[18] శత్రువులు ఎత్తుకొని వెళ్ళిన స్త్రీలను హిందూ సమాజం తనలో చేర్చుకోలేదు. వారిని వెలివేసింది.

జారత్వానికి సంబంధించిన సూత్రాలను కానే పండితుడు వరుసగా వ్రాశాడు :-

1) వ్యభిచరించినంతమాత్రాన భార్యను వదలిచేయటానికి లేదు.
2) వ్యభిచారం ఉపపాతకం (చిన్నపాపం)
3) ప్రాయశ్చిత్తం చేసుకున్న వ్యభిచార స్త్రీని భర్త భార్యగా స్వీకరించవలెను.

4) ఆమె పశ్చాత్తాపం వెలిబుచ్చి ప్రాయశ్చిత్తం చేసుకోనంతకాలం ఆమెకు చాలీ చాలని తిండిని భర్త పెట్టాలి.

5) శూద్రునితో వ్యభిచరించిన స్త్రీ, సంతానాన్ని కనినచో లేక గర్భ స్రావము చేసుకున్నచో, లేక భర్తను చంపపోయినచో అది మహా పాతకం. ఆమె ప్రాయశ్చిత్తం చేసుకున్నప్పటికి ఆమెకు చాలీ చాలని తిండి పెట్టి ఇంటివద్ద గుడిశలో ఉంచాలి. (మను. XI-177)

6) సంతానం కనకుండా, గర్భస్రావం చేసుకొనక, నెలసరి బహిష్టు అయి ప్రాయశ్చిత్తం చేసుకొనని భార్యలకు చాలీ చాలని తిండీ, మనవర్తి ఇవ్వాలి.

7) సంతానం కని లేక గర్భస్రావం చేసుకొనిన వ్యభిచార స్త్రీ ప్రాయశ్చిత్తాన్ని నిరాకరిస్తే, మనవర్తిగాని, నివాసయోగ్యతగాని ఆమెకు ఇవ్వనక్కరలేదు.[19]

యుద్ధంలో గెలిచిన స్త్రీలను సైనికులకు ఇవ్వవచ్చును. (మనువు. VII-70)[20] వారిని ఆ సైనికుడు భార్యలుగా స్వీకరిస్తాడో, ఉంపుడు గత్తెలుగా స్వీకరిస్తాడో తెలియదు. అతనిని అభిశంసించటం లేదు. క్రీ. పూ. 600 కాలంలో అపస్తంభుడు భార్యయెడల అపచారం చేసిన (వ్యభిచారం వల్ల) పురుషుని గాడిద చర్మం కప్పుకొని ఆరునెలలు భిక్షాటన చేయమన్నాడు.[21] కాని వీటిని పురుషులు ఖాతరు చేయలేదు. ఉంపుడు కత్తెలను తమ ఇళ్ళల్లో ఉంచుకున్నారు. ఆమెను 'అవరుద్ధా' అని పిలిచేవారు. ఆమె అవరుద్ధ స్త్రీ. యజమాని ఇతర కుటుంబీకులతో కలిసి కాపురం ఉండేది. ఈమెకు మనవర్తి ఇవ్వాలని నారదుడు, కాత్యాయనుడు చెప్పారు. ఇంట్లోగాక వేరుగా ఉంచుకున్న ఉంపుడుగత్తె పేరు 'భూజిస్యా'. వీరిని గురించిన ప్రసక్తి మహాభారతం కర్ణపర్వాం 94-26, యాజ్ఞవల్క్యస్మృతి II. 290 వీటిలో ఉన్నది. ఇదంతా పురుషుల జారత్వం క్రింద వస్తుంది. కాని పురుషుల జారత్వానికి పట్టింపు లేదు; శిక్షలేదు.

నాట్యకత్తెలు :-

వేదకాలంలో కూడ నాట్యకత్తెలు ఉండేవారు. నృత్యం వృత్తిగా స్వీకరించిన వారు రాజాస్థానంలో కూడ నృత్యం చేసేవారు. ఆచ్ఛాదన లేని

వక్ష స్థలంతో వారు నాట్యం చేసేవారు. (ఋగ్వే I - 92-4) పాటతో పదం కలపటాన్ని 'పేశిఖం' అనేవారు.

బౌద్ధం నుండి, జైనం నుండి ప్రజల దృష్టిని మరల్చటానికి హిందువులు నానాపాట్లు పడ్డారు. పురాణాలు వ్రాయించారు. దేవాలయాలు పెట్టించారు. దేవుళ్ళ ఉత్సవాలు రక్తి కట్టాలని దేవాలయాలలో నాట్యాలు చేయించారు. క్రొత్త దేవుళ్ళను సృష్టి చేశారు. దేవతల కొరకని విందులు, వినోదాలు ఏర్పాటు చేశారు. దేవుళ్ళకు భోగాలు అవసరమయ్యాయి. అందుకు ఆట, పాట కావాల్సిన అవరసం వచ్చింది. దాంతో దేవదాసీలు పుట్టారు. అర్ధశాస్త్రంలో వేశ్యలసంగతి ఉన్నది కాని దేవదాసీల ప్రసక్తి కానరాదు. తీర్థస్థలాలలో యాత్రికులను అలరింపచేసేవారు ఈ దేవదాసీలు. వీరు ఇతోధిక సంఖ్యలో ఉండేవారు. వీరు తమ వృత్తిని కొనసాగించటానికి వీరికి మడులు, మాన్యాలు ఇవ్వబడినాయి. మహమ్మదు గజనీ దండయాత్రనాటికి సోమనాధ దేవాలయాన్ని కనిపెట్టుకొని 500 మంది దేవదాసీలు ఉండేవారట. సూర్యదేవాలయాలు శృంగారానికి పట్టం కట్టాయి. వాటికి ఆడపిల్లలను దేవదాసీలుగాఇస్తే సూర్యలోక ప్రాప్తి జరుగుతుందని భవిష్యత్ పురాణంచెప్తున్నది. దేవాలయాలలో నృత్యానికి సనాతన బ్రాహ్మణులు అభ్యంతర పెట్టారు. మొదట్లో రాజులు సంకోచించారు. ధైర్యం తెచ్చుకొని దేవదాసీపద్ధతిని కొనసాగించారు. దేవదాసీ పద్ధతి వల్ల వేశ్యావత్తి పెరిగింది. చాలమంది దేవదాసీలు అధిక వరుమానం కోసం వేశ్యావృత్తిని స్వీకరించారు. కాని పాశ్చాత్య దేశాలలో లాగ దేవాలయాలలో వ్యభిచారం సాగించినట్లు దాఖలాలు లేవు. దేవదాసీ పద్ధతిని మాన్పించటానికి ఉద్యమంగా కదిలి శాసనం తెచ్చి విజయం పొందారు.

స్త్రీలు : వేశ్యలు

వేశ్యా వృత్తిని పురాతనమైన వృత్తిగా వర్ణిస్తారు అన్ని దేశాలలో. స్త్రీలను దుర్మార్గంగా వాడు కోవడం విషయంలో దీనిని మించినది లేదు. ఇదంతా సంఘటిత రూపం తాలుస్తున్నది. అన్ని వ్యాపారాల లాగా దీనికి హంగులూ, మందీ, మార్బలమూ ఏర్పడినయి. పురుష ప్రపంచం ఈ వ్యవస్థను సహిస్తున్నది. కొంతమంది పురుషులు దీనిని పోషిస్తుంటే మరికొందరు ఇతర కారణాల పేరుతో చూసీ చూడనట్లు ఊరుకుంటున్నారు. ఈ దేహ వ్యాపా

రంలో స్త్రీ కేవలం 'సెక్సు సింబల్' గా మిగిలిపోతున్నది. ఆమె నికాల్సాయిన భోగ్య వస్తువు. ఆకలి వేసిన నాడు ఫలహారం తినడానికి హోటలుకు వెళ్ళినట్లు పురుషుడు అలాంటి స్త్రీ వద్దకు వెళ్ళి తన కామాన్ని తీర్చుకుంటున్నాడు. పడుపువృత్తికి ఉనికి కల్పించింది మన సమాజం. సమాజం ఆరోగ్య వంతంగా సాగాలంటే ఈ వృత్తి 'అవసరమైన చెడు' అని వర్ణించి తృప్తిపడు తున్నది సమాజం. ఈ పరిస్థితిని మార్చటానికి ఎందరో మహానుభావులు, సంస్కర్తలు కృషి చేశారు. దీనిని నిరోధించటానికి అనేక శాసనాలు వచ్చాయి. అన్నింటినీ రద్దుచేసి 1956 లో- స్త్రీలు, బాలికలు వీరి పరంగా అవినీతికర వ్యాపారాన్ని చేయడం, ప్రోద్బలం చేయడం, పడుపుగృహాలు నడపడం నేరాలుగా చేసే కేంద్ర శాసనం వచ్చింది. దీనిని 'Sita' అని పిలుస్తా వుంటారు. అవినీతి వ్యాపార నిరోధశాసనం వల్ల స్త్రీలకు శిక్షలు పడుతున్నాయి. కాని పడుపు వృత్తిని అవలంబించే స్త్రీలను ఆదరిస్తున్న పురుషులు తప్పించు కొని తిరుగుతున్నారు. మాయనిమచ్చకు దూరమైపోతున్నారు. ఈ పడుపు వృత్తికి కారణాలను ఆరురకాలుగా వర్గీకరణ చేయడం జరిగింది అవి—

1) కుటుంబంలో తండ్రి, తల్లి, భర్త సంరక్షకుడు, లేక బంధువులు లేకపోవటం. (సహజకారణాలు)

2) పేదరికం, గాలికి వదలి వేయబడటం. (ఆర్థికం)

3) తల్లిదండ్రులచేత, భర్త చేత, బంధువుల చేత బాధింపబడి ఇల్లువెదలి, పొట్టగడవక ఈ వృత్తిని చేపట్టటం. (కుటుంబపరం)

4) స్త్రీని బలవంతతగా ఎత్తుకొని పోవడం, మాయమాటలు చెప్పి ఇంటినుండి వెలుపలికి తేవడం, దుష్ట సహవాసం, ప్రేమించినట్లు ఆమెను భ్రష్టుచేసి వదిలివేయటం లాంటివి. (సామాజికం)

5) అక్రమంగా గర్భం రావడం తద్వారా సాంఘిక వెలికి లోనవటం, అతి కామ భావనలాంటివి. (శారీరకం)

6) అజ్ఞానం, భోగ లాలస, నైతిక విలువలు లేకపోవడం వగైరా. (మానసికం).

ఈ వృత్తిని అనుసరించేవారు రెండురకాలు వంశపారంపర్యంగా దీనిని సాగించేవారు, లేక పైన చెప్పిన కారణాలవలన వృత్తిలోకి వచ్చినవారు22

వంశ పారంపర్యంగా ఈ వృత్తిని సాగించిన కులాలు పూర్వం తెలుగునాట, ఇతర భాషాప్రాంతాలలో ఉండేవి. సంస్కర్తల అమోఘ కృషివల్ల ఆ స్థితి చాలవరకు మారింది. పడుపు వృత్తిని సాగించే కులాలంటూ ఇంచుమించుగా ఈనాడు లేకుండా పోయినయి, 'ఎల్లమ్మ' అనే దేవతకు పూజారిణులుగా కొల్హాపూర్ ప్రాంతంలో ఏటా వందలమంది ఈ వృత్తిలోకి కులాచారంగా దిగుతున్నారని పత్రికలలో వార్తలు వచ్చాయి. పెట్టుబడిదారీ సమాజ ఆవిర్భావంతో ఈ వృత్తి నూతన తొడుగులు దిద్దుకుంటోంది.

మనం ఆలోచించవలసిన విషయం హిందూ సమాజంలో ఈ పడుపు వృత్తి (పైకం కోసం లేక ప్రతిఫలం కోసం పురుషుడి కామతృష్ణ తీర్చడమే; ఇది జీవనోపాధికి మార్గం అయింది) ఎప్పటి నుండి ఉన్నది, ఎలా పరిణామం చెందింది, హిందూ సంస్కృతి దీనిని పెంచి పోషించిందా, లేక నిరోధించ ప్రయత్నించిందా అనేది మాత్రమే ఆలోచనీయాంశాలు. ఆచారంగా పడుపు వృత్తి చేసే స్త్రీలు ఒక కులంగా ఉన్నట్లు తేలింది కదా. ఇది ఏనాటి నుండి? అంటే వేదకాలంలోనూ వేశ్యలుండేవారు. ఇద్దరికి భోగ్యమయిన భార్యను 'సాధారిణి' అనేవారు.

బహు భర్తృత్వం వేదకాలంలో లేదని భావిస్తే, తత్సంబంధమైన రుక్కులకు ప్రకృతి పరంగా చెప్పుకుంటే, ఈ పదం ఎందుకు పుట్టినట్లు? నాట్యగత్తెలు వక్ష స్థలంమీద ఆచ్ఛాదన లేకుండా ఎందుకు నృత్యం చేసినట్లు? మరి సామాజిక జీవితంలో ఆర్య స్త్రీ తన వక్ష స్థలాన్ని కప్పుకొని తిరుగుతున్నట్లు దాఖలాలు ఉన్నాయికదా! అంటే కామోద్దీపనకోసం పురుషుల కామ తృష్ణ తీర్చడం కోసం కొంతమంది స్త్రీలున్నట్లు తేలుతున్నది. (చూడండి ఋగ్వే I - 167-4)

సమాజంలో వేశ్యలను చిన్నచూపు చూచేవారు. కాని లలిత కళలను అభ్యసించినవారుగా, సంగీత సాహిత్య విశారదలుగా, నాట్యగత్తెలుగా వారికి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. క్రీ. పూ. 400 నుండి స్త్రీ యొక్క హోదా పూర్తిగా పడిపోవటంతో సంసారాలు చేసే స్త్రీలకు విద్యా వ్యాసంగం తగ్గింది. కళాపిపాసువులైన పురుషులు, సాహిత్యాభిలాషులు తమ భార్యల సాంగత్యాన్ని అభిలషించలేకపోయారు. భార్యల మానసికస్థాయి అత్యల్పంగా ఉండేది

కదా! అందుకని సమాజంలోని నాగరికులు గణికలను, నాట్యగత్తెలను అభిమానించడం సాగించారు. పోషించడం ప్రారంభించారు. ఉంపుడు గత్తె పద్ధతి అమలులోకి వచ్చింది. ఏ ఒక్కరి సొత్తో కాకుండా అందరికీ ప్రణయాన్ని, ఆనందాన్ని పంచి యిచ్చేవారు సంఖ్యలో పెరిగారు. వారిది వేశ్యవృత్తిగా రూఢి అయింది.

గౌతమ ధర్మసూత్రం XXII - 27) లో వేశ్యల ప్రసక్తి ఉన్నది. ధృతరాష్ట్రుని భార్య గాంధారి ప్రసవించినపుడు మంత్రసానిగా ఒక వేశ్య పనిచేసింది. (మహాభారత-ఆదిపర్వం 115-39) కౌరవుల వేశ్యలకు యుధిష్ఠిరుడు అభివాదం చేశాడట (మహాభారతం. ఉద్యోగపర్వం 30-38). వేశ్యలలో కూడ పురుషుడు 'ఏగువ' కులాల స్త్రీలతో పొందు పెట్టుకోరాదు. (నారదస్మృతి స్త్రీ. పుం. శ 78-79) మత్స్య పురాణం 70 వ అధ్యాయంలో వేశ్యధర్మాన్ని వివరించింది. కామసూత్రం (I - 3.20 లో గణిక చతుష్షష్టి కళలలో నిష్ణాతురాలని వాత్స్యాయనుడు అభివర్ణించాడు. వేశ్య చేతి భోజనం బ్రాహ్మణులకు పనికిరాదన్నాడు మనువు. (మనువు IV - 209). వేశ్యలలో మోసకత్తెలకు శిక్షలను మనువు పేర్కొన్నాడు (మనువు IX - 259)23.

అర్థశాస్త్రంలో వ్యభిచారాన్ని గురించి వ్రాశాడు కౌటిల్యుడు. ఆ కాలంలో గణికలకు ప్రాధాన్యం, నృత్యం చేసేవారికి ఆదరణ ఉండేవి. వ్యభిచారం శాసనసమ్మతం. వ్యభిచారిణుల ఆదాయంపై 15 శాతం పన్ను వేసేవారు రాజులు. కౌటిల్యునిది లౌకికదృష్టికదా! బౌద్ధులకాలంలో వ్యభిచారిణులను కూడా భిక్షుణీల సంఘాలలో చేర్చుకున్నారు. ఇది ప్రాచీన బౌద్ధ సారస్వతంలో గోచరిస్తుంది. వేశ్యావృత్తికి నిరసన లేదు. లచ్ఛవుల ఆహ్వానాన్ని కాదని 'అమ్రపాలి' అనే వేశ్య ఇంట ఆతిథ్యం స్వీకరించాడు బుద్ధుడు. వేశ్యావృత్తి ఉపయోగకరమైనదిగాను, అతిక్రమమైనదిగానుభావించారు.వారి ఉనికి పట్టణాలకు అలంకారంగా,గౌరవంగా భావించారు.బుద్ధుడుకూడా వేశ్యావృత్తినిఖండిస్తూ ఉపన్యసించలేదు. బుద్ధునిదృష్టిలో వ్యభిచారం దోషమే. చేపలను పట్టడం, పక్షులను చంపడం తప్పే. అయినా ఆ వృత్తులను ఖండించలేదు. అదే వైఖరిని వేశ్యవృత్తి పట్ల బుద్ధుడు చేపట్టాడు. ఆ కాలపు సమాజపధిరిని బుద్ధుడంతటి వాడు ఈ విషయంలో దాటలేకపోయాడు. ఒక పురుషుని వద్ద మూడువేల

రూపాయలు తీసుకున్నది ఒక వేశ్య పణంగా అతడు పైకం ఇచ్చి ఆమె సాంగత్యానికి రాలేదు. ఆమె అతనికోసం మూడు సంవత్సరాలు వేచియుంది. ఈలోగా ఆమె బీదరికాన్ని కూడ అనుభవించవలసి వచ్చింది. ఇది వేశ్యయొక్క నీతి; వేశ్య ధర్మపాలన. 'మిళిందపన్హా' లో 'బిందుమతి' అనే వేశ్య యొక్క ప్రభావ వర్ణితము. ఆమె గంగా ప్రవాహాన్ని వెనుకకు మళ్ళించిందట. కులాన్ని తృణీకరించటం వలన ఆమెకు ఆ శక్తి కలిగిందట. బౌద్ధుల ప్రాభవం క్రీ. పూ. 500 - క్రీ. త. 500 వరకు సాగిందనేది గుర్తుంచుకోవాలి.

జైనుల కాలంలో వేశ్యలకు ఆదరణ ఉండేది. రాజవేశ్యా సంగమం రాజద్రోహంతో సమానం. రాజవేశ్యతో లైంగిక సంబంధం ఘోరమైన నేరం. దానికి శిక్ష కాళ్ళు చేతులు నరకటం లేక బహిరంగంగా అవమానకరంగా ఊరేగించి శిరచ్ఛేదం చేయడం. అంటే ప్రజలు రాజుగారి వేశ్యల వైపు కన్నెత్తి చూడరాదని. ఇతర వేశ్యలు సామాన్యలు. అందరికీ అందుబాటులో ఉంటారు. పౌరాణిక హైందవంలో దేవదాసీలు ఉద్భవిల్లారు. వారు వేశ్యలుగా రూపొందారు. వాత్స్యాయనుడు (క్రీ. త. 1, 2 శతాబ్దాలు) తొమ్మిది రకాల వేశ్యలను అభివర్ణించాడు. గణిక సాహచర్యం కోసం తహతహ లాడే వారు నాగరికులు. వేశ్యలు వైభవాన్ని, సంపదను అనుభవించే వారు. సమాజంలో పేరు ప్రఖ్యాతులుండేవి. వసంతసేన 'మృచ్ఛకటకం' లోని వేశ్య. ఆమె రుజువర్తనానికి మెచ్చి సాధ్వులు ధరించే వసనాన్ని ఆమెకు బహూకరించాడు చారుదత్తుడనే శ్రోత్రియ బ్రాహ్మణుడు. అతని భార్య కూడా ఆమెను కౌగిలించుకొని ఆదరిస్తుంది.24

మూడవ శతాబ్దిలో ఉజ్జయనిలో మహాకాల దేవాలయంలో దేవదాసీలు ఉండేవారు. 'రాజతరంగణి' కాశ్మీరులో ఈ ఆచారం క్రీ. త. 7 వ శతాబ్దంలో ఉన్నట్లు తెలియజేస్తున్నది. క్రీ. త. 10 వ శతాబ్దంలోని తంజావూరు దేవాలయంలో 400 మంది దేవదాసీలకు మడిమాన్యాదులు ఇచ్చి కట్టడి చేశారు ఆనాటి రాజు రాజరాజు. చివరకు కాశీ విశ్వనాథుని (దేవుడు) ముందుకూడా దేవదాసీలు నృత్యం చేసినట్లు ఆధారాలున్నాయి.25 దేవదాసీ చట్టం వల్ల నిరోధం వచ్చేవరకు (1929) ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో దేవదాసీలు దేవుళ్ళ యెదుట నాట్యం చేసేవారు. ఆనాడు ఆంధ్రప్రాంతం ఉమ్మడి

మదరాసు రాష్ట్రంలోనే ఉండేది. దేవదాసీలు అవివాహితలు. దేవాలయం వారు ఇచ్చిన మడిమాన్యాల ఆదాయం చాలక వారు వేశ్య వృత్తిని జీవనోపాధి కోసం స్వీకరించారు. అలా దేవదాసీ వృత్తికి, వేశ్యావృత్తికి అవినాభావ సంబంధం ఏర్పడింది. దేవదాసీల సముద్ధరణకోసం చేసే ప్రయత్నంలో భాగంగా దేవునిముందు ఆడటం, పాడటం మాన్పించారు. కాని ఆస్తులు వారికే ఉన్నాయి. దాంతో దేవదాసీ వృత్తికి పునాది పోయింది. ఆ కులపు వారు తలిమ్మా అన్ని కులాల వారిలాగానే పెండ్లిండ్లు చేసుకొని సుఖ,శాంతులతో సంసారాలు చేస్తున్నారు. సమాన హోదాతో సమాజంలో జీవిస్తున్నారు ఈనాడు. ఇదంతా శాసన ప్రభావం. సంస్కరణ ఫలితం. అంతేకాని పురాతన హైందవం ప్రభావం కాదు.

మరో విషయం ప్రస్తావించక తప్పదు. ప్రబంధాలలో కొన్ని వర్ణనలు విధిగా ఉండాలట. సూర్యోదయ వర్ణన మొదలైనవే గాక పురవర్ణన కూడా వాటిలో చోటుచేసుకునేది. పురవర్ణనలో నాలుగువర్ణాల వారినే కాక వేశ్యలను కూడ వర్ణించేవారు. ఇది క్రీ. శ. 1900 వరకు సాగింది. వేశ్యలపై ఎంత గౌరవమో గమనించండి. వేశ్యలు నగరాలకు అందచందాలను సమకూర్చే వారని భావం వుండనే వుందికదా;

ఇలా హైందవం వేశ్యావృత్తికి ఉనికి కల్పించి, పెంచి, పోషించి దానిని శాస్త్రసమ్మతం చేసింది. కనుకనే మహాత్మాగాంధి ఇలా అనాల్సివచ్చింది. ఆబలలని పేర్కొని స్త్రీలలో కొందరికి వేశ్యా వృత్తిని అంటగట్టి, శాసనాలు తయారుచేసి ధర్మాలు ప్రవచించిన పురుషుడు తాను చేసిన పాపానికి శిక్ష అనుభవించక తప్పదు."26 ఇవి హిందూమతాభిమాని మహాత్మాగాంధి మాటలు.

భారతదేశంలో వేశ్యావృత్తి సాగినంతకాలం హైందవం ఈ విషయంలో తన వంతు దుర్మార్గానికి బాధ్యత వహించక తప్పదు.

## అధ్యాయం 7

# పాదదీపికలు

1. హిందూ నాగరికతలో భారత స్త్రీల స్థానం :
   డా॥ ఎ. ఎస్. ఆల్టేకర్. పుట 109
2. శతపథ బ్రాహ్మణం II - 5, 2, 20-ఆల్టేకరు. పుట 313
3. హిందూ ధర్మ శాస్త్రాల చరిత్ర : కానే 2 వ సంపుటం
   ఒకటవ భాగం, పుట 571
4. డిటో డిటో
5. నారదస్మృతి - డిటో - పుట 572
6. డిటో - పుట 572
7. ఆల్టేకర్. పుట 313
8. డిటో పుట 313
9. డిటో పుట 313
10. డిటో పుట 313
11. డిటో పుట 313
12. కానే - పుట 572
13. ఆల్టేకర్. పుట 313
14. డిటో పుట 314
15. కానే పుట 575
16. డిటో డిటో
17. డిటో డిటో

18. మహాత్మాగాంధి-హరిజన పత్రిక తే 3-11--46
స్త్రీలు అనే పుస్తకంలో
**(Women by M. K. Gandhi-page 100 Novjivan Publishing House, Ahmedabad)14 (1964)**

19. ధర్మశాస్త్రాల చరిత్ర - కానే. పుటలు 572, 573

20. ఆల్టేకరు : పుట 314

21 డిటో - పుట 312

22. 'సమానత్వంవైపు' స్టేటస్ కమిటీ రిపోర్టు.
**Repot on the status of women in India (1974)**

23. కానే ధర్మశాస్త్రాల చరిత్ర 2 వ సంపుటం
1 వ భాగం పుట - 637

24. యుగ యుగాలలో భారతస్త్రీలు : థామస్.

25 ఆల్టేకరు : పుట 183

26. స్త్రీలు : మహాత్మాగాంధి - పుట 106




అధ్యాయం

# 8 ఆస్తిహక్కు

ఇంతవరకు స్త్రీ జీవితంలో హిందూ భావన ప్రకారం ముఖ్యమైనదిగా ఎంచబడిన వివాహాన్ని గురించి, వైవాహిక జీవితాన్ని గురించి వివరించడం జరిగింది. ఇపుడు స్త్రీకి ఆస్తిలో గల హక్కులను గురించి విశదీకరించుకోవటం అవసరం. హిందూ సంప్రదాయం స్త్రీని ఎలా పరిగణించిందీ—అంటే వస్తుతుల్యంగానా, బానిసజీవిగానా, లేక ద్వితీయస్థాయి మనిషి గానా—మనకు ఆస్తి తాలూకు హక్కులవల్ల కూడా తెలుస్తుంది. ఈనాడు వారసత్వాన్ని నిర్ధారిస్తూ 1955 సం॥ పు హిందూ వారసత్వ చట్టం అమలులో ఉన్నది. ఈ శాసనానికి పూర్వం హిందూ సంప్రదాయ సూత్రాలను మారుస్తూ 1928లో హిందూ వారసత్వ అనర్హతల తొలగింపు శాసనము, 1929 లో వారసత్వ సవరణ శాసనము, 1930 లో విద్యాలాభం వల్ల ఆర్జన చట్టం, ఆస్తికి హిందూ స్త్రీల హక్కుల శాసనం (1937), వచ్చాయి. 1955 సంవత్సరపు శాసనం రాగానే 1929 వారసత్వ సవరణ శాసనం, 1937 హిందూ స్త్రీల హక్కుల శాసనమూ రద్దయినాయి. 1955 సం॥ పు శాసనం సమగ్రము కనుక అలా చేయవలసి వచ్చింది. 1955 సం॥ శాసనం తెచ్చిన ముఖ్యమైన మార్పులను గురించి తదుపరి వచ్చే అధ్యాయంలో వివరింపబడుతుంది. ఈ విషయమంతా ఇక్కడ ప్రస్తావించడంలో అర్థం ఏమంటే శాసనాలద్వారా మార్పులు జరుగకముందు ఆస్తి విషయంగా హిందూ సమాజం ఎలాంటి హక్కులను స్త్రీకి ప్రసాదించిందో ముమ్ముందుగా తెలుసుకోవలసిన అగత్య మున్నదని చెప్పడానికే ఆస్తియందు స్త్రీకి హక్కు అనేక విధములుగా కలుగ వచ్చును. ఆమె స్వాధీనంలో ఉండే ఆస్తి :-

1. స్త్రీ ధనంగా పరిగణింపబడేది.
2. స్త్రీ ధనపు ఆస్తి వృద్ధివల్ల వచ్చేది.
3. వారసత్వం వల్ల సంక్రమించేది.

4. భర్త, కుమారులు భాగ పంపిణీ చేసుకున్నపుడు ఆమెకు ఇవ్వబడేది.

5. ఆమె స్వశక్తి వల్ల సంపాదించుకున్నది.

6. భరణంగా వచ్చినది.

7. ఇతరుల్ల ఆస్తిని వారి హక్కులకు భంగంగా అవిచ్ఛిన్నంగా ఆమె అనుభవించినందువల్ల హక్కు కలిగినది. (Adverse Possession)

8. ఇతరమైనది.

ఈ సూత్రాన్ని మనస్సులో ఉంచుకొని స్త్రీకి సర్వహక్కులు కల ఆస్తిని గురించి విచారిద్దాం.

స్త్రీ ధనం :- వేదకాలంలో వివాహమపుడు పిల్లకు లోపమున్నపుడు ఆమెకు కొంత ఆస్తిని తండ్రి ఇచ్చేవాడు. మామూలుగా ఆభరణాలు, వస్త్రాలు, నిత్యావసర సామాగ్రి (మంచం, పెట్టె లాంటివి) ఇవ్వడం కద్దు. దీనిని కట్నమనేవారు. ఇది ఆడపిల్లలకు కట్నం. ఇది వధువుయొక్క ఆస్తి. దీనియందు ఆమెకు సంపూర్ణ హక్కులుండేవి. దీనిని 'స్త్రీ ధనం' అని పిలవడం జరిగేది. స్త్రీ ధనాన్ని ఆమె బ్రాహ్మణులకు దక్షిణగా ఇవ్వ వచ్చును. మామూలుగా ఆమెకు ఆస్తి ఉండేది కాదు. వారసత్వంలేదు.[1]

స్మృతులు వ్రాసిన ఋషులు పనభై మందిదాకా ఉన్నారు. కాగా స్త్రీ ధనాన్ని గురించి వ్రాసినవారిలో భాష్యకారులు ఎనిమిదిమందిని మాత్రమే పేర్కొన్నారు. 1) మనువు 2) నారదుడు 3) విష్ణువు 4) కాత్యాయనుడు 5) ఆపస్తంభుడు 6) వ్యాసుడు 7) దేవలుడు 8) యాజ్ఞవల్క్యుడు.

మనువు ప్రకారం స్త్రీ ధనం అంటే :-

1) పెండ్లికాలమందు ఇవ్వబడినది; అధ్యాగ్ని [అగ్నిముందు ఇవ్వబడినది]

2) వరుని ఇంటికి పోవునపుడు ఇవ్వబడినది [అధ్యావాహనిక]

3) ప్రేమ పురస్సరంగా ఇవ్వబడినది. అత్త మామలు ఇచ్చేది 'ప్రీతి దత్తం'. పెద్దల పాదాలకు నమస్కరిస్తే వారుఇచ్చేది పాదవందనిక.

4) తండ్రి ఇచ్చే కానుకలు

5) తల్లి ఇచ్చే కానుకలు

6) సోదరుడు ఇచ్చే కానుకలు

విష్ణుధర్మసూత్రం మరో నాల్గింటిని కలిపింది.

1) భర్త మరో స్త్రీని భార్యగా తెచ్చుకొన్నప్పుడు మొదటిభార్యకు భర్త చెల్లించునది [అధివేదనిక]

2) వివాహ మయిన తదుపరి భర్త బంధుగులచేత. తల్లిదండ్రుల బంధుగులచేత ఇవ్వబడిన కానుకలు [అన్వధేయక]

3) శుల్కము

4) కుమారులు తదితర బంధువులు ఇచ్చేవి.

కాత్యాయనుడి అభిప్రాయం ప్రకారం వైవాహిక దశలో స్త్రీ తన నైపుణ్యంచేత (వస్త్రములు నేయుట ఇత్యాది పనులు) సంపాదించినది, ఇతరులు ఆమెకు కానుకగా ఇచ్చినది, ఆమె భర్త ఆధీనములో ఉండును. అయితే వివాహంలోను, వరుని ఇంటికి ఊరేగింపుకు పోయేటప్పుడు, ఇతరులు ఇచ్చిన కానుకలు ఆమెవే. స్త్రీ యొక్క ఆభరణాలు ఆమె స్త్రీ ధనమని చెప్పటంతో ఎవరికీ అభిప్రాయభేదం లేదు. యాజ్ఞవల్క్యుడు ఇలా చెప్పాడు. తల్లి, తండ్రి, భర్త, సోదరుడు ఇచ్చినవి, పెళ్ళినాడు అగ్ని ముందు కూర్చున్న పుడు వచ్చిన కానుకలు, భర్త మరో పెండ్లి చేసుకున్నపుడు (ఆమెకు ఉప శమనంగా) ఇచ్చినది, ఇంకా తదితరాలు స్త్రీ ధనమనబడును. 'ధనం' అంటే ఆస్తి అని అర్థం. యాజ్ఞవల్క్య స్మృతికి మితాక్షర భాష్యం వచ్చింది. దానికి నాలుగు వ్యాఖ్యానాలు వచ్చినయి. ఆ నాలుగు కాశీ, మిధిల, బొంబాయి, మదరాసు శాఖలుగా పేరెన్నిక పొందాయి. విజ్ఞానేశ్వరుని మితాక్షర ప్రకారం స్త్రీ ధనం అంటే తల్లి, తండ్రి, సోదరుడు, భర్త వీరు ఇచ్చిన ఆస్తి, పెండ్లి నాడు హోమం ముందు మేనమామ మొదలైన వారు ఇచ్చిన కానుకలు, భర్త మరో స్త్రీని వివాహం చేసుకున్నపుడు మొదటిభార్యకు ఇచ్చునది, తదితరాలు.

తదితరాలు అంటే 1) వారసత్వం 2) కొనుగోలు 3) భాగపంపిణీ 4) ఇతరుల ఆస్తియందు ప్రత్యేక పరిస్థితుల్లో హక్కు రావడం (Adverse Possession) 5) దొరకుట, వీటివల్ల వచ్చిన ఆస్తి. అంటే స్త్రీకి చెందిన ఆస్తి అంతా స్త్రీ ధనమే. నాలుగు ప్రాంతాలకు చెందిన నాలుగు శాఖల వారి శాస్త్రము పలుతెరగుల వ్యాఖ్యానాలు చేశాయి. వాటికి బ్రిటిషు న్యాయ స్థానాలు అర్థాలు చెప్పి అన్వయాలు చేసాయి. వాటిని గురించి మనం లోతుకు దిగవలసిన పనిలేదు. కాగా కొన్ని పదాలను వాటి వెనుకనున్న భావాలను తరచి చూడవలసిన అవసరం చాలా వున్నది.

శుల్కం :- ఈ పదానికి అనేకమంది శాస్త్ర రచయితలు పలు రకాలుగా అర్థం చెప్పారు. వీటి నిర్వచనాన్ని బట్టి అది శిసలైన స్త్రీ ధనమా (Technical or Proper) కాదా అనేది తేలుతుంది. దానిని బట్టి దాని వారసత్వం నిర్ణయమవుతుంది. కనుక ఈ రకమైన చర్చ కేవలం పాండిత్య ప్రకర్షకు సంబంధించినది కాదు.

వారసత్వాన్ని దృష్టిలో పెట్టుకొని మితాక్షర స్త్రీ ధనాన్ని రెండు రకాలుగా నిర్ణయించింది. I) శుల్కం : పిల్లను ఇచ్చినందుకు వరుడు లేక వరుని వైపువారు ఇచ్చునది. II) తదితరం.

శుల్కం సోదరునికి లేక తల్లికి లేక తండ్రికి లేక తండ్రి వారసులకు పోతుంది.

తతిమ్మాది అవివాహిత కుమార్తెలకు లేక ఆస్తిలేని వివాహిత కుమార్తెలకు లేక ఆస్తి ఉన్న కుమార్తెలకు వగైరాలకు వారసత్వరూపేణా సంక్రమిస్తుంది.

బొంబాయి ప్రాంతంలో అమలులో ఉండే 'వ్యవహార మయూఖ' ప్రకారం గృహపరికరణాలు, పాడిపశువులు, అరకపశువులు, ఆభరణాలు వీటికి బదులుగా ఇచ్చినవి. పెండ్లి అయి పుట్టింటి నుంచి పుట్టింటి ఆస్తిలో వాటా లేకుండా ఆడపిల్ల అత్తింటికి వెళ్తున్నందుకు ప్రతిఫలమన్నమాట. దక్షిణాదిన ప్రాచుర్యం కలిగిన 'స్మృతి చంద్రిక' ప్రకారం కూడా అదే నిర్వచనం. మిథిల ప్రాంతంలో జనాదరణ పొందిన 'వివాద చింతామణి'

ప్రకటించిన విధమున అధార్మ్య వివాహాలలో (అసుర, గంధర్వ, రాక్షస, పైశాచికములు) పెండ్లి సమయంలో వధువు వరునినుండి తీసుకునే ఆస్తి శుల్కం అనబడును. బెంగాలులో ఆచరణయోగ్యంగా భావించబడిన దాయభాగశాఖాసిద్ధాంతం ప్రకారం "భర్త గృహానికి రావడానికి వధువును ప్రోత్సాహ కారణంగా ఇవ్వబడిన ఆస్తి" శుల్కమని పిలిచేవారు. పెండ్లి సమయంలో భర్తతో కలసి వధువు ఒకే పీటమీద కూర్చున్నపుడు (యుత కలసి కూర్చున్నపుడు) ఆమెకు ఇవ్వబడిన కానుకలు 'యౌతక' అని పేర్కొనబడెను. భర్త చేత ఇవ్వబడిన, లేక తన తదనంతరం చెందజేసిన ఆస్తి 'భర్తృదత్తం' అని పిలిచేది. ఆమె బంధువులచేత లేక ఆమె భర్త బంధువులచేత వివాహమయిన తదుపరి ఇవ్వబడిన ఆస్తి, చెందజేయబడిన ఆస్తి దీనికిందకే వస్తాయి.

దక్షిణాదిన ప్రచారంలో ఉన్న స్మృతి చంద్రిక శిసక్తైన స్త్రీ ధనాన్ని గుర్తించి వారసత్వ క్రమం నిర్ణయించే నిమిత్తం దానిని నాలుగు రకాలుగా విభజించింది. 1) శుల్కం 2) యౌతకం 3) భర్తృ దత్తం మరియు అన్వదేయకం 4) తదితరం.

శుల్కం యొక్క స్వభావాన్ని గురించి భేదాభిప్రాయాలున్నా దాని వారసత్వం గురించి నాలుగు శాఖలలో ఏకాభిప్రాయం ఉన్నది.

స్త్రీ ధనం ఇన్నిరకాలుగా ఉంది కదా వీటి అన్నింటి పైనా ఆమెకు సర్వాధికారాలు ఉన్నాయా? అనేది మరో ఆసక్తికరమైన విషయం. అలా లేదు. ఆమె జీవిత దశలను బట్టి, ఆ స్త్రీ ధనపు ఆస్తి స్వభావాన్ని బట్టి వేరు వేరుగా నిర్ణయాలు చేయబడినాయి. కన్యగా ఉన్నపుడు ఆమె స్త్రీ ధనపు ఆస్తిపై ఆమెకు సర్వాధికారాలు ఉండేవి. అలాగే ఆమె విధవ అయినచో అన్నిరకాల స్త్రీ ధనంపై ఆమెకు సంపూర్ణాధికారం ఉండేది. ఇక పోతే ఆమె వివాహితగా ఉన్నపుడు మాత్రం కొంత తేడా కన్పడుతున్నది. ఆ పరిస్థితిలో రెండు రకాలుగా స్త్రీ ధనాన్ని వర్గీకరణ చేశారు. 1) సౌదాయక స్త్రీ ధనం :- ప్రేమ పురస్సరంగా ఇచ్చిన కానుక. వివాహానికి పూర్వం కాని, వివాహ సమయంలో కాని, వివాహం తరువాతగాని ఆమె తల్లిదండ్రులు వారి బంధువులు, భర్త, ఆతని బంధువులు ఇచ్చిన కానుకలు; అంటే ఇతరులు

ఇచ్చిన కానుకలు గాక బంధువులు ఇచ్చిన కానుకలు. అలాగే బంధువులు తమ తదనంతరం చెందజేసిన ఆస్తులు కూడా సౌదాయక స్త్రీ ధనం క్రిందికి వస్తాయే. సౌదాయక స్త్రీ ధనాన్ని తన భర్త ఆదుపాజ్ఞలో నిమిత్తం లేకుండా స్త్రీ తన ఇష్టం వచ్చినట్లు వాడుకోవచ్చును; విక్రయించవచ్చును; అన్యాక్రాంతం చేయవచ్చును. కాగా కరువు, వ్యాధిగ్రస్తత, కారాగారవాసం లాంటి ఆపదలు సంభవించినపుడు భర్త ఆ ఆస్తిని తీసుకోవచ్చును. సౌదాయక స్త్రీ ధనం కాక తదితర స్త్రీ ధనంను - అంటే ఆమె వివాహితగా ఉన్నపుడు శ్రమచేసి సంపాదించినది, ఇతరులచేత ఇవ్వబడిన కానుకలు, వగైరా....ఆమె భర్త అనుమతి లేకుండా ఆమె అన్యాక్రాంతం చేయరాదు. కష్టాలు, ఆపదలు వీటితో నిమిత్తం లేకుండా భర్త ఈ రకపు ఆస్తిని తన ఇష్టం వచ్చినట్లు వాడవచ్చును.

హిందూ వివాహం స్త్రీ పురుషుల శారీరక, మానసిక తాదాత్మ్యానికి సాధనమని భావిస్తే స్త్రీ పురుషులిరువురు కలసి ఒకటే. అపుడు వారి మధ్య 'నీ ఆస్తి అది, నా ఆస్తి ఇది' అనే తేడా భావం ఉండటానికి అవకాశం లేదు. అలాగని అసౌదాయక (Non - Sowdavaka) స్త్రీ ధనంపై భర్త అదుపు, ఆజ్ఞలే గాక సర్వహక్కులను ఎలా ఆమోదించగలం ఎలా సమర్థించగలం. భర్త బ్రతికి ఉండగా ఏ విధమైన ఆస్తిపై హక్కులు లేకున్న [తన సంపాదన మీద, తన జీతంమీద, తనకు వారసత్వంగా వచ్చిన ఆస్తి మీద, తనకు బంధువులు, సన్నిహితులు కానుకగా ఇచ్చిన దానిమీద] పాశ్చాత్యవనిత స్థితి కన్న భారత మహిళస్థితి - ఆనాడు - మెరుగే కదాయని ప్రశ్నించవచ్చును. నిజమే పాశ్చాత్యవనితకు వేరే అస్తిత్వం ఉండేది కాదు. పెండ్లి స్త్రీల వేతనాలు భర్తలు వసూలు చేసుకునేవారట. (ప్రత్యేకంగా లేక విడిగా ఆస్తి కలిగియుండటానికి వారు 1907 లో ఆందోళన జరిపి వేతనాలమీద తమ హక్కులను సంపాదించుకున్నారు.) కనుక భారతీయ మహిళలకు ఈ ధనపు హక్కు - కొద్దిపాటి పరిమితులు విధించబడినా - ధర్మశాస్త్ర కారులు కొంతహక్కు ఇవ్వడమే విశేషం అని పేర్కొనవచ్చు. అర్థశాస్త్రం లోను, మనుస్మృతిలోను 'స్త్రీ ధనం' పరంగా వైఖరిలో వచ్చిన మార్పును గమనించటానికి రెంటిని తరచి చూడటం మంచిది.

అర్థశాస్త్ర కాలం [క్రీ. పూ. 4, 3 శతాబ్దాలు]

ఆస్తిహక్కు నిర్ణీత లక్ష్యంతో నిర్దేశింపబడినది. నిర్ణయింపబడిన ఆచారాలను పాటిస్తే ఆస్తిహక్కు ఉండేది. కనుక ఆస్తిహక్కు ఎలా వస్తుంది? దాని స్వభావం ఏమిటి? సమాజంలో స్త్రీల హోదాపై దాని ప్రభావం ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పుకోవాలి. స్త్రీకి ఆస్తి రెండుచోట్ల నుండి సంక్రమించేది. 1] తల్లిదండ్రులు, భర్త, మామ 2] స్నేహితులు' బంధువులు. అర్థశాస్త్రం ప్రకారం స్త్రీకి ఆస్తి ఏర్పడే విధానాలు అనేకం.

స్త్రీ యొక్క ఆస్తి :-

1] పూర్వీకులనుండి సంక్రమించిన ఆస్తి.

2] వాడుకోవడానికి భర్త ఇచ్చినందువల్ల కలిగిన ఆస్తిహక్కులు.

3] స్వంతంగా సంపాదించుకున్న ఆస్తి.

4] సర్వసాధారణంగా వివాహ సందర్భంగా ఇతరులు ఇచ్చిన కానుకలు బహుమతులు, దానాలు పోషణ వగైరాలకు ఇవ్వబడినవి.

కౌటిల్యుని లెక్కప్రకారం స్త్రీ ధనం అనేక రకాలుగా ఉండేది. శ్వశుర, పతిదత్తం - అంటే భర్త, భర్త తండ్రి ఇచ్చిన ఆస్తి. అధి వేదనిక అంటే మనవర్తి. జీవితం సాగించటానికి సదుపాయం. వృత్తి ఫలాని దాని కోసమని నిర్ణయించి యిచ్చిన అదనపు మొత్తం. భర్త మరో స్త్రీని ఆమెకు సవతిగా తెస్తే అధివేదనిక, వృత్తి ఈ రెంటిని ఆమెకు చెల్లిస్తూంటాడు. ఇవిగాక వివాహమపుడు వచ్చిన ఆభరణాలు, వస్తువులు, అవరణం, అన్వాదేయం బంధుదత్తం, అన్యత్ స్త్రీ క్రింధ నందకువస్తాయి. (A. S. III 15-92; 2-17, 14, 15, 13, 16; IV 12 : 173)[1]

ఇబ్బందులను అధిగమించటానికి ఉదాహరణకు భర్త ముందు చనిపోయి సంతానం లేకపోతే, భర్త ఇల్లు వదలిపోయిన సందర్భంలో తనను, కుమారులను కోడళ్ళను పోషించుకునే నిమిత్తం స్త్రీ ధనం ఏర్పరచడమైనది. (A. S. III 2-16, 14) కరువు కాటకాలలో, వ్యాధి కలిగిన సందర్భాలలో' ధర్మం చేసే నిమిత్తం భర్తకూడ ఈ ఆస్తిని వాడవచ్చును. కవలపిల్లలు

కలిగినవారు పరస్పర సమ్మతిపై స్త్రీ ధనాన్ని వాడుకోవచ్చును. బ్రాహ్మ ప్రాజాపత్య, ఆర్ష దైవపద్ధతులలో వివాహమయిన వారిలో భర్త ఈ ఆస్తిని మూడు సంవత్సరాలు వాడుకోవచ్చును. గాంధర్వ, అసుర వివాహములలో భర్త ఆ ఆస్తిని వాడుకుంటే వడ్డీతో సహా దానిని తిరిగి భార్యకు ఇవ్వవలెను. రాక్షస, పైశాచిక వివాహాలలో భర్త భార్య స్త్రీ ధనం వాడితే అది దొంగతనంతో సమానం. (A. S. III 2, 14 Shamsastry's Translation (1951) PP 179, 173). అప్పటికీ ఆమె ఆస్తిపై స్త్రీకి సర్వాధికారాలు లేవు. ఆమెకు ఇవ్వవలసింది కొన్ని పరిస్థితులలో ఇచ్చేది లేదు. అదంతా ఆమె నడతపై ఆధారపడుతుంది. స్త్రీ అవర్ణుని వివాహమాడితే ఆభరణాలు ఆమెకు చెందకుండా పోతయి. ఆమె భర్తను వదలిపోతే, ఆమె స్త్రీ ధనం ఆమెకు కాకుండా పోతుంది. శుల్కం, స్త్రీ ధనం వగైరా అతిచరంవల్ల (హద్దుమీరిన ప్రవర్తన వలన) పోతయి. భీదరికం తప్ప మరే కారణం వల్లనైనా ఆమె పునర్వివాహం చేసుకుంటే స్త్రీ ధనం పోతుంది. వివాహబంధం తెంచుకున్నా (మోక్షం), ఇంకొకనితో తనుగా కాపురానికి స్థిరపడినా (అంటే పెద్దల అనుమతి లేకుండా) ఆమెకు ధననష్టం. స్త్రీ ధనం కాకుండా పోతుంది. (A. S. III 4,26; 2, 15; 3. 21-23)[3]

కౌటిల్యుని అర్థశాస్త్రంలో అనేక పేర్లు వాడబడినాయి. వివరణ సరిగా లేదు. పేర్లు ఆచారాలను బట్టి వచ్చినట్లు కనపడుతున్నది. 'వేదన' పోషణ కొరకు ఇవ్వబడేది. శుల్కం నిర్వచనం చేయబడలేదు. ద్రవ్యం, శుల్కం వైవాహిక జీవితంలో ఆమె నడతను బట్టి ఉండేవట. అలంకారం, ద్రవ్యం ఆలస్యంగా పెండ్లి అయితే ఇవ్వబడేవి. శ్వశుర, పతిదత్తం, నివేశం కాపురం చేయడాన్ని బట్టి ఉంటుంది. కౌటిల్యుని అర్థశాస్త్రం లౌకిక ధర్మ పరమైనది. కనుక స్త్రీ ధనానికి ఎక్కువ విలువ ఇవ్వబడింది. పురుషుడు మరో భార్యను చేసుకుంటే పూర్వం స్త్రీ ధనం, శుల్కం ఇవ్వకపోయినా అపుడు—ద్వితీయ మపుడు - తప్పక మొదటి భార్యకు ఇవ్వాలి. శుల్కం, స్త్రీ ధనం, అధి వేదనకం ఆమెకు విధిగా చెందాలి. అధివేదనికం అతని ఆదాయాన్ని బట్టి, శాసనాన్నిబట్టి ఉంటుంది. (A. S. III 3, 14; 15. 92; 2. 15; 16, 17; 3. 19). అదివేదనికానికి హామీ ఇవ్వాలి. [మరొక హామీ అంటే ఒప్పందాన్ని ఎగవేసే ఆచారం ఉన్నట్లేనా?[4] ప్రభాతి ముఖర్జీ ప్రశ్న]. ఈ స్త్రీ ధనపు ఆస్తి లాంఛన ప్రాయపు ఆస్తి కాదు. దీని వాడికంపై కొన్ని నిబంధనలున్నాయి.

భర్త కొన్ని సందర్భాలలో వాడుకోవచ్చును. కొన్ని పరిస్థితులలో ఆమె దానిపై తనే సర్వాధికారాలు సరాసరి కలిగి ఉండవచ్చును. కొన్ని షరతులకు లోబడి అది ఇతరులకు సంక్రమిస్తుంది. వివాహిత స్త్రీ ఆస్తి మామూలుగా చరాస్తియే. దానిని కాపాడటానికి ఒక వ్యక్తి నియమితుడు. అతని పేరు 'అన్వాధి' సంరక్షకుడు అన్నమాట. (అర్థశాస్త్రం 3. 21; 4. 25). భర్త ఆమెను ద్వేషిస్తే అన్వాధి ఆమెను ఆదుకోవాలి. ఆమె ఆస్తికి తండ్రి ఇంటివారు వారసులు. తల్లి ఇంటివారు నియోగానికి అర్హులు [అర్థశాస్త్రం 5. 33, I - 17-85]. అందువలన ఈ కాలంలో భార్యను కిరసనాయిలు పోసి నిప్పంటించి చంపి, లేక గొంతుపిసికి చంపి, ఉరితీసుకున్నట్లు కథలు కల్పించి, ఆత్మహత్య చేసుకున్నట్లు ప్రభుత్వాధికారులల కనులు కప్పిగాని, లేక మోస పుచ్చిగాని, లేక లొంగదీసుకొనిగాని ఆమె ఆస్తిని కాజేయుటకు ఆనాడు వీలు లేదు. ఇంత దుర్మార్గానికి ఒడికట్టినా ఆమె ఆభరణాలు వగైరాలు భర్తకు దక్కవు. పుట్టింటివారు వారసులు కదా: కనుక స్త్రీ యొక్క ఆర్థిక ప్రతి పత్తి, వ్యక్తిత్వం (ఆర్థికంగా) ఉండేవి.

మనుస్మృతి :- ఆరు రకాల స్త్రీ ధనాన్ని మనుస్మృతి పేర్కొన్నది. యౌతకం, రుక్తం, స్త్రీ ధనం, ధన, వసువు, విత్తం వాటి పేర్లు. కన్య తన భర్తను తనే ఎన్నుకుంటే అంటే గాంధర్వ వివాహం చేసుకుంటే తండ్రి, సోదరుడు ఇవ్వవలసిన ఆభరణాలు ఆమెకు రావు. అసుర, రాక్షస, పైశాచిక వివాహాలలో ఆమె ఆస్తి తల్లిదండ్రులకు చెందుతుంది. తన స్వంత ఆస్తిని కూడా భర్త అనుమతిలేకుండా ఆమె వినియోగించరాదని మనువు హితవు చెప్పాడు. (మనుస్మృతి IX - 92, 197, 199)

స్త్రీ ధనపు ఆస్తిపై స్త్రీ యొక్క అధికారాన్ని కౌటిల్యుడు ఇంచు మించుగా స్వతంత్రం చేశాడు. మనువు ఆమె స్వాతంత్ర్యాన్ని తగ్గించాడు. "స్త్రీలు బానిసలు, కుమారులు ఆస్తి కలిగి ఉండరాదు. వారల ఆస్తి వారిని పొందినవారికి చెందుతుంది." (మనుస్మృతి VIII - 4. 16) అర్థశాస్త్రం కాలంనాటి స్త్రీ స్థితి మనువు కాలంనాటికి (క్రీ. పూ. 200 - క్రీ. శ. 200) క్షీణించింది. ఆమెకు ఆస్తి వచ్చే వనరులు, వచ్చే ఆస్తి తగ్గాయి. పుత్రికా పుత్రుడు వచ్చి ఆమె తండ్రి ఆస్తిలో హక్కులేకుండా చేశాడు (ముస్ముందు దీనిపై చర్చ వస్తుంది). స్త్రీ ధనం విధిగా ఇవ్వాలని లేదు; ఇవ్వవచ్చును.

ఆమెకు ఆస్తి ఇచ్చేవారిలో భర్త ఒకడు మాత్రమే. శుల్కం, అధివేదనిక, వృత్తి (అలంకారం వగైరాలకు ఇచ్చే సొమ్ము) ను గురించి మనువు చెప్పలేదు. స్త్రీ ధనాన్ని పవిత్రించేసి దాని విలువ తగ్గించాడు. భర్తకు అధికారం ఇచ్చి దాని విలువ తగ్గించాడు. ఆర్థికంగా ఆమెకు భద్రత తగ్గింది. ఉన్న కొద్ది పాటి ఆస్తి ఆమె స్వేచ్ఛగా వినియోగించ వీలులేదు. భర్త నిజానికి యజమాని అయినాడు. స్త్రీకి ఒక మంచిస్థానం కల్పించాలనే శ్రద్ధ మనువుకు లేదు.

కానే పండితుని వ్యాఖ్యను మరోసారి గుర్తుచేసుకోవడం ఈ పరిస్థితిలో చాలా అవశ్యకం. ధర్మశాస్త్రకాలంలో స్త్రీ పరిస్థితి మరీ అధ్వాన్నమయింది. ఒక్క ఆస్తి విషయంలో మాత్రం ఇందుకు భిన్నంగా జరిగింది.6 వేదకాలంలో స్త్రీలకు ఆస్తిలో వాటా ఇవ్వలేదు. (కానే : పుట 576) అనాడు ఆస్తిమాట అటుంచితే స్త్రీ స్థానం సామాజికంగా మెరుగుగా ఉంది. (పుట 574). మధ్య యుగంలో శాస్త్రకారులు స్త్రీకి ఆస్తిలో హక్కును గుర్తించారు.7 ఇది విచిత్రమైన పరిణామం. ఆమె వ్యక్తిత్వాన్ని చిదిమివేశారు. మతపరంగా హక్కులు తగ్గించారు. సామాజికంగా అణచివేశారు. కాని ఆస్తి ఇచ్చారు. దీనిని గురించి సామాజిక శాస్త్రజ్ఞులు గాఢంగా, సునిశితంగా, తప్పనిసరిగా పరిశీలన చేయవలసి ఉంటుంది.

స్త్రీ ధనం విషయమైన పరిశీలనను ప్రాచీన సమాజాలను ఎంతో జాగ్రత్తగా పరిశీలించిన మెయిన్ మాటలను ఉటంకిద్దాం. "కన్యాశుల్కం అనే వ్యవస్థలో స్త్రీ యొక్క ప్రత్యేక ఆస్తియొక్క రూపురేఖలు దరహంమీద ఆర్యుల సమాజాలలో గోచరమవుతుంది. వరుడు పెండ్లిరోజున గాని మరునాడు గాని ఈ శుల్కాన్ని వధువు తండ్రికి చెల్లించేవాడు. తండ్రిగా కాని కుటుంబ యజమానిగా కాని వధువు తండ్రి యొక్క అధిపత్యాన్ని వరునకు అతడు బదిలీ చేసినందుకు ప్రతిఫలంగా ఈ శుల్కంలో సగం వధువు తండ్రికి చేరేది. మిగతా సగం వధువుకు ముట్టేది. దానిని ఆమె భర్త ఆస్తితో మిశ్రితం చేయకుండా ప్రత్యేకంగా ఉంచుకొనేది, అనుభవించేది."8 "రోమనులకన్న ముమ్మందుగా స్త్రీకి ప్రత్యేక ఆస్తి ఇచ్చిన ఘనత హిందువులకు దక్కింది"9 ఇదొక్కటే హిందూ సమాజానికి కలికితురాయి.

వారసత్వం :-

స్త్రీకి వారసత్వం బహువిధాలుగా రావచ్చును. అందులో ముఖ్యమైనవి మాత్రం పరిశీలనార్హమవుతాయి.

ఈ దిగువ పేర్కొనబడిన వ్యక్తులు చనిపోతే ఆమెకు వారసత్వంగా ఆస్తి రావచ్చును. వారు ఆమె తల్లి, తండ్రి, భర్త, కుమారుడు, సోదరుడు, కుమార్తె. ముందుగా తల్లి, కూతుళ్ళను తీసుకుందాము.

1] తల్లి ఆస్తి :-

అర్థశాస్త్రం ప్రకారం తల్లియొక్క స్త్రీ ధనం పిల్లలకు చెందుతుంది. కనుక కుమార్తెకు వస్తుంది. శుల్కం, అన్వాధేయం, అన్వాత్, బంధుదత్తం మాత్రం తల్లి పుట్టింటివారికి చెందుతుంది. మనువు మరో విధంగా చెప్పాడు. రుక్తం కుమారుడు, కుమార్తెలు అందరికీ వస్తుంది. యౌతకం అవివాహిత కుమార్తెలకు వస్తుంది. మితాక్షర లెక్కన శుల్కం తల్లి పుట్టింటివారికి వస్తుంది. ఇతర స్త్రీ ధనం అవివాహిత కుమార్తెకు ఆమె లేకపోతే ఆస్తిలేని వివాహిత కుమార్తెకు ఆమెకూడా లేకపోతే ఆస్తివున్న వివాహిత కుమార్తె. దక్షిణాదిన శుల్కం తండ్రి పుట్టింటివారికి పోతుంది. యౌతకం అవివాహిత కుమార్తెలకు చేరుతుంది. భర్తృదత్త, అన్వాధేయక రెండూను విధవా కుమార్తెలు కాక కుమార్తెలకు, కుమారులకు సమంగా చెందాలి. తతిమ్మా రకాల స్త్రీ ధనం అవివాహిత కుమార్తెలు, ఆస్తిలేని వివాహిత కుమార్తెలు సమానంగా పంచుకుంటారు. (కోర్టు తీర్పులవల్ల వచ్చిన మార్పును సూచించటం లేదు. 2. ఈనాటి 1955 శాసనం ప్రకారం ఈ రకపు వారసత్వం లేదు. వీటిని గమనంలో ఉంచుకోవాలి).

కూతురునుండి :-

కూతురు చనిపోతే శుల్కం, అన్వాధేయం, అన్వాత్, బంధుదత్తం ఒక పరిస్థితిలో తల్లికి సంక్రమిస్తుంది. ఇది కౌటిల్యుని అర్థశాస్త్రపు స్థితి. ధనం అంటే అసుర, రాక్షస, పైశాచిక వివాహాలలో తల్లిదండ్రులిచ్చినది తల్లి దండ్రులకు చెందుతుందని మనుస్మృతి ప్రకటించింది. మితాక్షర ప్రకారం శుల్కం ఏకోదరునికి అతడు లేకపోతే తల్లికి చెందుతుంది. దక్షిణాదిన కూడా శుల్కం వరుసగా ఏకోదరుడు, తల్లి, తండ్రి (ఎవరు బ్రతికి ఉంటే వారికి) చెందుతుంది.

భర్తనుండి :- సర్వసాధారణంగా నిస్సంతుగా చనిపోయిన పురుషుని ఆస్తికి స్త్రీలు వారసులు కారు. కాని ఈ సూత్రానికి కొంత మినహాయింపు యివ్వ

ఒడింది. విధవ, కుమార్తె, తల్లి, తండ్రి తల్లి, తండ్రి తండ్రి తల్లి మొదలైనవారు అలాంటివారు నిస్సంతుగా చనిపోయిన పురుషునికి అతని విధవ వారసురాలు కావటానికి 2 వేల సంవత్సరాలనాడు ఆమోదం రావటం విశేషం. తన భర్తకు విశ్వాసపాత్రురాలుగా ఉండి (పరపురుషునితో ఏ విధంగా లైంగిక సంబంధం పెట్టుకోకుండా) మత క్రతువులు చేస్తున్న విధవ చనిపోయిన భర్తకు దినవారాలు చేసి అతని వాటాను పొందగలదని బృహస్పతి చెప్తున్నది (బృహస్పతి స్మృతి XXV - 46, 47, 55). వృద్ధమనువు, యాజ్ఞవల్క్యుడు, విష్ణువు, బృహస్పతి, కాత్యాయనుడు, శంఖలిఖితులుకి దేవలుడు విధవ వారసత్వ హక్కును ఇచ్చారు. ఆపస్తంభుడు, వశిష్టుడు, నారదుడు నిరాకరించారు. సాధారణంగా నారదుడు ఉదారవాది. అలాంటి నారదుడు వ్యతిరేకించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. బృహస్పతి పూర్తిగా విధవ హక్కులను బలపరిచాడు. సంతానం లేనపుడే ఆమెయే ప్రథమ వారసురాలన్నాడు. స్మృతులకు, ధర్మసూత్రాలకు, ధర్మశాస్త్రాలకు భాష్యాలు వ్రాసినవారు, కోశగ్రంధాలు రచించినవారు ఆమె హక్కును సర్వేసర్వత్రా గుర్తించారు." తన సమిష్టి హిందూ కుటుంబీకులనుండి విడివిడిన పురుషుని ఆస్తి (మరల సమిష్టి కుటుంబంలో) కలవకపోతే, అతనికి సంతానం లేకపోతే, అతని ధర్మపత్నికి - ఆమె పతివ్రతగా ఉంటే అంటే భర్త పట్ల ద్రోహం చేయకపోతే - పూర్తిగా చెందుతుంది' అని విజ్ఞానేశ్వరుడు మీతాక్షరలో చెప్పాడు. యాజ్ఞవల్క్యస్మృతికి భాష్యం రాసిన అపరార్కుడు 'భార్య' అనే పదానికి 'గర్భిణీ అయిన భార్య' అని అర్థం చెప్పాడు. ఈ అభిప్రాయాన్ని, అతడు వశిష్టుని సూక్తులనుండి బలాన్ని పొందాడు. ఒక పురుషుడు సమిష్టి కుటుంబంలో ఉండికూడా కొంత స్వార్జితపు ఆస్తి కలిగియుండి చనిపోతే అతని స్వార్జితపు ఆస్తి అతనికి సంతానం లేనిపక్షంలో భార్యకు సంక్రమిస్తుంది. అతని సమిష్టి హిందూ కుటుంబ సభ్యులకు (కోపార్సనర్లకు) పోతుంది.[10] చనిపోయిన పురుషుడు హిందూ అవిభక్త కుటుంబీకుడిగా, ఉన్నా విభక్తుడైనా దాయభాగన్యాయశాస్త్రప్రకారం అతనివాటా విధవకు చెందుతుంది. స్వార్జితపు ఆస్తి సరేసరి. ఎలాగూ ఆమెకే వస్తుంది. పైన సంతానం అని చెప్పబడినపుడు కుమారుడు, కుమారుని కుమారుడు, కుమారుని కుమారుని కుమారుడు అని అర్థం చెప్పుకోవలెను. అంతేగాక విధవకు వచ్చే ఆస్తి పరిమిత హక్కులతో (Limited Rights) వస్తుంది. దానిని పరిమిత హక్కులు కల ఆస్తి' (Limited Estate) అంటారు. అది సంపూర్ణ

హక్కులు కల ఆస్తికి, జీవితకాలం అనుభవించే హక్కు గల ఆస్తికి మధ్యలో ఉంటుంది. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో విధవ ఆ ఆస్తిని అన్యాక్రాంతం చేయవచ్చును. కాగా విధవ విషయంలో ఒక నిబంధన ఉన్నది. భర్త చనిపోయే నాటికి ఆమె పతివ్రతగా ఉండవలెను. ఇదంతా ఒక సూత్రింపై ఆధారపడుతున్నది. ఆమె భర్త యొక్క అర్థాంగి కనుక ఆమె అతనికి వారసురాలు. కాగా ఆమె జీవితాంతాన ఆ ఆస్తి ఆమె భర్త సోదరులకు పోతుంది. ఇతంతా 1937 హిందూ స్త్రీల ఆస్తిహక్కు శాసనానికి పూర్వపు మాట. విధవరాలు 4 వ వారసు.

కుమారునినుంచి :-

స్త్రీ కుమారుని తల్లిగా కొన్ని పరిస్థితులలో అతని ఆస్తికి వారసు రాలవుతుంది. గౌతముడు, బౌద్ధాయనుడు, ఆపస్తంభుడు, వశిష్టుడు, కౌటిల్యుడు, ఆమెను వారసురాలిగా అంగీకరించలేదు. కాని అమె యొక్క, తండ్రి తల్లి యొక్క హక్కులను బాగా సమర్థించాడు. "నిస్సంతుగా చనిపోయిన వ్యక్తికి తల్లి ఆమె బ్రతికి ఉండకపోతే తండ్రి తల్లి వారసులు." స్మృతి చంద్రిక, వీర మిత్రోదయం, వివాద చింతామణి, మితాక్షర అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చాయి. వారసుల జాబితాలో చనిపోయిన వ్యక్తి తండ్రితరువాత స్థానాన్ని విష్ణువు తల్లికి ఇచ్చాడు. యాజ్ఞవల్క్యుడు తల్లి దండ్రులకు అతని కుమార్తె తరువాత స్థానాలను కేటాయించాడు. స్మృతి కర్తలైన బృహస్పతి, కాత్యాయనులు ఆమె హక్కును గుర్తించారు. పురుషుడు చనిపోయిన తరువాత అతని సంతానం ఆస్తిని భాగ పంపిణీ చేసుకునే సమయంలో ఆమెకు వాటా వస్తుందని నారదుడు చెప్పినాడే కాని ఆమెను వారసుల వరుసలో చేర్చలేదు.11 మితాక్షర ప్రకారం వారసుల క్రమంలో ఆమె స్థానం చనిపోయిన వ్యక్తి యొక్క పుత్రికా పుత్రుని తరువాత వస్తుంది. విధవవలె ఆమెకు వచ్చే ఆస్తి పరిమిత హక్కులతో ఉంటుంది. దత్తు తల్లి కూడా తల్లికిందయే లెక్క. కాగా తల్లి వ్యభిచార జీవితం కాని, పునర్వివాహం కాని ఆమె వారసత్వానికి అడ్డురాదు. తల్లీ కొడుకులది సరాసరి రక్త సంబంధం కదా! వ్యవహారమయూఖ ప్రకారము తల్లిస్థానం తండ్రి తరువాత వస్తుంది. వారసుల క్రమంలో దక్షిణాదిన తల్లిస్థానం 7 వది.

తండ్రినుండి :-

స్త్రీ కుమార్తె హోదాలో ఆస్తికి వారసురాలవుతుంది. కౌటిల్యుని అర్థ శాస్త్రప్రకారం కుమారులు ఉంటే పిత్రార్జితపు ఆస్తిలో కుమార్తెలకు హక్కు లేదు. కాగా కన్యలకు వివాహం నిమిత్తం కట్నం ఇవ్వాలి. కుమారులు లేకపోతే ఆతని అవివాహిత కుమార్తెలు (కన్యలు), చనిపోయినవాని సోదరులు అతని వస్తువులను (ద్రవ్యం) తీసుకుంటారు. తల్లి దండ్రులు ధర్మానుసరణంగా వివాహమాడితే కుమార్తెలు (దుహితలు) ఆస్తిని వంశపారంపర్యంగా అనుభవిస్తారు. రాజులకు కొన్ని ప్రత్యేక ధర్మసూత్రాలను ఏర్పాటు చేసాడు కౌటిల్యుడు. ఔరసపుత్రులకు ప్రత్యామ్నాయంగా పుత్రికా పుత్రుని పేర్కొన్నాడు. ఎంపిక చేయబడిన కుమార్తె కుమారుడు పుత్రికా పుత్రుడనబడును. రాజుకుకుమారుడు ఉండి, రాజ్యార్హత లేకపోతే, ఇక రాజుకు సంతానం కలిగే అవకాశం లేకపోతే పుత్రికా పుత్రుడికి అవకాశం వస్తుంది. (అర్థశాస్త్రం - III - 5-32; 7-40; V 6. 222; I 17-89). మనువు కౌటిల్యుని పద్ధతిని మొత్తంమీద ఆమోదించాడు. పిత్రార్జితం కుమారులకు వస్తుంది. అవివాహిత కుమార్తెలు పెండ్లి ఖర్చును పొందుతారు. కుమార్తె పెండ్లి ఖర్చు కుమారుని పెండ్లి ఖర్చులో నాలుగవవంతు (మనుస్మృతి XI - 109, 185, 192. 118). కుమారులు లేకపోతే కుమార్తెల కుమారులు, పుత్రికా పుత్రికులు ఆస్తిని పొందుతారు. తల్లి ఆస్తిని పొందటంలో కుమారులు కుమార్తెలు సమానంగా ఎంచబడినారు. కాని అదే సందర్భంలో పుత్రికా పుత్రుని పేర్కొనటం వల్ల ఆ భావానికి విలువపోయింది (మ. స్మృ IX 130, 132, 127, 133, 136, 137). దీనిని కొంత వివరించవచ్చును. తండ్రి కుమార్తెను ఎంపిక చేస్తాడు. ఆమె పుత్రిక. తతిమ్మా కుమార్తెలు దుహితలు. పుత్రిక కుమారుడు పుత్రికా పుత్రుడు. ఆతనిని వాడుక భాషలో దహోత్రుడు అని పిలుస్తున్నారు కాని అది సరియైన పదం కాదు. అతడు తల్లి తండ్రికి శ్రాద్ధాదులు పెట్టాలి. ఆతడు అలా తాత ఆస్తికి వారసుడవుతున్నాడు మ. స్మృ. IX - 127, 132, 136, 140. పుత్రికా పుత్రుని నియమించుకున్న తరువాత కుమారుడు కలిగినా, ఔరసపుత్రుడూ, పుత్రికా పుత్రుడు కుమారులవలె సమానంగా ఆస్తిని పంచుకుంటారు. కాగా కుమారులలోని పెద్దవానికి వచ్చే జ్యేష్టభాగం పుత్రికా పుత్రునికి రాదు. పుత్రిక కుమారుని కనకుండా చనిపోయినా అల్లుడు మామగారి ఆస్తి పొందవచ్చును. ఇదంతా

ఎందుకు వివరించ వలసి వచ్చిందంటే పుత్రికా పుత్రుని పద్ధతి వచ్చిన తరువాత పుత్రిక స్థానం తగ్గింది. పుత్రికా పుత్రుడు ఔ ర స పుత్రు ని తో సమానుడు కనుకను, కుమారులు ఉన్నచో కుమార్తెకు వారసత్వం లేదు కనుకను, ఆమె స్థానం చాల వెనుకకు పోయింది.12 పురాతన కాలంనుండి కుమార్తెను వారసురాలిగా గుర్తించారు. బహుశః మొదట్లో పేర్కొనబడిన కుమార్తె (పుత్రిక) గా, తరువాత కేవలం కుమార్తెగా (దుహిత) ఆమెను వారసుగా ఆమోదించి ఉంటారు ధర్మశాస్త్ర విదులు. మనువు మాటల్లో "కుమారుడు తండ్రి ఒకరే (తండ్రి కుమారునిలో జన్మిస్తాడు). కుమార్తె కుమారునితో సమానం; కుమార్తె జీవించి ఉన్నంతకాలం తండ్రి జీవించి యున్నట్లే. కనుక ఇతరులు అతని ఆస్తిని (ఆమెకు కాకుండా) ఎలా తీసుకోగలుగుతారు?" (మను. స్మృ IX 130). మనువుకు భాష్యం చెప్పిన వారు కొందరు 'కుమార్తె' అంటే 'పుత్రిక' అని అర్థం చెప్పారు. మనువు వాడిన పదం 'దుహిత' అని మాత్రమే; అంతేకాని 'పుత్రిక' అనే పదాన్ని ఆయన వాడలేదు. పుత్రికను గురించి మనువు IX - 127-128 లో చెప్పాడు. బృహస్పతి మామూలుగా మనువును అనుసరిస్తాడు. ఆయన మనువు కుమార్తెను గురించి చెప్పినట్లే అర్థం చేసుకున్నాడు. ఆయన ఇలా ప్రశ్నించాడు. "కుమార్తె కుమారునివలె పురుషుని శరీరంలోని ప్రతి అణువునుండి ఉద్భవిస్తుంది. అందువలన ఆమె జీవించి యుండగా మరొక ప్రాణి అతని ఆస్తిని ఎలా పొందగలరు?" (బృహ. XXV - 56). విష్ణు, యాజ్ఞవల్క్య, కాత్యాయనులు కుమార్తె యొక్క వారసత్వ హక్కుని గుర్తించారు. కాత్యాయన, బృహస్పతులను అనుసరించిన మితాక్షర భార్య లేకపోతే ఆస్తి కుమార్తెలకు సంక్రమిస్తుందని చెప్పింది. తండ్రి ఆస్తిలో కుమారులవలె కుమార్తెలకు హక్కు వారి జన్మవల్లనే వస్తుందని అపరార్క భాష్యం అభిప్రాయ ప్రకటన చేసింది. స్మృతి చంద్రిక, వీరమిత్రోదయ, వివాద చింతామణి, మనువు అందరు కుమార్తెలను గురించి చెప్పినట్లే అర్థం చేసుకున్నారు. మితాక్షర భావం కూడ ఇదే.13 శాసనాల వల్ల మార్పులు రాకముందు వారసుల వరుస క్రమంలో కుమార్తెస్థానం ఐదవది. కుమార్తె అపవిత్ర జీవితానికి వారసత్వానికి సంబంధం లేదు. ఆమెకు చనిపోయిన వానికి జన్మనుబట్టి రక్తసంబంధం ఉన్నది కనుక ఆమె పాతివ్రత్య రాహిత్యం ఆమె వారసత్వానికి అడ్డురాదు.

సోదరుని నుండి :-

కొన్ని స్మృతులలో భాగపంపిణీ అపుడు లేక మరల కలసి పంపిణీ చేసుకునేటప్పుడు సోదరికి వాటా ఇవ్వవలెనని వ్రాయబడినది. నిస్సంతుగాను భార్య తండ్రి లేకుండాను చనిపోయినవాని ఆస్తి సోదరికి వస్తుందని బృహస్పతి వ్రాసాడు. శంఖలిఖితుల పద్ధతిన నిస్సంతుగా చనిపోయిన తల్లియొక్క కుమారుని ఆస్తికి సోదరి వారసురాలు. జగన్నాధ ధర్మకోశంలో బృహస్పతి తల్లి తరువాత వారసుగా సోదరిని పేర్కొన్నట్లు వ్రాయబడినది. ఇదే భావాన్ని మనువును వివరిస్తూ కల్లూకుడు చెప్పాడు. బొంబాయి శాఖలో సోదరిస్థానం గోత్రజసపిండురాలుగా గుర్తింపబడినది. ఆమె మరో వంశం లోకి వివాహం ద్వారా వెళ్ళినా ఆమె భిన్నగోత్రికురాలు కాదు. మితాక్షర లెక్కన సవతి సోదరుడు, అతని కుమారుడు వీరిరువురి తరువాత సోదరి స్థానం ఉంటుంది. బొంబాయి ప్రాంతంలో చలామణీలో ఉన్న 'వ్యవహార మయూఖం' ఆమెను - సోదరిని - నాయనమ్మ తాతయ్యల మధ్యన స్థానం కలుగచేసింది. సవతి సోదరుని తరువాత, (Helf - Brother) ఏకోదరుని (Full Brother) ముందు సోదరికి వారసుల వరుస క్రమంలో స్థానాన్ని నిర్దేశించింది. మద్రాసు శాఖ సోదరి స్థానాన్ని స్పష్టంగా తెలియజెప్పంది. మితాక్షరలో దీని వివరణ ఉంది. సోదరి భిన్నగోత్ర సపిండురాలు. ఆమె బంధువుల జాబితాలోకి వస్తుంది. కాని ఆమె సాధారణ బంధువు కాదు. ఆమెకు విశిష్ట స్థానం ఉన్నది. దక్షిణాది శాఖలో పురుష బంధువుల తరువాత సోదరి వస్తుంది. మరీ దూరపు పురుష బంధువుల తరువాత మాత్రము కాదు. ఇపుడు 1929 లో వచ్చిన హిందూ వారసత్వ సవరణ శాసనం వలన సోదరి, తండ్రి తండ్రి తరువాత ప్రవేశపెట్టబడిన కుమారుని కుమార్తె, కుమార్తె కుమార్తెల తరువాత స్థానానికి వచ్చింది. 13 వ స్థానానికి వచ్చింది. ఇది 1955 కు పూర్వస్థితి.

దీనివలన తేలిన విషయాలు I) భార్యకన్న కుమారులు మనుమలు, ముని మనుమలు, ఎక్కువ II)కుమార్తె కుమారునితో సమానం కాదు. III)సోదరుడు

9 వ స్థానపు వారసుడు కాగా, సోదరి వారసుల వరుసక్రమంలో 12, 13 ల మధ్యస్థానం కలిగి ఉన్నది. ఎంతసేపూ పిండప్రదానాలూ, తర్పణాలూ వాటికే ప్రాముఖ్యత. ప్రేమలకు అభిమానాలకు, సాంగత్యానికి విలువే లేదు. పారలౌకిక దృష్టి పేరుతో ఇహలోక జీవితాన్ని దుఃఖభాజనం చేసుకున్నది. ఎవరు ఆత్మీయులో, ఎవరు కాదో తేల్చుకోలేని దుర్భరస్థితిలో పడింది హిందూ సమాజం.

అధ్యాయం 8

## పాదదీపికలు

1. ఋగ్వేదంలో స్త్రీలు : ఉపాధ్యాయ అధ్యాయాలు 3, 4
2. హిందూ స్త్రీ : ప్రభాతీ ముఖర్జీ - పుట - 77
   Hindu women (Normativemodel) by
   Probhati Mukherjee (1978)
3. డిటో పుట 79
4. డిటో పుట 81, 82
5. డిటో పుట 83
6. ధర్మశాస్త్రాల చరిత్ర : కానే - పుట 577
7. డిటో డిటో పుట 582
8. ప్రాచీన సమాజాలు : మెయిన్
9. డిటో
   Lectures on early history of
   Institutions : Maine (1914)

10. హిందూశాస్త్రము-ఆచారము : మెయిన్ - పుట 614-616
పేరాలు 498, 499,
Treatise on Hindu Law & Usage by
Maine [Ed. by Sreenivasa Iyenger Pub.
Higginbothams, Madras (1914)]
11. డిటో పుట 620; పేరా 503
12. హిందూ స్త్రీ : ప్రతిభా ముఖర్జి - 8 వ అధ్యాయం
13. హిందూ శాస్త్రము-ఆచారము : మెయిన్ పుటలు 619, 620;
పేరా 502
14. డిటో డిటో పుటలు 621-624; పేరాలు 506-509

అధ్యాయం

# 9 మనవర్తి, దత్తత

మనవర్తి :- ఈ విషయంలో శాసనపరంగా మొదటిసారిగా 1946 లో శాసనం వచ్చింది. 'హిందూ వివాహిత స్త్రీ వేరు కాపురానికి, మనవర్తికి శాసనం' దాని పేరు. దానిలో ఏ పరిస్థితిలో వివాహిత స్త్రీ భర్తకు దూరంగా వేరుగా కాపురముండవచ్చునో వివరించబడింది. ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో వచ్చిన 'హిందూ బహుభార్యాత్వ నిషేధశాసనం' 1910 లో వచ్చింది. 1956 నుండి 'హిందూ దత్తత మరియు మనవర్తి శాసనం' అమలులో ఉంది. బ్రిటిషు పాలన మొదలైన తరువాత కోర్టు తీర్పులలో హైందవం కొంత మారింది. కనుక అంతకు క్రితపు హైందవాన్ని తరచి చూద్దాం.

సమష్టి హిందూ కుటుంబంలోని సభ్యులలో కొంతమందికి మతిస్థిమితం లేనందువల్ల, పుట్టుకతో తనపని తను చేసుకోలేని అసమర్ధతతో పుట్టినందు వల్ల వారసత్వానికి, భాగపంపిణీలో వాటా పొందటానికి వారు అనర్హులు. కాని కుటుంబం వారిని, వారి భార్యలను పోషించాలి. వారి కుమార్తెలకు వివాహ మయ్యేవరకు పోషణ జరగాలి. ఇక తతిమ్మా సమిష్టి హిందూ కుటుంబ సభ్యుల సంగతి-కుమార్తెలు, కుమారులు, భార్యలు, కోడళ్ళు, తల్లులు, అక్క చెల్లెళ్ళు వీరి సంగతి చెప్పనక్కరలేదు. సమిష్టి కుటుంబ యజమాని వీరి నందరినీ పోషించవలసినదే. అక్రమ సంతానంగా ఉన్న కుమారులు, వాటాకు అనర్హులయినపుడు మనవర్తికి అర్హులు. కాని అలాంటి కుమార్తెలకు మనవర్తి రాదు. ఒక పురుషుడు తన మరణానంతరం వరకు ఒక స్త్రీని ఉంపుడు గత్తెగా ఏర్పరచుకొని అలా జీవిస్తే ఆమె 'అవరుద్ధ స్త్రీ' అనబడుతుంది. ఆమె భరణాన్ని పొందవచ్చును. పురుషునికి ఆస్తి ఉన్నా లేకపోయినా వయో వృద్ధులైన తల్లిదండ్రులను, భార్యను, మైనరు కుమారుని పోషించాలి. పెండ్లి అయ్యే వరకు అక్కగాని, చెల్లెలుగాని పోషణకు లేక మనవర్తికి అర్హురాలు. విధవ

సోదరిని పోషించవలసిన బాధ్యత కేవలం నైతికం. భార్య తన హోదాకు తగిన విధులను నెరవేర్చినంతకాలం భర్త భార్యను పోషించాలి. భర్త మరో భార్యను స్వీకరించినంతమాత్రాన భార్య అతనిని విడనాడుటకు హక్కులేదు. అలా విడిపోతే ఆమెకు మనవర్తి హక్కులేదు. వ్యభిచరించిన భార్య విషయం ఇంతకుముందు ప్రస్తావనకు వచ్చింది. విధవ తన కుమారునికి ఆస్తి ఉన్నా లేకపోయినా మనవర్తి కోరవచ్చును. కాని మామకు విధవ కోడలును పోషించవలసిన బాధ్యత లేదు. పిత్రార్జితపు ఆస్తి ఉంటేనే అతడు బాధ్యుడు. విధవ తన భర్త బంధువులతో కలసి వుండవలసిన అగత్యం లేదు. అపవిత్ర జీవితం గడిపే విధవకు మనవర్తి లేదు. విధవ పునర్వివాహం చేసుకోగానే మొదటిభర్త కుటుంబం నుండి మనవర్తి పొందే హక్కు పోతుంది. విధవ తన భర్త కుటుంబ గృహములో కాపురం ఉండటానికి హక్కుకలిగి వున్నది. పెండ్లి అయ్యేవరకు, కుమార్తెలకు పోషణ హక్కు, లేక తండ్రి వదలి వేసినచో మనవర్తి పొందే హక్కు ఉన్నాయి. పిత్రార్జితపు ఆస్తి ఉంటే తన ఆస్తికి తగ్గట్టు తండ్రి ఆడపిల్ల పెండ్లి ఖర్చులను భరించవలెను.

దత్తత :-

దత్తుకు సంబంధించి 1956 లో శాసనం వచ్చింది. బ్రిటీషువారు వచ్చినప్పటినుండి ధర్మశాస్త్రాలు, కోర్టు తీర్పులు, హిందూ సమాజాన్ని నడిపించాయి. దత్తుకు సంబంధించిన ధర్మాలు పరస్పర భిన్నంగా ఉండటం వల్ల, ఆచారాలు భిన్నంగా సాగినందువల్ల, ధర్మశాస్త్రాల అన్వయం సంస్కృతం రాని ఇంగ్లీషు జడ్జీలకు కష్టతరమయినందువల్ల, దానికి సంబంధించిన 'లా' సంక్లిష్టమయింది. న్యాయస్థానాలలో కేసులు సగంపైగా అందువల్ల ఉత్పన్నమయినవే. న్యాయవాదులు సగంమందికి ఈ దత్తు దావాలే జీవనోపాధిని కల్పించాయి.

దత్తతను గురించి చారిత్రక దృష్టితో అధ్యయనం చేయడం ప్రయోజనకరం. వేదకాలంలో దత్తత ఉన్నదట. శునశ్శేపుని విశ్వామిత్రుడు దత్తు తీసుకున్నట్లు ఐతరేయ బ్రాహ్మణం చెప్తున్నది. అత్రి అనే ఋషి తన ఏకైక కుమారుని ఔర్వికి దత్తు ఇచ్చాడట. పుత్రికా పుత్రుడికి తాత ఆస్తి రావడం వలన పతిమ్మా కుమార్తెల సంతానానికి బాధగా తోచింది. తలిమ్మా

కుమార్తెలకు హక్కులు రావడం మొదలయింది. సోదరుడు లేని కన్యలను వివాహం చేసుకోరాదనే నియమం రావడంతో వారికి పెళ్ళిళ్ళు కావడం కష్టమయింది. పుత్రికా పుత్రుడు ఎంత మంచివాడయినా భిన్నగోత్ర సపిండుడు. కనుక దత్తత ఆవశ్యకతను సమాజం గుర్తించింది. గౌతమ, బౌద్ధాయన, మనువులు దత్తునికి ఔరస, క్షేత్రజ కుమారుల తరువాతి స్థానం ఇచ్చారు. ఆపస్తంభుడు వ్యతిరేకించాడు. వసిష్ఠుడు అతనికి 8 వ స్థానాన్ని ఇచ్చాడు. యాజ్ఞవల్క్యుడు దత్తుని కుమారులలో 7 వ వానిగాను, మనువు మొదటి 6 గురిలో ఒకని గాను, నారదుడు 9 వ వానిగాను పేర్కొన్నారు. దత్తు మతకారణాలవల్ల పుట్టిందా? లేక లౌకిక కారణాలవల్ల ఉద్భవించిందా? అనేది వివాదాంశం. గుప్త సామ్రాజ్య పతనం తర్వాత ముఖ్యంగా మహమ్మదీయుల కాలంలో ఈ ఆచారం ప్రబలమయింది. ఆస్తిని నిలబెట్టుకోడానికి అవసరమయిందని మెయిన్ అభిప్రాయం. మత భావన ద్వితీయస్థాయి కారణం. శ్రాద్ధ కర్మలను చేయటానికి ఒక పురుషుడు కావాల్సి వచ్చింది.

మతకారణాలు లౌకిక కారణాలను త్రోసి రాజనలేదు. వంశోద్ధరణ ముఖ్య ప్రోద్బల కారణం. అంటే లౌకిక కారణమే ప్రబలమన్నమాట. ఇది మెయిన్ ఆలోచనా ధోరణి. మతకారణాలే ప్రబలంగా పనిచేసాయని చెప్పడం యుక్తి యుక్తం. పున్నామ నరకం తమకు సంప్రాప్తమవకుండా దత్తత అవసరమయింది.

కుమారుడు, మనుమనుడు, మునిమనుమడు ఉంటే దత్తు చేసుకోరాదు. కుమారుడు సన్యసిస్తే దత్తు చేసుకోవచ్చును. ఉన్న ఒక్క కుమారుడు హిందూ మతాన్ని వదలివేస్తే తండ్రి దత్తు చేసుకోవచ్చును. వ్యభిచారజీవితం గడుపుతున్న విధవ భర్త అధికారం ఇచ్చినా దత్తు చేసుకోరాదు.

భార్య అనుమతి లేకపోయినా భర్త దత్తు చేసుకోవచ్చును. ఆమె వ్యతిరేకించినా దత్తతకు అతడు ఉపక్రమించవచ్చును. విధవ భర్త అధికారం పొంది యైనా దత్తు చేసుకోవలెను లేక జ్ఞాతులు ఒప్పుదల మీద ఆధారపడి ఆ పని చేయవచ్చును. భర్త అధికారాన్ని గురించి, జ్ఞాతుల ఒప్పుదలను

గురించి ఎంతో గ్రంధం పెరిగింది, అనేక ప్రాంతీయ భేదాలు మత భేదాలు వెలిశాయి. భర్త సమష్టి హిందూ కుటుంబీకుడుగా చనిపోతే ఆ కుటుంబం లోని వారి సమ్మతి కోసం ఆమె ప్రయత్నించాలి. వేరుపడిపోతే, దగ్గర జ్ఞాతుల అంగీకారం కావాలి. అత్తగారి సమ్మతికి కూడా విలువ ఉన్నది. కాని ఆమె ఒక్క సమ్మతి చాలదు. దత్తు చేసుకోవద్దని భర్త చెప్పి చనిపోతే దత్తు చేసుకోడానికి విధవకు అధికారం లేదు. భార్య సమ్మతించకపోయినా భర్త వారిరువురి కుమారుని తానొక్కడే ఇతరులకు దత్తు ఇవ్వవచ్చును. ఏ కుర్రవాని తల్లినయితే దత్తు తీసుకునే పురుషుడు, ఆమె కన్యగా ఉన్నచో, వివాహమాడరాదో ఆ కుర్రవానిని దత్తు తీసుకొనరాదు. ఆచారం పేర దీనిని సడలించారు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో. బొంబాయిలో కుమార్తె కుమారుని, సోదరి కుమారుని, పినతల్లి కుమారుని దత్తు చేసుకొనరాదు. వారి తల్లులను దత్తు తండ్రి ఏ పరిస్థితులలోను వివాహమాడరాదు కదా!

బ్రహ్మచారి, విధురుడు దత్తు చేసుకోవచ్చును. భార్య ఇష్టపడక పోయినా, వ్యతిరేకించినా ఒక పురుషుడు ఒక దత్తు కుమారుని స్వీకరిస్తే వాడు—ఆ కుర్రవాడు—ఆ పురుషుని భార్యను దత్తుతల్లిగా పరిగణిస్తాడు. ధర్మశాస్త్రం అంగీకరిస్తుంది. దత్తు పురుషునికి జరుగుతుంది. అది అతని ఇష్టాఇష్టాలపై ఆధారపడుతుంది. అయితే దత్తు జరిగేనాటికి దత్తు తండ్రి భార్య చనిపోయి ఉంటే దత్తుడు - దత్తు చేసుకోబడిన పురుషుడు - ఆమెకు కూడా దత్తు కుమారుడయినట్లే లెక్క.

ఇందులో ముఖ్యంగా గమనించవలసినవి :- దత్తు అనేది పురుషునికి సద్గతులు కల్గించటానికి - పిండ ప్రదానాలు చేసి, తర్పణాలు ఇచ్చుట ద్వారా- ఉద్దేశింపబడింది. స్త్రీ తనకు దత్తు చేసుకొనరాదు. ఆమె పతి జీవించి వుండగా ఆమె తన భర్తకోసం కూడా దత్తు చేసుకోరాదు. విధవ తన భర్త కొరకు భర్త పేరుమీదుగా దత్తు చేసుకోవాలి. అదయినా అతడు అధికారం ఇచ్చి వుంటే, లేక సపిండుల సమ్మతి మీద. అత్తగారున్నా ఆమె ఒక్కతే సమ్మతించినా చాలదు. దత్తు తీసుకునే విషయంలో, తన కుమారుని ఇతరులకు

దత్తు ఇచ్చే విషయంలో ఆమె-ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేదు. "భర్త యొక్క ఆధిక్యత ఫలితంగా, అతడు దత్తు చేసుకోగానే, దత్తుడు ఆమె కుమారుడుగా భావించబడడం పూర్తి అవుతుంది. భర్త అంగీకరించిన దేనినయినా ఆమె తన ఆస్తిగా ఎలా అనుకున్నదో దీని విషయంలోనూ అలాగే జరగాలి" ఇవి 'దత్తత మీమాంస' గాని వాక్యాలు. దత్తత అనే వ్యవస్థ పురుషుని కోసం కల్పింపబడింది. పురుషునికోసం కొనసాగింపబడింది. కాగా 1956 లో కొద్ది మార్పులు జరిగాయి. వీటిని గురించి ముందు విచారిద్దాం.



అధ్యాయం

# 10 మైనారిటీ, సంరక్షకత్వం

మైనారిటీ : హిందూ స్త్రీ పురుషులకు 16 వ ఏట మైనారిటీ తీరి పోతుందని అధికారిక ప్రవచనము. కాగా 16 వ ఏడు మొదట్లోనా లేక ఆ సంవత్సరం పూర్తి అయిన తరువాతనా అనే భేదాభిప్రాయాలువున్నాయి. ఎక్కువమంది సంస్కృత రచయితలు 16 వ సంవత్సరం మొదట అని చెప్పారు. 16 సంవత్సరాలు నిండాలని బెంగాలు ప్రాంతం వారి భావం. మదరాసు వారుకూడా బెంగాలు భావనను బలపరిచారు. ప్రసుత మదరాసు, బెంగాలులలో మెజారిటీ రావడమంటే 16 సం॥ నిండడము. దేశంలోని తతిమ్మా ప్రాంతములలో 15 సం॥ నిండితే చాలును. ప్రస్తుతం ఇది అంతగా ప్రత్యేకంగా ప్రాముఖ్యత లేనిది. 1875 లో భారత మెజారిటీ శాసనం ఆమోదింపబడింది. దాని ప్రకారం మామూలుగా 18 సం॥ నిండిన వ్యక్తికి మైనారిటీ వెళ్ళిందని అంటాం. కోర్టువారు సంరక్షకుని నియమిస్తే అతని మైనారిటీ 21 సం॥ నిండువరకు ఉంటుంది. ఈ శాసనము దత్తత, వివాహము, విడాకులు అనే మూడు విషయాలలో వర్తించదు.

సంరక్షకులు నాలుగు రకాలవారు: 1) సహజ సంరక్షకులు 2) వీలు నామా ద్వారా నియమింపబడినవారు 3) కోర్టుద్వారా ఏర్పాటు చేయబడిన వారు. 4) ఇతరుల నియామకం లేకపోయినా పరిస్థితులవల్ల అనుభవంలో సంరక్షలు. 1890 లో సంరక్షకుల - సంరక్షితుల శాసనం వచ్చింది (**Guardians & Wards Act**). దీనిప్రకారం కొన్ని సందర్భాలలో అయుక్త వయస్కులకు (మైనర్లకు) సంరక్షకులను నియమించటానికి న్యాయస్థానాలకు అధికారాలు సంక్రమించాయి. ఈ శాసనం ప్రకారం అవిభక్త కుటుంబం లోని మైనరు పురుషుని ఆస్తికి సంరక్షకుని నియమించటానికి వీలులేదు. కాగా అవిభక్త హిందూ కుటుంబంలోని మైనరు బాలుని వ్యక్తిగా పరిగణించి సంరక్షకుని నియమింవవచ్చును. అంటే వ్యక్తి వేరు, అతని ఆస్తి వేరు.

ఆస్తికాక తతిమ్మా విషయాలన్నీ అతని వ్యక్తిగత విషయాల క్రింద లెక్క. అతని శారీరక, మానసిక ఆరోగ్యం, విద్య, వైద్యం మొదలగునవి వ్యక్తి సంబంధమైన సంరక్షకుని పరిధిలోకి వస్తాయి.

తల్లి, తండ్రి సహజ సంరక్షకులు. ప్రప్రధమంగా తండ్రి అలాంటి సంరక్షకుడు. తండ్రి జీవించి యుండనిచో తల్లి సహజ సంరక్షకురాలు. వీరిరువురు లేకపోతే న్యాయస్థానం ఒక మనిషిని సంరక్షకునిగా నియమిస్తుంది. అవిభక్త హిందూ కుటుంబంలోని అయుక్తవయస్కుడైన పురుషునికి (మైనరుకు) ఆస్తి సంబంధంగా కాక యితరత్రా తన వీలునామాద్వారా తండ్రి సంరక్షకుని నియమించవచ్చును. తల్లికి అలాంటి అధికారం లేదు. మైనరుకు ప్రత్యేక ఆస్తి ఉంటే దానికి వీలునామా ద్వారా తండ్రి సంరక్షకుని నియామకం చేయవచ్చును.

అయుక్త వయస్క [మైనరు] బాలకు యుక్తవయస్కుడైన భర్త సంరక్షకుడు. అతడే ఆమెకు రెండురకాల సంరక్షకుడు. కాగా దక్షిణాదిన ఆడపిల్ల ఈడేరువరకు తల్లిదండ్రుల ఇంట్లో వుండే ఆచారం వున్నది. అయినా శాస్త్రరీత్యా భర్తయే సంరక్షకుడు. ఆమె ఆస్తికీ, వ్యక్తికి రెంటికీ అతడే సంరక్షకుడని భావం. మైనరు భార్యకు మైనరు భర్తయే సంరక్షకుడు. అంటే ఆస్తి సంబందం కాక ఇతరత్రా అని అర్థం చెప్పుకోవాలి.

తల్లి పునర్వివాహం చేసుకుంటే తన సంతానానికి సహజ సంరక్షకురాలుగా ఉండే హక్కును ఆమె పోగొట్టుకుంటుంది. ఒక వ్యక్తి కులం పోగొట్టుకుంటే సంరక్షకత్వ అర్హత పోతుంది. కులసంబంధమైన అనర్హతల తొలగింపు శాసనం (Caste Disabilities Removal Act 1850) వల్ల ఆ ప్రమాదం తప్పిపోయింది.

తండ్రి మతం మార్చుకున్నా తన సంతానానికి సంరక్షకుడుగా ఉండే హక్కును కోల్పోడు. తల్లి విషయంలో అలాకాదు. ఆమె సంరక్షకురాలుగా ఉండే అర్హత కోల్పోతుంది. "తండ్రి మతాన్నే పిల్లలు అనుసరిస్తారని - భారతదేశంలో - అనుకోవాలి. అలాగే తండ్రియొక్క వ్యవహార సంబంధమైన హోదాకూడా పిల్లలకు సంక్రమిస్తుంది." ఇది ప్రివీ కౌన్సిలు తీర్పు.

భారతీయ ఒప్పందపు చట్టము [Indian Contract Act] నిబంధనల ప్రకారం అయుక్త వయస్కులు [మైనర్లు] చేసే ఒప్పందాలు చెల్లవు. కాగా వారి ముఖ్య అవసరాలను ఎవడైనా సమకూరిస్తే వాటి వెలను అతనికి అయుక్త వయస్కుల ఆస్తి నుండి చెల్లింపచేస్తుంది న్యాయస్థానం. సంరక్షకుడు సంరక్షితుని ఆస్తిని సక్రమంగా నిర్వహించి కాపాడాల్సిన బాధ్యత వుంది. దుర్వినియోగం చేసినచో మైనరుకు కల్గే కష్టనష్టములకు సంరక్షక స్థానములో ఉన్న వ్యక్తియే బాధ్యుడు. న్యాయస్థానం సంరక్షకుని నియమించేటప్పుడు కేవలం మైనరు శ్రేయస్సును మాత్రమే దృష్టిలో ఉంచుకుంటుంది. సహజ సంరక్షక వ్యక్తి మైనరు యొక్క వ్యక్తికీ, ఆస్తికీ రెంటికీ సంరక్షకునిగా వ్యవహరించవచ్చు. 1956 లో మైనారిటీ మరియు సంరక్షకత్వ శాసనం వచ్చింది.

అధ్యాయం

# 11 భ్రష్టులు, బందీలు

హిందూ సమాజంలో వర్ణాశ్రమధర్మాలు కీలక పాత్ర వహించాయి. మొదట్లో వేదకాలంలో మూడు వర్ణాలు మాత్రమే ఉండేవి. ఆర్యులు ప్రధానంగా పశుపాలకులు. వారు వచ్చే నాటికి దేశంలో రాజ్యం చేస్తున్న అనార్యుల వ్యవసాయంపై ఎక్కువగా ఆధారపడేవారు. ఆర్య - అనార్య సంఘర్షణ రెండు నాగరికతల వారిమధ్య పోరాటం. ఆర్యులకు అశ్వాలు ఉండడంతో వారు అనార్యులను తమ వేగంతో జయించికలిగారు. వారిని బందీలుగా చేసుకున్నారు. వారిని చంపేదానికంటే వారిచేత ఊడిగం చేయించుకోవటం మేలని వారిని 'దాసులను' చేశారు. వారికొక వర్ణాన్ని సృష్టించారు. దానినే శూద్ర వర్ణమని నామకరణం చేశారు. ఇతర జాతుల వారిని రాజకీయ, సామాజిక కారణాలవలన తమలో కలుపుకున్నారు. ఆగంతకుల హోదాను బట్టి వారికి కుల నిర్దేశం చేశారు. వారు శక్తివంతులై రాజ్యాధినేతలైతే వారిని క్షత్రియులలో చేర్చారు. కాకపోతే వారిని శూద్రులతో కలిపారు. మానవ సమాజంలో స్త్రీ పురుషుల మధ్య ఉండే ఆకర్షణలను శాసనాలు, సామాజిక కట్టుబాట్లు ఆపలేవు; ఆపలేకపోయాయి. దానికి అనేక సామాజిక రాజకీయాంశాలు తోడు అయినాయి. వర్ణసంకరం కలిగింది. అనేక కులాలు ఉద్భవించాయి. మరల వాటికి వృత్తులు కేటాయించటం, కులధర్మాలను నిర్ణయించి శాసించటం పరిపాటి అయింది. విదేశాలనుండి అనేకులు దండెత్తి వచ్చారు. మొదట్లో వారిని హిందూ సమాజం కలుపుకున్నది. కాని ముసల్మానులు, ఐరోపియనులు హిందూ సమాజంలో కలవడానికి వీలు లేదు. హిందూ సమాజపు విధానాలు వేరు. తతిమ్మావారి పద్ధతులు వేరు. దాంతో ఇతరులను కలుపుకునే కార్యక్రమం ఆగిపోయి హిందూ సమాజాన్ని కుదించి గట్టిపరిచే ప్రయత్నాలు సాగాయి. దాంతో కులవ్యవస్థ, వర్ణవ్యవస్థ గట్టిపడినాయి. హిందూ సమాజంలోనుండి కారణాంతరాల వలన వెలుపలికి అడుగిడిన వారిని వెలివేశారు. స్త్రీల విషయంలోనూ అలాగే జరిగింది.

ఇది స్త్రీలపట్ల అపచారంగా పరిణమించింది. ఈ పరిణామాన్ని దృష్టిలో ఉంచుకొని భారతదేశ చరిత్రను అధ్యయనం చేయాలి. లేకపోతే తప్పుడు అవగాహనకు దారి తీస్తుంది.

కుల భ్రష్టలయిన స్త్రీలను, మత భ్రష్టలయిన స్త్రీలను సమాజం ఎలా చూచింది? అనే విషయాన్ని తెలుసుకునే ముందు కొన్ని మౌలిక అంశాలను గుర్తుంచుకోవాలి. కులాన్ని గుర్తించడం ఎలా? ఆ కులపువారు తమనిని ఎలా అభివర్ణించుకుంటున్నారు? ఇతర కులాలవారు ఆ కులపువారిని ఎలా పరిగణిస్తున్నరు, అసలు ఆ కులపు వారి ఆచారాలు, నడత ఎలా వున్నాయి? అనేవి కులాన్ని గుర్తించడానికి సహాయకారులు. వర్ణాశ్రమాలు లేని దేశాన్ని మ్లెచ్ఛదేశమన్నాడు హారిదత్తుడు.1

ఆర్యావర్తాన్ని దాటి వున్నదంతా మ్లెచ్ఛదేశమన్నాడు మనువు. పౌండ్రకులు, యవనులు, శకులు, మ్లెచ్ఛ భాషను వాడతారని మనువు చెప్పాడు. యవనులను, శకులను హిందువులు తమ సమాజంలో కలుపుకున్నారని భండార్కరు తేల్చారు.2 వర్ణపారిశుద్ధ్యానికి పెద్దగా పట్టుపట్టలేదు. వర్ణాన్ని వేరుగా చూడటాన్ని, జాత్యంహంకారాన్ని వదులుకున్నారు. గుట్టుచప్పుడు కాకుండా పైకి హడావుడి లేకుండా కొత్త వారిని, విజాతీయులను కూడా హిందూ సమాజంలోకి చేర్చుకోవడం సాగించారు. అలా చేయమని ఇంద్రుడు మాంధాతకు చెప్పినట్లు (మహాభారతం - శాంతిపర్వం. 65) కథ ఉన్నది.3 యవనులను వారిని పోలినవారిని బ్రాహ్మణ ప్రభావంలోకి తెమ్మని దాని భావం. హిందూ మతమంటే బ్రాహ్మణ మతమే కదా! హూణ రాకుమార్తెను భారత రాజు వివాహమాడినట్లు శాసనాల వల్ల తెలుస్తున్నది.4 అయితే అధికారం కలవారు విజాతీయులైనా, క్షత్రియులైనారు కనుక వారి స్త్రీలు కూడా ఆ వర్ణపు వారుగానే పరిగణింపబడ్డారు. ఇది జాతి భ్రష్టల చరిత్ర.

<u>మతభ్రష్టలు</u> :- వీరు రెండురకాలు. ఇచ్ఛికంగా వేరొక మతాన్ని స్వీకరించినవారు. ఉదాహరణకు - బౌద్ధాన్ని, జైనాన్ని చేపట్టినవారు. అలా కాక ఇతరులచేత బందీలుగా తీసుకోబడి మతమార్పిడికి లోను కావలసి వచ్చిన వారు. ఈ రెండవ కోవకు చెందిన వారికి, ఇతరజాతులకు బందీలయి చిక్కిన వారికి, కొన్ని సామాన్య అంశాలు ఉన్నాయి. అందులో ముఖ్యమైనది స్వాతంత్ర్యాన్ని కోల్పోవటం.

ఇష్టపూర్వకంగా మతం మార్చుకున్న స్త్రీలను గురించి విశదీకరణ చేసేముందు వారెవరో, వారు అలా ఎందుకు చేశారో స్థూలంగా పరిశీలించ వచ్చును. గౌతమ ధర్మసూత్రాలు బ్రహ్మచర్య, గృహస్థాశ్రమాలను మాత్రమే పేర్కొన్నాయి. వైఖానస స్మార్త సూత్రం వానప్రస్థ ఆశ్రమాన్ని ప్రస్తా వించింది. వశిష్ఠుడు బ్రహచర్య, గృహస్థ, వానప్రస్థ, పరివ్రాజక ఆశ్రమాలను పేర్కొన్నాడు. ఇవన్నీ పురుషులకే. స్త్రీలకు ఐచ్ఛికంగా ఉన్నవి రెండే రెండు ఆశ్రమాలు, ఒకటి బ్రహ్మచర్యం, రెండవది గృహస్థాశ్రమం. కాగా భర్త వానప్రస్థాశ్రమాన్ని స్వీకరిస్తే, ధర్మపత్ని కనుక భార్య అతని అడుగు జాడలలో అరణ్యాలలో ఆశ్రమవాసం చేస్తుంది. జీవిత రహస్య ములను గురించి ఆలోచించువాడు ముని. ఇంద్రియములను నియంత్రణం చేయువాడు యతి. ఒకచోట ఉండక ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు పోవువాడు పరివ్రాజకుడు. ఆహారాన్ని భిక్షగా స్వీకరించువాడు భిక్షువు. సన్యాస లక్షణాలను మనువు నిర్వచనం చేశాడు. బ్రహ్మచారి అనే పదం రుగ్వేదంలో, అధర్వవేదంలో కనిపిస్తుంది. వానప్రస్థం వేద వాఙ్మయంలో లేదు. మంత్ర శాస్త్రాన్ని అధ్యయనం చేసి ఆచరించేవారు యతులు. వారు ఇంద్రుని ఆగ్రహానికి గురి అయినారు. యతులు వైదిక ఆర్యులు కారు.[5] ఇంద్రుడు మునులతో స్నేహంగా ఉండేవాడు. రామాయణ కాలంనాటి దక్షిణా పధంలో కన్పించే మునులు బ్రాహ్మణ మత ప్రచారానికి పూనుకున్న పండిత బ్రాహ్మణులు, వారు ఈనాటి క్రైస్తవ మిషనరీల వంటివారు. అందువలననే వారిపై రాక్షసుల దాడులు జరిగేవి. ముని ఆశ్రమాల రక్షణకు రాముడు పూనుకోవటం జరిగింది. యజ్ఞయాగాది క్రతువుల పైన, వర్ణాశ్రమ ధర్మాలపైన, కులధర్మ నిర్వహణపైన నొక్కి పెట్టిన హిందూ మతాన్ని బుద్ధిపూర్వకంగా విడనాడి అనేకమంది స్త్రీలు బౌద్ధ, జైన మతాలను స్వీకరించారు. సన్యాసినులు అయ్యారు. బౌద్ధ భిక్షుకీ సంఘాలలో చేరారు. వీరిని మత భ్రష్టలుగా పరిగణించింది హిందూ సంఘం. తమ సంఘపు స్త్రీలు గృహస్థాశ్రమం స్వీకరించకుండా సరాసరి సన్యాసినులు అవుతారేమోనని భయపడి వివాహాన్ని స్త్రీకి ముఖ్య సంస్కారంగా చేసి, చిన్నతనంలోనే పెళ్ళి చేయటం ఆరంభించారు. అదంతా పూర్వం ప్రస్తావనకు వచ్చింది. ఇలాంటి మత భ్రష్టలను మరల హిందూ సమాజంలో కలుపుకునే ప్రస్తావన అసలు రానే రాలేదు.

ముసల్మానులు దండయాత్ర చేసినపుడు ఈనాటి సింధురాష్ట్రంలో (ఇపుడు పాకిస్తానులో ఉంది) అనేక హిందూ స్త్రీలను చెరపట్టారు. మతం మార్పించారు. పెళ్ళిళ్ళు చేసుకున్నారు. దానితో వేలమంది హిందూ వనితలు మతభ్రష్టలయ్యారు. వీరిలో ఎవరైనా చెరనుండి తప్పించుకొని పారిపోయి వచ్చినా హిందూ సమాజం వారిని స్వీకరించలేదు. వారిని ముసల్మానులుగానే పరిగణించింది. వెలివేసింది. పంక్తి బాహ్యులను చేసింది. ఈ కష్టాలు భరించలేక ఆ స్త్రీలు మరల తమను చెరపట్టినవారినే ఆశ్రయించారు. ఇది ఒకరకపు కథ. మరొకరకపు చరిత్ర సాగింది. రాజకీయ ఒత్తిడికి లొంగి కొందరు రాజపుత్రులు తమ కన్యలను మొగల్ రాజపుత్రులకు వివాహాలు చేశారు. కాని అట్టి రాజపుత్ర వంశాలవారిని తతిమ్మా వారు మతభ్రష్టులుగా పరిగణించేవారు. వాస్తవానికి మొగలాయీ రాజపుత్రులను వివాహమాడిన హిందూ స్త్రీలు హిందూ మతాన్ని పాటించినట్లు దాఖలాలు ఉన్నాయి. కాగా ముస్లిం భర్తల సాంగత్యం మటుకు వారికి తప్పలేదు. ఇక్కడ మతానుసరణకన్నా విమతస్తుని సాహచర్యానికి ప్రాధాన్యత ఇవ్వబడింది. ఇలా మతభ్రష్టలను నిరసించింది హిందూ సమాజం. మొదటిరకం వారు చెరపట్టబడి మతం మార్చుకోవలసి వస్తే, రెండవ రకం వారు రాజకీయ ఒత్తిడికి లొంగి మతాంతరుని వివాహం చేసుకున్నారు. ఏదైనా ఫలితం ఒకటే. వారు మత బాహ్యులు.

ఇక బందీల విషయం ఎత్తుకుంటే రామాయణగాథ స్ఫురణకు వస్తుంది. రాక్షస రాజు రావణుని బందీగా ఉన్నందున సీత అపవిత్రురాలయిందట. అందుచేత ఆమెను స్వీకరించ నిరాకరించాడు రాముడు. ఈ సంఘటన వృత్తాంతం ప్రక్షిప్తమని అల్టేకరు భావన. సీతయొక్క పాతివ్రత్యానికి దేవతల ధ్రువీకరణకోసం ఆ కథ అల్లారట; ఈ సంజాయిషీ అంత యుక్తియుక్తంగా లేదు. రాముని శీలాన్ని పరికిస్తే ఇది బోధపడుతుంది. తన రాజ్య ధర్మ నిర్వహణ ఊసే తప్ప మరేమీ ఎరుగడు శ్రీరామచంద్రమూర్తి. తరువాత అయోధ్యలో పట్టాభిషిక్తుడైన తరువాత మరల సీతను వనవాసానికి పంపాడు. ఆ వ్యక్తి సీతను - అంతకుముందు - అగ్నిప్రవేశం చేయమనటంలో ఆశ్చర్యం లేదు. రాముని గురించి కాదు చర్చ, బందీలను ఎలా పరిగణించాలనేదే ప్రశ్న. రావణుడు అనార్యుడు, సీతను సగౌరవంగా చూచాడు. ఆమె ప్రేమను అర్థించాడు. బ్రతిమాలాడు, అదలించాడు, బెదరించాడు. అంతే

కాని అత్యాచారానికి ఒడికట్టలేదు. కాని రాముని సంగతి వేరు. సీత తన యిష్టప్రకారం రావణునితో వెళ్ళిపోలేదని రామునికి తెలుసు. అయినా ఆమెకు పరీక్ష పెట్టాడు. తరువాత హిందువులంతా ఆ విధానాన్ని అనుసరించారు. ఇతరులచేత బందీలుగా కొనిపోబడిన స్త్రీలను నిరసించారు.

హిందూ ధర్మశాస్త్రజ్ఞులలో కొంతమంది ఉదారులు లేకపోలేదు. ఒక స్త్రీని శత్రువులు చెరపట్టినా, దొంగలు ఎత్తుకొని పోయినా, లేక ఆమెను ఇతరులు బలాత్కారంగా చెరిచినా ఆమెను కుటుంబం వదలి వేయరాదని [illegible] డు (వశిష్ట ధర్మసూత్రం, XXVIII - 2-3).

[illegible] భావాన్ని సమర్థించాడు (V - 35). మామూలు ప్రాయశ్చిత్తం చాలునన్నాడు. పరాశరుడు కూడా ఈ విషయంలో ఔదార్యాన్ని ప్రకటించాడు. (X - 26-7). మత్స్య పురాణం అదే చెపుతుంది (227, 126). ఆమె ఇష్టపూర్వకంగా ఏ పాపమూ చేయలేదు. బృహస్పతి అదే అంటాడు, కాకపోతే తగిన ప్రాయశ్చిత్తం ఉండనే ఉందన్నాడు. గర్భం వచ్చిన సరే, బిడ్డను ప్రసవించిన తరువాత ఆ స్త్రీని స్వీకరించమని అత్రి, దేవతలు చెప్పారు. కాని వీరి మాటలను హిందూ సమాజం ఖాతరు చేయలేదు. రాముడు దేవుడయి నాడు కనుక మనుష్యుల మాటలు వదలివేసి దేవుడు చేసినట్లే చేశారు. ఇతరులచేత బందీలుగా తీసుకొనిపోబడిన స్త్రీలను బహిష్కృతులనుగా చూచారు. మతం మార్చుకున్నవారికి అంటే ముసల్మాను మతంను వదలిపెట్టిన వారికి మరణశిక్ష విధించారు ముస్లిం పరిపాలకులు. అందువలన హిందువులు ఇలాంటి వైఖరిని అవలంబించారని కొంతమంది అంటారు. అది సరియైన వాదన కాదు. ముసల్మానుల పరిపాలన లేని రాజస్థాను, దక్కను ప్రాంతాలలో కూడ అలాంటి స్త్రీలను సంఘం వెలివేసింది. కనుక హిందూ మనస్తత్వమే దీనికి కారణం.

కులభ్రష్టలను హిందూ మతం ఎలా పరిగణించిందీ మునుపే తరచి చూశాం. ఒక విషయం తథ్యం. స్త్రీల విషయంలో ఏదో కారణం చూపి హిందూ సమాజం చాల కర్కశంగా ప్రవర్తించినదనేది తిరుగులేని సత్యం; మరువరాని పచ్చినిజం.

# అధ్యాయం 11

## పాదదీపికలు

1. ధర్మశాస్త్రాల చరిత్ర : కానే, 2 వ సంపుటం-మొదటిభాగం
పుట 383
2. డిటో : పుట 384
3. డిటో : పుట 389
4. డిటో : పుట 389
5. డిటో : పుట 419
6. హిందూ నాగరికతలో స్త్రీల స్థానం : ఆల్టేకరు
పుట 307

అధ్యాయం

# 12 ఆర్థిక, రాజకీయాలు

సామాజిక రంగంలో స్త్రీల పాత్రను గురించి ఇంతకుక్రితం చాల సవిస్తారంగా వ్రాయడం జరిగింది. కనుక ఆర్థిక రాజకీయ రంగాలలో స్త్రీల పాత్రను గురించి మదింపు వేయాలి. అది చాలా అవసరం.

వేదకాలంలో ఆర్యులు ఎక్కువగా యుద్ధాలలో మునిగి తేలుతూ వుండే వారు. కనుక వారికి స్త్రీల సహకారం ఎంతగానో కావలసి వచ్చింది. స్త్రీలు వ్యవసాయ రంగంలో తమ వంతు పనిని చేసేవారు. విల్లంబులు, బాణాలు తదితర యుద్ధసామాగ్రిని వారు తయారుచేసేవారు. అల్లకం, అద్దకం, బుట్టలు తయారు చేయడం స్త్రీలు చేసేపనులు.

వేదకాలం తరువాత రోజుల్లో స్త్రీలు ఉపాధ్యాయినులుగా ఉండేవారు, ఆచార్యుని భార్యను 'ఆచారాణి' అనేవారు. స్త్రీ ఉపాధ్యాయుని 'ఆచార్యా' అని పిలిచేవారు. వ్యాకరణం, కవిత్వం, సాహిత్యం ఉపాధ్యాయినుల విశిష్ట అభిమాన విషయాలు. వారికి పేరు ప్రఖ్యాతులుండేవి. బౌద్ధ, జైన సమాజాలలో బిక్షుణిలు మత ప్రబోధం చేసేవారు. 'ధర్మదిన్న' లాంటి స్త్రీలు అలా ప్రసిద్ధిగాంచినవారు. వారు బుద్ధుని మెచ్చుకోలు కూడా పొందారు. క్రి. త. 8 వ శాబ్దంలో 'రూసా' అనే స్త్రీ మంత్రసాని తనంపై ఉద్గ్రంథం వ్రాసింది.1 వ్యాపార రంగంలో స్త్రీలపై ఆంక్షలు లేవు. తక్కువ ఆదాయం కల కుటుంబాలలో స్త్రీలు వ్యాపారం చేసేవారు, సంగీతాన్ని వృత్తిగా సంసారం చేసే స్త్రీలు సాగించినట్లు దాఖలాలు లేవు. రజస్వలాత్పూర్వ వివాహాలు అమలులోకి రావడంతో సంగీత సాధన పెండ్లికి ముందు ఎక్కువగా చేయటానికి అవకాశం ఉండేది కాదు. దరిమిలా సంగీత సాధన ద్వారా జీవనోపాధి సంపాదించుకోవటానికి సభ్యత, సంస్కారమూ అడ్డు వచ్చేవి. కాకపోతే వేశ్యలు, నాట్యగత్తెలు వీరుమాత్రం ఈ వృత్తులను - సంగీతం, నృత్యము - చేపట్టేవారు.

ఆడి, పాడే స్త్రీల సంఖ్య ఎక్కువగానే ఉండేది. స్త్రీలు ఛత్రి, చామరాలను మోయువారుగాను, కేశాలంకార నిపుణులుగాను వృత్తులు చేసేవారు. కాలం దొర్లి దేవాలయాలు భారీ ఎత్తున వెలసిన కొద్దీ దేవదాసీల సంఖ్య పెరుగ ప్రారంభించింది.

స్త్రీల ఆర్థిక స్థితి గతులను గురించి సమాచారం చాల స్వల్పంగా ఉన్నది సాక్ష్యాధారాలు పెద్దగా లేవు. కావ్యాలనుండి మాత్రమే వారిని గురించి కొంతగా కొంత తెలిసికోగలుగుతున్నాము. కావ్యాలు రాజవంశీయులు, కులీనులు, ధనవంతులు, శ్రేష్టులు వీరి జీవితాలను చిత్రించాయి. శ్రామిక స్త్రీల జీవితాలను కథా వస్తువులుగా స్వీకరించిన సాహిత్య గ్రంధాలు ఆ రోజుల్లో అసలు వెలువడనే లేదు. అందుచేత సమాచారం సరిగా లభ్యం కావటంలేదు. అనార్యుల జీవితాలనుండి, సంప్రదాయాలనుండి కొంత విషయం గోచరమయింది. అదైనా అత్యల్పం. పరిశోధకులు ఇప్పటికైనా ఈ లోటును పూడ్చవలసి వున్నది.

రాజకీయరంగంలో :-

స్త్రీలు రాజ్యం చేయదగునా లేదా అనే అంశంపై రెండు అభిప్రాయాలు వుండేవి. రాముడు అరణ్యానికి పోవలసి వచ్చినపుడు సీతకు రాజ్యాధికారం ఇవ్వాలనే ప్రతిపాదన వచ్చింది (రామాయణం II - 37, 38). పురుష సంతానం లేకుండా యుద్ధంలో చనిపోయిన రాజుల కుమార్తెలకు పట్టం కట్టమని భీష్ముడు యుధిష్టరునికి సలహా చెప్పాడు (మహా భారతం XII - 32, 33). 9 వ శతాబ్దం చివరలో ఒరిస్సాలో 'లలితాభరణ దేవుడు' చనిపోగా సామంతుల కోరికలపై రాజు తల్లి పరిపాలించి తరువాత రాజ్యాన్ని మనుమనికి ఒప్పచెప్పింది. స్వంతహక్కుగా రాజ్యం చేసిన స్త్రీల సంఖ్య తక్కువ. బహుశః స్త్రీలు రాజరికం సాగించరాదనే అభిప్రాయం బలపడటం వలన అలా సంభవించిందేమో: ఏకైక రాజపుత్రిక వివాహమాడితే సాధారణంగా ఆమె భర్త రాజు అయ్యేవాడు. 10 వ శతాబ్దంలో 'రాట్ట' అనే రాజ కుమార్తె పెండ్లాడితే ఆమె భర్త బాసహట్టవంశీకుడు రాజు అయినాడు.

సాధారణంగా భర్తలు జీవించి వుండగా రాణులు రాజ్యాధికారాన్ని చలాయించేవారు కాదు. కౌశాంబి రాజు ఉదయనుడు బంది అయినప్పుడు

అతని తల్లి రాజ్యాన్ని పాలించింది. భర్త అలెగ్జాండరుతో జరిగిన పోరులో చనిపోయినా మాసగా రాణియుద్ధాన్ని సాగించింది. క్రీ. పూ. 2 వ శతాబ్దంలో తన కుమారుడు అయుక్త వయస్కుడు (మైనరు) గా ఉన్నపుడు తల్లి నాయనికా శాతవాహన రాజ్యభారాన్ని మోసింది. అలాగే మధ్యప్రదేశ్‌లో వాకాటక రాజ్యాన్ని తన కుమారుని తరపున రాణి 'ప్రభావతీ గుప్త' క్రీ. త. 4 వ శతాబ్దంలో పదిఏళ్ళు పాలించింది. క్రీ. త. 1193 లో పృథ్వీరాజుతో సహా తన భర్త 'సామరసీ' చనిపోగా అతని భార్య 'కూర్మాదేవి' మేవాడు రాజ్య పరిపాలనా భారాన్ని స్వీకరించి, కుతుబుద్దీన్‌తో పోరాటంలో సైనికులను నడిపింది. రాణాసింగ్ భార్యలలో ఒకతైన 'కర్ణావతి' చితోడ్ రక్షణ కార్యక్రమంలో ప్రముఖపాత్ర వహించింది. ఇలా ఎన్నో ఉదాహరణలు ఇవ్వవచ్చును.2 కొల్హాపూర్‌కు చెందిన 'తారాబాయ్', ఇచాలో కరంజికి చెందిన 'అనూబాయ్', ఇందూర్ రాజ్యపు 'అహల్యాబాయి', 'ఝాన్సీ లక్ష్మీబాయి' పేరెన్నికగన్న రాజ్యాధినేతలు. వారు ఎంతో సమర్థతతో రాజ్యపాలన చేశారు.

రాజులు రాజ్యం చేస్తున్న సందర్భాలలో కూడ రాణులకు పలుకుబడి ఉండేది. మహాభారతంలో గాంధారి, కుంతి, ద్రౌపది అలాంటివారు.

కేవలం నామమాత్రపు రాజ్యపాలకులుగా కాక, రాణులు చాలమంది పరిపాలనలో సమర్థవంతంగా జోక్యం కలిగించుకున్నట్లు సాక్ష్యాధారాలు ఉన్నాయి. రాష్ట్రకూట రాజు ధ్రువుని భార్య 'శీల మహాదేవి' భూములను దానం చేసింది. రాష్ట్ర కూట రాజు అమోఘవర్షుని కుమార్తె 'రేవక నమ్మడి' (క్రీ. త. 837), సోమసేవ చాళుక్యుని భార్య 'మైలాల దేవి' (క్రీ. త. 1053) చిన్న చిన్న రాజ్యాలను పాలించారు. 'అక్కాదేవి' (క్రీ. త. 1022), 'కుంకుమదేవి' (క్రీ. త. 1077) జిల్లాల పరిపాలనకు బాధ్యత వహించారు. కాకతీయ సామ్రాజ్ఞి రుద్రమదేవి తెలుగుదేశపు రాణి. వీరంతా ఎంతో రాజకీయ చతురను, పరిపాలనా నైపుణ్యాన్ని, సమర్థతను ప్రదర్శించారు.3

సామాన్య జాతులకు చెందిన స్త్రీ, పురుషుల జోక్యం పరిపాలనలో ఎంతగా ఉందో చూద్దాం. వేదకాలంలో ప్రజాస్వామ్య సభలుండేవి. ఆ సభలలో

వధువు పాల్గొనగలదనే ఆశాభావాన్ని వెలిబుచ్చే ఋక్కు ఋగ్వేదంలో ఉన్నది. (ఋగ్వే X - 85, 26). కనుక కొందరు స్త్రీలు వీటిలో పాల్గొని వుండవచ్చని ఊహించవచ్చును. తరువాత కాలంలో పరిస్థితులు మారాయి. స్త్రీలు రాజకీయ నిర్ణయాలు చేసే సభలకు పోవటం మానుకున్నట్లు తెలుస్తున్నది [మనుస్మృతి IV - 7, 4). తరువాత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజా ప్రభుత్వాలుగా అంతరించాయి. కేవలం గ్రామ సభలు, శ్రేణులు, వృత్తి సంఘాలు రంగంలో మిగిలాయి (క్రీ. 200 నుండి క్రీ. శ. 1200 వరకు). స్త్రీలు వీటిలో కూడ పాల్గొనే అవకాశం సశించింది. 1900 సంవత్సరం వరకు ఇలాగే సాగింది.[4]

ఏనాడు రజస్వలాత్పూర్వ వివాహాలు అవతరించాయో, ఏనాడు స్త్రీ త్వరగా చిన్నవయస్సులోనే మాతృత్వభారం వహించిందో ఆనాడే ఆమెకు సామాజిక, రాజకీయ అవకాశాలు సన్నగిల్లినాయి. రాజకీయాధికారం కల సభలు - ఒకటో అరో ఉన్నా - ఆమెకు ప్రవేశం లేనివైనాయి. రాజకీయాధికారం ఆమెకు అలా దూరమయిపోయింది.

కొంతమంది స్త్రీలు రాజ్యాధికారాన్ని చలాయించిన కారణం చూపి స్త్రీలను హిందూ సమాజం ఆదరించిందని చెప్పి తమకు తామే ధ్రువపత్రాలను ఇచ్చుకునే సంప్రదాయ వాదులు ఈ దేశంలో లేకపోలేదు. పురుషుడు రాజ్యం చేసినా, స్త్రీ రాజ్యం ఏలినా విషయమొకటే. తేడా బహుస్వల్పం. శాసనాలు, ధర్మాలు పురుష నిర్మితాలు. ధర్మశాస్త్ర కర్తలు పురుషులు. ఋక్కులు గానం చేసిన ఋషులలో ఋగ్వేదకాలంలో స్త్రీలున్నారు కాని, ఆచార్య పథాన్ని అనుసరించిన అతివలున్నారు కాని, ధర్మసూత్ర కారులుగా కర్తలుగా, ధర్మశాస్త్ర రచయితలుగా, భాష్యకారులుగా, ధర్మకోశ నిర్మాతలుగా స్త్రీలు కలికానికి కనబడరు. తులసీదాస్ లాంటివారు కూడా స్త్రీలను గురించి నిందావాక్యాలు పలికారని బాధపడుదూ మహాత్మాగాంధి ఇలా చెప్పాడు. ప్రాచీన శాసనాలను (ధర్మాలను) పురుషులు రూపొందించారు. ఋషులయినా, ద్రష్టలయినా స్త్రీలను గురించి వాస్తవ జ్ఞాన లేమి వారిలో చోటుచేసుకుంది.[5] కనుక సర్వసాధారణంగా వారు తయారుచేసిన శాసనాలు పురుషుని పెత్తనానికి అనుకూలంగానే ఉన్నాయి. స్త్రీ శ్రేయస్సుకు భంగకరంగా ఉన్నాయి.

అలాంటి శాసనాలను, సామాజిక ధర్మాలను పురుషులు అమలుపరిచినా స్త్రీలు చలామణీ చేయించినా ఫలితం ఒకటే. ఏరాయి అయితే నేమి పన్ను ఊడటానికి? ఎవరైనా ఒకటే అయినప్పుడు రాజకీయాధికారం కావాలని స్త్రీలు ఎందుకు కోరుతున్నారు? అనేది జటిల ప్రశ్నగా కొందరికి కన్పించవచ్చు. జాగ్రత్తగా పరికిస్తే ఇందులో చిక్కు ఏమీలేదు. సామాజిక ధర్మాల స్వభావమేమిటి, రాజకీయ శాసనాల రూపు రేఖలు ఏమిటి? అనేది ముఖ్యాంశము. కాగా పెత్తనం చేసే పురుషునికి స్త్రీ బాధలు, వ్యధలు సర్వసామాన్యంగా తెలియవు. ఒకరిద్దరు పురుష పుంగవులు సానుభూతి చూపినా వారి మాటలను ఎవరూ వినరు. అత్రి మాటలను, దేవలుని ఉపదేశాలను ఎవరు పట్టించుకున్నారు? పోనీ స్త్రీకి స్త్రీ బాధలు, వ్యధలు తెలుస్తాయి కదా ఆమె రాజ్యాధికారాన్ని చలాయిస్తే చాలదా? చాలదు. చైతన్యం కల ఏ ఒక్క స్త్రీ రాణి అయినా, తతిమ్మా స్త్రీలకు రాజకీయాధికారం లేనపుడు ఏమీ చేయలేదు; స్త్రీ జనాభ్యుదయాన్ని సాధించ లేదు. కారణం ఒక్కటే ఒకటి. ఆమెకు ప్రజలు అంటే రాజాకీయాధి కారంకల ప్రజలు అంటే పురుషులు బలపరచరు; స్త్రీలకు ప్రవేశమూ హక్కులుంటే సామాన్యంగా స్త్రీ జన పురోగతిని సాధించ పూనుకున్న రాణులు మద్దతు ఇచ్చేవారే. కాని స్త్రీలకు ఆ హక్కులు లేకుండా అశక్తులను చేసింది కదా పురుషాధిక్య సమాజం. ఈ పరిస్థితిలో రాణి ఏకాకి అవుతుంది. ఒక వేళ ఆమెకు చైతన్యం ఉన్నా (ఆనాటి రాణులకు లేదనుకోండి) లాభంలేదు. ఆమె మహిళా ప్రగతికి వ్యతిరేకమైన శాసనాలను, ధర్మాలను అమలు జరిపి తన పదవిని నిలుపుకుంటుంది. అలాంటి వారిని ఎంతమందిని చూడటం లేదు ఈ 20 వ శతాబ్దంలో కూడా? స్త్రీ హోదా విపరీతంగా తగ్గిపోయింది సామాజిక రంగంలో. ఆర్థికంగా ఆస్తిహక్కు వచ్చింది. అది లాభించేది ఆస్తి ఉన్న కుటుంబాల వారికి మాత్రమే. పోనీ వారైనా దానిని వినియో గించుకోవచ్చుకదా అంటే వారు సర్వదా పతివ్రతలు. పతికోసం వారు ఎంత త్యాగమైనా చేయగలరు. కనుక వారికి ఆ ఆస్తి ఉండి ఏమి లాభం? దాని ప్రయోజనం వారి భర్తలకే చెందేది. ఇకపోతే రాజకీయాధికారాన్ని వినియో చించి శాసనాలను ధర్మాలను మార్పుచేయించవచ్చుకదా! అని భావిస్తే స్త్రీలకు రాజకీయహక్కులు లేవు. (బ్రిటిషు వనితలు పోరాడి 1919 లో వోటుహక్కు తెచ్చుకుంటే ఆ వోటు హక్కు నునాయాసంగా భారత మహిళలకూ

దక్కింది). కనుక సమాజ ధర్మాలు మారలేదు; శాసనాలు మారలేదు మౌలికంగా. ఇలా సామాజిక రంగం ఆర్థిక రంగాన్ని ప్రభావితం చేసింది. రాజకీయంగా స్త్రీలు ఈ పరిస్థితిని మార్చలేకపోయారు. హిందూ సమాజపు పరిణామ చరిత్ర స్త్రీలకు సంబంధించినంతవరకు - ఇలా సాగింది.

## అధ్యాయం 12

# పాదదీపికలు

1. హిందూ నాగరికతలో స్త్రీల స్థానం : ఆల్టేరు పుట-180
2. డిటో డిటో పుటలు 185 - 187
3. డిటో డిటో పుటలు 189 - 190
4. డిటో డిటో పుటలు 190. 191
5. బాపూ ఉత్తరాలు - 1 ఆశ్రమ సోదరీలకు
   తే. 6-12-26 నుండి తే. 30-12-1929 వరకు
   సం॥ కాకాసాహెబ్ కలేల్కార్ (నవజీవన పబ్లిషింగు
   హౌస్, అహమ్మదాబాద్ - 14, 1960) : పుట 98

అధ్యాయం

# 13 హైందవ విశిష్టత

హైందవ సమాజం స్త్రీలకు ఏ స్థానాన్ని సమాజంలో కేటాయించిందో, వారి వ్యక్తిత్వాన్ని ఎలా కాలరాచిందో, వారి హక్కులను ఎలా కబళించిందో మనం చూచాం. ఇలాంటి సమాజాన్ని నడిపిస్తున్న భావనా ప్రపంచం ఏది? దీని వెనుకనున్న తాత్విక చింతన ఎట్టిది? హిందువుల తాత్విక ధోరణి వారి జీవితాలను ఏమేరకు ప్రభావితం చేసింది? అనే విషయాలను తరచి చూడటం అత్యవసరం; అవశ్య కర్తవ్యం కూడాను.

సింధు నాగరికత నాటి అనార్యులు నగరాలు నిర్మించుకొని ప్రశాంత జీవితం సాగిస్తున్నారు. వారిమీద ఆర్యులు విరుచుకొని పడ్డారు. నగరాలను ధ్వంసం చేశారు. వారు పూజించేదేవతలను 'పురందరుడని' అందుకే పిలిచారు. జీవితంలో ప్రశాంతతను అలవరచుకున్నందున అనార్యులు ఆర్యుల దాడిని తట్టులేకపోయారు. ఆర్యులలో క్రొత్తదనం, సాహసం, నాయకత్వం, సమస్యా సాధనశక్తి, నిర్ణయాత్మక శక్తి లక్షణాలుగా కనిపించాయి. అనార్యుల నుండి వారు దేవతలనే గాక, ప్రత్తి వాడకం, పశుల పెంపకం, వ్యవసాయంలో కొన్ని మెళుకువలు వీటిని తమవిగా చేసుకున్నారు.

హరప్పా క్రీ. పూ. 1500 లో ఆర్యులచేతికి చిక్కింది. అలాగే 'ప్రాతిహారన్' అనే పట్టణం క్రీ. పూ. 1000 తో ఆర్యులవశమయింది. ఈ 500 సంవత్సరాల కాలంలో ఆర్య నాగరికత వెల్లివిరిసింది. ఆర్య సంస్కృతి పుష్పించింది.

మౌర్యుల కాలంలో ప్రభుత్వమే కొన్ని పరిశ్రమలను నడిపేది. 'స్టేట్ సోషలిజం' ఉండేదని ఒక అభిప్రాయం. గనులు, నేతకర్మాగారాలు, నూలుకర్మాగారాలు ప్రభుత్వ ఆధీనంలో ఉండేవి. 500 కుమ్మర

సారెలున్న కర్మాగారం శ్రావస్తిలో ఉండేదట. అలెగ్జాండరును పురుషోత్తముడు నిలువరించి పోరాడాడు. దానితో అలెగ్జాండరు బీస్‌నదిని దాటి తూర్పుకు పురోగమించ సాహసించలేకపోయాడు. చంద్రగుప్త మౌర్యునితో (క్రీ. పూ. 331 - 324) అలెగ్జాండరు సేనాపతి సెల్యూకస్ రాజీకి రావలసి వచ్చింది. సముద్రగుప్తుడు శకులను, పుష్యమిత్రుడు బాక్ట్రియను గ్రీకులను ఎదిరించారు. స్కంద గుప్తుడు (క్రీ. శ. 455 - 467) హూణులను ఆపగలగాడు. అశోకుడు నెలకొల్పిన స్తంభాలు ఈనాటికీ తమ కాంతులను వెదజల్లుతున్నాయి. క్రీ. శ. 500 ప్రాంతంలో ఆర్యభట్టు సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. భూమి తనచుట్టూ తానే తిరుగుతున్నదని ప్రకటించాడు. గణిత శాస్త్రంలో పురోగతి అత్యద్భుతం. సున్నా, అనంతం, బీజగణితం, దశాంశం ఇవన్నీ భారతదేశంనుండే ప్రపంచానికి అందాయి. సంఖ్యలకు ధన రుణ లక్షణాలను కనిపెట్టారు. 'పై' యొక్క విలువను ఆర్యభట్టు 62832, 20, 000 గా చెప్పాడు. తరువాతవచ్చిన గణిత శాస్త్రజ్ఞులు దానిని 9 వ దశాంశం వరకు గుణించారు. స్క్వేరు రూటు (Square Root), క్యూబికురూటు (Cubic Root) వీటిని కనుగొనే పటిష్టమైన పద్ధతిని కని పెట్టారు. శూన్యం (సున్నా) ను సరిగా అంచనా వేశారు. పూర్వం ఏ అంకె నయినా శూన్యంతో భాగహారం చేస్తే ఆ వస్తువు మాత్రమే వస్తుందని భావించేవారు. భాస్కరుడు అలా కాదని అప్పుడు అనంతం వస్తుందని తేల్చాడు. అలాగే అనంతాన్ని దేనితో భాగహారం చేసినా అనంతం వస్తుందని రూఢి అయింది ఏనాడో. భౌతికశాస్త్రంలో ఈనాటి అణుసిద్ధాంతాన్ని ఏనాడో ఆర్యులు ప్రతిపాదించారు. ఈనాటికీ తుప్పు పట్టని ఢిల్లీ ఉక్కు స్తంభం వారి లోహ శాస్త్రజ్ఞానానికి ప్రతీక. వైద్యంలో ఆనాడు ముందంజ వేశారు. శస్త్రచికిత్సలో, ఎముకలను సరిదిద్దటంలో, ఇంకా ఇతరత్రా ఎన్నో శాఖలలో అభివృద్ధి జరిగింది. మందులలో ఎంతో పురోగమనం సాధించారు. ఉద్యాన వనాలు, తీర్చిదిద్దిన వీధులు, నీళ్ళుచల్లిన వీధులు, పుర ప్రాకారాలు, సభా భవనాలు, నాట్యశాలలు, వీధి దీపాలు, జూదగృహాలు, న్యాయస్థానాలు, వ్యాపార స్థలాలు, చేతివృత్తులవారికి ప్రత్యేక ప్రదేశాలు ఇలా ఎంతో శోభతో నగరాలు మిరుమిట్లు కొలిపేవట. బౌద్ధుల కథలలో ఈ వర్ణన ఉంది. నీతి, నిజాయితీలకు సామాజిక జీవితంలో అత్యధిక స్థానం ఉండేదట. అనృతం (అబద్ధం) పలికేవారు కారట. తలుపులకు సాధారణంగా గడియలు వేసుకునేవారు కారట. మెగస్తనీసు వీటిని గురించి ఎంతో కొనియాడాడు.

చంద్రగుప్త మౌర్యుని కాలంలో (క్రీ. పూ. 350) హైందవ నాగరికత ఉచ్ఛస్థాయిలో వుంది. గుప్తులకాలం నాటికి (క్రీ. శ. 350 - 400) అది ఉన్నతోన్నత స్థానాన్ని చేరుకుంది. తరువాత క్షీణదశ ప్రారంభం అని దాస్ గుప్తా అభిప్రాయం.1 క్రీ. శ. 1001 నాటికి, మహమ్మద్ గజనీ దండయాత్ర నాటికి హైందవం యొక్క రాజకీయ పతనం ప్రారంభమయింది.

యజ్ఞయాగాది క్రతువులతో, సాధు జీవిత విధానంతో, వర్ణతత్వ వివక్షతో విసిగిపోయిన ప్రజలకు బౌద్ధమతం కొంతకాలం ఆశ్రయం ఇచ్చింది. తరువాత బౌద్ధం కూడా హైలదవంలో భాగమయింది.

ఇంత ప్రతిభా వ్యుత్పత్తులను చూపిన హైందవ సమాజం ఎందుకు విదేశీయుల దండయాత్రలకు తల ఒగ్గింది? ఎందుకు నూతన స్వేచ్ఛా వాయువులను పీల్చలేకపోయింది. షుమారు వెయ్యి సంవత్సరాలు ఎందుకు వెనుకబడిపోయింది? వీటికి సమాధానాలు వెదకికోవటం అత్యావశ్యకం. ఏజాతి మార్పు చెందదో, ఏ సమాజం మార్పును కోరదో ఆ జాతి చరిత్ర పరుగులో వెనుకబడి పోతుందనేది పచ్చినిజం, అనుభవైక సత్యం.

వేదాలు- ధర్మసూత్రాలు, ఇతిహాసాలు, భగవద్గీత, సంహితలు, ఇతర ధర్మశాస్త్రాలు, వాటి భాష్యాలు, అన్వయాలు అన్నీ సనాతన హైందవాన్ని రూపొందించాయి. వేదాలలో వర్ణవ్యవస్థ ఉన్నది, ఇతిహాసాలలో వానిని గట్టిపరచడం జరిగింది. భగవద్గీతలో దానికి తాత్విక ప్రాతిపదిక ఇవ్వడం సంభవించింది. తరువాత వచ్చిన ధర్మశాస్త్రాలు దానిని కట్టుదిట్టం చేశాయి. ఈ వర్ణవ్యవస్థ, కుల కట్టడి హైందవాన్ని నీరసింప చేసింది. ధర్మాన్ని పాలించటం అంటే వర్ణ నిర్దేశిత ధర్మాన్ని నిర్వహించడం, ప్రాపంచిక జీవితంపై విసుగు, కర్మసూత్రంపై విశ్వాసం, జన్మపరంపర సిద్ధాంతంపై నమ్మకం, శరణం పొందే మనస్తత్వం, యోగంపై మోజు, కులం ఈ ఏడు అంశాలు సనాతన ధర్మాన్ని పోషించాయి. అంతేకాదు 2 వేల సంవత్సరాలు ఇతర సంస్కృతుల దాడిని ఎదుర్కొనేలాగా హైందవాన్ని తయారు చేసాయి. శరణు జొచ్చే భావన 15 వ శతాబ్దం నాటికి భక్తి ఉద్యమానికి పునాదిరాయి అని, యోగం అంటే ప్రజ్ఞద్వారా సమాధ్యవస్థను సాధించి (అంటే చిత్త వృత్తులను నిరోధించి), మానసిక శక్తులను పెంపొందించుకొని సృష్టికర్తతో

సరాసరి సంబంధం ఏర్పరచుకోవటం అంటే తాదాత్మ్యం పొందటం అని తెలిసికొని ఆ లక్ష్యాన్ని సాధించటం హిందువుల దృష్టిని ఆధ్యాత్మికంవైపు మళ్ళిందని మనం గ్రహించాలి. ఇక కులతత్వం సంగతి సర్వజన విదితం. సమాజాన్ని ముక్కలు ముక్కలుగా చీల్చింది. ఒక కులానికి మరొక కులానికి మధ్య అడ్డుగోడలు నిర్మించింది. సహపంక్తి భోజనాలను, వర్ణాంతర, కులాంతర వివాహాలను నిషేధించింది. స్పర్శలోనే కాక, దృష్టిలో కూడ అపవిత్రతను సృష్టించింది. అసహన భావాన్ని పెంపొందించింది. వేర్పాటుకు తాత్విక ప్రాతిపదికను అందిచ్చింది. సమాజాన్ని మార్పునుండి వెనుకకు మళ్ళించింది.

ఆనాటి సమాజంలో ప్రకృతి వనరులు తగినంతగా ఉన్నాయి. ఉన్నదాంతో తృప్తిపడే సమాజం ఉద్భవించింది. సర్వసామాన్యంగా మార్పుకు దోహదం చేసే లక్షణాలను తమ సమాజానికి ఉన్నట్లుగా అర్థం చెప్పుకొని తృప్తిపడ్డారు పూర్వీకులు. పుట్టుకనుంచి చావువరకు వచ్చే ప్రశ్నలకు అన్నింటికి సమాధానాలు చెప్పుకున్నారు. సాధారణంగా మార్పుకు ప్రేరకాలు ఏడు. భద్రత కోసం, ఉన్నత జీవన ప్రమాణం కోసం ఆరాటం మనిషిని ముందుకు నడిపిస్తుంది. కాని హిందువులకు ఆ యావ లేదు. సంపదపై వాంఛలేదు. సంతృప్తి వారి లక్షణం. కులధర్మ నిర్వహణ వారి విద్యుక్త ధర్మం సమాజంలో 'నేను నా సమాజానికి చెందిన వ్యక్తిని' అనే భావం ఉంటే సమాజంలో తానొకడై పురోగమించటం జరుగుతుంది. కులం, కర్మ సిద్ధాంతం, జన్మ పరంపరా సూత్రం ఇవన్నీ కలసి హిందువుకు కులంలో, హిందూ సమాజంలో ఆ భావాన్ని కలిగించాయి. దాంతో ఆతనిలో వైమనస్యత (Alienation) చోటు చేసుకోలేదు. ఆత్మగౌరవ భావనకూడా అభ్యుదయానికి దారి తీస్తుంది. అలాగే ఆత్మ సాక్షాత్కారం కూడా. ఈ రెండూ కులంలోనే లభించాయి హిందువుకు. వ్యక్తిని మించి విశ్వవ్యవస్థతో తాదాత్మ్యం చెందుటకూడా పరిణామానికి ఉపకరిస్తుంది. ఈ భావాన్ని వేదాంతంలో, గీతా బోధనలో, 'తత్వమసి' అనే వాక్యంలో గ్రహించాడు హిందువు; గ్రహించింది హిందూ స్త్రీ. సామాజిక న్యాయంకోసం తహతహ వర్తనానికి బాటవేస్తుంది. కాని హిందువు తన కులవ్యవస్థలోనే సామాజిక న్యాయాన్ని దర్శించటం జరిగింది. హైందవం తరతమయుతమైన అసమానత్వాన్ని సమానత్వంగా చిత్రించుకుంది. సామాజిక ఆచారాలను, అలవాట్లను,

ఆలోచనా ధారలను ఎదిరించే శక్తులు ఉద్భవిల్లిననాడు సమాజం మారుతుంది. అయితే అలాంటి శక్తులు హైందవంలో పుట్టకపోలేదు. సమాజంనుండి పారిపోయి 'సాధు' జీవితం గడిపినవారు, చార్వాకులు అలాంటివారు. అలా హిందువులు భౌతికానందానికన్నా, ఆత్మానంధానికి ప్రాముఖ్యత ఇచ్చారు. గతాన్ని గురించి ఆలోచించటం, వ్యక్తిత్వానికి ప్రాధాన్యత ఇవ్వకపోవటం, సంప్రదాయాన్ని పాటించటం హైందవ లక్షణాలు.[2]

ఎస్. ఎన్. దాస్ గుప్తా అభిప్రాయం ప్రకారం భారత భావ వాదం వెనుక ఆరు పిడివాద సిద్ధాంతాలు ఉన్నాయి. 1) పునర్జన్మ, 2) కర్మ సిద్ధాంతం, 3) మోక్షం, 4) మానసిక స్వభావానికి, ఆధ్యాత్మిక స్వభావానికి మధ్య అంతరం, 5) ఆధ్యాత్మికానుభూతికి ఎక్కువ విలువ ఇవ్వడం, 6) మత గ్రంధాల ప్రామాణ్యత తిరుగులేనిదనటం. హిందూ మనస్తత్వంలో ఈ అతార్కిక భావనలు చోటుచేసుకోవటం ఆశ్చర్యకరమన్నాడు దాస్‌గుప్తా[3] ఇవన్నీ పిడివాదాలు. వీటిని రుజువు చేయవలసిన అవసరం హిందువుకు కనిపించదు. శివుని దేవునిగా స్వీకరించటంలో హైందవ మనస్తత్వం గోచరిస్తుంది. శక్తికీ, రక్షణకూ, సంతానోత్పాదనకూ ప్రతీక శివుడు.

హైందవ ఆచారాలూ, సంప్రదాయాలూ, విలువలూ అన్నీ హిందువుల చైతన్య స్థాయిలోని, అచేతన స్థాయిలోని అవసరాలను బట్టి పుట్టాయి, పెరిగాయి. వారి మనః కవాటాలను మూసివేశారు, వారి సమాజ ద్వారాలను పూడ్చివేశారు. ఇదంతా జరగడానికి కారణం హైందవ సంస్కృతికి భిన్నమయిన సంస్కృతులు కల విదేశీయులు దండెత్తి రావడం. లేక దేశంలోకి చొచ్చుకరావడమే. ఇది మానసిక సబంధమైన 'రక్షణ చర్య' ఫలితం. తమ సంస్కృతి రక్షణార్థం హైందవ జాతి చేపట్టిన మార్గమిది. ఇది సమాజ స్తబ్ధతకు దారి తీసింది. శుభయూదాస్ గుప్తా యొక్క ఈ అభిప్రాయం సరియైనదే,

హిందూ సమాజాన్ని పట్టుకొని వ్రేలాడుతున్నవి ముఖ్యంగా రెండు భావాలు. 1) పవిత్రతను గురించి భావన, 2) వర్గీకరణ చేసి దానిని చివరవరకు కొనసాగించడం. ఈ రెండూ హైందవ జీవితంపై ఎనలేని ప్రభావాన్ని చూపాయి. కులవ్యవస్థ, కులాల ధర్మాల నిర్దేశన, నిబంధనలను

విపరీతంగా పెంచడం, వాటిని పాటించని వానిని వెలివేయడం, ఇవన్నీ హైందవ వర్గీకరణమైన 'నిర్దిష్టమైన క్రమంపై మక్కువ' వీటిపై ఆధారపడు తున్నాయి. సంస్కృత వ్యాకరణ సూత్రాలు, బీజగణితం, దశాంశపద్ధతి వీటిని కనుగొనటం ఈ మనస్తత్వ ఫలితమే. వర్గీకరణ, క్రమం, నియమం ఇవి ఆ భావన యొక్క విశిష్ట లక్షణాలు. దాంతో పవిత్రత పేరుతో ఛాందసం, అసహనం సమాజంలో చోటుచేసుకున్నాయి. క్రీ. పూ. 600 నుండి క్రీ. శ. 600 వరకు వున్న సృజనాత్మకత నశించింది. యుద్ధాలలో ఓటమి గతవైభవాన్ని తలపింపచేసి లేని తృప్తిని ఇచ్చింది. భౌతిక జీవితంలో మెరుగుదల లేకపోయినా తాత్వికంగా, ఉద్వేగపరంగా సమాధానం చెప్పుకొని జీవయాత్ర చేశారు. భయం (మలినమయి పోతామేమోనని), ఆందోళన జీవితంలోకి ప్రవేశించాయి. రక్షకుడు కావలసి వచ్చాడు. గురువు వచ్చాడు రంగంపైకి. నిబంధనలను నియమాలను, పాటించడం కష్టమవుతున్నది. వాటిని అతిక్రమిస్తే దోషభావం మనస్సులో పుట్టున్నది. దానిని ఉదాత్తం చేయలేకపోయింది హైందవం. అసంబద్ధ విషయాలు సమాజ భావనలో చోటుచేసుకున్నాయి. ఒక వైపు విశ్వాత్మ భావన; మరోవైపు సంకుచిత కులతత్వం. ఒకవైపు దౌర్జన్య రాహిత్యం; మరోవైపు సతీసహగమనాన్ని అమలుపరచటంలో విదవఫై దౌర్జన్యం, హింస. ఒకవైపు ప్రపంచం మిధ్యయనే భావం; మరోవైపు బ్రాహ్మణులకు సమాజంలో ఉన్నత స్థానాన్ని కట్టబెట్టడం, వారికి ఇతోధిక సదుపాయాలు సౌకర్యాలు కలుగజేయడం. అంతేగాక ప్రాయశ్చిత్త చర్య తేలిక అవడంతో మరల పాపం చేయడానికి అవకాశం ఎక్కువయింది, నియమాలను అతిక్రమిస్తే లాభాలు, ప్రయోజనాలు ఎక్కువగా కన్పించాయి. ఇలా మౌలికంగా అసంబద్ధమైన వైఖరులను ప్రదర్శించింది హైందవం.

యోగంపై వ్యామోహం సమాధిస్థితిని ఆశించేటట్లు చేసింది. దానికి గురువు అవసరమయ్యాడు. గురువు అంటే వ్యక్తికి బాహ్యమైన అధికారి. తండ్రిలాంటివాడు. తనపై అధికారాన్ని చలాయించువాడు. అసలు భగవంతుడే రక్షకుడు. ఆ భగవంతునికి హిందూ వ్యక్తికి మధ్య మనిషి గురువు. ఇలా భవిష్యత్‌పై ఆశలు పోగొట్టుకున్న హిందూ వ్యక్తి, కట్టుదిట్టం చేయబడిన వ్యక్తిత్వాన్ని, నియమ నిబంధనలలో నలిగిపోయే వ్యక్తిత్వాన్ని పొందడం జరిగింది. ఇతరులపై ఆధార పడటం సర్వసాధారణ మయింది. దేవుడు

గురువు అలా వెలుపలినుండి అతనికి లేక ఆమెకు బలాన్ని ఇచ్చే శక్తులుగా రూపొందారు.

కర్మసిద్ధాంతం విధిసూత్రంపై నమ్మకానికి దారి తీసింది. హైందవ సమాజంలోని అస్థిరత్వం హిందువు అంతర్ముఖుడయ్యే పరిస్థితిని కల్పించింది. అహింసా సిద్ధాంతంలో విశ్వాసం శాఖాహార భోజనాన్ని మాత్రమే స్వీకరించే టట్లు చేయలేదు. జీవితంలో ఎదుర్కోవలసిన సంఘటనలు ఒకవైపు, ధర్మ సూత్రాలు మరోవైపు హిందువును ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఈ జన్మలో నిష్కృతి కనిపించడంలేదు. వచ్చేజన్మకోసం ఎదురుచూడటం అలవాటయింది. అది తరువాతి తేదీ వేసిన చెక్కులాంటిది. (పోస్టుడేటెడ్‌చెక్కు) దానికి ప్రతిఫలం పైకం ముట్టవచ్చును లేక పైకం లభ్యం కాకపోవచ్చును. కనుక బాహిరమైన శక్తిపై (దేవుడు, గురువు) ఆధారపడటం సాగింది. అంటే ఆ శక్తికి పూర్తిగా లొంగిపోయి 'మామేకం శరణం వ్రజ' అనే సూత్రార్థాన్ని పోషించటం జరుగుతున్నది. పరాధీనపు బ్రతుకు అలవాటుపడిన వ్యక్తి ఇతరులపై అధికారం చలాయించే మనస్తత్వాన్ని అలవరచుకుంటాడు. బాహ్య శక్తులను శరణుజొచ్చిన హిందువు అధికార మనస్తత్వాన్ని స్వంతం చేసు కుంటాడు. కనుక 'శరణం కోరడం' అతని స్వభావంలో ముఖ్యలక్షణ మవుతుంది. తనని నడిపించటానికి పెద్దలు - ఋషులు, ధర్మసూత్ర రచయితలు, ఇతిహాసాలలో భీష్మాదులు, ధర్మశాస్త్ర కారులు - ఏర్పరచిన నియమాలను నిబంధనలను హిందువు కౌగిలించుకుంటాడు. అవి అతనికి లేక ఆమెకు పట్టుకొమ్మలు. ఆ ఆధారాలను విడనాడడం ప్రాణత్యాగంతో సమానం. కనుకనే హిందువులు నాయకుల జయంతులు, వర్ధంతులు ఉత్సాహంగా జరుపుకుంటారు. హైందవం నియమాల సంస్కృతి దశ. కాని అప్పు డప్పుడు తమ లాభంకోసం నియమాలను అతిక్రమిస్తారు. అది అలవాటు అవుతుంది. అవినీతిని స్వీకరించడం సంభవిస్తుంది. అయినా ధర్మ పన్నాలను ఏ కరువు పెట్టటం మానరు. అసంబద్ధమైన విషయాలను ఆదరిస్తారు. చెప్పేది ఒకటి, చేసేది మరియొకటి. పరస్పర విశ్వాసం గాలిలోకి ఎగిరిపోతుంది. అసహనం ప్రబలుతుంది. అధికార మనస్తత్వంతో సంచరిస్తాడు హిందువు. అధికార మనస్తత్వ ప్రభావంలో ఉండే సమాజం అధికారం చెలరేగే కుటుంబానికి దారితీస్తుంది. అంటే కుటుంబంలో పురుషుడు స్త్రీపై, పిల్లలపై అధికారం చలాయిస్తాడు. 'ఇది నీ విధి' అని స్త్రీని శాసిస్తాడు.

ఆమెకు దర్మబోధ చేస్తాడు. ఆమె మెదడును శాసనం చేస్తాడు. ఆమె బుర్రలో తన భావాలను చొప్పిస్తాడు, హైందవం స్త్రీని అలా మానసికంగా లొంగతీసుకున్నది. ఎదురు తిరిగిన స్త్రీని శిక్షించింది. కష్టనష్టాలపాలు చేసింది. అలా హైందవం స్త్రీలను పురుషునికి, కుటుంబానికి, సమాజానికి బానిసను చేసింది. ఆమె వ్యక్తిత్వాన్ని చిదిమి వేసింది. ఆమె ఆలోచనా శక్తికి ఆనకట్టలు కట్టింది. ఆమె సృజనాత్మకను మంట కలిపింది. ఆమె కార్యాచరణను నిరోధించింది. ఆమెను కాళ్ళూ చేతులూ కట్టి ఇంట్లో పడ వేసింది. ఆమెను ఓదార్చటానికి 'ఇల్లాలు', 'గృహిణి', 'గృహ సామ్రాజ్ఞి' అని బిరుదులిచ్చింది. 'మతాన్ని, జాతిని కాపాడేది నీవే' నని స్తుతించింది. 'నీ వల్లనే ఈ మాత్రమైనా హైందవం మనుగడ సాగిస్తున్నదని ఆమెను పొగిడింది. ఇదంతా నిజమనే నమ్మే స్త్రీలు ఇంకా ఉన్నారు.

ఈ హైందవ సామాజికాచారాలను, సంప్రదాయాలను, ఆలోచనా స్రవంతిని, భావనా విధానాన్ని నిలబెట్టూ దీనికి, నిజానికి, మూలస్తంభాలుగా ఉంటున్నవారు మతగురువులు, పూజారులు. వీరిని గురించి, కులతత్వాన్ని నిర్ద్వంద్వంగా ఖండించిన వివేకానందుడు ఏమన్నాడో గమనిద్దాం. అస్పృశ్యతను నిరసిస్తూ తన దేశస్తులకు చెప్పినమాటలు ఇవి :-

"రండి. మనుషులు కండి. మతగురువులను, పూజారులను తన్ని పారేయండి. వారు అభ్యుదయానికి వ్యతిరేకులు; వారు ఎన్నటికీ మారరు. వారికి హృదయ వైశాల్యం అబ్బదు. శతాబ్దాల తరబడి సాగిన మౌఢ్యానికీ, నిరంకుశత్వానికి వారు వారసులు. మున్ముందుగా పూజారీ విధానాన్ని నిర్మూలించండి. రండి. మానవులుగా తయారవ్వండి. మీ సంకుచిత పరిధినుండి వెలువడి, చుట్టూ ఉన్న ఇతర ప్రపంచాన్ని గమనించండి. దేశాలు ఎలా పురోగమనిస్తున్నయో తిలకించండి. మీరంతా (పాత ఆచారాల మీద నియమాలమీద) పిచ్చివ్యామోహం కలవారు. విదేశాలకు పోతే మీ కులం పోతుందని మీకు భయం.

మనం ప్రయాణం చేయాలి; విదేశాలకు పోవాలి. సమాజం ఇతర దేశాలలో ఎలా పని నిస్తున్నదో తెలిసికోవాలి. మరల మనం ఒకజాతిగా వర్ధిల్లాలంటే మనం స్వేచ్ఛా వాయువులను పీల్చాలి. ఇతర దేశస్తుల

భావనలను, ఆలోచనా విధానాలను పరిశీలించాలి. అన్నింటికన్నా ముఖ్యం మనం నిరంకుశులంగా ప్రవర్తించటం మానుకోవాలి.[5]

ఇలా పురోహితులపై ప్రజలను ఉసిగొల్పిన దీశాలి వివేకానందుడు హిందువునని గర్వంగా చెప్పుకున్నాడు.

పురోహిత పద్ధతిని నిర్మూలించాలని, నిరంకుశ ధోరణులను విడనాడాలని వివేకానందుని ఉద్బోధ:

ఈ నాటి హైందంలో - ఆ మాటకు వస్తే సనాతన హైందవంలో - స్త్రీలపై దుర్మార్గంగా అమానుషంగా అధికారం చలాయించడం, పూజారీ విధానం, స్త్రీలపై నిరంకుశ ధోరణి అన్నీ ఇమిడి ఉన్నాయని విదితమవుతుంది. అంతేకాక ఈ 'పూజారులు' మతగురువులు, ధర్మశాస్త్ర నిర్ణేతలు వీరి పెత్తనాన్ని స్త్రీలు సవాలు చేస్తే తప్ప స్త్రీ జాతికి ముక్తి, విముక్తి లేవని స్పష్టమవుతున్నది.

అధ్యాయం 13

# పాదదీపికలు

1. హైందవ విశిష్టత మరియు మార్పు చేసే సవాలు - శుభయా దాస్‌గుప్త : పుట 77

   Hindu Ethos and the Challenge of Change ; Subhayu Das Gupta (The Minerva Associates, Calcutta).
2. డిటో పుటలు 96 - 101
3. డిటో పుట 102

   Ref : S. N. Das Gupta : Dogmas of Indian Philosophy (Philosophical Essays) Calcutta University, 1941.
4. శుభయూదాస్ గుప్తా : పుట 216
5. కులం, సంస్కృతి, సోషలిజం : వివేకానంద.

   Caste, Culture & Socialism : Vivekananda, Adwaita Ashram, India - 1965.

అధ్యాయం

# 14 ఆధునిక వైజ్ఞానిక దృక్పథం

హిందూ సమాజపు చరిత్రను అధ్యయనం చేశాం. హిందూ ఆచార సంప్రదాయాలను క్షుణ్ణంగా కాకపోయినా తగినంత గాంఢంగా తెలుసుకున్నాము. వీటి వెనుకనున్న హిందూ మనస్తత్వాన్ని, బావనాప్రపంచాన్ని అవగాహన చేసుకున్నాం. కాగా ఈనాడు అమలులో ఉన్న హిందూ శాసనాలు ఎంత వరకు పురోగమించాయో, ఏమేరకు తిరోగమన భావాలకు రూపకల్పన చేశాయో, ఏయే అంశాలలో మార్పులు కావలసి వున్నాయో మదింపు వేసుకొని సమీక్షించుకోవటానికి మనకు ఒక కొలమానం, ఒక ప్రమాణం అత్యవసరం. ఆ కొలమానం హిందూ సంప్రదాయ పరంగా ఉండాల్సిన పనిలేదు. ఆ ప్రమాధం హిందూ మనస్తత్వాన్ని ఆధారంగా తీసుకోవలసిన అగత్యం లేదు. మరి అది ఎలాంటిది? దానికి ఆధార భూతాలైన మౌలిక భావాలు ఎట్టివి? ఆ మౌలిక భావాల వెనుక ఏదైనా తాత్విక ఆలోచనా స్రవంతి ఉన్నదా? ఆ ఆలోచనా విధానానికి అనువైన జీవిత సరళి ఎలాంటిది? ఈ ప్రశ్నలకు సమాధానాలను యీ అధ్యాయంలో కనుగొన ప్రయత్నిద్దాం.

మానవ చరిత్ర మతాల చరిత్ర కన్న విస్తృతమైనది. ప్రాంతీయ సామాజిక ధోరణులను మించిన విలువకలది అంటే అది హైందవం కన్న విశాలమైనది. క్రైస్తవం కన్న పురాతనమైనది. ఇస్లాం విషయం వేరే పేర్కొన పనిలేదు. అది కేవలం 1300 సంవత్సరాలనాడు పుట్టిన మతం. అదీగాక దాని మౌలిక భావాలకు పురాతన యూదు చరిత్రలో పునాదులు ఉన్నాయి. కనుక ఏ ఒక్క మతస్థుడూ, ఏ ఒక్క దేశస్థుడూ తన సంస్కృతి గొప్పదనే అహంకారంతో సంచరించపనిలేదు. ఎన్నో నాగరికతలు పుట్టి, పెరిగి, కాలగర్భంలో కలిసిపోయాయి. దక్షిణ అమెరికాలోని మాయా నాగరికత, బాబిలోనియను నాగరికత, సుమేరియను నాగరికత, ఇలా ఎన్నో ఉద్భవించి, ఎదిగి, నమసిపోయాయి. చైనా సంస్కృతి భారత ఆర్యుల

సంస్కృతివలె ఐదువేల ఏండ్ల చరిత్ర కలది. ఈజిప్టు ఒకనాడు సంస్కృతీ క్షేత్రంగా విరాజిల్లింది. ఇదంతా అందరికీ తెలిసిన విషయమే. దీనిని ఇపుడు పునశ్చరణ చేయడంలో ఉద్దేశం ఏమంటే-ఏ జాతీ, ఏ దేశం, ఏ ప్రాంతం, ఏ మతం తన సంస్కృతీ, నాగరికతలు మాత్రమే గొప్పవని విర్రవీగరాదని మనవి చేయడానికే.

ఆధునిక వైజ్ఞానిక దృక్పథం అనగా ఈనాడే సైన్సు పుట్టిందా, పూర్వం సైన్సుకు ఉనికియే లేదా? అని ప్రశ్నించవచ్చును. విజ్ఞానం ఈనాడు పుట్టలేదు. మానవ జీవితంతో ఆరంభమయినది. రెండు రాళ్ళను రాపిడిచేసి అగ్నిని రాజించినప్పుడే పుట్టింది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మానవుని పూర్వీకుడైన కోతి చెట్టుకొమ్మను విరిచి దానిని గడగా వాడుకొని లేత కొమ్మమీది కాయను కొట్టి నేలపై పడవేసినప్పుడే మొదలయింది. అంటే ఒక పనిముట్టు, సాధనం యొక్క సృష్టి జరిగిందన్నమాట. మనిషికి హేతుత్వ శక్తి ఉన్నది. ఆలోచించగల సత్తా, తన అనుభవాన్ని నెమరువేసుకొని తర్క - వితర్కాలు చేసి సమన్వయం చేసుకొని నూతనానుభవాన్ని ఎలా ఎదుర్కోవాలో తేల్చుకోగల ప్రజ్ఞ, భావనా బలం, మననం చేసుకోగల తాహతు, జ్ఞాపకశక్తి, అన్నింటికన్న మిన్న సృజనాకౌశల్యం ఉన్నాయి. తన పరిసరాలను తనకు అనుకూలంగా అమలుపరచుకొని సుఖాన్ని, ఆనందాన్ని పొందగల నేర్పు మానవవ్యక్తి సొమ్ము. అంటే అతనికి స్వతంత్ర ప్రతిపత్తి ఉందన్నమాట. ప్రకృతి శక్తులను ఎలా అదుపులో పెట్టుకోవాలో, ఎలా వాటివల్ల లాభమూ, ప్రయోజనమూ పొందాలో, మానవవ్యక్తి తెలుసుకోవటం జరిగింది. ప్రకృతిని పూర్తిగా జయించలేనని తెలుసుకున్న అతడు లేక ఆమె ప్రకృతి ధర్మాలను అవగతం చేసుకోవటానికి తద్వారా ప్రకృతిని తన అధీనంలోకి తెచ్చుకోవటానికి ప్రయత్నం చేయటం సాగుతున్నది. ఇక్కడ ఒక్క అంశాన్ని విస్మరించరాదు. ఈ అనంత విశ్వంలో (Unbounded Universe) మనం నివశిస్తున్న భూమి ఒక సూర్యునికి సంబంధించిన కుటుంబంలోనిది. సూర్యుడు ఒక నక్షత్రం. అలాంటి సూర్యులు లక్షలసంఖ్యలో ఉన్నాయి. నక్షత్రాలు కలిసి గెలక్సీలుగా ఏర్పడతాయి. ఆ గెలక్సీలుఅనేకం. కనుక మొత్తం మీద ఒక విషయం తేలుతుంది. విశ్వం బ్రహ్మాండమైనది. అందులో ఒక మారుమూల ఉన్న మనం రోజూ చూస్తూ ఉన్న సౌరకుటుంబంలోని భూమిపై మనం నడయాడుతున్నాము. ఇదంతా తలుచుకుంటే మానవుని అల్పత్వం

గోచరిస్తుంది. దురహంకారం పటాపంచలవుతుంది. మానవుని మనస్సులో వినయం పొడసూపుతుంది. విస్మయం తలఎత్తుతుంది. ఆశ్చర్యం తల మునకలు చేస్తుంది.

ఈ విషయజ్ఞానాన్ని పొందిన మనిషి దురహంకారి కాలేడు; కారాదు. అయితే న్యూనతా భావంతో కుృంగిపోరాదు. సమతుల్య మానసికస్థితిని పెంపొందించుకోవాలి. లేకపోతే మానవ జీవితం దుర్భరమవుతుంది.

విజ్ఞానం వృద్ధిపొందింది. తత్ఫలితంగా అనేక యంత్రాలకు, సాధనాలకు రూపకల్పన చేసుకున్నాము. ఒకనాడు దేవతగా భావించిన చంద్రునిపై కాలూనాము. మామూలు పద్ధతిలో రాకపోకలు సాగిస్తున్నాము. దూరదర్శన దూర శ్రవణాది సౌకర్యాలను ఏర్పరచుకున్నాము. జీవకణాలను ప్రయోగ శాలలో తయారుచేసే స్థితికి చేరువ అయ్యాము. ఎలాంటి సంతానం కావాలో అలాంటి సంతానాన్ని పొందగల స్థితికి సమాజం ఇంచుమించుగా వచ్చేసినట్లే. ప్రకృతిలోని గ్రహాలను, ఉపగ్రహాలను చూచి, వాటి తీరు గమనించి కృత్రిమ ఉపగ్రహాలను సృష్టించాం. ప్రమాణంలో వేగాన్ని పెంచుకున్నాం. వాయు వేగాన్ని అధిగమించాం. కాంతి వేగాన్ని లెక్కకట్టాం. పదార్థంలో ఉండే అణువును బదాబదలు చేసి బ్రహ్మాండమైన శక్తిని విడుదల చేసి కొండలను పిండిచేస్తున్నాం. నదులను మళ్ళిస్తున్నాం. పొలాల ఫలసాయాన్ని పెంచుకున్నాం, అనవసర క్రిమి, కీటకాదులను సంహారం చేసుకున్నాం. ఇలా ఎంతో ప్రగతిని సాధించాం. కాని ఇదే సందర్భంలో ప్రకృతి జ్ఞానం పెరిగినంతగా మనిషి మానసిక వికాసం పెరగలేదు. మనుష్యులలో ఒక తెగ ఐదువేల సంవత్సరాలనాటి భావాలతో మనుగడ సాగిస్తుంటే మరొకతెగ రెండువేల సంవత్సరాల సంస్కృతితో జీవయాత్ర సాగిస్తోంది. వేరొక శాఖ వెయ్యి సంవత్సరాల క్రిందటి ఆచార వ్యవహారాలను పాటిస్తూ తమ జీవిత విధానమే ఉత్కృష్టమైనదని తలపోస్తోంది. కాగా దౌర్భాగ్యమేమంటే, మానవ సృజనాశక్తి యొక్క విస్తారతను, గాంభీర్యతను చాలమంది అవగాహన చేసుకోకపోవటం. తమశాఖవారు అభిమానించే రుషినో, ప్రవక్తనో, మహా గురువునో, నాయకునినో 'దైవసమానుని' చేసి అతని వాక్యమే తుది వాక్యమని, అతని ఆలోచనా ధోరణి మించినది లేదని, అతని మేధాశక్తి అనంతమని భావిస్తూ తమ జీవితాలను, ఇతరుల జీవితాలను దుఃఖభాజనం చేసుకుంటున్నారు. ఇక్కడే ఉంది ప్రమాదం.

ప్రకృతి శక్తులను చూచి విస్మయం చెందిన మనిషి రూపుకల్పన చేసుకున్నాడు. తనలాంటి మనిషిని ఊహించుకున్నాడు వాటికి ప్రతీకగా. కాగా తనకున్న ప్రకృతి శక్తులు ఎన్నో రెట్లు శక్తివంతం కనుక అధి మానవుని సృష్టించాడు తన మనస్సులో. దేవతలు పెరిగిపోయారు సంఖ్యలో. సమాజ జీవితంలో మార్పులు వచ్చాయి. సమాజంలో నాయకుడు పుట్టాడు. సమాజాలు ఒకదానితో మరొకటి పోరాటానికి దిగాయి. ఒక సమాజపు నాయకుడు మరొక సమాజపు నాయకునితో పోరాటానికి తలపడ్డాడు. ఆ క్రమంలో బాగా బలవంతుడైన నాయకుడొకడు తన సమాజ అండ దండలతో తతిమ్మా వారిని లొంగదీసుకున్నాడు. సామ్రాజ్యాలు వెలిశాయి. సామ్రాట్టు ఉన్నట్లు దేవతలకు ఒక అధిపతి పుట్టాడు. చివరకు దేవుడు ఒకడే అయినాడు. ప్రకృతి ధర్మాలను తగినంతగా అవగాహన చేసుకోలేని ఆ స్థితిలో ఆ దేవుని బలులతో తృప్తిపరచి, శాంతింపచేసి, ప్రార్ధనలు చేసి అనుగ్రహం పొందాలని మానవజాతి ప్రయత్నించింది. ఆ క్రమంలో పూజా విధానం జన్మ ఎత్తింది. పూజారులు రంగం మీదికి వచ్చారు. వారికి చేతి నిండాపని, పూర్తి కాలపు పని కలిగింది. కనుక జీవనోపాధికి ఏర్పాట్లు అవసరమయ్యాయి. అప్పటికి సంపాదించిన ప్రకృతి విషయ పరిజ్ఞానంలో ప్రజానీకాన్ని హడలగొట్టించిన వారు తమ అవసరాలను తామే నిర్ణయించు కున్నారు. వాటిని తమకు అందించాలని సమాజాలను కట్టడిచేశారు. ఆ కట్టడిని అమలు పరచమని సమాజ నాయకులను ఆదేశించారు. వారు శిరసా వహించారు మొదట్లో. పూజారుల బుద్ధిబలం, నాయకుల కండబలం సామాన్యులను అదుపులో పెట్టాయి. ధర్మాలను ప్రవచనం చేశారు పూజారులు; వాటిని అమలుచేశారు నాయకులు వరపు రాజులు. అలా సాగింది కొంతకాలం. పూజారుల అహంభావం పెరిగిపోయింది. నాయకులు, రాజులు ఎదురు తిరిగారు, వ్యాపారస్తులు రాజులకు వంతపలికారు. భారత దేశంలో ఒక వెయ్యిసంవత్సరాలు బౌద్ధ, జైనాల పేరుతో ఆ తిరుగుబాటు సాగింది, పూజారులు పుంజుకున్నారు. క్రొత్త రకపు నాయకులను తయారు చేస్తున్నారు. తమ ఆధిపత్యాన్ని మరల స్థాపించుకున్నారు. ఇది ఒక పరిణామం. మానవ సమాజంలో అన్ని ప్రాంతాలలో, వేరు వేరు కాలాలలో మరో ధోరణి చెలరేగింది. అది ప్రశ్నించే ధోరణి. వారు పూజారులను, మతగురువులను, నాయకులను ప్రశ్నించ నారంభించారు. సామాజిక వ్యవస్థయొక్క మౌలిక

సూత్రాలను ప్రశ్నించారు. సమాజంలో అసమానత, దోపిడి, అక్రమం, అన్యాయం అన్నింటిని తలదన్నిన దుస్థితిని, అజ్ఞానం పెచ్చు పెరిగిపోవడాన్ని, వారు సహించలేకపోయారు. సమాజాన్ని మార్చాలని వారు భావించారు. సమాజంయొక్క ఆధారాలను తెలుసుకోవాలనుకున్నారు. 'సత్యం' యొక్క స్వరూపాన్ని అర్థం చేసుకోవాలని తహ తహ లాడారు. ఈ తపన అన్ని రంగాలలో ప్రదర్శిత మయింది. ప్రకృతి శక్తుల సత్యస్వరూపాన్ని తెలుసు కోవాలనే ఆకాంక్ష ఆధునిక విజ్ఞానానికి బీజాలు వేశింది. సైన్సు ఈనాటి రూపంలో పుట్టింది. దానికి కొన్ని పద్ధతులను ఏర్పరచుకున్నారు. అదే వైజ్ఞానిక పద్ధతి.

సైన్సు వేరు, సైన్సు ఫలితాలు వేరు. విజ్ఞానాన్ని సరిగా వాడుకోలేక మానవ ప్రపంచాన్ని బదాబదలు చేసుకొని సర్వనాశనం చేసుకునే ప్రయత్నాలు అజ్ఞానయుత, దురహంకారయుత వైఖరితో సాగుతున్న ఈ తరుణంలో కూడ విజ్ఞానాన్ని తిట్టిపోసినందువల్ల లాభంలేదు. విజ్ఞానం మనకు పనిముట్లను అందిస్తుంది. వాటిని సక్రమంగా మానవ సంక్షేమం కోసం వాడుకుంటే మనం బాగుపడతాము. లేకపోతే వినాశకర పరిస్థితులను కొని తెచ్చుకుంటాము. తప్పు అంతా సమాజాల నాయకులది. సైన్సుపని చేసే తీరును గమనించాలి. ముందు ఒక ఊహాధారంతో బయలుదేరి ప్రయోగంచేసి, ఫలితాన్నిబట్టి ఆ ఊహాధారం సరియైనదో కాదో తేల్చుకోవటం ఆ పద్ధతి. ఆలోచనా పద్ధతి క్రమంగా, తర్కయుతంగా ఉండాలి. భిన్నవిషయాల పరస్పర వైరుధ్యాల కన్న సమన్వయానికి ప్రాధాన్యత ఇవ్వాలి. ఆలోచనా, తర్కం, ఊహ, ప్రయోగం, ఫలితం, సరిపోల్చుకొనుట, సమన్వయం ఇలా సాగి పోతుంది. విజ్ఞానయాత్రా రథం. వైజ్ఞానికుడు సత్యాన్వేషి. అతనికి వ్యక్తి గత ఆవేశకావేషాలు ఉండరాదు. నిస్సంగత్వం అతని లక్షణంగా ఉండాలి. అతనిలో విశ్వశ్రేయస్సు, మానవ సంక్షేమం, సత్యనిరతి, స్వేచ్ఛా పిపాసకల మానవునిపట్ల గౌరవం, మానవ విలువలయెడ అభిమానం చోటుచేసుకుంటాయి. అతనికి వినయం ఉంటుందని తెలిసికొన్నాం. అతనికి ఏదైనా తెలియక పోతే తెలియదని అంగీకరిస్తాడు. కాకపోతే జీవితపు పోకడ చూచినవాడు కనుక జీవితానుభవాన్ని బట్టి ఈనాడు తెలియని విషయం రేపు తెలుసుకో గలమనే ఆత్మవిశ్వాసం కలిగిఉంటాడు. వందసంవత్సరాలక్రితం తెలియని విషయం ఈనాడు తెలుసుకున్నాం. అలాగే ఈనాడు తెలియనిది రేపు

తెలుసుకోగలము. ఇది అనుభవాన్ని బట్టి తెలుసుకున్న సత్యం, దీనిని అనుసరిస్తాడు. ఇది అంధవిశ్వాసం కాదు. సత్యమార్గ పయనం.

ప్రకృతి శక్తులను గమనిస్తున్నాం. వాటి స్వరూపాలను గుర్తించాం. వాటి పరస్పర సంబంధాలను పరిశీలించాం. అవి ఒక రూపంనుండి మరో రూపానికి ఎలా మారుతున్నాయో గ్రహించి వాటిని ఆలా మలుచుకుంటున్నాం. కాగా ఈ ప్రకృతిలో ఉన్న శక్తి అంతా ఒకటే అని, దాని రూపాంతరాలు వేరని తెలుసుకున్నాం. అంతటితో ఆగిపోయాడు ప్రస్తుతానికి ఆధునిక వైజ్ఞానికుడు, ఇక్కడ "నేను వస్తున్నాను" అంటూ తయారయ్యాడు మతవాది. ఈ ప్రకృతి శక్తికి ఆధారభూతం దైవం అన్నాడు. దానికి పూజాదిక కార్యక్రమాలు, తంతు నిర్ణయం చేశాడు. దేవుని ఉనికి ఊహా అంటాడు వైజ్ఞానికుడు. 'నీ శక్తికి పరిధి ఉన్నది' అంటాడు మతవాది. ఇదీ ఈనాటి ఘర్షణ. ఇది భావాలకు పరిమితం కాలేదు. సామాజిక జీవితానికి ప్రాకింది. ఒక్కొక్క దేవుని ఆవేశం ప్రకారం - ఆ దేవుడు ప్రవక్తకో, రుషికో దర్శనమయి చెప్తాడు - ఒక్కొక్క సామాజిక విధానం యేర్పడుతుందని శాసిస్తారు మతవాదులు. ఇలా వివిధ సామాజిక రీతులమధ్య సంఘర్షణ సాగుతుంది. మతయుద్ధాలు సాగుతయి! సాగాయి, ఈనాడుకూడా సాగుతున్నాయి. ఈ సంఘటనల వెనుక ఆలోచనకు అందని 'విశిష్ట దైవ భావం' ఉన్నదని మరచిపోరాదు. కేవలం ఊహపై ఆధారపడి యావత్తు జీవితాన్ని ప్రభావితం చేసుకొని, జీవితంలో సుఖసంపాదనను, ఆనంద ప్రాప్తిని, మానసిక శాంతి సాధనను వదులుకోవటం మంచిది కాదని వైజ్ఞానికుడు అంటాడు. అలాగని ప్రకటిస్తాడు. సత్యం ఒక్కరి సొమ్ము కాదని, సత్యం మానవాళి సమష్టి కృషి ఫలిత సాధ్యమని అతని విశ్వాసం. అది అతని జీవితానుభవ సూత్రం.

ఆధునిక వైజ్ఞానిక పద్ధతిని ఈనాడు మనం సమాజ జీవితానికి, కుటుంబ జీవితానికి, స్త్రీ పురుషుల సంబంధాలకు వర్తింపచేస్తే మనకు అనేక విషయాలు క్రొత్తవి తెలుస్తాయి. పాతవి క్రొత్త వెలుగుతో కన్పడతాయి. నూతన జీవిత సత్యాలు దర్శనమిస్తాయి. వాటికి అనుగుణంగా మనం నడుచుకోవటానికి ప్రయత్నిస్తే ఆధునికులం అనిపించుకోగలం. కారును, విమానాన్ని దూరదర్శన యంత్రాన్ని వాడిన ప్రతి మనిసి ఆధునికుడు కాడు. ఆధునిక

విజ్ఞాన సూత్రాల ప్రకారం జీవితాలను మలుచుకోడానికి సిద్ధపడితేనే మనం ఆధునికులంగా చలామణీ కాగలం. ఆధునిక విజ్ఞానం ఏం చెప్తున్నదో జ్ఞాపకం చేసుకోవడం అవసరం.

స్త్రీ పురుషులు సమానులు, ఇది భౌతిక సత్యం. ఇద్దరిలోను మేధా శక్తి పనిచేస్తున్నది, ఇద్దరూ ఇంచుమించుగా సమాన శక్తి యుక్తులు కల వారు. కాగా స్త్రీకి అదనంగా ఒక శక్తి ఉంది. అదే గర్భధారణ లేక సంతాన సాధన శక్తి. దానికి తగిన అవయవ నిర్మాణం ప్రకృతి పరిణామంలో ఆమెకు లభించింది. తద్వారా జాతి జీవితాన్ని కొనసాగించటానికి ఆమె సాయపడుతున్నది. ఇది ఆమెకు కలికితురాయి.

స్త్రీ మాత్రమే సంతానాన్ని కనగలదు, కాని భార్యా భర్తలలో ఎవరికైనా లేక ఇరువురికి శిశుపోషణ చేయగల శక్తి వుంది. కుటుంబ జీవితానికి స్త్రీ పురుషుల సాన్నిహిత్యం, సాంగత్యం అవసరం. లైంగిక సంపర్కం భార్యాభర్తల అనుబంధాన్ని బట్టి గట్టి చేస్తుంది. అది ప్రకృతి సహజచర్య. అది స్త్రీ పురుషులిద్దరికీ ఆనందాన్ని చేకూరుస్తుంది. సెక్సు అనుభవాన్ని సంతాన ప్రాప్తిని విడదీసి ఆలోచించాలి. సంతాన ప్రాప్తికి సెక్సు సంయోగం అవసరము కావచ్చును. కాని సంతానాన్ని అభిలషించని లైంగిక సన్నిహితత్వం ఉనికి కలిగి వుందనేది నగ్న సత్యం. అది సాధ్యమయింది ఈనాటి విజ్ఞాన ఫలితంగా, ప్రపంచ జనాభా విపరీతంగా పెరిగిపోతున్నది. ఆ సత్యాన్ని గుర్తించి కొందరు దంపతులు జన్మనిగ్రహాన్ని పాటిస్తున్నారు. అధిక సంతానం వలన కల్గే అనారోగ్యాన్ని తనకు కలుగకుండా చేసుకోవటానికి, ఇంకా యితర కారణాలపై స్త్రీ సంతానాన్ని క్రమబద్ధం చేసుకుంటున్నది. తన సంతానాన్ని క్రమబద్ధం చేసుకోవటానికి, తను సంతానాన్ని కనకుండా ఉండటానికి స్త్రీకి ఆధునిక విజ్ఞానం సమాచారాన్ని, సాధనాలను, శక్తిని ఇస్తున్నది. దాంతో స్త్రీకి మాతృత్వం ఐచ్ఛికం అయింది.

స్త్రీ పురుషుల సంయోగంతో నిమిత్తం లేకుండా సంతానప్రాప్తి సాధ్యం అయింది. ఒక స్త్రీ మరియొక స్త్రీకి సాయపడడానికి తన గర్భసంచిని (Uterus) అరువు ఇవ్వవచ్చును. అలాగే పరపురుష సంపర్కం లేకుండా కృత్రిమ గర్భధారణ సాధ్యం. ఫలాని లక్షణాలు కల సంతానం కావాలందే లక్ష్యం చేసే ప్రక్రియలు ఈనాడు సాధ్యమవుతున్నాయి.

పురుషుడితో సమానంగా స్త్రీ అన్ని విద్యలు నేర్వగలదు. పురుషాధిపత్యానికి శారీరక శాస్త్రంలో ఆధారాలు లేవు.

మానవజాతి అంతా ఒకటే. హిందువులలో ఒకరక్తం, ముస్లింలలో ఒకరక్తం లేదు. అలాగే స్త్రీ పురుషులతో కూడాను. అందరిలోను ఉన్న రక్తం ఒకటే. కాకపోతే వర్గీకరణ మాత్రం వుంది. పురుషుడిలో 'ఏ' గ్రూపు రక్తం ఉండవచ్చు. స్త్రీలోనూ 'ఏ' గ్రూపు రక్తం వుండవచ్చును. ఈ సూత్రమే అన్ని గ్రూపులకు వర్తిస్తుంది. ఈనాడు ధరహంమీద మానవ సమాజంలోనూ ప్రత్యేకంగా భారత ప్రజానీకంలోనూ ఏ జాతికూడా సంకరం కాని స్థితిలో లేదు. మానవాళి అంతా ఒకటే. వర్ణభేదం [రంగు తేడా) స్త్రీ పురుషుల కలయికకు అవకాశం ఉంది. హిందూ మతంలోని వర్ణ వ్యవస్థ, కులవ్యవస్థ స్త్రీ పురుష సంయోగ, వియోగాలకు అడ్డురావు.

సామాజిక, ఆర్థిక రాజకీయ వ్యవస్థలు మానవ నిర్మాతలు. సాంస్కృతిక సౌధం సమష్టి మానవ జీవిత ఫలం.

దగ్గర పూర్వీకుని ద్వారా జన్మను పొందినవారి మధ్య దాంపత్య జీవితం వల్ల కలిగే సంతానం వికలాంగంగా పుట్టే అవకాశం ఎక్కువ వున్నట్లు సైన్సు రుజువు చేసింది.

హిందూ ధర్మశాస్త్రజ్ఞులు స్త్రీకి సంతాన ప్రాప్తికి అనువైనవిగా, రుతుమతి అయిన తదుపరి కొన్ని దినాలను నిర్ణయించారు. ఆ పెద్దల అంచనాలకు శారీరక శాస్త్రంలో ఆధారం లేదు. వారికి విషయం తెలియదు. వాస్తవానికి ఆ రోజులు ఆమెకు సంతాన ప్రాప్తికి అనువు కాని రోజులు. రుతుమతియైన స్త్రీ, ప్రసవించిన స్త్రీ అస్పృశ్యులు అనడానికి విజ్ఞాన శాస్త్రంలో ఏ విధమైన సమర్థన లభించదు.

ఈ వైజ్ఞానిక సత్యాలను సామాజిక జీవితానికి అన్వయం చేస్తే కొన్ని ముఖ్యమైన నిర్ణయాలకు రాగలుగుతాం,

వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ అర్థరహితం. వీటివిషయంగా స్త్రీల చర్యలను నియంత్రణం చేయడం పొరపాటు. స్త్రీ ఒక వ్యక్తి. పురుషుడు మరొక

వ్యక్తి. ఇరువురికీ వ్యక్తి వికాసానికి హక్కు ఉన్నది. ఒకరు మరొకరి వస్తువుకాదు, బానిసకాదు; కారాదు. స్త్రీ ద్వితీయస్థాయి జీవికాదు. స్త్రీ పురుషులకు ఒకే విధమైన సంస్కారాలు ఉండవచ్చును. ఉదాహరణకు ఉపనయనాదులను పేర్కొనవచ్చును. ఇరువురికీ ఒకేరకపు విద్య అందుబాటులో ఉండాలి. ఇంటిపని స్త్రీకి మాత్రమే కేటాయించటం అక్రమం. భార్యాభర్తలిద్దరూ పాలుపంచుకోవాలి. అలాగే శిశుపోషణ, పిల్లల పెంపకం ఇద్దరి కర్తవ్యం. సంతానాన్ని కనాలో అక్కరలేదో వస్తుతః నిర్ణయించుకోవలసింది స్త్రీయే. నవమాసాలు గర్భస్థశిశువును మోసేది ఆమే కదా! పిల్లలకు తల్లిద్వారా పేరుండాలి. మాతృత్వం రూఢి అంటే తనబిడ్డ తండ్రియవరో తల్లికి మాత్రమే తెలుసు. కనుక పితృస్వామ్యం వైజ్ఞానిక సత్యాలకు వ్యతిరేకం. మాతృస్వామ్యం వైజ్ఞానిక జ్ఞానానికి అనువుగా ఉంటుంది. భార్యాభర్తలలో ఏ ఒక్కరు కోరినా వివాహవిచ్ఛేదనం జరగాలి. భార్యపై భర్త కూడా లైంగిక హింసకుగాని మరే హింసకుగాని పాల్పడరాదు. వివాహమే స్త్రీకి జీవిత పరమావధి అని నిర్ణయించటం, బోధించటం పొరపాటు. బాల్యవివాహాలు స్త్రీకి హానికలిగిస్తాయి. రజస్వల అవడం అంటే ఆమె స్త్రీగా రూపొందడానికి నాంది అన్నమాట. రజస్వల అయినంత మాత్రాన ఆమె స్త్రీత్వాన్ని సంపూర్ణంగా పొందినదనుకోవడం సరియైన భావన కాదు. స్త్రీ అస్వంతంత్రకాదు. ఆమెకు స్వతంత్ర ప్రతిపత్తి ఉంది. కాగా వైవాహిక జీవితంలో భార్యాభర్తలు పరస్పరం సహకరించుకుంటారు. వారిరువురు వేరువేరు వ్యక్తులు. ఇరువురు ఒకరుకాదు. స్త్రీ వ్యక్తిత్వం పురుషుని వ్యక్తిత్వంలో మిళితం కావలసిన అవసరం లేదు. పాతివ్రత్యం స్త్రీని కించపరిచే సూత్రం. స్త్రీ అవివాహితగా ఉండటానికి హక్కు కలిగి వుంది. ఆ మాటకు వస్తే స్త్రీ అవివాహిత మాత కావడానికి కూడా ఆమెకు హక్కున్నది. ఇతరుల శ్రేయస్సుకు, స్వేచ్ఛకు భంగం కాని రీతిలో, తన హోదాను వ్యక్తిత్వాన్ని కించపరచుకోకుండా స్త్రీ జీవించడానికి ఆమెకు హక్కు ఉంది. సంతానం కనమని నిర్బంధించటానికి గాని, పురుష సంతానం కలిగే వరకు పిల్లలను కనమని బలవంతం చెయ్యటానికి గాని భర్తకు హక్కులేదు. ఆమె శరీరంపై హక్కు పూర్తిగా ఆమెదే. గర్భస్రావం చేసుకోడానికి, చేసుకోక పోవడానికి ఆమె ఇష్టాయిష్టాలే నిర్ణాయక విషయాలు కావాలి.

స్త్రీని దానం చేయడానికి తల్లిదండ్రులకు కూడా హక్కు లేదు. కన్యాదానం అర్థరహితమైన తంతు. 'నన్ను అనుసరించుము' అని వరుడు సప్తపదిలో వధువును కోరటం కూడా అనుచితమే. సమానత్వ సూత్రానికి ఇది వ్యతిరేకం. పురుషాధిపత్య చిహ్నాలయిన పెండ్లి తంతులన్నీ అక్రమం. వధువుకు మంగళసూత్ర ధారణ సమానత్వ సిద్ధాంతానికి వ్యతిరేకం. అన్ని కులాలవారు మంగళసూత్రం కట్టిస్తున్నారు (దక్షిణాపథాన). కాని వరుడు తనమెడలో ఏదైనా కట్టించుకొని జీవితకాలమంతా తను వివాహిత వ్యక్తినని తెలియజేయటం లేదే! "ఓ దేవా! మగపిల్లవానిని ఇమ్ము", "ఓ దేవా! గర్భస్థ పిండాన్ని మగశిశువుగా మార్చుము" అనే మంత్రాలు స్త్రీని అవమానపర్చటమే. దేవుడు వీరి ప్రార్థనలను విని సమాజంలో శిశువులందరినీ మగశిశువులుగా పుట్టిస్తే ఈ మగవారి గతి ఏమవుతుంది? సమాజపు మనుగడ ఏది? మానవ జాతి - ప్రస్తుతం హిందూజాతి - నశించదా?

వివాహిత, అవివాహిత; విధవ, విడాకులు పొందిన స్త్రీ ఎవరైనా ఏ పిల్లనైనా - పురుషునిగాని, స్త్రీనిగాని దత్తు చేసుకోవచ్చు. అని ధర్మ సూత్రీకరణ చేయాలి. విడాకులు పొందినపుడు స్త్రీ పురుషులు కలసి పెంపొందించిన ఆస్తిని, కలసి కృషిచేసి సంపాదించిన ఆస్తిని చెరిసగంగా తీసుకోవాలి. ఆమె ఇంట్లో చేసిన పని భర్త ఇంటి వెలుపల సంపాదించిన వృత్తితో సమానంగా ఎంచాలి. వారసత్వ విషయంలో భర్త పేరనున్న ఆస్తిలో సగం ఆమెకు ఇచ్చి తరువాత తతిమ్మావారు, కుమారులు కుమార్తెలు పంచుకోవాలి. పిత్రార్జితపు ఆస్తిలో కుమారులకు గాని కుమార్తెలకుగాని జన్మతః హక్కు ఉండరాదు. కాపురానికి రమ్మనమని పిటీషను పెట్టి, ఉత్తర్వులు పొంది, వానిని అమలు పర్చుటకై, ఒకరి ఆస్తిని రెండోవారు జప్తుచేయించి, వేలానికి తెచ్చుటద్వారా ఒత్తిడిచేయడం ధర్మవిరుద్ధం. అసలు ఆ ప్రక్రియకు స్వస్తి చెప్పాలి. వివాహరథం కుంటుపడిందని ఒకరు ఆరోపణ చేసినపుడు, అది నిర్ధారణ అయితే, దానికి ఎవరు కారకులు, ఎవరు నిందార్హులు అనే అనవసర విచారణకు దిగకుండా భార్యాభర్తలకు విడాకులు ఇవ్వాలి. సంతానానికి ఎవరు సంరక్షకులుగా ఉండాలో భార్యాభర్తలు తేల్చుకోవటానికి అవకాశం ఇవ్వాలి. వారిమధ్య అంగీకారం లేనిచో భార్యయే ప్రథమ సంరక్షకురాలిగా ఉండాలి. ఆమె జీవించి ఉండని పక్షములో

భర్తకు ఆ అధికారం సంక్రమిస్తుంది. వివాహం కాగానే భార్య భర్త ఇంటికి కాపురానికి పోవాలనే నిబంధన మారాలి. అది వారిరువురి సమ్మతిపై ఆధారపడాలి. అలా అంగీకారం కుదరని పక్షంలో ఎవరికి వారే వేరు వేరు ప్రదేశాలలో వేరు వేరు గృహాలలో కాపురం ఉంచవచ్చును. భర్త ఇంట్లోనే కాపురం ఉండాలని ఏ న్యాయస్థానము ఆమెను ఆదేశించరాదు. వివాహమయిన దరిమిలా విద్యార్థి దశను కొనసాగించడమా లేదా అనేది, అలాగే ఆమె ఉద్యోగం చేయడమా లేదా అనేది భార్య ఇష్టంమీద మాత్రమే ఆధారపడాలి. శాసించడానికి భర్తకు అధికారం లేదు. ఒకరి సంపాదనను మరొకరు స్వంతం చేసుకోవడానికి దత్తం చేసుకోవడానికి హక్కులేదు. సభ్యత పేర, సంస్కారం పేర స్త్రీ యొక్క సంచార స్వాతంత్ర్యాన్ని, భావస్వాతంత్ర్యాన్ని అరికట్టడానికి భర్తకు కూడా హక్కులేదు. అట్లే ఆమె రాజకీయ అభిప్రాయాలమీద, రాజకీయ ఆచరణమీద పెత్తనం సాగించటానికి భర్తకు కూడా హక్కులేదు. స్త్రీయొక్క అభిరుచులను, ప్రదేశాన్ని, శిక్షణను భర్త అదుపులో ఉంచరాదు.

తల్లిదండ్రులు తమ కుమార్తె వివాహవిషయంలో ఆమెపై ఒత్తిడి తేరాదు. వివాహం ఆమె వ్యక్తిగత విషయం. అట్లే ఉద్యోగం, ఆమె అభిరుచులు, వ్యాసంగాలు ఆమె ఇష్టాఇష్టాలపై ఆధారపడతాయి. అయుక్త వయస్కులైన బాలికలకు (మైనర్లకు) ఎవరు వివాహం చేసినా చెల్లరాదు, ఆ వివాహం 'లా' ప్రకారం జరగనట్లుగానే భావించాలి.

వివాహిత స్త్రీతో వ్యభిచారం చేసిన పురుషునికి శిక్ష విధించే సెక్షను భారత శిక్షాస్మృతినుండి తీసివేయాలి. పురుషుని వస్తువును దొంగిలించిన వానికి శిక్ష ఉన్నట్లే భార్యతో జారత్వం చేసినవానికి శిక్ష వేయడానికి ఆస్కారమిస్తుంది ఆ శిక్షాస్మృతి. అది పొరపాటు. స్త్రీ భర్త వస్తువు కాదు. ఆలోచనయూ, ఇచ్ఛయూ ఉన్న వ్యక్తి. జారత్వం తప్పే; అది విడాకులకు కారణభూతం కావచ్చును; కాని శిక్షకు పాత్రమైనదిక కారాదు. పై చెప్పిన ఉపమానాన్ని కొనసాగిస్తే (దొంగలించుట నేరమనేది) భర్తతో వ్యభిచరించిన పరాయిస్త్రీకి శిక్ష ఉండాలికదా; అటిలేదు శిక్షాస్మృతిలో. జారత్వానికి మొదట్లో ఇరువురికి మనువు శిక్షలు చెప్పాడు. స్త్రీలపై జాలికలిగి బ్రిటిషు వారు స్త్రీలపై శిక్షలు తీసివేశారు. కనుక ఈ రకంగా పాదించటం పొరపాటు

అని ప్రతివాదన చేయవచ్చు. అది సమర్థనీయం కాదు. శిక్షాస్మృతిలో నిబంధన ఎందుకు వచ్చిందనేది కాదు సమస్య. ఇపుడున్న రూపంలో అది అర్థరహితమేనా కాదా లేక స్త్రీల గౌరవానికి, హుందాకు, స్వతంత్ర ప్రవృత్తికి భంగకరమగునా లేదా అనేది చర్చనీయాంశంగా ఉండాలి.

బాలబాలికలను పెంచడంతో తల్లిదండ్రుల ఇంటిలో సాగే వివక్ష నిర్మూలనం కావాలి. స్త్రీకి అణకువ, విధేయత, సర్దుకుపోవటం అనే గుణాలను ఉగ్గుపాలతో నూరిపోయటం మానాలి. విద్యాబుద్ధులు చెప్పించటంలో ప్రదర్శితమయ్యే పక్షపాత దృష్టి పోవాలి.

ఇలా సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో స్త్రీకి స్వేచ్ఛ, సమానత్వం సిద్ధించాలి. అపుడే ఆధునిక వైజ్ఞానానికి దృక్పథాన్ని అలవర్చుకున్నామని మనం సంతసించవచ్చు. లేనినాడు అంధవిశ్వాసాలనే పాములున్న ఇంట్లో కాపురమున్నట్లే. వైజ్ఞానిక వ్యతిరేక భావాలు స్త్రీలకు మాత్రమే వ్యతిరేకమని, నష్టదాయకమని, వారి ప్రయోజనాలకు శ్రేయస్సుకు భంగకరమని కొందరు పురుషులు విశ్వసించవచ్చును. అది పొరపాటు భావమని చెప్పక తప్పదు. సమాజంలో సగంమంది స్త్రీలు. వారిలో ఎక్కువ మంది అజ్ఞానాంధకారంతో మునిగి, విద్యలేనివారై, వ్యక్తిత్వ హీనలై, అస్వతంత్రులై అమాయకంగా జీవిస్తున్న రోజులలో వారి భావోద్రేకాన్ని రెచ్చగొట్టి, వారిని తన వాగాడంబరంతో వివేక హీనులనుగా చేసి, వారి వోట్లను తనకు వేయించుకొని ఏ వ్యక్తి అయినా నియంతగా వస్తే భారతదేశ భవిష్యత్తు అంధకార బంధురమవుతుంది. ఇది రాజకీయాంశము. సామాజిక విషయంగా చూస్తే అలాంటివారు ఎలా తమ పిల్లలను పెంచగలుగుతారు? ఎలా విద్యాబుద్ధులను నేర్పకలుగుతారు? కేవలం కుటుంబాన్నే తీసుకోండి. అలాంటిస్త్రీలు భర్తకు ఎలాంటి సాంగత్యాన్ని ఇవ్వగలుగుతారు? భర్త సాంస్కృతిక జీవితానికి అలాంటి స్త్రీ ఎలా సాయపడకలుగుతుంది? చివరమాట. ఆమె ఇప్పుడున్న స్థితిలో ఉంటే అతడు అభ్యుదయగామిగా సంచరించగలడా? ఏంతమంది అభ్యుదయ వాదులైన పురుషులు తమ అజ్ఞానపు భార్యల మూలాన నిష్క్రియాపరులు అవుతున్నారో మనకు తెలియదా? స్త్రీ విమోచన పురుష విముక్తికి రాచబాట అని ఆధునిక విజ్ఞానం మనకు తెలియ చెప్తున్నది.

అధ్యాయం

# 15 హిందూ శాసనాలు

ధర్మశాస్త్ర ప్రతిపాదితమైన హైందవ ధర్మసూత్రాలను బ్రిటిషు పాలనలో శాసనాలద్వారా కొంతమార్చడం, దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారీఎత్తున మార్చటం జరిగింది. వాటిలో ముఖ్యమైనవాటిని చర్చించటం అవశ్యకం.

సతీసహగమన నిరోధశాసనం (1829), విధవావివాహ శాసనం (1856), కుల బహిష్కారణవల్ల అనర్హతల తొలగింపు శాసనం (1850), హిందూవారసత్వ అనర్హతల తొలగింపు శాసనం (1929), విద్యవల్ల ఆర్జితానికి సంబంధించిన శాసనం [1930], బాల్యవివాహ నిరోధశాసనం [1929], హిందూస్త్రీల ఆస్తిహక్కు శాసనం [1937], ఆర్యవివాహ సమర్థశాసనం [1937], హిందూస్త్రీ ప్రత్యేక నివాసమునవర్తి శాసనం [1946], సగోత్ర, సప్రవర వివాహాలను అనుమతిస్తూ హిందూ వివాహ అనర్హతలతొలగింపు శాసనం [1946] వర్ణాంతర కులాంతర, శాఖాంతర వివాహాలను అనుమతిస్తూ 1949లో శాసనం భారత దేశం స్వతంత్ర దేశంగా రూపొందక ముందువచ్చాయి. వీటిని బ్రిటీషువారి చొరవతో వచ్చినవిగాను, భారతీయుల ప్రతిపాదనపై వచ్చినవిగాను విభజించవచ్చును. 19 వ శతాబ్దపు శాసనాల విషయంలో బ్రిటీషువారి పట్టుదలజాస్తి. తరువాతవీ భారతీయ సంస్కర్తల ఆందోళనా ఫలితాలు.

ఈనాడు అమలులోఉన్న శాసనాలలో ముఖ్యమైనవి వివాహానికి, వారసత్వానికి దత్తతకు, మనవర్తికి, మైనారిటీ మరియు సంరక్షకత్వానికి సంబంధించినవి. తృతీయ శ్రేణికి చెందిన బాల్యవివాహ నిరోధశాసనం, వరకట్న నిషేధశాసనం శిక్షాస్మృతిలో వచ్చిన మార్పులు.

1948 లో హిందువులకు వర్తించే ధర్మకోశాన్ని (హిందూ కోడ్ బిల్లు) శాసన రూపంగా తయారు చేయాలని బిల్లు ప్రతిపాదించబడటం

దానికి వ్యతిరేకత రాగా విరమించడం జరిగింది. తరువాత 1955, 1956 సంవత్సరాలలో దానిలో కొంతభాగాన్ని నాలుగు ముక్కలుగా చేసి నాలుగు శాసనాలుగా ఆమోదింప చేసింది జవహరలాల్ నెహ్రూ ప్రభుత్వం.

## హిందూ దత్తత మరియు మనవర్తి శాసనం (1956)

దత్తతకు సంబంధించి మౌలికమైన మార్పులు వచ్చాయి. దత్తుకు మతపరమైన భావన తీసివేసి దానిని లౌకికం చేశారు. కుమార్తెనుగాని కుమారునిగాని దత్తు తీసుకోవచ్చును. భార్య అనుమతి లేకుండా పురుషుడు దత్తు చేసుకోవటానికి వీలులేదు. అవివాహిత, వివాహము రద్దయిన స్త్రీ, విధవరాలు, లేక సన్యాసియైన వాని భార్య, మతాంతరుని భార్య, మతిస్థిమితం లేని భార్య కుమారునిగాని కుమార్తెనుగాని దత్తు చేసుకోవచ్చును. తల్లి అనుమతి లేకుండా ఏ తండ్రి తన సంతానాన్ని ఇతరులకు దత్తు ఇయ్యరాదు. తండ్రి మరణించినపుడు, సన్యాసి యైనపుడు, మతాంతరుడయినపుడు, లేక మతి స్థిమితం లేనివాడని కోర్టు నిర్ధారణ చేసినపుడు తల్లి తన సంతానాన్ని దత్తు ఇవ్వవచ్చును. దత్తు ఇవ్వబడే వ్యక్తి హిందువయి ఉండాలి; 15 సం॥ల వయస్సు పూర్తి కానివాడుగా ఉండాలి. అవివాహితుడుగా ఉండాలి. ఆచారం ఉంటే ఈ నియమాలకు సడలింపు వుంది. కుమారుడు, మనుమడు (కుమారుని ద్వారా) మునిమనుమడు (అలాంటి మనుమని ద్వారా) కలిగిన వారు కుమారుని దత్తు చేసుకోరాదు. కుమార్తెను దత్తు చేసుకోదలిచినవారికి హిందూ కుమార్తెగాని, కుమారుని కుమార్తెగాని ఉండరాదు, పురుషుడు స్త్రీని దత్తు చెసుకోదలిస్తే దత్తురాలి వయస్సుకన్న దత్తు తండ్రి వయస్సు 21 సం॥ పైగా ఉండాలి. అలాగే స్త్రీ పురుషుని దత్తు చేసుకోదలిస్తే దత్తు తల్లి వయస్సు దత్తుని వయస్సుకన్న 11 సం॥ పైగా ఉండవలెను. వివాహిత స్త్రీ భర్త సమ్మతితో తనకు దత్తు చేసుకోవటానికి శాసనంలో వెసులుబాటు లేదు. వివాహితులలో దత్తు చేసుకొనే అధికారం పురుషునిదే. అంటే వారిలో పురుషుని ఆధిక్యతను అట్లే ఉంచినట్లు తోస్తుంది. దంపతులలో ఏ ఒకరైనా మరియొకరి సమ్మతితో దత్తు చేసుకోడానికి వీలు ఉండాలని 'స్టేటస్ కమిటీ' సిఫారసు చేసింది.

ఇదే శాసనంలో మనవర్తిని గురించిన నియమాలు ఉన్నాయి. న్యాయ స్థానాలు అంతకు క్రితం ఇచ్చిన తీర్పులను ఎక్కువగా ఆధారం చేసుకొని

రూపొందించారు. భర్త వదలేసినా, భర్తతో కాపురముండటం ఆమెకు ప్రమాదమని ఆమెకు భీతి కల్గించేటట్లు ఆమెను క్రూరంగా హింసించినా, భర్త కుష్టురోగ పీడితుడయినా, మరో భార్యను కలిగి ఉన్నా, ఉంపుడు గత్తెను ఇంటిలో కాపురం పెట్టినా లేక మరోచోట అలవాటుగా ఉంపుడు గత్తెతో కాపురం ఉంటున్నా, మతం మార్చుకున్నా ఇంకా ఏవైనా తగిన కారణాలున్నా ఆమె వేరుగా కాపురం ఉవడవచ్చును. తన జీవితకాలము అతనినుండి మనవర్తిని పొందవచ్చును. ప్రతి హిందువు తన సంతానాన్ని క్రమంగా కాని అక్రమంగా కాని - వృద్ధులైన తల్లిదండ్రులను పోషించ వలెను. బిడ్డలు మైనర్లుగా ఉన్నంత కాలమే వారికి మనవర్తి లభిస్తుంది. వివాహిత కుమార్తెలకు ఆ హక్కు పోతుంది. ఈ శాసనంలో భర్తను పోషించాల్సిన బాధ్యత (అతడు పోషించుకోలేకపోతే) భార్యపై విధించలేదు. అది స్త్రీ పురుష సమానత్వ సిద్ధాంతానికి వ్యతిరేకం. అదీగాక ఈనాడు ఆర్థిక ప్రతిపత్తి కలిగిన స్త్రీల సంఖ్య పెరుగుతోంది. కనుక అలాంటి స్త్రీ కూడా (1) తనమీద ఆధారపడే భర్తను పోషించాలి. (2) బిడ్డల పోషణా భారాన్ని భర్తతో పాలుపంచుకోవాలి. (3) బీదలుగా ఉండే తల్లిదండ్రులను పోషించే విషయంలో సోదరులలోపాటు సోదరికూడా బరువు భారాన్ని మోయాలి అని స్టేటస్ కమిటీ సూచించింది.2

హిందూ మైనారిటీ మరియు సంరక్షకత్వ శాసనం (1956)

మైనరు బాలునికి, బాలికలకు తండ్రి సహజ సంరక్షకుడు. కాకపోతే మైనరు 5 సం॥ వయస్సు నిండేవరకు సర్వ సామాన్యంగా తల్లివద్ద ఉండ వచ్చును. అక్రమ సంతానం అయితే తల్లి సహజ సంరక్షకురాలు. ఆమె లేకపోతే తండ్రి సంరక్షకుడు. వివాహితఅయిన మైనరు స్త్రీకి భర్తయే సంరక్షకుడు. దత్తు కుమారునికి తండ్రియే సంరక్షకుడు. అతడు లేకపోతే తల్లి సంరక్షకురాలవుతుంది. సహజ సంరక్షకుని బిడ్డమీద, బిడ్డ ఆస్తిమీద అదుపు ఉంటుంది. హిందూతండ్రి తన వీలునామాద్వారా మరియొకరిని తన బిడ్డకు సంరక్షకునిగా నియమించవచ్చును. ఆ వీలునామాలోని నియామకం అతడు భార్యకన్నా ముందు చనిపోతే వర్తించదు. విధవ కాని, భర్త సంరక్షకుడుగాని ఉండడానికి వీలులేని పరిస్థితులలో భార్యకాని తవీ లునామాద్వారా మరియొక వ్యక్తిని తన బిడ్డకు సంరక్షకునిగా నియమించవ

వచ్చును. ఇది గొప్పవిశేషమట! కోర్టువారు సంరక్షకుని నియమించడంలో మైనరు శ్రేయస్సునే అత్యధిక విషయంగా పరిగణించవలెను. మైనరు అంటే 18 సం॥ నిండని వ్యక్తి అని శాసనం నిర్వచనం చేసింది. తల్లిది సంరక్షరాలిగా ద్వితీయస్థానం. 5 సం॥ లోపు బిడ్డను సర్వసామాన్యంగా ఆమె తనవద్ద ఉంచుకోవచ్చు. ఈ రెండు అంశాలు ఈ శాసనంలోని లోపాలు. స్టేటస్ కమిటీ ఈ రెంటినీ గమనించింది.3

హిందూ వివాహ శాసనం (1955)

ఇది ఈ విషయాన్ని గురించిన సమగ్రమైన శాసనం. వివాహము కాపురానికి రమ్మని కోరటం, కోర్టుద్వారా ఉత్తర్వులు పొంది విడిగా ఉండటానికి ఏర్పాటు, విడాకులు, ఆ సందర్భంగా మనవర్తి, పిల్లల సంరక్షణ మొదలైన అంశాలన్నింటిపైన నిర్వచనాలు, నిబంధనలు, అమలుజరిపే విధానాలు అన్నీ ఈ చట్టములో ఉన్నాయి. ఇది జమ్మూ, కాశ్మీర్ ప్రాంతానికి కాక భారతదేశానికంతటికీ వర్తిస్తుంది. ఈ శాసనం విస్తరింప బడిన ప్రాంతాలలో శాసన సమ్మతంగా స్థిరనివాసం ఏర్పరచుకున్న హిందువులకు వర్తిస్తుంది. మతరీత్యా హిందువులకు, బౌద్ధులకు, జైనులకు, శిక్కులకు, ఈ శాసనం వర్తించిన ప్రాంతాలలో స్థిరనివాసముంటూ ఇస్లాం, క్రైస్తవ, యూదు, పార్శీమతాలకు చెందకుండా ఉన్నవారందరికీ వర్తిస్తుంది. ఇద్దరు తల్లిదండ్రులు హిందువులు బౌద్ధులు లేక జైనులు లేక సిక్కులు అయినచో వారి సంతానం సక్రమమైనా, అక్రమమైనా వారికి, తల్లిదండ్రులలో ఒకరు, మాత్రమే హిందువు, బౌద్ధ, జైన, శిక్కులైయున్నచో, ఆ సంతానం వారివద్ద పెంచబడినను, పైన చెప్పిన నాల్గు మతాలలోకి ఇతర మతాలనుండి మారిన వారు, నాలుగు మతాలనుండి - హిందూ, బౌద్ధ, జైన శిక్కు మతాలనుండి ఇతర మతాలకు పోయి మరల తిరిగి అసలు వారి పాత మతాలకు తిరిగి వచ్చినవారు, వీరందరూ ఈ శాసనం క్రింద ఉండవలసిన వారే. ఇంకా ఏమైనా అనుమానం ఉంటుందేమోనని ఇలా స్పష్టం చేశారు. హిందూ మతానికి చెందినవాడు కాకపోయినా పై చెప్పిన నిర్వచనం వల్ల ఈ శాసనం వర్తించే ఏ వ్యక్తి అయినా 'హిందువు' గానే పరిగణింపబడును. అంటే ఇండియాలో స్థిరనివాసం కలిగిన నాస్తికులు, హేతువాదులు, అజ్ఞేయవాదులు, సంశయవాదులు అందరూ ఈ శాసనం క్రిందికి వచ్చువారే.

వధూవరులలో ఏ ఒకరికైనా అంతకు క్రితమే భార్యగాని, భర్తగాని జీవించి యున్నపుడు, వధూవరులు సపిండులయినపుడు, లేక వధూవరుల సంబంధం వివాహానికి నిషిద్ధమయినపుడు ఆ పెండ్లి చెల్లనేరదు. అది జరగనట్లే ఎంచుకోవలెను.

అదీగాక ఈ దిగువ పేర్కొనబడిన పరిస్థితులు ఉన్నపుడు భార్యాభర్తలలో ఎవరో ఒకరు పిటీషను పెట్టి ఆ వివాహాన్ని చెల్లనిదానిగా న్యాయస్థానం చేత ప్రకటింప చేసుకొవచ్చును :-

i రెస్పాండెంటు యొక్క లోపం వలన గర్భాదానం జరగక పోవుట,

ii వధూవరులో ఒకరికి మతిస్థిమితం లేక చెల్లదగిన సమ్మతి ఇవ్వలేని పరిస్థితిలో,

iii) అలాంటి సమ్మతి ఇవ్వడానికి శక్తి కలిగినా వివాహానికి తగక, సంతానం కనడానికి అర్హత లేకుండా ఉండే స్థాయిలో మానసిక రుగ్మతవల్ల బాధపడుచున్నందున

iv) తరచుగా, వధూవరులలో ఒకరు మూర్ఛరోగానికి, పిచ్చికి లోనై యుండుటవలన,

v) వివాహాన్ని గురించి కాని, రెస్పాండెంటుకు సంబంధించిన వివరాలు, పరిస్థితులను గురించి కాని రెస్పాండెంటు మోసం చేయడమో, బలవంతం చేయడమో జరిగినప్పుడు,

vi) పిటీషనరు వల్లగాక రెస్పాండెంటు వివాహకాలమందు ఎవరిద్వారానైనా గర్భాన్ని పొంది యుండుట

ఈ రకం పిటీషను పెట్టవచ్చును.

బలవంతం చేశారనే ఆరోపణ వచ్చినపుడు బలవంతం ఆగిపోయిన తదుపరి సంవత్సరంలోగా పిటీషను పెట్టాలి. లేకపోతే ఆ పిటీషను చెల్లదు. ఆ మోసం తెలిసిన తరువాత, ఆ బలవంతం ఆగిపోయిన తరువాత పిటీషనరు రెస్పాండెంటుతో ఇష్టపూర్వకంగా కాపురం చేస్తే పిటీషను పెట్టటానికి వీలులేదు. రెస్పాండెంటు గర్భిణీగా ఉన్నదనే కారణం విషయంలో

ఆ విషయం పిటీషనురుకు అపుడు తెలియకుండా ఉండాలి. పెండ్లి అయిన సంవత్సరంలోగా ఆ కారణంపై పిటీషను పెట్టాలి. ఆ వాస్తవం తెలిసిన తరువాత పిటీషనరు సమ్మతితో భార్యాభర్తల మధ్య శారీరక సంయోగం జరగకుండా ఉండాలి. ఈ షరతులు విధిగా వుండాలి. లేకపోతే పిటీషను చెల్లదు.

విడాకులు :- భార్యాభర్తలలో ఏ ఒకరు పిటీషను పెట్టినా ఈ దిగువ కారణాలను ఆరోపించి రుజువుచేసి విడాకులను పొంది వివాహాన్ని విచ్ఛేదనం చేసుకోవచ్చును :-

i) వివాహం అయిన తదుపరి రెస్పాండెంటు భర్తతోనో లేక భార్యతోనో లేక భార్యతోనో గాక మరియొకరితో లైంగిక సంపర్కం ఏర్పరచుకొనుట

ii) పిటీషనరును క్రూరంగా హింసించుట

iii) పిటీషను పెట్టిన తేదీకి వరుసగా రెండుసంవత్సరముల కాలము రెస్పాండెంటు పిటీషనరును వదలియుండుట

iv) రెస్పాండెంటు హిందూ మతమును విడనాడి మరియొక మతమును స్వీకరించుట

v) రెస్పాండెంటుతో పిటీషనరు కాపురం చేయుటకు హేతుబద్ధంగా వీలులేని పరిస్థితి రెస్పాండెంటు యొక్క అవిచ్ఛిన్నమైన లేక అపుడపుడు సంభవించే మానసిక రుగ్మత వల్ల ఏర్పడినపుడు, లేక రెస్పాండెంటుకు నయం కావటానికి అవకాశంలేని మతిస్థిమిత రాహిత్య మున్నపుడు,

vi) రెస్పాండెంటు తీవ్రమయిన, నయంకావటానికి అవకాశంలేని కుష్టు వ్యాధితో బాధపడుతున్నపుడు.

vii) అవతలివారికి సంక్రమించే లక్షణం కల, నయంకాని సుఖ వ్యాధిని రెస్పాండెంటు కలిగి యుంటే,

viii) ఏదైనా మతసంస్థలో చేరి సన్యాసం పుచ్చుకొని యుంటే,

ix) ఏడు సంవత్సరములు రెస్పాండెంటు జాడ, మామూలుగా అతని జాడ తెలిసేవారికి, తెలియకుండుట, విడాకుల కొరకు పిటీషనరు పెట్టవచ్చును.

వదలి యుండుట అంటే సహేతుకమైన కారణము మరియు సమ్మతి లేకుండా గాని, లేక పిటీషనరు ఇష్టానికి వ్యతిరేకంగా గాని, రెస్పాండెంటు వదలివేయుట పిటీషనరును నిరాదరణ చేయటం కూడా దానికిందనే వస్తుంది.

ఇరువురు విడిగా ఉండవచ్చని కాని, లేక అందులో ఒకరిని రెండవ వారితో కాపురం చేయమని కాని కోర్టువారు ఉత్తరువు ఇచ్చి ఉంటే, ఆ ఉత్తరువు పుట్టిన ఒక సంవత్సరంలోగా ఇరువురు కాపురం చేయుట ఆరంభం చేయక పోతే విడాకులకోసం పిటీషను పెట్టుకోవచ్చును.

ఆలాకాక భర్తకు ద్వితీయ భార్య ఉన్నదనిగాని, తనతో వివాహమయిన తరువాత భర్త మరల ఇంకొక స్త్రీని వివాహమాడాడని ఆరోపణచేస్తే, అలాగే భర్త మానభంగం, ఏకలింగ సంపర్కం, లేక పశువుతో లైంగిక సంపర్కంలాంటి నేరాలకు పాలుపడితే, భార్యకు మనవర్తి శాసనం క్రింద గాని, లేక క్రిమినలు ప్రొసీజరు కోడ్ క్రిందగాని మనవర్తి ఇవ్వబడియుండి ఆ ఉత్తరువు పుట్టిన నాటినుండి ఒక సంవత్సరంలోగా భర్త విడాకుల కోసం పిటీషను పెట్టుకోవచ్చును. అంతేగాక తనకు 15 సంవత్సరాలు నిండేలోపల వివాహమయినదని 18 సంవత్సరాలు నిండేలోపల తను ఆ వివాహం తనకు అక్కరలేదని ప్రకటించానని భార్య చెప్పి విడాకులు కోరవచ్చును. ఇపుడు ఈ శాసనం ప్రకారం వధువుకు 18 సం॥ నిండాలి. వరునికి 21 సం॥ నిండాలి. ఈ వివాహ శాసనానికి 1976 లో సవరణ వచ్చింది. దాని ప్రకారం విడాకులు కోరడానికి అదనంగా ఒక కారణం దొరికింది. ఇద్దరం ఒక సంవత్సరము నుండిగాని లేక పైకాలం నుండిగాని విడివిడిగా ఉంటున్నామని, ఇద్దరం కలసి ఉండలేకపోయామని, మరియు వివాహం రద్దవడానికి ఇద్దరం అంగీకరించామని భార్యాభర్తలు కోర్టుకు నివేదిస్తే వివాహం రద్దు అవుతుంది. అలా పిటీషను పెట్టిన తరువాత ఆరు నెలల తరువాత పద్దెనిమిది నెలల లోపల ఇరుపక్షాల కోరిక మీద విడాకుల

ఉత్తరువు పుట్టుంది. సాధారణంగా విడాకులకోసం ఏ పిటీషనూ వివాహమయి సంవత్సరం పూర్తి కాకముందు స్వీకరింపబడదు. పిటీషనరుకూ ఎంతో ప్రత్యేకమైన, అసాధారణమైన ఇబ్బంది కలిగినపుడు కోర్టు ఈ గడువును సడలించి పిటీషను స్వీకరిస్తుంది. గడువును తగ్గించమనే పిటీషను విచారణపుడు భార్యా భర్తలకు సంతానం ఉంటే, ఆ సంతానపు శ్రేయస్సు, సంవత్సరం లోపల భార్యాభర్తల మధ్య సామరస్య సాధనకు ప్రయత్నం జరిగిందా లేదా అనే విషయం కోర్టు పరిగణనలోకి తీసుకుంటుంది.

వివాహం రద్దు అయిన తరువాత, అపీలు లేకపోతే, వెంటనే అలాకాక అపీలుకు అస్కారం ఉంటే అపీలు, గడువు అయిపోయినా అపీలు దాఖలు కాకపోతే, లేక అపీలు దాఖలయితే అది కొట్టివేయబడినపుడు భార్యా భర్తలలో ఎవరైనా మరల వివాహమాడవచ్చును.

భార్యా భర్తలలో ఏ ఒకరైనా రెండవ వారిని తనతో కాపురం చేయ వలసినదని కోర్టుద్వారా ఉత్తరువు పొందవచ్చును. అలాగే విడాకులకు నిర్ణయింపబడిన ఏ కారణం వలనైనా భార్యగాని, భర్తగాని న్యాయశాస్త్ర రీత్యా విడివిడిగా వుండే హక్కును పొందవచ్చును.

భార్య ఉండగా లేక భర్త ఉండగా మరొక వ్యక్తిని భర్తగానో లేక భార్యగానో స్వీకరిస్తే అది నేరమవుతుంది. అంతేకాక ఆ ద్వితీయ వివాహం 'లా' ప్రకారం చెల్లతగదు. ఈ వివాహ శాసనంలోని నిబంధనలకు వ్యతి రేకంగా నడచిన వ్యక్తికి శిక్షలు నిర్దేశించబడినాయి. వివాహమయిన ప్రదేశం, రెస్పాండెంటు నివసిస్తున్న చోటు, చివరిసారిగా భార్యాభర్తలు కలసి కాపురం ఉన్న ఊరు వీటిలో దీనిపైన అధిపత్యం కల జిల్లా కోర్టులోగాని, సబ్ కోర్టులో గాని పైచెప్పిన పిటీషన్లు పెట్టవచ్చును. విచారణ వీలయినంత త్వరలో చేయాలి. రెస్పాండెంటుకు నోటీసుముట్టిన ఆరునెలలలోగా విచారణ పూర్తి చేయటానికి ప్రయత్నం జరగాలి. ఈ కేసు విచారణ రహస్యంగా జరుగుతుంది. ఎవరూ ఈ విచారణ విషయాలను ప్రకటించరాదు. వీలయినంతవరకు భార్యాభర్తలమధ్య సఖ్యత, సామరస్యం నెలకొల్పటానికి కోర్టు తనంతతాను గాని, లేక వారిరువురు ఎన్నుకున్న వ్యక్తి, వారిరువురు ఒకవ్యక్తి పేరు చెప్ప లేకపోతే కోర్టు నియమించిన వ్యక్తిద్వారా గాని ప్రయత్నించాలి. కోర్టులో

విచారణ కాలంలో ఏ ఒక్క పార్టీకైనా కోర్టు తాత్కాలిక మనవర్తిని, వ్యాజవ్య ఖర్చులు ఇప్పించవచ్చును. చివరసారిగా ఉత్తరువు ఇచ్చేటపుడు శాశ్వత మనవర్తిని చెల్లించమని ఉత్తరువు జారీ చేయవచ్చును. మైనరు పిల్లల యొక్క స్వాధీనం, భరణం, విద్యలాంటి విషయాలను గురించి వ్యాయస్థానం ఉత్తరువు ఇవ్వవచ్చును. అలాగే ఇరువురికి సంబంధించిన ఆస్తి విషయమై ఉత్తరువు రూపంలో సూచనలు చేయవచ్చును.

కోర్టు జారీచేసిన ఉత్తరువులు సివిలుకోర్టు డిక్రీలవలె అమలు చేయబడగలవు. ప్రత్యేక వివాహశాసనంలోని నిబంధనలకు ఈ శాసనంలోని నిబంధనలు వ్యతిరేకంగా పనిచేయవు. అంటే హిందువులు ఆ శాసనం క్రింద వివాహం చేసుకుంటే వారికి ఆ వివాహశాసనమే వర్తిస్తుంది, కాని ఈ హిందూ వివాహ శాసనం వర్తించదు.

ఈ హిందూ వివాహ శాసనం క్రింద పరిహారాన్ని పొందటానికి పిటీషను చాలును. దావా వేయనక్కరలేదు. అంటే కోర్టుఫీజు తక్కువ అన్నమాట. ఇది పెద్ద సౌకర్యం.

భర్త ఒకఊరిలో కాపురం ఉంటుంటే భార్య మరొక గ్రామంలోనో లేక పట్టణంలోనో కాపురం చేస్తుంటే అది భార్య భర్తను వదలివేసినట్లు కాదని స్పష్టంగా వివరించటం అవసరమని స్టేటస్ కమిటీ తలపోసింది.4

## హిందూ వారసత్వ శాసనం (1956)

ఈ శాసనంయొక్క పరిధి హిందూ వివాహశాసనం లాంటిదే. దీనిలోని 'హిందూ' పద నిర్వచనం వివాహ శాసనంలోని లాంటిదే. ఈ శాసనం సమగ్రమైనది. కనుక ఈ శాసనంలో ఉన్న నిబంధనలకు వ్యతిరేకంగా ఉన్న ఆచారము, సంప్రదాయం చెల్లనేరవు. భారతీయ వారసత్వ శాసనము వర్తించే వారికి ఈ వారసత్వ శాసనము వర్తించదు.

ఈ శాసనం చేసిన మౌలికమైన మార్పులు :-

i) కొన్ని సందర్భాలలో కుమార్తెలను, కుమారులను సమంగా చూచింది. (షెడ్యూల్ 1 వ వర్గం)

ii) కోపార్సనరీ కుటుంబంలో ఒక సభ్యుడు చనిపోతే 1937 కు పూర్వం అతని హక్కులు తతిమ్మా సభ్యులకు చెందేవి. ఆ నిబంధన కొంత మారింది 1937 లో. ఇపుడు ఈ శాసనం వల్ల పూర్తిగా మారింది (సెక్టను 6).

iii) పురుషుని ఆస్తికి వారసులను నాలుగు వర్గాలుగా చేసి ఒక వర్గం తరువాత మరో వర్గాన్ని వీలునామా వ్రాయకుండా చనిపోయిన అతనికి వారసులనుగా నిర్ణయించింది (సెక్షను 8).

iv) స్త్రీ స్వాధీనంలో ఉన్న ఆస్థికి స్త్రీకి సంపూర్ణ హక్కులు ఇచ్చింది. అలాగే స్త్రీకి స్వాధీనానికి హక్కుగల అస్తి ఆమెకు వారసత్వం వల్ల సంక్రమించినా, మనవర్తిగా వచ్చినా, దాఖలు పూర్వకంగా వచ్చినా దానియందు ఆమెకు సర్వహక్కులూ ఏర్పడతాయి (సెక్షను 14).

v) 1956 కు పూర్వం స్త్రీ యొక్క స్త్రీ ధనపు ఆస్తి కుమార్తెలకు చెందేది. ఈ శాసనం వలన కుమారులు, కుమార్తెలు, భర్త సమానంగా మున్ముందుగా పొందుతారు (సెక్షను 15).

vi) హిందూ పురుషుని ఆస్తికి స్త్రీలు కూడా వారసులైనపుడు పురుష వారసులు పంచుకునే వరకు కాపురపు ఇంటిని స్త్రీ వారసు భాగ పంపిణీ కోరదు (సెక్షను) 23).

vii) వారసత్వం మొదలయిన సమయంలో పునర్వివాహం చేసుకున్న స్త్రీ (ముందుగా చనిపోయిన కుమారుని విధవ, ముందుగా చనిపోయిన కుమారుని ముందుగా చనిపోయిన కుమారుని విధవ, సోదరుని విధవ) పునర్వివాహం చేసుకున్నచో ఆమెకు వారసత్వంగా ఆస్తి రాదు (సెక్షను 24).

viii) ఎవరైనా ఏ వ్యక్తినైనా ఖూనీ చేసినా, చేయటానికి సహాయం చేసినా ఆ చనిపోయిన వ్యక్తి ఆస్తికి అలాంటివారు వారసులు కారాదు (సెక్షను 25)

ix) ఏ వ్యక్తి అయినా మతాంతరుడయితే అతని లేక ఆమెయొక్క సంతానం వారి సంతానం వారి హిందూ బంధువుల ఆస్తులకు -

ఆ సంతానం వారి సంతానం హిందువులయితే తప్ప - వారసత్వ రీత్యా యజమానులు కాలేరు (సెక్షను 26).

x) ఏ వ్యక్తి అయినా వారసుడుగా ఉండటానికి అనర్హుడయితే, అతడు చనిపోయినట్లుగా భావించి, వారసత్వం తరువాత వారికి చెందవలెను. (సెక్షను 27).

xi) ఈ శాసనంలో పేర్కొన్న రీతిగా కాక ఏ వ్యక్తి అయినా వ్యాధి లోపం, అంగవైకల్యం వలన వారసత్వానికి అనర్హత చేత బాధ పడరాదు (సెక్షను 28).

xii) శాసనంలో పేర్కొనబడిన వారసులు ఎవరూ లేకపోతే ఆస్తి ప్రభుత్వానికి సంక్రమిస్తుంది (సెక్షను 29).

xiii) మితాక్షర కోపార్సనరీలో తన హక్కులకు హిందూ పురుషుడు వారసత్వాన్ని ఏర్పరచవచ్చును (సెక్షను 30).

హిందూ సమిష్టి కుటుంబ లక్షణాన్ని మితాక్షర ప్రకారం - తీసి వేద్దామని ప్రభుత్వం మొదట్లో ఆలోచించినా సనాతనుల ఒత్తిడిని తట్టుకోలేక దానిని తీసివేయలేదు. అంటే మితాక్షర న్యాయాన్ని మార్చి దాయభాగ న్యాయాన్ని ప్రవేశపెట్టలేదు. అంటే కుమారునికి పిత్రార్జితపు ఆస్తిలో జన్మతః ఏర్పడిన హక్కును తీసివేయలేదు. అయితే 1937 హిందూ స్త్రీ ఆస్తిహక్కు చట్టం ప్రకారం సమిష్టి హిందూ కుటుంబాలలో (మితాక్షర పద్ధతి) భర్త వాటా పరిమిత హక్కులతో (Limited Rights) భార్యకు వచ్చేది. అదిపోయి పిత్రార్జితపు ఆస్తిలో భర్త వాటాను (అతడు విభక్తుడుగా చనిపోయినట్లు భావించుకొని) శాసనపు షెడ్యూలులో 1 వ వర్గంలో పేర్కొన బడిన వారందరు పంచుకుంటారు. కుమారుడు, కుమార్తె, భార్య, తల్లి, ముందుగా చనిపోయిన కుమారుని కుమారుడు, ముందుగా చనిపోయిన కుమార్తె కుమారుడు, ముందుగా చనిపోయిన కుమార్తె కుమార్తె, ముందుగా చనిపోయిన కుమారుని విధవ, ముందుగా చనిపోయిన కుమారుని ముందుగా చనిపోయిన కుమారుని కుమారుడు, ముందుగా చనిపోయిన కుమారుని ముందుగా చనిపోయిన కుమారుని కుమార్తె, ముందుగా చనిపోయిన కుమారుని ముందుగా చనిపోయిన కుమారుని విధవ. వీరు షెడ్యూలు 1 వ వర్గంవారు.

వీలునామా వ్రాయకుండా చనిపోయిన హిందూ పురుషుని ఆస్తి శాసనపు షెడ్యూలులోని 1 వ వర్గం వారికి చెందుతుంది. వారూ లేకపోతే చనిపోయిన అతని వంశం వారికి చెందుతుంది. వారూ లేకపోతే అతని రక్త సంబంధీకు లైన ఇతరులకు చెందుతుంది (సెక్షను 8). 1 వ వర్గంలోని వారసులు ఒక్కసారిగా ఆస్తిని తీసుకుంటారు. వారి తర్వాత రెండవ వర్గంలోని 1 వ వరుస వారికి వస్తుంది. వారు లేకపోతే 2 వ వర్గంలోని రెండవ వరుస వారికి వస్తుంది. తరువాత 3 వ వరుస. తరువాత 4 వ వరుస. ఆదేక్రమం చివరవరకూ వర్తిస్తుంది (సెక్షను 9). 1 వ వర్గంలోని వారసులు ఈ విధంగా పంచుకుంటారు. చనిపోయిన అతనికి అనేకమంది భార్యలుంటే వారంతా కలసి ఒక వాటా తీసుకుంటారు. (రూలు 1), తండ్రి చనిపోయే నాటికి బ్రతికి వున్న కుమారులు, కుమార్తెలు, తల్లి తలా ఒక వాటా తీసుకుంటారు. (రూలు 2). ముందుగా చనిపోయిన కుమారుని లేక ముందుగా చనిపోయిన కుమార్తె శాఖలకు సంబంధించిన వారసులు వారంతా కలసి శాఖకు ఒక వాటా తీసుకుంటారు. (రూలు 3). ముందుగా చనిపోయిన కుమారుని శాఖకు సంబంధించిన వాటాలో అతని విధవ ఒక వాటా, కుమారులు కుమార్తెలు తలా ఒక వాటా పొందుతారు [రూలు 4 (i)]. ముందుగా చనిపోయిన కుమార్తె శాఖకు సంబంధించిన వాటాలో ఆమె కుమారులు కుమార్తెలు తలా ఒక వాటా తీసుకుంటారు [రూలు 4 (ii)], (సెక్షను 10). షెడ్యూలులోని 2 వ వర్గంలోని ఏ వరుసలోని వారసులయినా సమానంగా తీసుకుంటారు (సెక్షను 11). సపిండులు, రక్త సంబంధీకుల వారసత్వ విధానం 12 వ సెక్షనులో చెప్పబడినది. వీలునామా వ్రాయకుండా చనిపోయిన పురుషుడికి అవిభక్త హిందూ కుటుంబంలో ఉన్న హక్కు (వాటా) అతని ఆస్తిగా ఎంచబడును. అంటే దానికి, అతని స్వార్జితపు ఆస్తికి సెక్షను 8 లో రూపొందించబడిన వారసత్వ విధానం అమలులోకి వస్తుంది. ఒక ఉదాహరణ తీసుకుందాము. ఒక హిందూ పురుషుడు తన ముగ్గురు కుమారులతో అవిభక్తుడుగా ఉండి చనిపోయినాడనుకుందాము. 1937 సం॥ శాసనం ప్రకారం పిత్రార్జితంలో అతని నాలుగవ వంతు ఆస్తి (చనిపోయిన రోజున అతడు విభక్తుడయినట్లు భావించుకొని) అతని విధవకు పరిమిత హక్కులతో వచ్చేది. ఇపుడు పరిస్థితి పూర్తిగా మారింది. అతనికి ముగ్గురు కుమార్తెలు, తల్లి ఉందని ఎంచుకుంటే అప్పుడు, ఈ శాసనం ప్రకారం, అతని నాల్గవ

వంతు వాటాను అలని కుమారులు ముగ్గురు, కుమార్తెలు ముగ్గురు, తల్లి ఒకామె, భార్య ఒకతె మొత్తం ఎనిమిదిమంది పంచుకుంటారు. అపుడు

భార్యకు $\frac{1}{4} \times \frac{1}{8} = \frac{1}{32}$ తల్లికి $\frac{1}{4} \times \frac{1}{8} = \frac{1}{32}$

కుమార్తెలకు ఒక్కొక్కరికి $\frac{1}{4} \times \frac{1}{8} = \frac{1}{32}$ సర్వహక్కులతో వస్తుంది.

ముగ్గురు కుమార్తెలకు $3 \times \frac{1}{32} = 3/32$ వస్తుంది. కుమారుడు ఒక్కొకనికి

$\frac{1}{4}$ (స్వంతహక్కుగా) $+ \frac{1}{32}$ (తండ్రిద్వారా) $= \frac{9}{32}$ వస్తుంది.

ముగ్గురు కుమారులకు—$3 \times \frac{9}{32} = 27/32$.

1937 కు పూర్వం కుమారులు ఉండగా భార్యకు, కుమార్తెకు వారసత్వ హక్కు ఉండేది కాదు. కుమారులు, భార్య, కుమార్తెలు ఉండగా తల్లికి వారసత్వ హక్కు ఉండేది కాదు.

ఈ శాసనంవల్ల కొంతగా కుమార్తెలు లాభించారు; అలాగే తల్లి లాభించింది. కాని చనిపోయిన వ్యక్తి యొక్క విధవ నష్టపోయింది. 1937 సంవత్సరపు 'ఆక్టు' ప్రకారం పై ఉదాహరణలో విధవకు $\frac{1}{4}$ వంతు

పరిమిత హక్కులతో వస్తే ఇపుడు దాని స్థానంలో $\frac{1}{32}$ సర్వహక్కులతో వచ్చింది. [ఇపుడు ఆం. ప్ర. హిందూ వారసత్వ సవరణ బిల్లు 1985 ప్రకారం భార్యకు $\frac{1}{32}$ వంతు బదులు $\frac{1}{7}$ (జన్మతః హక్కు ఉన్నవారు ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు, చనిపోయిన వ్యక్తి మొత్తం

7 గురు) లో $\frac{1}{8}$ వంతు అంటే $\frac{1}{7} \times \frac{1}{8} = \frac{1}{56}$ వంతు సర్వహక్కులతో వస్తుంది. కుమార్తెలకు, కుమారులకు అరుగురికి ఒక్కొక్కరికి $\left\{\frac{1}{7} + \frac{1}{56}\right\} \frac{9}{56}$ వంతు వస్తుంది. తల్లికి $\frac{1}{56}$ సర్వహక్కులతో వస్తుంది].

స్వార్జితపు ఆస్తిని తీసుకుందాం. పై ఉదాహరణను వరిగణిద్దాము. అపుడు ముగ్గురు కుమార్తెలు, తల్లి, విధవ 8 మంది సమానంగా పంచుకుంటారు. అంటే తలా $\frac{1}{8}$ వంతు ఆస్తి వస్తుంది. (ఆం. ప్ర. హిందూ వారసత్వ సవరణ బిల్లు వల్ల కూడా ఈ వాటాలలో మార్పు ఉండరాదు).

ఇక ఈ శాసనంలో స్టేటస్ కమిటీ వారు పేర్కొనిన లోపాలు :-

1) కుమారునికి జన్మతః పిత్రార్జితపు ఆస్తిలో ఉన్న హక్కు (మితాక్షర న్యాయం ప్రకారం) తీసివేయాలి.[5]

2) వ్యవసాయ కమతాలు చిన్నా భిన్నం కాకుండాను, లేక కమతాల పై గరిష్ఠ పరిమితి విధిస్తూను, లేక ఆ కమతాల వారసత్వ క్రమాన్ని నిర్ణయిస్తూను చేయబడిన శాసనాలను ఈ శాసనం ఏ విధంగాను భంగపరచరాదు అని సెక్షను 4 (2) లో వ్రాయబడినందున రాష్ట్ర శాసన సభలు కమతాలను గురించి చేసిన శాసనాలు చెల్లుతాయి. అంటే అవి ఈ శాసన పరిధినుండి మినహాయింపు చేయబడినవి. ఈ దేశంలో గ్రామాలు జాస్తి. వ్యవసాయ భూమి ఎక్కువ. కనుక హిందూ స్త్రీల హక్కులను నివారించటానికి రాష్ట్ర శాసన సభలు పైన ఉదహరింపబడిన శాసనాలను చేసే ప్రమాదం ఉన్నది. ఉత్తర ప్రదేశ్ శాసనం ప్రకారం కమతం పురుష సంతతికి వస్తుంది. వారు లేకపోతేనే విధవకు, తల్లికి వస్తోంది. వారి తరువాత తండ్రి. అతడు లేకపోతే అవివాహిత కుమార్తె. పైచెప్పినది ఊహ కాదని ఈ ఉత్తర ప్రదేశ్ శాసనం రుజువు చేస్తున్నది.[6]

3) హిందూ స్త్రీ వీలునామా వ్రాయకుండా చనిపోతే ఆమె ఆస్తి కుమారులకు కుమార్తెలకు, భర్తకు వస్తుంది. ముందుగా చనిపోయిన కుమారుని సంతతి, ముందుగా చనిపోయిన కుమార్తె సంతతి కూడా వాటాలు పొందుతాయి. వీరెవరూ లేక భర్త మాత్రమే ఉన్నా ఒక పరిస్థితిలో ఆస్తి భర్తకు రాదు (సెక్షను 15). ఆ ఆస్తి ఆమెకు అంతకు క్రితం తండ్రి వల్ల వచ్చి ఉంటే తండ్రి వారసులకు వస్తుంది [సెక్షను 15 (2) ఎ] అలాగే ఆస్తి ఆమెకు భర్తవల్ల, మామవల్ల వచ్చివుంటే పైచెప్పిన సంతతి లేనపుడు భర్త వారసులకు వస్తుంది [సెక్షను 15 (2) బి]. స్త్రీ ధనం సంతానానికి భర్తకు ముందుగా - మామూలుగా వస్తుంది. వారు లేకపోతే భర్త వారసులకు ఆ తర్వాత తల్లికీ తండ్రికీ, వారూ లేకపోతే తండ్రి వారసులకు వారూ లేక పోతే తల్లి వారసులకు వస్తుంది. [సెక్షను 15 (1)] పైన ఉటంకించబడిన ప్రత్యేక నిబంధనలవల్ల [సెక్షను 15 (2)] 'అందరికీ ఒకే సూత్రం వర్తించాలి అనేది' దెబ్బతిన్నది.7

4) కాపురపు ఇంటిని భాగపంపిణీ చేసుకునే విషయంలో స్త్రీ వారసుల యెడ వివక్ష ఉన్నది. అంతేగాక కాపురపు ఇంటిలో నివాసముండే హక్కు అవివాహిత కుమార్తెకు, విధవరాలైన కుమార్తెకు, భర్త నుండి విడివడిన కుమార్తెకు పరిమితం చేసింది.8

5) ఏ హిందూ పురుషుడైనా స్త్రీ వారసుల హక్కులను తోసి రాజనటానికి వీలునామా వ్రాయవచ్చును. అది మంచి పద్ధతి కాదు. కనుక అలా చేయకుండా హిందూ పురుషుడు తన ఆస్తిలో కొంతమాత్రమే వీలునామా ద్వారా చెంద జేయనగును అని సవరించాలి.9 స్త్రీల శ్రేయస్సు దృష్ట్యా హిందూ వారసత్వ శాసనం మార్పులకు లోను కావలసి ఉన్నది.

## బాల్య వివాహ నిరోధ శాసనం (1929)

ఇది చివరిసారిగా 1978 లో సవరింపబడినది. 21 సంవత్సరములు నిండని పురుషుడు బాలుని, 18 సం॥ నిండని స్త్రీ బాలిక అని నిర్వచనం చేయబడింది. బాల్యవివాహం చేసుకున్న వరునికి శిక్ష, తల్లితండ్రులకు శిక్ష నిర్దేశింపబడినాయి. సంరక్షకునికి కూడా శిక్ష చెప్పబడినది. స్త్రీకి జైలుశిక్ష వేయరాదు. ఈ శాసనం క్రింది నేరాలను పోలీసులు దర్యాప్తు

చేయగలదు. బాల్యవివాహాన్ని ఆపటానికి న్యాయస్థానం నిషేధపు టుత్తరువును జారీ చేయవచ్చును.

కట్న నిషేధ శాసనం (1961).

ఇది 1984 లో సవరింపబడినది. సవరణ చట్టము తే 2-10-84 నుండి అమలులోకి వచ్చింది. ముఖ్యమైన మార్పులు జరిగాయి. శిక్షల పరిమితి, బహుమతుల జాబితాలు, జరిమానాల హెచ్చింపు, కేసు పెట్టడానికి అర్హత, వరకట్నాన్ని వివాహమాడిన స్త్రీకి తిరిగి ఇవ్వడానికి నిర్దేశింపబడిన కాలవ్యవధి, మొదలగు విషయాలలో మార్పులు వచ్చాయి. కట్నంయొక్క నిర్వచనాన్ని కూడా మార్చడం సంభవించింది. ఈనాటి శాసనం ప్రకారం చాల కట్టుదిట్టాలు వచ్చాయి. ఈ శాసనం అందరికీ వర్తిస్తుంది కనుక, వరకట్న దురాచారం హిందువులలో ఎక్కువగా ఉన్నది కనుక, ఈ శాసనాన్ని ప్రత్యేకంగా హిందువులకై వర్తింపచేయకపోయినా ఇక్కడ చర్చిస్తున్నాం.

వివాహంతో ఒకపార్టీ మరిఒక పార్టీకి, లేక ఒక పార్టీ తల్లిదండ్రులు గాని మరెవరైనా గానీ రెండవ పార్టికి లేక మరియొక వ్యక్తికి ఆ పార్టీల పెండ్లి సందర్భంగా ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని ఇచ్చిన ఆస్తి లేక విలువగల ధనం, పత్రం, చరాస్తి వగైరా లేక ఇచ్చుటకు అంగీకరించిన కట్నమనబడును. ముసల్మాను ధర్మశాస్త్రప్రకారం పేర్కొనబడిన 'మహర్' (Dower) దీని క్రిందకు రాదు. (సెక్షను 2) ఏ వ్యక్తి అయినా కట్నం ఇచ్చినా, పుచ్చుకున్నా, లేక ఇచ్చుటలో, పుచ్చుకొనుటలో సహాయపడినా, అనికి ఆరుమాసములకు తక్కువగాని 2 సం॥ మించని జైలుశిక్ష. ఇంకా పదివేల రూ. లు లేక కట్నం ఏది ఎక్కువ అయితే దానికి మించని జరిమానాకు పాత్రుడు లేక పాత్రురాలు. కాకపోతే ప్రత్యేక కారణాలను పేర్కొని కోర్టు ఆరు మాసాలకు తక్కువ శిక్ష వేయవచ్చును. వివాహకాలమందు, ఎవరూ కోరకుండా, వధువుకు ఇవ్వబడిన బహుమతులు - ఈ శాసనం క్రింద తయారయిన నిబంధనల ప్రకారం ఏర్పడిన జాబితాలో పేర్కొనబడినచో - కట్నం క్రిందికి రావు.

అలాగే, ఎవరిచేత కోరబడకుండా, వరునికి వివాహమపుడు ఇవ్వబడిన బహుమతులు - జాబితాలో వ్రాయబడితే - కట్నం క్రిందికి రావు. కాగా

వరునికి వచ్చే బహుమతులకు సంబంధించి మరో షరతు వుంది. అవి వధువు తరపున గాని లేక వధువు బంధువైన వ్యక్తి తరపునగాని ఇవ్వబడి, అవి ఆచారం ప్రకారం ఇవ్వబడే బహుమతులు అయి, ఎవరివల్ల లేక ఎవరి తరపున ఆ బహుమతులు ఇవ్వబడినవో ఆ వ్యక్తి యొక్క ఆర్థిక స్తోమతును పరిగణన లోకి తీసుకొనినచో అధిక విలువ కానివి అయినచో అవి కట్నం క్రింద లెక్కకురావు. (సెక్షను 3) ఏ వ్యక్తి అయినా ప్రత్యక్షంగా కాని వధువు లేక వరునియొక్క తల్లిదండ్రులనుండి, బంధువులనుండి లేక సంరక్షుని నుండి కట్నంను 'డిమాండు' చేసినచో ఆ వ్యక్తికి 2 సం॥ లకు మించకుండా 6 నెలలకు తగ్గకుండా జైలుశిక్ష మరియు పదివేలకు మించని జరిమానా వేయ వచ్చును. కాకపోతే తగిన కారణాలు ఉంటే కోర్టువారు 6 నెలల లోపున శిక్ష వేయవచ్చును (సెక్షను 4), కట్నం ఇవ్వడానికి, పుచ్చుకోడానికి చేసుకున్న ఒప్పందం చెల్లనేరదు (సెక్షను 5).

ఏ స్త్రీ వివాహ సందర్భంగా కట్నం ఏ వ్యక్తి చేతనైనా తీసికొనబడినచో- ఆ స్త్రీ కాక - ఆ వ్యక్తి ఆ కట్నాన్ని ఆ స్త్రీకి ఈ దిగువ విధంగా తిరిగి ఇచ్చివేయవలెను.

i) కట్నం పెళ్ళికి ముందే తీసుకుంటే పెళ్ళి తేదీనుండి 3 మాసాల లోపల.

ii) కట్నం వివాహమపుడు కాని లేక తరువాత గాని తీసుకుంటే తీసుకున్న తేదీనుండి 3 నెలల లోపల

iii) స్త్రీ మైనరుగా ఉన్నపుడు కట్నం తీసుకుంటే, ఆ స్త్రీకి 18 సం॥ నిండిన 3 మాసాలలోగా, అది ఆమెకు చెందజేయాలి (సెక్షను 6).

అలా చేయని వ్యక్తికి 6 మాసాలకు తక్కువ కాకుండా 2 సం॥ మించని జైలుశిక్ష లేక పదివేలకు మించని జరిమానా లేక ఆ రెండు శిక్షలు విధించవచ్చును. అలా హక్కుదారయిన స్త్రీ చనిపోతే ఆ కట్నం ఆమె వారసులకు చెందవలెను [సెక్షను 6 (3)]. ఏ వ్యక్తి అయినా కట్నాన్ని శిక్ష చెప్పకముందు ఆ స్త్రీకి చెందజేయకపోతే శిక్ష వేయడమే కాక ఆ ఆస్తిని ఆ స్త్రీకి చేర్చమని అతనికి లేక ఆమెకు ఉత్తరువును కోర్టువారు ఇవ్వవచ్చును. ఆలాంటి ఉత్తరువును కోర్టువారు ఇచ్చిన గడువు లోపల ఆ వ్యక్తి ఖాతరు

చేయకపోతే ఆ కట్నపు విలువను అతని ఆస్తినుండి, కోర్టువారు విధించిన జరిమానాను వసూలు చేసే పద్ధతిలో, రాబట్టవచ్చును [సెక్షను 6 (3 ఎ)]. ఈ కేసులను ఫస్టు క్లాసు మెజిస్ట్రేటు విచారించగలడు. కోర్టువారు ఇలాంటి కేసును స్వయంగా తమకు తెలిసిన విషయాన్ని ఆధారంగా ఫైలులోకి తీసుకో గలరు. లేక పోలీసు రిపోర్టుపైన, ఆ నేరంవల్ల బాధిత వ్యక్తి, లేక తల్లి దండ్రులు, లేక బంధువు, లేక గుర్తింపబడిన సంక్షేమ సంఘం వారి ఫిర్యాదు పైన మెజిస్ట్రేటు కేసును స్వీకరించగలడు. కేంద్ర, లేక రాష్ట్ర ప్రభుత్వాలచే గుర్తింపు పొందిన సామాజిక సంక్షేమ సంఘము 'గుర్తింపబడిన సంక్షేమ సంఘం'గా పరిగణింపబడును. ఈ శాసనం క్రింద నమోదయ్యే నేరాలు 'కాగ్నిజిబులు' నేరాలు. అంటే పోలీసువారు నిందితులకు వారంటు లేకుండా అరెస్టు చెయడానికి వీలయిన నేరాలు. ఈ కేసులో జామీనుపై నిందితుని విడుదల చేయవచ్చును. అయితే ఈ కేసులో రాజీపడటానికి వీలులేదు. బహుమతుల జాబితాను ఎవరు తయారు చేయాలి, ఎలా తయారు చేయాలి అనే దాని విషయమై కేంద్ర ప్రభుత్వం నిబంధనలను రూపొందించవచ్చును. నిబంధనలను తే 19-8-1985 న గెజిటులో ప్రకటించారు. బహుమతుల జాబి తాను వరుడు వ్రాయాలి. ప్రతి బహుమతి, దాని వివరం, దాని సుమారు విలువ, ఇచ్చిన వారి పేరు, బహుమతి వధువు బంధువు గాని, వరుని బంధువు గాని ఇస్తే ఆ బంధుత్వం ఈ అంశాలన్నీ ఆ జాబితాలో ఉండాలి. ఈ జాబితాపై వధూవరుల దస్కతులు లేక వేలిముద్రలు ఉండాలి. అంతేగాక పెండ్లి సమయంలో హాజరయిన బంధువుల, లేక ఇతర వ్యక్తుల సంతకాలు కూడా ఆ జాబితాపై తీసుకొనవచ్చును.

ఇలా ఎన్ని కట్టుబాట్లు శాసనపరంగా చేసినా ఈ సామాజిక దురా చారాన్ని అరికట్టడం కష్టం. స్త్రీలలో చైతన్యం వెల్లివిరిసిననాడు, వరకట్న ఇవ్వడానికి వారు నిరాకరించిననాడు, వివాహం స్త్రీకి తప్పనిసరి సంస్కార మని భావించటం మానివేసిననాడు, కట్నం తీసుకున్న పురుషుని సమాజం ఈసడించి, అసహ్యించే స్థితికి కొంతగా కొంత వచ్చిన నాడు ఈ దురాచారం నశిస్తుంది. ఆ శుభ సమయాన్ని దగ్గర చేయటానికి స్త్రీలు ఉద్యమించాలి.

# అధ్యాయం 15

## పాదదీపికలు

1. స్టేటస్ కమిటీ రిపోర్టు పుట 125
సమానత్వంవైపు (భారత ప్రభుత్వం)
Towards Equality (Govt of india 1974)
2. డిటో పుట 129
3. డిటో పుట 126
4. డిటో పుట 119
5. డిటో పుట 136
6. డిటో పుట 137
7. డిటో పుట 138
8. డిటో పుట 138
9. డిటో పుట 138

అధ్యాయం

# 16 మదింపు, ముగింపు

హిందూ సమాజాన్ని స్థూలంగా దర్శనం చేసుకున్న తరువాత, ఆ సమాజాన్ని నడిపించే మత సూత్రాలను అవగతం చేసుకున్న తదుపరి, దాని ధార్మిక నియమాన్ని గుర్తించిన పిదప దాని బాగోగులను గురించి ఆలోచించవలసి ఉంటుంది. కాగా విషయ ప్రధానంగా సామాజిక ధర్మాలను, నియమాలను, సంప్రదాయాలను, ఆచారాలను విశ్లేషణ చేసుకున్నాం. కనుక ఇపుడు ఒకసారి కాలగతి ననుసరించి సమీక్ష చేసుకోవటం అవసరం.

ఋగ్వేద కాలంలో (సుమారు క్రీ. పూ 2500 క్రీ. పూ 1500) స్త్రీలు మత విషయకంగా, విద్య పరంగా తృప్తికరమైన స్థానంలోనే ఉన్నారు. కాగా వారు రాజ్య నిర్వాహణ చేసినట్లు లేదు. ఆర్థిక రంగంలో పాత్ర స్త్రీపురుషులిద్దరికీ అంతంతమాత్రమే. కాగా ఆమెకు వేరే ఆస్తి ఉన్నట్లుగా గాని దానిని ఆమె ఎలా అనుభవించేదో గాని మనకు సాక్ష్యాధారాలు లేవు. కాబట్టి ఆమెకు విడిగా ఆస్తిపై హక్కులు లేవని ఊహించవచ్చును. వివాహ విషయంలో ఆమె చొరవ చూపటానికి అవకాశం ఉండేది. 16 సంవత్సరముల వయస్సులో వివాహం జరిగేది. సభలలో, విద్వత్ సభలలో ఆమెకు ఆనాడు ప్రవేశం ఉండేది. భర్త చనిపోతే భార్య మరణించవలసిన పనిలేదు. విధవా వివాహం వుండేది.

క్రీ. పూ 1500 నుండి క్రీ. పూ 500 వరకు గడచిన కాలాన్ని సంహితలయుగమనవచ్చు. సంహితలు, బ్రాహ్మణాలు ధర్మసూత్రాలు, గృహ్యాసూత్రాలు, తొలికాలపు స్మృతులు పుట్టాయి. ఈ కాలంలో వివాహ వయస్సు తగ్గలేదు. కాగా జీవిత దృక్పధం మారింది. భౌతికానందానికి ప్రాధాన్యత తగ్గి, పితృదేవతల ఋణవిముక్తికి ప్రాముఖ్యత వచ్చింది. ప్రతి మనిషికి మూడు ఋణాలు ఉన్నాయట. అవి దేవఋణం, పితృఋణం, మనుష్యఋణం, దేవ ఋణం తీర్చుకోడానికి యజ్ఞాలు, యాగాలు, క్రతువులు సాగించే మానవుడు

పితరుల సేవకు పూనుకున్నాడు. వారిని దేవతలతో సమానంచేసి పితృదేవత లన్నాడు. వారికి సద్గతులు కల్గించటానికి సంతానాన్ని అపేక్షించాడు. సంతానాన్ని కనవలసిందని ఆమెను ఆదేశించాడు. స్త్రీ స్థానం పతనం కాజొచ్చింది. వేదకాలంలో తమ జనాభాను పెంచుకుంటే తప్ప శత్రువులను జయించలేమనే భావంతో సంతానాన్ని అధికంగా ఆశించిన ఆర్యుడు ఈ కాలంలో మత కారణం వలన అలాంటి పనికే పూనుకున్నాడు. మరో సామాజిక పరిణామం సంభవించింది. ఆర్యులు అనార్య స్త్రీలను వివాహ మాడసాగారు. కాని వారితో తమ సుఖసంతోషాలకు మాత్రం సాంగత్యం నెరపి, మత క్రతువులలో ఆర్య భార్యలకు అధికారం, ప్రమేయం కల్పించారు. వైదిక యజ్ఞాలను క్రతువులను సంక్లిష్టం చేసుకున్నారు. కావున స్త్రీ సంతాన సాధనకు ఉపకరించే జీవి మాత్రమే కాక ఇల్లాలు కూడాను. అయితే భార్యలలో రెండు తెగలు. మత క్రతువులలో సాహచర్యం జరుపగల భార్యలు. ఆ స్వేచ్ఛలేని భార్యలు. 'విభజించి పాలించు' సిద్ధాంతం ఆచరణలో స్త్రీల పరంగా ప్రారంభమయిందా! అని తోస్తున్నది.

క్రీ. పూ. 500 నుండి క్రీ. శ. 500 వరకు 'సూత్రయుగం' అని పిలవవచ్చు. ధర్మశాస్త్రాలు అశేషంగా ఉద్భవిల్లాయి. సూత్ర గ్రంధాలు, స్మృతులు, పురాణాలు వచ్చాయి. ఈ దశలో స్త్రీ స్థితి చరమాంకానికి వచ్చింది. ఈ కాలంలోని ముఖ్యులు కౌటిల్యుడు, మనువు. కౌటిల్యునిది లౌకికతత్వం. మనువుది 'ధర్మ' దృష్టి. ధర్మమంటే న్యాయమైనదని కాదు. ధర్మమంటే విధ్యుధర్మం. అంటే తప్పక చేయవలసిన పని అని అర్థం చెప్పుకోవాలి. వీరిరువురి మధ్య ఉన్న కొద్దిపాటి తేడాలను, పోలికలను గమనిద్దాం. అర్థ శాస్త్రంలో స్త్రీకి ఆర్థిక ప్రతిపత్తి, ఆర్థిక పరంగా వ్యక్తిత్వం ఉండేవి. మనువు కాలం నాటికి అది క్షీణించింది. ఆర్థికంగా, ఆధ్యాత్మికంగా కుమారుని అవసరాన్ని నిర్ధారించి వంశోద్ధరణ యొక్క ప్రాముఖ్యాన్ని, పితృస్వామ్య వ్యవస్థయొక్క ప్రాధాన్యతను మనుస్మృతి తెలుపుతున్నది. అర్థశాస్త్రం, మనుస్మృతి ఈ రెండు కూడా స్త్రీని పురుషునిపై ఆధారపడేటట్లు చేశాయి. స్త్రీలు సాంఘిక ఆర్థిక హక్కులు కోల్పోయారు. తమ భవిష్యత్తును తాము నిర్ణయించుకోగల సత్తాను కోల్పోయారు. ఇది కాలక్రమేణ జరిగిన మార్పు వీరికాలంలో. వీరు దీనికి సిద్ధాంతపరమైన ఆధారాలను కల్పించారు. స్త్రీలకు అవకాశాలు సన్నగిలినాయి. అర్థశాస్త్రకాలంలో పునర్వివాహం, స్వతంత్రంగా

ఆస్తి కలిగి ఉండడం ఉండేది. 'ధర్మకామ' అయిన విధవ గొప్పమనిషి. లౌకిక వివాహాలకన్న ధార్మ్య వివాహాలు గొప్ప. కాని లౌకిక వివాహం చేసుకున్న స్త్రీలకు ఎక్కువ హక్కులు వెసులుబాట్లు ఉన్నాయి. మనువు కాలంలో (క్రీ. పూ. 200 - క్రీ. త. 200) రజస్వలాత్పూర్వ వివాహాలు వచ్చాయి. వర్ణాంతర వివాహ నిషేధం వచ్చింది. బహుభార్యాత్వం స్థిర పడింది. ధార్మ్య వివాహాలను ప్రోత్సహించడానికి, ధార్మ్య వివాహం చేసుకున్న వారికి ఇతోధిక హక్కులను సౌకర్యాలను ఇచ్చాడు మనువు. స్త్రీల హోదాలో తేడా - ఆర్య భార్యలు, అనార్య భార్యల మధ్య - తీసివేశాడు. అందరు స్త్రీలనూ అస్వతంత్రులను చేశాడు. బ్రాహ్మణుల ఆచారాలను మనువు సమాజం మొత్తంపై రుద్దాడు. వాస్తవానికి కౌటిల్యునికీ, మనువుకూ లక్ష్యాల విషయంలో తేడా లేదు. కౌటిల్యుడు 'అర్థం' పై దృష్టితో వ్రాశాడు. మనువు 'ధర్మాన్ని' మనసులో ఉంచుకున్నాడు. కౌటిల్యుని కాలంలో ధనవంతులు, బీదలు వేరు వేరుగా ఉండి ఎవరి ధర్మాలు వారికి ఉండేవి. మనువు కాలంలో ధనవంతుల ధర్మాలు అందరి ధర్మాలుగా చేయబడినయి. మనువు సామాజిక సంస్థకు విలువ ఇచ్చాడు. ఆస్తికి విలువ ఇవ్వలేదు. రాజకీయ కారణాలను, మతవ్యాప్తి అవకాశాలను పురస్కరించుకొని గాంధర్వ వివాహాన్ని, నియోగాన్ని మనువు అంగీకరించాడు. వర్ణవ్యవస్థ పూర్తిగా నాశనం కాకుండా చేసిన ప్రయత్నమది. విధవా పునర్వివాహాన్ని ఆపటానికి నియోగాన్ని ఆమోదించాడు. అర్థశాస్త్రంలో కుమార్తెలకు హక్కులుండేవి వారసత్వ విషయంగా. అవి కోల్పోయారు మనువు ధర్మమా అని. కుమారుని ప్రాముఖ్యత పెరిగింది. వివాహానికి, వారసత్వానికి ధర్మాన్ని జోడించాడు మనువు. శుల్కాన్ని నిషేధించాడు. ద్విజులలో కూడ వర్ణాంతర వివాహాలను నిషేధించాడు. అర్థశాస్త్రకాలంలో వర్ణ వ్యవస్థ బిగవలేదు. మనువు నాటికి గట్టిపడింది. మనుస్మృతితో బ్రాహ్మణుల స్థానం స్థిరపడింది. పితృస్వామ్య వ్యవస్థ మనుస్మృతి కాలంనాటికి బలపడింది. దాంతో స్త్రీల శాశ్వత పరాధీనత, సమాజంలో పురుషుల పెత్తనం స్థిరపడినయి.1 స్త్రీకి ఉపనయనాధికారం పోయింది. చిన్నతనంలో పెండ్లి అవటంతో విద్యా సముపార్జనావకాశాలు మృగ్యమైనాయి. స్త్రీని దండించటానికి మనువు భర్తకు అధికారం ఇచ్చాడు. త్రాడుతోకాని, సన్న వెదురు బొంగుతో కాని భార్యను వీపుమీద కొట్టి భర్త ఆమెను దండించవచ్చును (మనుస్మృతి VIII - 299-30)2 మనువు స్త్రీలకు

భద్రత ఇచ్చాడు. స్త్రీలను గౌరవంగా, ప్రేమగా చూడమన్నాడు.3 మనువు విధవా వివాహాలను పూర్తిగా నిషేధించాడు. వివాహాన్ని త్రెంచివేయటానికి, రద్దుచేయటానికి వీలులేదన్నాడు.

ఈ కాలంలో స్త్రీలకు కొన్ని సదుపాయాలను మాత్రం కల్పించారు ధర్మశాస్త్రకారులు. అవి ఇలా ఉన్నాయి. స్త్రీలను చంపరాదు. పతిత కుమార్తె పతిత కాదు, పతిత కుమారుడు పతితుడు. పురుషునికి విధింపబడిన ప్రాయశ్చిత్తం లో స్త్రీకి విధింపబడిన ప్రాయశ్చిత్తం సగం మాత్రమే. అన్ని వర్ణాల స్త్రీలకు పన్నులు చెల్లించవలసిన బాధ్యత లేదు. గర్భిణీ స్త్రీలకు నదిని దాటటానికి పడవ సుంకం లేదు. వివాహితలై పుట్టింట నున్న స్త్రీలకు యజమాని కన్న ముందుగా భోజనం పెట్టాలి (యాజ్ఞవల్క్యుడు). స్త్రీ ధనానికి కుమార్తెలే వారసులు (శుల్కానికి కాదు). పెండ్లి విషయంలో ఆచారాలను స్త్రీల వద్ద తెలిసికోవలెను (అపస్తంబ గృహ్య సూత్రం II - 15). ఈ కాలం లో మనువుదే పెద్ద పీట అని తెలిసికున్నాం కదా! "తమ ఆస్తిని భద్రంగా కుటుంబంలోని పురుషుల అధీనంలో ఉంచి భద్రంగా అనుభవించే నిమిత్తం బహుశః స్త్రీలే తమ హక్కులను పోగొట్టుకున్నారేమో! ఇది ప్రభాతీ ముఖర్జీ ఊహ.6 ఒక మాట సత్యం. ఈ యుగంలో స్త్రీలు స్వేచ్ఛను పోగొట్టు కున్నారు. భద్రతను సంపాదించుకున్నారు. అది బానిసలకు ఉంటే భద్రతయా? లేక పరిచారకులకు ఉండే భద్రతయా? అనేది మిమాంస.

హైందవంలో చివరి దశ క్రీ. త. 500 క్రీ. త. 1800 వరకు సాగింది ఇది అంధకారయుగం. స్త్రీలకు విషాదయుగం. బాల్య వివాహాలు ఎక్కువ యినయి. సతీసహగమనం క్రీ. త. 12 వ శతాబ్దం నుండి విలయ తాండవం చేసింది. విధవల శిరోముండనం క్రీ. త. 8 వ శతాబ్దంలో ప్రారంభమయింది. స్త్రీల పరిస్థితి ఘోరంగా క్షీణదశలో ఉండిపోయింది. కాకపోతే ఆస్తి విషయంలో ఆమె హక్కులు పెరిగాయి. సామాజికంగా, వ్యక్తిగతంగా స్వేచ్ఛ లేని స్త్రీలకు ఆస్తి హక్కు వున్నా లేకున్నా ఫలితం మాత్రం హుళక్కి అయింది. పతివ్రతా ధర్మాలు ఆమెను బంధించి పడవేసినయి. ఆమెకు వేరే వ్యక్తిత్వం, జీవితం లేకుండా చేసినయి. ఆమె వైధవ్య జీవితాన్ని నికృష్టం చేసి, ఆమెకు జీవితంపై రోత కలిగేలా చేశాయి.

బ్రిటిషు పరిపాలన వచ్చి హిందూ సమాజ వ్యవహారాలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకొనే నాటికి స్త్రీల పరిస్థితి చాల శోచనీయంగా ఉంది. రజస్వలాత్పూర్వ వివాహమేకాక 8 సం॥ వయస్సు కల ఆడపిల్లలకు పెళ్ళి, బాలికకు చదువు అక్కరలేదు అనే భావం, విడాకులు లేకపోవటం, వితంతు పునర్వివాహ నిషేధం, వర్ణాంతర వివాహ నిషేధం, వైధవ్య జీవితంలో నిర్బంధంగా కఠిన నియమాలు, విధిగా విధవకు శిరోముండనం, పతివ్రతా ధర్మాలు, భార్యను భర్త దండించే అధికారం, ఎంతమంది పిల్లలను భర్త కవమంటే అంత మందిని భార్య కనవలసి రావడం, బహు భార్యాత్వం, భార్యలను నిరాదరణ చేయటం, స్త్రీలను తక్కువ చూపు చూడటం, ఆమెపై సతీధర్మాల అస్త్రాలను ప్రయోగించి ఆమెకు బయటి ప్రపంచ స్వభావ, స్వరూపాదులను తెలియజేయనీయక పోవడం, పర్దా, మేలిముసుగులతో ఆమెను బంధించడం, స్త్రీ జీవితంలో అన్ని దశలతోనూ ఆమెకు వ్యతిరేకంగా వివక్ష, వివాహం స్త్రీకి విధికృత సంస్కారమవటం. మాతృత్వానికి విలువను ఇచ్చి మాతయైన స్త్రీని నిరాదరణ చేయటం, స్త్రీలకు సామాజిక జీవితంలో తగుస్థానం కల్పించకపోవటం, రాజకీయ జీవితంలో ఆమెకు ప్రవేశం నిరాకరింపబడటం, స్వతంత్రంగా ఆమె ఏదైనా వృత్తులను అవలంబించి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కలిగి ఉండటానికి వీలులేని స్థితి, చివరకు దత్తత విషయంలో కూడ ఆమె సమ్మతి, అసమ్మతులకు విలువలేకపోవటం, సామాజిక జీవితంలో వేర్పాటు, స్వేచ్ఛారాహిత్యం, సమానత్వ లేమి, ఆమె వ్యక్తిత్వాన్ని గుర్తించకుండుట ఇవి అన్నీ స్త్రీని ప్రాణం ఉన్న వస్తువుగా దిగజార్చాయి. ఆమె శ్రేయోభివృద్ధికి 1829 నుండి శాసనాలు వస్తున్నా ఆమె పరిస్థితిలో ఇంకా ఎంతో మార్పు రావలసి వుంది.

హిందూ సామాజిక వ్యవస్థమీద పలువురు ప్రసిద్ధులు అభిప్రాయాలను ఏర్చి కూర్చుకొని, వాటికి విలువ కట్టుకునే ముందు ప్రాచీన కాలంలో స్త్రీ విమోచనానికి దోహదం చేసిన వారిని స్మరించడం విధ్యుక్తధర్మం. ధామస్, లెక్కన తాంత్రికులు, వరాహమిహిరుడు (క్రీ. శ. ఆరవ శతాబ్దపువాడు), కర్నాటక ప్రాంతపు లింగాయతు శాఖ స్థాపకుడు బసవుడు (క్రీ. శ. 12 వ శతాబ్దపు వాడు) ఎన్నిక గన్నవారు. తాంత్రికులు స్త్రీ దేవతను పూజ చేసేవారు బహుశః అందువలన నేమో వారు స్త్రీల పరిస్థితివి షయంలో ...

'మహానిర్వాణతంత్ర' అనే గ్రంథంలో ఈ దిగువ వాక్యాలు పరిశీలనార్హాలు: "గృహస్తు భార్యను అభిమానించాలి. పిల్లలను విద్యావంతులుగా చేయాలి. బంధువులను, స్నేహితులను, పోషించాలి. ఇది శాశ్వత ధర్మం. భార్యను శిక్షించరాదు. భార్య బ్రతికి వుండగా దురుద్దేశంతో మరొక స్త్రీని తాకరాదు. సంపదతో, దుస్తులతో, ప్రేమతో, గౌరవంతో, మధుర భాషణంతో, భార్యను సంతోషపెట్టవలెను. ఆమెకు అహితం కలిగించే పనిని అతడు చేయరాదు. 'సతీ' ని సహగమనాన్ని నిరసించింది ఆ గ్రంథం. మానభంగానికి మరణ శిక్ష విధించమన్నది. స్త్రీని అవమానించినవాడు, ఆమెపై కోపగించుకునే వాడు, కొట్టినవాడు శిక్షార్హులు. భార్యను వదలిపెడితే గాడిద చర్మం కప్పుకొని ఏడు ఇళ్ళవద్ద పురుషుడు బిక్షాటన చేయాలి. అట్లు విడువబడిన స్త్రీ పరపురుష సాంగత్యం చేయవచ్చును. బాలవిధవ పునర్వివాహం చేసుకోవచ్చును. భర్త నపుంసకుడయితే ఆమె విడాకులు పొంది పునర్వివాహం చేసుకోవచ్చును. వరునివద్ద పైకం తీసుకొని కుమార్తెను ఆతనికిచ్చి వివాహం చేయరాదు. శుల్కం పుచ్చుకొనుట నిషేధింపబడినదన్నమాట. అష్టవివాహాలు మాత్రమే కాక వారు 'శైవ వివాహం' అనే తొమ్మిదవ వివాహాన్ని ప్రదిపాదించారు. భార్య-దేవీ పూజలో కూర్చొనడానికి అంగీకరించకపోతే పురుషుడు మరొక స్త్రీని శైవ భార్యగా స్వీకరించవచ్చును. మొదటి భార్యకు మనవర్తి, ఆమె సంతానానికి వారసత్వ హక్కులుంటాయి. శైవ భార్య సంతానానికీ వారసత్వ హక్కు ఉంటుంచి. తాంత్రికుల సతీ సహగమన నిరసన వారి శాఖకు పరిమితమయింది. వారిలో వారు సహగమనాన్ని ఆమోదించలేదు. ఇతరుల విషయం వారు పట్టించుకోలేదు.7

స్త్రీల యెడ అన్యాయాన్ని, వివక్షను నిరసించిన వారిలో ముఖ్యుడు వరహమిరుడు. ఇతడు ప్రఖ్యాత ఖగోళ శాస్త్రజ్ఞుడు, విజ్ఞాన శాస్త్రవేత్త. అతడు తన గ్రంధం 'బృహత్ సంహిత' లో ఇలా అన్నాడు. "స్త్రీలు రత్నాలకు వన్నె తెస్తారు. అంతేకాని అవి స్త్రీలకు వన్నె తీసుకొనిరావు. స్త్రీ తన చూపు ద్వారా, మాటలద్వారా, ఒవనద్వారా, స్పర్శద్వారా పురుషునికి ఆనందాన్ని ఇస్తుంది. ఆమెను మించిన రత్నాన్ని దేవుడు సృజించలేదు. ఆమెద్వారానే ధర్మార్థ కామాలు సాధ్యం. ఆమెవల్లనే పుత్రప్రాప్తి. అందు వలన స్త్రీ లోకాన్ని లక్ష్మికి అలవాలంగా సమాజానికి వెన్నెముకగా, మర్యాదచేసి గౌరవించాలి. ఎవరైతే వన్యాసభావనతో స్త్రీలపై ద్వేషం కక్కుతారో,

ఎవరైతే స్త్రీల గొప్ప గుణాలను పరిగణించరో వారే దుష్టులు. వారి వాచాలత్వానిరి విలువ లేదు. పురుషునికి లేని లోపం స్త్రీకి ఏమి ఉన్నది. ఆ మాటకు వస్తే పురుషులే స్త్రీలకు వక్ర మార్గం పట్టిస్తున్నారు. సద్గుణ ప్రస్తావనగా స్త్రీలు పురుషుల కంటె ఉన్నతలు. మనువు ఈ సందర్భంలో ఏమంటాడు? సోముడు వారికి అందాన్నిచ్చాడట. గాంధర్వులు మధురవాణిని ఇచ్చారట. అగ్ని పరిశుద్ధతను ప్రసాదించాడట. స్త్రీలు సువర్ణం లాగానే అమలినులు. బ్రాహ్మణుల పాదాలు పరిశుద్ధం. ఆవు వీపు, మేక, కుక్కల నోళ్ళు పరిశుద్ధం అయితే స్త్రీలు తమ శరీరం యావత్తు పరిశుద్ధులు. స్త్రీలు అసమానంగా పరిశుద్ధులు. వారు ఎప్పుడు అపవిత్రులు కారు. వారి బహిష్ట రక్తస్రావం వారి అపరిశుద్ధతను తొలగిస్తుంది. స్త్రీలను గౌరవించని కుటుంబాలు వినాశ దేవత ఆగ్రహానికి గురి అయినట్లుగా నాశనం అవుతాయి. స్త్రీ నుండియే పురుషుడు ఉద్భవిస్తున్నాడు. ఓ కృతజ్ఞత లేని పురుషులారా! మీ జన్మకు కారకులయిన స్త్రీలను మీరు నిందిస్తే మీరు ఎలా ఆనందంగా ఉండగలరు? దాంపత్యంలో స్త్రీ పురుషులిరువులూ విశ్వాసంతో ప్రవర్తించాలి. ఇరువురిలో ఎవరు భిన్నంగా ప్రవర్తించినా శాస్త్రాలు వారిని అభిశంసించాయి. ఈ శాస్త్ర వాక్యాలను వేటిని పురుషులు పట్టించుకోరు. స్త్రీలు అలా చేయరు. అందు వలన పురుషులకన్న స్త్రీలు గొప్పవారు. తన భార్య యెడ అవిశ్వాసంతో ప్రవర్తించినపుడు (ఆమెను కాదని మరియొక స్త్రీని చేపట్టినవాడు) వెంట్రుకలు బయటికి ఉండే గాడిద చర్మం కప్పుకొని 'నేను భార్యకు ద్రోహం చేసిన వాడను, నాకు భిక్ష ఇవ్వండి అని ఆరు మాసాలు భిక్షాటనం చేయాలి. 100 సం॥ వయస్సు వచ్చినా పురుషుని కామేచ్ఛ నశించదు. వీర్యశక్తి నశించి నప్పుడే ఆదిపోతుంది. అలాకాక స్త్రీలు సంకల్ప బలంతో కామేచ్ఛను అదుపులో పెట్టుకోగలరు. బందిపోటు దొంగ ఎవరినో దోచి వారిని 'దొంగ, దొంగ' యని పిలిచినట్లు పురుషులు ఎంత లజ్జాహీనంగా స్త్రీలను నిందిస్తారు? ఏంకాతంలో స్త్రీతో ఆడిన మధుర భాషణలను పురుషుడు మరచిపోతాడు. తద్భిన్నంగా ఆమె అతని శవాన్ని కౌగిలించుకొని అతని చితిపై అగ్ని ప్రవేశం చేస్తుంది."8 ఇంత నిక్కచ్చిగా, ఘాటుగా, నిజాయితీగా భావ ప్రకటన చేసిన పురుషుడు ప్రాచీన సమాజంలో ఇతనొక్కడే. బృహత్ సంహిత 74 అధ్యాయంలో ఇంకా కొన్ని అభిప్రాయాలు చెప్పాడు. "స్త్రీల సద్గుణాలను గుర్తించకపోవడం క్షంతవ్యం కాదు." పరలోక భావనపై

మోజుతో, సన్యాస జీవితంపై గల ఆసక్తితో స్త్రీని నిందిస్తున్నారని అతడు వ్యధ వెలిబుచ్చాడు.[9] కాళిదాసు, బాణుడు, భవభూతి స్త్రీని ఉదారభావంతో చిత్రించారు. "స్త్రీల పక్షాన ఎలుగెత్తి వాదించినవాడు వరాహమిహిరుడు ఒక్కడే."[10]

దక్షిణాదిన ప్రఖ్యాత. యశస్కుడు బసవడు. బ్రాహ్మణ వంశోద్భవుడు. ఏకేశ్వరోపాసనము ప్రతిపాదించాడు. విగ్రహారాధనను నిరసించాడు. కుల వ్యవస్థను ఖండించాడు. జన్మ పరంపరను కాదన్నాడు. స్త్రీలు పురుషుల కన్న తక్కువ కాదని, స్త్రీలను గౌరవించి దయతో చూడాలని. బాల్యవివాహం, సతీ సహగమనం అభ్యంతర కరమని, వివాహానికి వధూవరుల సమ్మతి అవసరమని, సంతానం ఉన్న విధవలు కూడ వివాహ మాడవచ్చని సాహసంతో ప్రకటించిన ధీరుడు. కొన్ని సందర్భాలలో విడాకులు పొందడానికి స్త్రీలకు హక్కు ఉందని ఉద్ఘాటించాడు. సనాతన బ్రాహ్మణుల ఆగ్రహానికి గురి అయినా తను విశ్వసించిన సిద్ధాంతాలను ప్రచారం చేసిన ధైర్యశాలి, స్థిరచిత్తుడు. తన జీవితంలో తన సిద్ధాంతాలను ఆచరణలోకి తెచ్చిన నిజాయితీపరుడు. అతనికి స్త్రీ లోకం రుణగ్రస్తమయి ఉండాలి.[11]

మార్పుయొక్క ఆవశ్యకత :-

గత రెండువేల సంవత్సరాలనుండి స్త్రీ యొక్క స్థితి మరీ క్షీణించింది. అందువల్ల మార్పు అవసరం. స్త్రీలకు సమాజంలో సముచితమైన, న్యాయమైన స్థానాన్ని ఇచ్చే నిమిత్తం కొన్ని ఆచారాలను, వ్యవస్థలను విప్లవాత్మకంగా మార్చవలసి ఉంటుందని ఆల్టేకర్ అభిప్రాయం వెలిబుచ్చారు.[12] మరోచోట ఇదే భావాన్ని ఇంకా కొంచెం తీవ్రపదజాలంలో ప్రకటించారు. "పరిస్థితులు మౌలికంగా మారాయి. కనుక ఆచారాలు వ్యవస్థలూ విధిగా పరిణామాను సారంగా మారాలి."[13] ఈ మాటలు స్త్రీ విమోచన ఉద్యమకారులవి కావు. ఏంతో సానుభూతితో, అవగాహనతో హిందూ నాగరికతను అధ్యయనం చేసిన ఆల్టేకరు వాక్యాలు.

మార్పును వ్యతిరేకించేవారు :-

ఇందరు ఇన్ని విధాలుగా చెప్తున్నా మతస్వేచ్ఛ స్త్రీకి హిందూమతంలో ఉన్నంతగా మరెక్కడా లేదని, హిందూమతం ఆమెకు సమానత్వాన్ని

ప్రసాదిస్తున్నదనీ ఇప్పటికీ వాదించే నిష్ఠా హిందువులు (అంటే పాశ్చాత్య ఆచారాలను తమకు అనుకూలమైన వాటిని పాటిస్తూ తమకు అసౌకర్యమైన వాటిని తృణీకరించి స్త్రీలకు పతివ్రతా ధర్మాలు బోధించేవారు) ఇంకా ఈనాటికి భారతదేశంలో అసంఖ్యాకంగా ఉన్నారు. మత సమానత్వాన్ని గురించి, లౌకిక సమానత్వాన్ని గురించి మచ్చుకు నాలుగు మాటలు గుర్తు చేసుకుందాం. స్త్రీలు ఒకసారి మాత్రమే ఆచమనం జేయాలి. (మనుస్మృతి V - 139 యాజ్ఞవల్క్యస్మృతి I - 21). స్త్రీలు మంత్ర రహితంగా స్నానం చేయాలి. స్త్రీలు అన్నంతో పిండం చేయగాదు. స్త్రీలను చంపినా, శూద్రుని చంపినా ఒకే ప్రాయశ్చిత్తం (బౌద్ధాయన ధర్మసూత్రం II - 1-11-12; పరాశర VI - 16). సాధారణంగా స్త్రీలు, పిల్లలు, వృద్ధులూ సాక్షులుగా పనికిరారు (యాజ్ఞ II - 70). స్త్రీల తగాదాలలో, ఇంకొక సాక్ష్యం లేకపోతే దొంగతనం, వ్యభిచారం, బలప్రయోగం వీటి విషయంగా స్త్రీలు సాక్షులుగా ఉండవచ్చును. (మనుస్మృతి VIII 68, 70)14. దేశ స్వాతంత్ర్యానికి పూర్వం పుట్టి పెరిగిన మహిళలలో చెక్కుమంది సామాజిక మార్పును వ్యతిరేకిస్తున్నారు. వారు పాత పద్ధతులలో పుట్టి పెరిగారు. 'కుమారీ శతకం' లాంటి శతకాలను బట్టీ పెట్టి గృహిణులయినారు. క్రీ. శ. 1850 సం॥ ప్రాంతంలో పక్కి వేంకట నరసయ్యా విరచితమై, 20 వ శతాబ్దపు తొలి సంగంలో కూడ బాలల ప్రాథమిక పాఠశాలలలో నిర్బంధ పాఠ్య గ్రంథమైన కుమారీ శతకం ఏమిచెప్పిందో చూద్దాం.

క. పరపురుషులన్న దమ్ములు;
వరుడే దైవంబు; తోడి పడుచులు వదినెల్
మఱదండ్రు; నత్తమామలు
దరఁ దల్లియుఁ దండ్రియనియు దలఁపు కుమారీ
(6 వ పద్యం).

క. పతి పాపపుఁ బని చెప్పిన
బతిమాలి మరల్ప వలయుఁ; ; బతివినకున్నన్
హితమనుచు నాచరింపుము;
మతిలోపల సంశయంబు । మాని కుమారీ ॥
(12 వ పద్యం).

క. ధనహీను ( డైన గడుదు
ర్జను ( డైన ( గురూపి యైన । జారుండైనన్
విను పాపియైన నెప్పుడు (
దనపతియే తనకు దెవ । తంబు కుమారీ ॥
(21 వ పద్యం)

క. జీవములు భర్త పదరా
జీవములని చిత్తమందు (। జింతించిన
లక్ష్మీ వల్లభు చరణంబుల
సేవ లతాంగులకు నెమ్మి।జేయు ( గుమారీ ॥
(31 వ పద్యం)

క. మును నాధు ( డు దరలినచో
వెనువెంటనే పోయి యెల్ల । వేల్పులు పొగడం
గని, యెందు నిందు నందును
ఘన కీర్తుల బొందు చుండు (। గాదె కుమారీ ॥
(92 వ పద్యం)

చివరి పద్యము శతకం మొత్తానికి పరాకాష్ట.

తా॥ భర్త తనకంటే ముందు మరణించిన యెడల
పతివ్రతయగు స్త్రీ ఆయన వెంటనే తాను చనిపోయి
పరలోకమున భర్తను దర్శించి యానందము ననుభవించును.15

ఈ పద్యాలను బట్టీయం చేసి వాటి భావాలను సరనరాన జీర్ణించుకున్న మామ్మలు, బామ్మలు మార్పును అభిలషిస్తారా? అభ్యుదయ భావాలు గల పురుషులు ముందుకు సాగిపోతలచినా ఈ అమ్మలు, అమ్మమ్మలు "నా మాట ఒక్కటి వినరా నాయనా!" అని ఆదలించి, బెదరించి మనుమలాండ్ర పెళ్ళిళ్ళలో పెత్తనం వహిస్తూ వాళ్ళ మెడలలో మంగళ సూత్రాలు కట్టించి వాళ్ళకు పతివ్రతా ధర్మాలు నూరిపోయకుండా ఆగుతారా? ఆ మనుమరాండ్రు ఆ మంగళ సూత్రాలను గర్వకారణంగా బహిరంగంగా

ప్రదర్శించుకుంటూ హిందూ సమాజ ప్రాశస్త్యాన్ని పొగడటం లేదా, ప్రఖ్యాత కళాతపస్వి ఆనంద కుమారస్వామి అభిప్రాయాలను గురించి ముచ్చటించుకున్నాం. వారి అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవించక పోయినా హిందూ సంస్కృతిలో స్త్రీ స్థానాన్ని పొగిడిన పాశ్చాత్య వనిత మార్గరెట్ కార్‌మాచ్ వివరణ గురించి పరికిద్దాం. "స్త్రీ పురుషుల మధ్య పోటీ లేకుండా ఎవరి విధ్యుక్త ధర్మాన్ని వారు నిర్వహించటానికి స్త్రీత్వాన్ని సాధించుకోవాటానికి, స్త్రీత్వ శక్తిని పొందటానికి ఆనంద కుమారస్వామి వ్యాఖ్యానాలు సందర్భోచితం."16 ఆమె అంతటితో ఆగక ఇలా అన్నది. "సిద్ధాంతరీత్యా స్త్రీల స్థానాన్ని పురుషుల కంటే తక్కువగా ఉండాలని హిందువులు భావించారని తలపోయరాదు. ఈ ఆదర్శాన్ని మలినం చేసుకోటం వలననే స్త్రీలు నీచ స్థాయికి దిగజారడం జరిగింది" 17 హిందూ స్త్రీలు అణగి మణగి ఉంటారని చెప్తు, తమ వ్యక్తిత్వాలను వికసింప చేసుకోలేరని అంగీకరిస్తూ ఇన్ని చెప్పి వారికి మానసిక భద్రత ఉందని మార్గరెట్ హిందూ స్త్రీలను మెచ్చుకుంటుంది. హిందూ స్త్రీకి భర్తను వెదకు కునే బరువు బాధ్యతలు లేవు కదా! ఈ అంశం ఆ పాశ్చాత్య మహిళను ఆకర్షించింది. మానసిక శాస్త్ర విశ్లేషణను కాస్త జోడించి, స్త్రీత్వ స్వరూపాన్ని విశదీకరించి. స్త్రీత్వ సిద్ధి కొరకు హిందూ స్త్రీ కృషిని మార్గరెట్ అభినందించింది. హిందూ సమాజం నుండి ఇతర దేశాల స్త్రీలు నేర్చుకోవలసిన అంశం పురుషులతో పోటీ పడకుండుట అని తేల్చి స్త్రీత్వ సిద్ధి అనే ఆదర్శాన్ని పొగిడింది. 18

ఈ రోజుల్లో కూడ ఎంతో ప్రసిద్ధి చెందిన మహా మహులు పాత భావాలనే ప్రచారం చేస్తున్నారు. రవీంద్రనాథ ఠాకూరు స్త్రీల బాధల యెడ ఎంతో సానుభూతి చూపించాడు. కాని ఆయన కూడ విధేయత, భర్తను ఆరాధించటం, పూజించటం అనే ధర్మాలను ప్రస్తుతించాడు. "ఆమె (హిందూ స్త్రీ) చర్యలన్నింట యెడ ఆరాధనా భావం ఎంతో కొట్టవచ్చినట్టు కనృడేది. ఆమె ఆత్మ త్యాగాన్ని గురించిన నా స్మృతులు నాకు ఒక విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. స్త్రీ యొక్క ప్రేమకు పరాకాష్ట భర్త యెడ గౌరవం.. అది ఏ ఆటంకులు లేకపోతే సహజంగా ఆరాధనగా మారుతుంది." ఈ వాక్యాలు ఆయన ఒక బ్రిటిషు వనితను గురించిన స్మృతులలోభాగాలు. 18

మరోరకపు పురుషులు :-

హిందూ సమాజం యెడ అత్యంత అభిమానంతో వర్ణాశ్రమాల మౌలిక సూత్రాన్ని అంగీకరిస్తూ, స్త్రీ పురుష పని విభజనను సమర్థిస్తూ, సంపాదన పురుషుని బాధ్యత అని ఇల్లు చక్కపెట్టడం స్త్రీ కర్తవ్యం[19] అని ప్రకటించిన మహాత్మ గాంధి ఈ కోవకు చెందినవాడు. అంటే హిందూ మత మౌలిక ప్రాతిపదికను త్రోసి రాజన కుండా హిందూ మత దురాచారాలను ఖండించే శాఖకు చెందుతారు వీరు. ఆయన బాల్య వివాహాలను[20] వివాహంలో కన్య పై బలవంతాన్ని [21] నిరసించాడు. బలవంతపు వైధవ్యాన్ని ఖండించాడు. [22] తప్పని సరి అయితే విడాకులను ఆమోదించాడు. [23] బాల విధవలకు వివాహాలు చెయ్యమన్నాడు. [24] వరకట్న దురాచారాన్ని పారద్రోల మన్నాడు. [25] పరదా పద్ధతి మంచిది కాదన్నాడు. మూఢ విశ్వాసాల నుంచి బయట పడాలన్నాడు. స్త్రీల పై దౌర్జన్యాలను ప్రతిఘటించమన్నాడు. ఇతర విషయాలలో ఎలా ఉన్నా ఒకటి రెండు విషయాలలో తప్ప - జన్మ నిగ్రహం, స్త్రీ ఆదర్శం, సమాజంలో స్త్రీ పాత్ర - మిగతా వాటి విషయంలో మహాత్మ గాంధి చాలా పురోగామిగా వ్యవహరించాడు.

మూడవ కోవకు చెందినవారు :-

ముల్క్‌రాజ్ ఆనంద్, అంబేద్కరు, ఎం.ఎన్. రాయ్ ఈ కోవకు చెందిన వారిలో ముఖ్యులు. వారు హిందూ సమాజ ప్రాతి పదికలనే ప్రశ్నించారు. హిందూ తాత్విక ఆలోచనను త్రోసి రాజన్నారు. హిందూ భావనను నిరసించారు.

హిందూ శాస్త్రకారులు ఎందుకు స్త్రీని ద్వేషించారో ప్రఖ్యాత నవలా కారుడు ముల్క్ రాజ్ ఆనంద్ ఇలా చెప్పారు. "మత గురువు తను అసాధారణమైన వ్యక్తినని భావించాడు. తనకే అన్ని మర్మాలు, రహస్యాలు తెలుసుననుకున్నాడు. తర్వాత సమాజానికి సంరక్షకుడుగా తయారయినాడు, ముఖ్యంగా తన ఉన్నతోన్నత స్థానాన్ని జాగ్రత్తగా పదిల పరుచుకోదలిచాడు. కాని స్త్రీ కూడా మార్మిక విషయానికి అధికారి అని, ఆమె శక్తి తన శక్తి కన్న మిగుల అందమైనది, రహస్యమైనది అని గ్రహించి, స్త్రీని పోటీ దారుగా పోల్చుకొని ఆమె స్థానాన్ని నీచపరచ జూస్తున్నాడు. (ఇక్కడే, ఈ లోకంలోనే, తన సంతానోత్పాదన శక్తి ద్వారా తన ప్రతిభను ఆమె వెలారుస్తున్నది.)" మత గురువుకు స్త్రీపై అసూయ, ఈర్ష్య. అందుకే ఆమె పై కక్ష. అందుచేత ఆమెను ఘోరంగా నిందించాడు. ముల్క్‌రాజ్ ఆనంద్

దృష్టిలో మనువు ఘోరమైన దుర్మార్గుడు. బ్రాహ్మణుల ప్రతినిధిగా పురుష జాతి ప్లీడరుగా భారత స్త్రీల పై బానిసత్వ సంకెళ్ళు విధించాడు. 27

అంబేద్కరు మనువును గురించి మరో రకమైన విశ్లేషణ చేశాడు. "మనువు స్త్రీలను గురించి చెప్పిన దానిలో క్రొత్త కాని, వింత కాని లేదు. భారతదేశంలో బ్రాహ్మణత్వం పుట్టినప్పటి నుండి బ్రాహ్మణులు పదే పదే వల్లిస్తున్నవే ఈ 'సూక్తులు'. మనువు రాక పూర్వం అవి సామాజిక సిద్ధాంతంగా ఉన్నాయి. మనువు వాటికి శాసన రూపం ఇచ్చాడు. అదీ అతని ప్రత్యేకత, 'విశిష్టత'. 28

శూద్రులు, స్త్రీలు ఎక్కువగా బౌద్ధమతావలంబులయినారు. వారిని బౌద్ధ మతంలోకి పోకుండా నిరోధించాలంటే వారిని ఇళ్ళల్లో కట్టి పడవేయాలి. మనువు అపనే చేశాడని అంబేద్కరు అంటాడు. కనుక హిందూ మహిళ స్థానం హిందూ సమాజంలో పడిపోవడానికి ముఖ్యకారకుడు మనువు.29 ఈ రకమైన ఆలోచన హిందూమత పునాదులనే కదిలించింది.

హిందూ సమాజాన్ని కూలంకషంగా పరిశీలించి, స్త్రీ యెడల జరిగిన అన్యాయానికి ఆక్రోశించి, తద్విషయమై తీవ్రంగా, గాఢంగా ఆలోచించి హిందూ తాత్విక ధోరణిని, భావనను, సామాజిక జీవితరీతిని తూర్పార బట్టిన ఘనత ఎం. ఎన్. రాయ్‌కి దక్కుతుంది. ఈ సందర్భంలో ఆయన మాటలను కొన్నింటిని గుర్తు తెచ్చుకోవటం మనకు అత్యంత అవసరం. "వివాహ సంబంధంలో విశ్వాసం మౌలికమైనది. విశ్వాసవంతులుగా వుండమని హిందూ మతం పురుషులను ఆదేశించడంలేదు. వివాహం భర్తల పరంగా శాసన సమ్మతమైన వ్యభిచారం. అనేక సాకులతో బహు భార్యాత్వం ఆచరింప బడుతున్నది. పెక్కు సందర్భాలలో ఆ సాకులు అల్పాతి అల్పమైనవి బహు భార్యాత్వం చట్ట సమ్మతమైన వ్యభిచారం. భార్య చాలకాలం వ్యాధి గ్రస్తురాలయితే భర్త తన పెళ్ళినాటి ప్రమాణం యొక్క బలంనుండి, (బంధం నుండి) విశ్వాసంనుండి విడుదల అవుతాడు. ఆ పరిస్థితుల్లో కుటుంబ సంరక్షణార్థం అతడు మరో భార్యను సంపాదించుకోవటానికి నైతిక పరమైన, మత పరమైన హక్కు కలుగుతుంది. భర్త ఆలా నిర్దయగా తనని వదలిపెడితే దానికి అంగీకరించి సవతికి స్వా[illegible] అర్పించ

వలసిన బాధ్యత భారతనారి ఆదర్శంలో ఒక భాగం. అది 'ఉదాత్తమైన' ఆదర్శం; అది నైతిక స్పందనకు అభిరుచికి సంబంధించిన విషయం. కాని ఈ నియతమైన నడక ఉద్వేగ పరంగా అసాధ్యం. నిస్సహాయులైన స్త్రీలు లాంఛనగా అలా నడుచుకోవచ్చు. నీతి, న్యాయం అనే భావన సంప్రదాయపు బరువుకు కుంగిపోయినపుడు ఈ పద్ధతికి సహజంగా ఎదురు తిరుగుతుంది. (స్త్రీ). స్త్రీలను వస్తువులుగా మార్చే ఈ నిర్దాక్షిణ్యమైన పద్ధతిని నిరసిస్తుంది. అంటే సంతానాన్ని కనే యంత్రాలుగా పురుషులు స్త్రీలను పరిగణించడాన్ని వ్యతిరేకిస్తుంది." ఈ వాక్యాలను చదివి స్త్రీ విమోచనోద్యమ కారులలో ఒకరైన కమలా భాసిన్ "ఒక పురుషుని నోట సానుభూతితో అవగాహనతో వచ్చిన ఆశ్చర్యకర పదాలు" అని అభివర్ణించింది. బహు భార్యాత్వం ఈనాడు లేదు. శాసనం వల్ల పోయింది. కాని ఆ పద్ధతి వెనుక ప్రస్ఫుటంగా ఉన్న మౌలిక ఆలోచనా స్రవంతి హిందూ సమాజాన్ని నియంత్రణం చేస్తున్నది. కనుకనే ఎం. ఎన్. రాయ్ ఆలోచనా సరళికి ఈనాడు కూడా విలువ. ఆ మాటలను ఆయన 1935 లోనే చెప్పాడు. స్త్రీ అర్ధాంగి అయినపుడు పురుషునితో సమానం కావాలి కదా అని ప్రశ్నించాడు.[31] హిందూ మత వివాహం పిల్లలను కనడానికే ఉద్దేశింపబడింది.[32] హిందూ వివాహం ద్వారా స్త్రీ భర్తతో ఆధ్యాత్మిక కలయికలో ఉంటుందని చెప్పి, ఆమెను పొగడి ఆమెచేత బహు సంతానాన్ని కన్నాడు.[33] ఇలా హిందూ సమాజాన్ని తెగడి హిందూ స్త్రీ - తదితర స్త్రీలవలె కోరుతున్నదేదో వివరించాడు. మానవ నిర్మితమైన ధర్మశాస్త్రాలూ, పరిస్థితులూ వ్యక్తులుగా అభివృద్ధిలోకి రానీయటం లేదు గనుక వాటిని రద్దుచేయాలని ఈనాటి స్త్రీలు డిమాండు చేస్తున్నారు.[34] ఇలా ఆధునిక వైజ్ఞానిక దృక్పథాన్ని భారత దేశంలో తొలిసారిగా వెలార్చిన ఖ్యాతి ఎం. ఎన్. రాయ్‌కి దక్కుతుంది.

హిందూ వాదంలో పునర్వికాసానికి కావలసిన వైజ్ఞానిక మహోద్యమం రాలేదు.[35] కనుకనే అనురాగ బంధం చేతకట్టి వేయబడిన ఇద్దరు వ్యక్తులుగా సతీ పతులను హిందూ సమాజం ఊహించలేదు. దాంపత్యమనే బండికి ఇద్దరూ రెండు చక్రాలని పైకి చెపుతున్నా ఆ బండిలో ఒకే చక్రం తిరుగుతున్నది. అతడే పురుషుడు. స్త్రీ యైన రెండో చక్రం తిరగదు; దానిని మొదటి చక్రం ఈడ్చుకొని వెళ్తుంది. ఇది జీవిత అనుభవం. కాదనలేని పచ్చినిజం.[36] హిందూ స్త్రీ జీవితంలో వివాహం ఎంత కీలకమైనదో తెలిసికున్న మనువు

ఈ చిత్రణ హిందూ మతం యొక్క అభ్యుదయ వ్యతిరేక ధోరణిని వెలికి తీస్తున్నది.

మతాన్ని వేరుగాను, తాత్విక ఆలోచనను వేరుగాను చూసే సర్వేపల్లి రాధాకృష్ణన్ కూడా స్త్రీలపై విధించిన ఈ అమానుష నియమాలను ఖండించాడు. ''మన దేశ ప్రజలలో లక్షలాది మందిని అర్థరహితంగా క్రూరంగా చూచేది, ఈ దేశంలో స్త్రీలపై సహించరాని ఇబ్బందులును, ఇక్కట్లను, విధించేది అయిన మత అంధ విశ్వాసం ఎడతెగని ప్రమాదం. ఆత్మను అది న్యూనత పరుస్తుంది. ఇతర మానవుల పై అలాంటి ఇక్కట్లను, ఆంక్షలను విధించేవారు అజ్ఞానానికి, అంధ విశ్వాసానికి తామే బలియైనవారు''. ఈ వాక్యాలు బాగానే ఉన్నాయి వినటానికి, చదవటానికి. కాని ప్రతిమతం వెనుక ఒక తాత్విక చింతన ఉంటుంది. రెంటినీ విడదీయడం, విడదీయ ప్రయత్నించడం వృధాప్రయాస. మానవాళి పునరుజ్జీవనమే హిందూ మత ఆశయంఅని చెప్తాడు రాధా కృష్ణన్ పండితుడు. 37 దాని లక్ష్యం మానవ స్వభావాన్ని ఆధ్యాత్మికంగా మార్చటమట. మానవుని లోని హేతుత్వం, సహకారం, ప్రేమ అనే ఉదాత్త గుణాలకు మాత్రం విజ్ఞప్తి చేస్తుందట. భయం, దురాశ, ద్వేషాలకు కాదట. ఇవి రాధా కృష్ణన్ మాటలే. కాని ఇతర మతాల సంగతి అటుంచి హిందూ మతాన్ని పరికిస్తే ఇంత ఉదాత్తమైన భావాలతో అది పొత్తు పెట్టుకోలేదని తోస్తుంది. ఆ మాటకు వస్తే అన్ని మతాలు అదే వరసన నడిచాయి. ఏ దేశంలో, ఏ మతంలో ఏనాడూ స్త్రీ సమాన హోదా, తాహతూ అనుభవించనట్లు ఆధారాలు లేవు.38

హిందూ మతస్తులు దురభిమానాన్ని వదలి తమ సహజ సంస్కారణకు పూనుకుంటారని ఆశిద్దాం.

హిందూ సమాజాన్ని మార్చటం హిందూ స్త్రీలకు ప్రధమ కర్తవ్యం. వారి జీవితాలు ఈ కార్య నిర్వాహణతో ముడిపడి ఉన్నాయి కనుక వారు ఈ విషయంగా ఉపేక్షను ప్రదర్శించ వీలులేదు. ఈ సందర్భంగా ఒక్క అంశాన్ని హిందూ స్త్రీలు గుర్తుంచుకోవాలి. వారిని ఉద్ధరించడానికి, వారి పరిస్థితిని మెరుగు పరచ డానికీఏ మహనీయుని పైనన్నో, ఏ తత్వవేత్త పైనన్నో వారు ఆశలు పెంచుకొని లాభంలేదు. ఈ మహత్కార్యానికి వారే పూనుకోవాలి.

ఈ లక్ష్యాన్ని వారే సాధించుకోవాలి. కాగా వారి బాటలలో ఎన్నో అడ్డంకులు, అవాంతరాలు, కష్టాలు వస్తాయి. అది సహజం. జీవితం పూలబాట కాదు. హిందూ స్త్రీ జీవితం నిజానికి ముళ్ళబాట. హిందూ పురుషుల - వ్యతిరేకత అడుగడునా తటస్థిస్తుంది. సామాజికాచారాల పేర, సంప్రదాయాల పేర, శాసనాల పేర అభ్యంతరాలు, ఆటంకాలు వస్తాయి. ఇన్నింటిని అధిగమించటం ఒక ఎత్తు; స్త్రీలలో ఉండే ఉపేక్షా భావాన్ని, వ్యతిరేకపు ఆలోచనా ధోరణిని దాటి పోగల్గటం మరో ఎత్తు. 'స్త్రీలే స్త్రీలకు శతురిపులు' అని పురుషులు ఈసడించడం గమనిస్తున్నాం. అది హేళనగా, పరిహాసంగా, అధిక్షేపంగా వారు వాడే పదజాలం. అయితే దాంట్లో కొంత నిజం లేకపోలేదు. సంప్రదాయానికీ, ఆధునికతకు జరిగే భావ సంఘర్షణలో, ఉద్యమరూపంగా జరిగే కార్యాచరణ సందర్భంగా, నూతన భావ ప్రపంచానికి అడ్డుతగిలే విషయంగా సనాతన హిందూ స్త్రీలు కొంతమంది అమాయకంగా, అజ్ఞానంలో - నిందకాదు సుమండీ, పరిస్థితులు సరిగా తెలిసికోలేక అని అర్థం - అభ్యుదయవాదులైన స్త్రీలకు ఎదురొడ్డి నిలుస్తారు. ఈ పరిస్థితిని సనాతన హిందూ పురుషులు హర్షిస్తారు. వారు తమ ప్రయోజనాలను, శ్రేయస్సును, సుఖాలను, సౌకర్యాలను కాపాడుకోవటానికి చేయవలసిన పనిని - ఆధునిక స్త్రీలను ఎదుర్కోవడం - స్త్రీలలో ఒక వర్గంవారే చేపట్టడం వారికి సంతోషదాయకం గాక మరేమవుతుంది? కనుక ఆ సనాతన పురుషులు సంప్రదాయ మహిళలను పురికొల్పుతారు; ఉత్సాహ పరుస్తారు. అండదండలందిస్తారు. సహాయానికి సాధన సంపత్తిని సమకూరుస్తారు. సనాతన హిందూ పురుషుల మనస్తత్వాన్ని ఆలోచనను, కార్యాచరణ విధానాన్ని, వ్యూహాన్ని. ఎత్తుగడలను తెలిసికోలేని సనాతన హిందూ స్త్రీలు అభ్యుదయానికి వ్యతిరేకంగా కృషి చేస్తారు. కనుక ముమ్మందుగా వారి వ్యతిరేకతలను పోగొట్టుకోవాలి. ఇది కేవలం ప్రబోధంతో జరిగేపని కాదు. సనాతన స్త్రీలకూ కష్టాలు వస్తాయి. అవి పురుష ప్రాధాన్య సమాజపు నియమాలవల్ల కలుగుతున్నాయని వారికి తెలియదు. అది 'విధివ్రాత' అని తలపోసి బాధపడుతుంటారు. ఆ విషయాన్ని విజ్ఞులైన స్త్రీలు వారికి వివరించి చెప్తే వారూ గ్రహిస్తారు. ఏదైనా ఆ పని అంత తేలికైన విషయం కాదు. కాగా విధిగా చేయవలసిన పని. స్త్రీలలో భావ విప్లవం రావాలి. దానికి తగిన ప్రబోధం, ప్రచారం విస్తృతంగా సాగాలి. భావ విప్లవం ముందా? సామాజిక పరిణామం ముందా అని తర్కవితర్కాలు చేయవలసిన పనిలేదు.

భావవిప్లవం ముమ్ముందుగా రావాలని చెప్పేవారు కూడా సామాజిక కార్యక్రమం అక్కర లేదని చెప్పరు. తగినంత మంది స్త్రీలలో ఆధునిక భావాలు, చైతన్యం వ్యాప్తి అయితే తప్ప కార్యాచరణకు రంగం సిద్ధం కాదని వారి భావం. ఏదయినా భావ విప్లవమూ, సామాజిక పరిణామమూ ఒక్కసారిగా సాగక తప్పదు. మహిళా దశాబ్దం ఈ విషయాన్ని వెలికితీసి గట్టిగా ప్రకటించింది.

చివరిగా ఒక్కమాట పునరుద్ఘాటన చేయవలసి ఉంది. స్త్రీలు తమ సర్వతోముఖ వికాసానికి-సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ, సామాజిక వికాసానికి తమ పైననే ఆధారపడాలి. ఇతరులు సానుభూతి చూపినా, సహాయం చేసినా, కార్యక్రమాలకు మద్దతు ఇచ్చినా వద్దనేది లేదు. ఆ సహాయ సానుభూతులను సాదరంగా స్వీకరించాలి. అయితే తమ భవిష్యత్తుకు రూపకల్పన చేసుకునే బృహత్తర ఉద్యమంలో స్త్రీలే ముఖ్య పాత్రధారులు కావాలి. ఈ అంశాన్ని అభ్యుదయ గాములైన స్త్రీలూ, తదితరులూ గుర్తించటం అవశ్యం జరగాలి. హైందవ సమాజంలోని స్త్రీలు ఈ విషయంలో వెనుకంజ వేయరని, వేయ రాదని విశ్వసిద్దాం.

## అధ్యాయం 16

# పాదదీపికలు

1. హిదూ స్త్రీ : ఆదర్శ మూర్తులు : ప్రభాతీ ముఖర్జీ.
   పుటలు 96 - 104
2. ధర్మశాస్త్రాల చరిత్ర : కానే 2 వ సంపుటం. 1 వ భాగం
   పుట 569
3. ప్రభాతీ ముఖర్జీ : పుట 104
4. కానే : పుట 595

5. కానే : పుట 596
6. ప్రభాతీ ముఖర్జీ : పుట 104
7. యుగ యుగాలలో భారతీయ స్త్రీలు : పి. థామస్ - 2 వ భాగం.
8. డిటో ,,
9. కానే : పుట 580.
10. డిటో.
11. పి. థామస్ : 2 వ భాగం.
12. హిందూ నాగరికతలో భారత స్త్రీలు : ఆల్టేకర్, పుట 359.
13. డిటో 361
14. కానే పుటలు 594, 595
15. కుమారీ శతకం : పక్కి వేంకటనరసయ్య.
రాయలు అండ్‌కో, కడప (1952) పుటలు 3, 6, 11, 16, 44
16. హిందూ స్త్రీ : మార్గరెట్ కార్‌మాచ్ (1961) పుట 139
17. డిటో పుట 192
18. భారతదేశ మధ్య తరగతి స్త్రీల విషమపరిస్థితి :
కమల బాసిన్ (భారత దేశంలో స్త్రీల స్థానం.
The Position of Women in India (Leslie Sawhny
Programme of Training for Democracy Ed.
KamlaBhasin - (1971)] పుట 39
19. సర్వోదయ : మహాత్మాగాంధి, పుట 60
Sarvodaya by M. K. Gandhi
స్త్రీలు : మహాత్మాగాంధి Women by M. K. Gandhi, పుట, 9
20. స్త్రీలు : గాంధి, పుట 48
సర్వోదయ : గాంధీ - పుట 62
21. స్త్రీలు : గాంధి; పుట 56
22. సర్వోదయ : గాంధి - 62

23. డిటో 63

24. డిటో 63

25. స్త్రీలు : మహాత్మాగాంధీ, పుట 70

26. ముల్క్‌రాజ్ ఆనంద్ 'ది బ్రైడ్స్ బుక్ ఆఫ్ బ్యూటీ'
The Brides Book of Beauty by Mulkraj Anand
in The Position of Women in India (189 Bid)
పుట 38

27. డిటో పుట 38

28. హిందూ స్త్రీ యొక్క అభివృద్ధి-పతనం : అంబేద్కరు, పుట 26
Rise & Fall of Hindu Women : Dr. B. R. Ambedkar
(Bheem Patrika Publications) Jullunder.

29. డిటో పుట 21

30. భారతనారి ఆదర్శం : ఎం. ఎన్. రాయ్, అనువాదం
మల్లాది సుబ్బమ్మ, హైదరాబాద్. పుటలు 29, 30

31. డిటో - పుట 20

32. డిటో - పుట 10

33. డిటో - పుట 13

34. డిటో - పుట 55

35. హిందూయిజం ఎక్సురే : తర్క తీర్థ లక్ష్మణశాస్త్రి జోషి-
'ప్రసారిత' అక్టోబరు - డిసెంబరు 1972 హైదరాబాద్

36. బంగారు సంకెళ్ళు : మల్లాది సుబ్బమ్మ.
(ప్రజాస్వామ్య పబ్లిషర్స్, హైదరాబాద్) పుట 5

37. Recovery of Faith by S. Radha Krishnan - Page. 105
Orient Paper Back

38. డిటో పుట 64

39. భావవాహిని : మల్లాది సుబ్బమ్మ
ప్రజాస్వామ్య పబ్లిషర్స్, హైదరాబాద్ పుట 44.

# పరిశీలించిన గ్రంథాల పట్టిక

# Bibliography

1. History of Dharma Sastra by P. V. Kane vol. 2 Part I Bhandarkar Oriental Research Institute, Pune, 1941.

2. The Position of Women in Hindu Civilisation by Dr A. S. Altekar, Motilal Banarsidas, Delhi. Reprinted 1978.

3. Indian Women through the Ages: by P. Thomas Asia Publishing House ( 1964 )

4. Hindu Ethos: and the Challenge of Change: by Subhayu Dasgupta, The Minerva Associates, Calcutta ( 1972 )

5. Women: by M. K. Gandhi, Navjivan Publishing House, Ahmedabad - 14 ( 1964 )

6. To Ashram Sisters: M. K. Gandhi „ „ ( 1960 )

7. Sarvodaya : by M. K. Gandhi „ „ ( 1969 )

8. The Rise & Fall of Hindu women : by Dr. B. R. Ambedkar - Bheem Patrika Publications, Jullunder, pin 144 003 ( 1977 )

9. The Position of Women in India. Ed. Kamla Bhasin-Leslie Sawhny Programme of Training for Democracy, Bombay ( 1971 )

10. Recovery of Faith : by Dr. S. Radhakrishnan Hind Pocket Books, Delhi.

11. Religion & Culture : by Dr. S. Radhakrishnan Hind Pocket Books, Delhi.

12. Kural : Tiru - Valluvar
Bharatiya Vidya Bhavan, Bombay ( 1970 )

13 Women in the Vedic Age : Shakuntala Rao Shastri
Bharatiya Vidya Bhavan, Bombay ( 1952 )

14. Women in Rig Veda : By Upadhyaya ( 1932 )

15. Hindu Women ( normative Model ) by Probhati Mukherjee-Orient Longman ( 1978 )

16. The Hindu Women : by Margaret Cormach
Asia Publishing House ( 1961 )

17. Indian women : Ed. Devaki Jain
Publications Division, Government of India ( 1975 )

18. Marriage & Society in Mahabharata : by
Dr. K. Jagannatha Sarma unpublished thesis,
submitted to Nagarjuna university, Nagarjuna
Nagar, Gnntur Dt. ( A. P. )

19. Towards Equality : Report of the Committee on the Status of Women in India. Government of India, Dept. of Social welfare Ministry of Education & Social welfare, ( 1974 )

20. Hindu Law : by Mayne
Higgin Bothams ( 1938 )

21. The Hindu Adoption & Maintenance Act. ( 1956 )

22. The Hindu Minority & Guardianship Act. ( 1956 )

23. The Hindu Marriage Act. ( 1955 )

24. The Hindu Succession Act. ( 1956 )

25. The Dowry Prohibition Act. (1961 )

26. Child Marriage Restraint Act. (1929 )

27. ఆంధ్రవేదములు (ఋగ్వేదము) ప్రథమ సంపుటం :
బంకుపల్లె మల్లయ్య శాస్త్రి, వినయాశ్రమం,
గుంటూరుజిల్లా (1940)

28. సత్యార్థప్రకాశ్ : మహర్షి దయానంద సరస్వతి
ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్ 500001 (1981)

29. హిందూ మతము : జటావల్లభుల పురుషోత్తం :
(జె- గోపాలం, కాకినాడ, 1947)

30. భారతనారీ ఆదర్శం : ఎం. ఎన్. రాయ్
అనువాదం : మల్లాది సుబ్బమ్మ
ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్ 19
హైదరాబాద్ 500 028 (1984)

31. వర్ణభేదం : డా- బి. ఆర్. అంబేద్కరు
అనువాదం : సింగంపల్లి వేంకట సుబ్బారావు
సుందరరాం అండ్ సన్సు. తెనాలి (1948)

32. కుమారీ శతకం : పక్కి వేంకట నరసయ్య,
రాయలు అండ్కో, కడప (1952)

33. బంగారు సంకెళ్ళు : మల్లాది సుబ్బమ్మ
ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్,
హైదరాబాదు 500 028 (1984)

34. భావవాహిని : మల్లాది సుబ్బమ్మ
ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్ (1983)

35. హిందూ యిజం ఎక్సురే : తర్క తీర్థ లక్ష్మణశాస్త్రి జోషి,
ప్రసారిత, త్రైమాసిక పత్రిక
అక్టోబరు - డిసెంబరు 1972 నెం. 10
C/o పి. సత్యనారాయణ, 103, కాకతీయనగర్,
హబ్సిగూడ, హైదరాబాద్ 500 007

36. ఆర్ష ధర్మసూత్రాలు : చర్ల గణపతి శాస్త్రి

# విషయసూచిక

# స్వ విషయం

"ప్రజాస్వామ్య ప్రచురణలు" ఒక వినూత్న ప్రయత్నం. ఇతర సంస్థలతో రూపసామ్యం వున్న ఆదర్శాలలో, లక్ష్యసాధనా విధానాలలో, కార్యాచరణ రీతులలో భిన్నమైనది.

వ్యక్తి జీవితంలో, సమాజ జీవితంలో అన్ని రంగాలలో ప్రజా స్వామ్యం వెల్లివిరిసి మూడు పూవులు, ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఈ సంస్థ అభిమతం, ఆశయం కూడాను.

ఇలాంటి ప్రయత్నాలు పూర్వం జరిగినవి. ప్రస్తుతం జరుగు చున్నవి. కాని, వానికీ–ఈ ప్రయత్నానికీ తారతమ్య మున్నది. ఉదాత్త మయిన ఆశయాలతో, ఉత్తేజంపొందిన మేధావుల సమిష్టి సహకార కృషి ఫలితంగా ఈ సంస్థ ఉద్భవించింది.

విశ్వ జనీనతే దీని విశిష్టత. మొత్తం మానవ ప్రపంచ సంస్కృతీ సాహిత్యాలు దీని వారసత్వం. ముఖ్యంగా భారతదేశ సంస్కృతిలో ఇంత వరకు మరుగున పడిన మాణిక్యాలు—చార్వాక, కపిల, కణాదుల మతాలు, సిద్ధాంతాలు దీని సొమ్ము. తెలుగుదేశమే కాదు, తెలుగు భాష విస్తరించిన ప్రాంతమంతా దీని కార్యక్షేత్రము.

ప్రపంచంలో విప్లవాలు ఎక్కడ వచ్చినా, ఏ కాలమందు జరిగినా, అవన్నీ దీనికి అధ్యయన యోగ్యాలే. ఇంగ్లండులో 1689లో బ్రిటిషు రాచరికానికి పరిమితులు, హద్దులు విధించిన విప్లవం: అమెరికాలో 1773 లో ప్రాతినిధ్యాధికారమున్న వారే పన్నులు విధించగల హక్కుదారులనే 'ప్రజాస్వామ్యం' సూత్రాన్ని ఎలుగెత్తి చాటిన విప్లవం: 1789 లో స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము ఆదర్శాలుగా విజయవంతమయిన ఫ్రెంచి విప్లవం; 1917 లో 'భూమి, తిండి, శాంతి' నినాదాలతో కార్మికవర్గం, మధ్య తరగతి రష్యాలో సాధించిన విప్లవం: 1947 లో భారతదేశం పొందిన స్వాతంత్ర్యం; 1949లో కర్షకబలం చైనాలో జరిగిన విప్లవం మొదలయిన చారిత్రాత్మక సంఘటనలను లోతుగా, సునిశితంగా, సమ్యక్‌దృష్టితో పరిశీలించి తదనుగుణమైన ప్రచురణలు చేయాలని ఈ సంస్థ ఆదర్శం.

సామాజిక పరివర్తనకూ, భావగమనానికీ అవినాభావ సంబంధ మున్నదనే విషయం జగద్విదితం. అయితే భావాలు ప్రాతిభాసికాలేనా

లేక మానవ మస్తిష్కములో ఉదయించిన తరుణం నుంచీ ప్రత్యేక గమన సూత్రాలతో స్వతంత్ర లక్షణాలు కలిగి పెంపొందుచున్నవా? రెండవ స్వరూపం అవశ్య పరిగ్రహణయోగ్యం. ఈ సూత్రాన్ని విశ్వవిఖ్యాత విప్లవవాది, మేధావి అయిన యమ్. ఎన్. రాయ్ 1946 లో ప్రవచించాడు. ఈ భావన యీ సంస్థకు జీవగర్ర.

వ్యక్తివాదం, హేతువాదం, మానవవాదం ఈ సంస్థను శాసించే త్రికము (త్రిగుణాలు). మానవులంతా ఒకటే; మానవ సమాజానికి మూలం మానవుడే; మానవుని అభ్యున్నతియే మానవ సమాజ అభ్యుదయానికి, శ్రేయస్సుకు కొలమానం లేక వరుమానం; ప్రకృతి నియమబద్ధమైనది కనుక ప్రకృతినుంచే ఉద్భవించిన మానవుడుకూడా వస్తుతః నియమబద్ధుడు అంటే హేతువాది. కనుక అతడు నీతివంతుడుగా మనగలడని ప్రకటించిన రాడికల్ హ్యూమనిజం యొక్క తాత్విక సిద్ధాంతం ఈ సంస్థకు వెలుగు బాటగా అడుగడుగునా ప్రభావితం చేస్తుంది.

మానవవాదం యీనాటిది కాదు. మానవజాతి సహజంగా మనుగడ సాగించినప్పటినుంచీ యీ తాత్విక చింతన జరుగుతూనే వచ్చినది. కాని ఆధునిక యుగంలో మానవ విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందటంతో ప్రస్తుతం నూతన భాష్యాలతో, వినూత్న విషయ పరిజ్ఞానంతో ఆ పాత కాలపు మానవవాదాన్ని పరిశీలించి, సవరించి, పునరుద్ధరించవలసిన అవసరమేర్పడినది. ఆకృషి ఫలితమే యమ్.ఎన్.రాయ్ నవ్యమానవవాదం.

స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ మానవ మనుగడ ప్రేరకాలని పేర్కొనటం ఈ నవ్యమానవవాద విశిష్టత. (1) అంతరాత్మ ప్రేరిత నీతి లేక దైవ నిర్దేశిత నీతి: (2) ప్రయోజనాత్మక నీతి; అనే రెంటికీ ప్రత్యామ్నాయంగా హేతుబద్ధమయిన నీతిని చాటిచెప్పినది. రాజకీయరంగంలో పార్టీ రహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించినది. ఆర్థిక రంగంలో సహకార సంబంధమయిన ప్రణాళికా రచనలను రూపొందించినది. సాంస్కృతిక రంగంలో భావ స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించినది. సాంఘికంగా కుల, మత, వర్గ, లింగ, ప్రాంతీయ, భాష, జాతి, దేశ విభేదాలను నిరసించినది. విశ్వజనీయ సంస్కృతికి విలువనిచ్చినది. ఏకత్వంలో భిన్నత్వాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని చూడగల్గినది. అంధ విశ్వాసాలకు గొడ్డలి పెట్టు ప్రబోధ కార్యక్రమాలను బలపరుస్తుంది. అందులో ఒక భాగమే ఈ సంస్థ ప్రచురణ యత్నం.

ఈ ప్రకృతికి అతీతమయిన మరే యితర శక్తి లేదని తెలుసుకొనటం తన మనుగడకు, భవిష్యత్తుకు తానే బాధ్యుడనని గుర్తెరగటం, తన క్షేమానికీ, అభ్యున్నతికీ, తోటి మానవుల శ్రేయస్సుకూ వైరుధ్యంలేదనే విషయాన్ని గ్రహించి సమాజ స్థితిగతులను మెరుగు పరచటానికి ఉద్యుక్తుడు కావడం ఉత్తమ మానవలక్షణం.

ఈ మానవవాద లక్ష్యాలనే 1952 లో నెలకొల్పబడిన అంతర్జాతీయ హ్యూమనిస్టు నైతిక సంఘం మరోరూపంలో ప్రకటించినది. భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘాన్ని ఆ ప్రపంచ సంస్థ గుర్తించి పూర్తి సభ్యత్వాన్నిచ్చినది. ఆ అంతర్జాతీయ సంఘం ఐదు ఖండాలలోని అనేక దేశాలలో అనుబంధ సంస్థలు కలిగి అసమానమైన కృషి సాగిస్తున్నది.

ప్రస్తుతం ప్రపంచ మానవాళి సాంస్కృతికంగా విషమస్థితిలో చిక్కుకొని యున్నది. ఒకవైపు మత ప్రాబల్యాలు, మరోవైపు ఫాసిజం, కమ్యూనిజంలాంటి నియంతృత్వ విధానాలు చలామణి అవుతూ ప్రజల సంక్షేమం కొరకు ప్రజల ఆశయాలను నెరవేర్చకపోగా హీనస్థితికి దిగజార్చుచున్నవి. దీని ఫలితంగా తృతీయ మార్గాన్వేషణ ప్రారంభ మయినది. విజ్ఞానం పెరుగుదల, మానవ మేధస్సు-సృజనాశక్తి అభివృద్ధి చెందడంతో నూతన తాత్విక చింతనలకు ప్రాతిపదిక ఏర్పడినది.

దీనినే నైతిక హ్యూమనిజం అని పిలవటం కూడా కద్దు. ఇది ప్రజాస్వామ్య సూత్రానికి కట్టుబడి వున్నది. ప్రతివ్యక్తీ సాధ్యమైనంతగా వికాసం పొందటానికి హక్కు కలిగి యున్నాడు. కేవలం ప్రభుత్వ పరిధిలోనేగాక జీవిత సంబంధాలన్నింటిలోనూ, ఈ ప్రజాస్వామ్య సూత్రం వర్తిస్తుంది. విజ్ఞానాన్ని మానవ వినాశనానికి కాక క్షేమానికి, శ్రేయస్సుకు, నిర్మాణయుతంగా వినియోగించటం ఈ సిద్ధాంతపు ఆదర్శ ముఖ్య లక్షణాలలో ఒకటి. విజ్ఞానము లక్ష్యాలను నిర్దేశించదు. మానవ శ్రేయస్సును సాధించటానికి అనువైన మార్గాలను సూచిస్తుంది.

హ్యూమనిజం నైతిక దృక్పథం కలది. మానవుని హుందాతనాన్ని, సాధ్యమైనంతలో ప్రతివ్యక్తి ఇతోధికంగా ఇతరుల హక్కులకు భంగం కలుగని రీతిగా స్వయంగా వికాసాన్ని పొందగల హక్కును గుర్తిస్తుంది. నిరంకుశత్వం, క్రమశిక్షణ పేరుతో మానవ జీవితాన్ని యాంత్రికం చేసే వ్యవస్థను వ్యతిరేకిస్తుంది. యాంత్రికరణ మానవ విలువలను నమ్ముచేస్తుంది. కనుక, తాత్కాలిక లక్ష్యాలను సాధించే ప్రయత్నంలో సమగ్ర

నియంతృత్వ సిద్ధాంతాలు అమలుపరచ జూచే సమగ్ర యాంత్రీకరణను త్రోసి రాజంటుంది. సమాజం యెడ బాధ్యతతో సమ్మిళితమైన వ్యక్తి స్వేచ్ఛను లక్ష్యంగా స్వీకరిస్తుంది. భౌతిక అవసరాలను తీర్చటం, భౌతిక పరిస్థితులను మెరుగుపరచటం అనే పేరుతో పైన పేర్కొనబడిన వ్యక్తి స్వేచ్ఛను త్యజించ నిచ్చగించదు. మానసిక స్వేచ్ఛ, మౌలిక చింతన లేనప్పుడు అభ్యుదయం అసాధ్యం.

పిడివాదాన్ని, పిడివాదపు సిద్ధాంతాన్ని త్రోసిరాజని హ్యూమనిజం స్వేచ్ఛను ప్రబోధిస్తుంది. నైతిక విలువలను, సృజనాశక్తులతో సమ్మిళిత మైన జీవిత విధానాన్ని, వ్యక్తి వికాసాన్ని లక్ష్యంగా అంగీకరిస్తుంది. మారుచున్న సమాజానికి అనుగుణంగా అభ్యుదయ పథంలో అనుసరించ దగిన మౌలిక జీవిత సూత్రం ఇది.

విజ్ఞానాన్ని ప్రపంచ శాంతి కొరకు వినియోగించ గలిగితే ప్రస్తుత విషమ స్థితినుంచి మానవాళి విముక్తి చెందగలదు. భయవిముక్తుడైన మానవునిపరిపూర్ణ వికాసానికి పరిమితులుండకూడదు. ఈ తాత్విక ఆలోచనా రీతిని మానవ ప్రపంచం ప్రస్తుతం ఎదుర్కొనే సవాలుకు సరియైన జవా బుగా భావించవచ్చును.

ఇలాంటి తాత్విక ధోరణి స్వేచ్ఛా భావుకతను పోషిస్తుంది. కనుక అన్ని సామాజిక రంగాలలోను వినూత్నమయిన రీతిలో స్వేచ్ఛను పెంపొం దించి అభ్యుదయ మార్గాన అడుగుల వేయించగల నూతన భావాన్వేషణయే 'ప్రజాస్వామ్య ప్రచురణల సంస్థ' ధ్యేయం.

అట్టి భావాలను ప్రజాబాహుళ్యానికి ఎరుకపరచటం ఈసంస్థ ప్రథమ కర్తవ్యంగా భావిస్తుంది. ఇది సాహసమే కావచ్చు. ప్రమాదభరితం కూడా కావచ్చు. కాని లక్ష్యసాధన కొరకు చేసే ఇట్టి కృషిని విస్మరించ జాలము. ఈ ప్రయత్నానికి, వ్యాపారానికి స్వేచ్ఛాపిపాసకుల వ్యక్తి అందరి సానుభూతి సహకారాలను అర్థిస్తున్నాము.

సభ్యులు : శ్రీ ఎం. వి. రామమూర్తి
శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి
శ్రీ గుంటుపల్లి గోపాలరావు
శ్రీమతి మల్లాది సుబ్బమ్మ
శ్రీ గురిజాల సీతారామయ్య
శ్రీ కొల్లా సుబ్బారావు

ఎం. వి. రామమూర్తి
అధ్యక్షుడు
బోర్డు ఆఫ్ డైరెక్టర్స్

# నాదొక మాట

"బాబుల్‌హమ్ తొరేఖూన్ లేకా గయాస్
జదర్‌బాంద్ దో చాంద్ జాయేన్"

'మేము పశువులము. ఓ తండ్రీ నీవు ఏ గాటికి కడితే అక్కడే పడివుంటాము.' ఇది ముస్లిం స్త్రీలు తమ కుమార్తెలను భర్తతో సాగనంపేటప్పుడు పాడే పాట. ముస్లిం మహిళలు తమ పుట్టుక, స్థాయి, హోదా అంతా దైవదత్తమని నమ్ముతారు. ఖురాన్‌లో స్త్రీ జన్మించిన దాది ఆమె జీవితపర్యంతం ఎలా నడుచుకోవాలో స్పష్టీకరించి వుంది. అందులో వివాహం, విడాకులు, వారసత్వం, ఆస్తిహక్కులలో స్త్రీ పురుషుల మధ్య ఎలాంటి తేడాలు చూపారో చక్కగా నిరూపించవచ్చు. ఇస్లాం ఆధునిక భావాలను, మార్పును తీవ్రంగాఖండిస్తుంది. ప్రతి విషయాన్ని ఖురాన్ ఆదేశానుసారం నమ్మమంటుంది. సొంత ఆలోచనకుగాని, చర్చకుగాని అందులో ఆస్కారంలేదు. క్రీ. శ. 571 లో జన్మించిన మహమ్మద్ ప్రవక్త ఇస్లాము 622 లో స్థాపించాడు. ఇస్లాం మతగ్రంథం ఖురాన్. అది ఇస్లాంకు పరమ ప్రాణం. ఖురాన్‌లో 114 సూరాలున్నాయి. ప్రతి సూరాలో ఆయత్తులున్నాయి; వాటిలో మతధర్మాలు అన్నీ వున్నాయి. అందులో వాటికన్నింటికీ ప్రత్యేక స్వరూపాలు, అర్థాలు వున్నాయి. మసీదుకెళ్ళటం, ప్రార్థనలు చెయ్యటం, రంజాన్‌లో పగలు భోజనం లేకపోవడం వగైరాలన్నీ అందులో వ్రాసివున్నాయి. ఖురాన్ ఆధారంతో వ్రాసిందే షరియా చట్టం. అది 1937 లో లిఖించబడ్డది. ఆ శాసనాలనే నేటికీ ఆచరించటం హాస్యాస్పదమనక తప్పదు. మహమ్మద్ అనుయాయులు ఒకచేతితో కత్తి మరోచేత ఖురాన్ ధరించి అనేక మందిని ఇస్లాం మతంలోకి మార్చారు. 1360 ఏండ్ల ఫలితంగా ఇస్లాం మతం ఈనాడు 700 మిలియన్ల ప్రజల మతమయింది. మొదట తాము ముస్లింల గాను తర్వాత ఆయా జాతి ప్రజలగాను భావించుకొనుట వారి మనస్తత్వం. ఇస్లాం ఒక వ్యవస్థిత మతం. అంటే అంతా క్రమబద్ధంగా వుంటుంది. ఆ మత సూత్రాలనుండే ముస్లింలు

ఉత్తేజితులై వాటిని శిరసావహిస్తారు. ఖురాన్ ప్రకారం ఈనాటికీ భూమి నలచదరపు బల్ల. దానిచుట్టూ పర్వతాలునిలబడి దాన్ని కదలకుండా నిలుపుతున్నాయంటుంది. కాదంటే కఠినశిక్షలు, చిత్రహింసలూ. అవిశ్వాసుల నెలా శిక్షించాలో, ఎలాంటి నరకయాతనలు పెట్టాలో, ఆ చిత్రహింసల స్వరూప స్వభావాలన్నీ స్పష్టీకరించారు ఆ మతగురువులు. అసలు వ్యతిరేక భావాన్ని సహించకపోగా చట్టం పేరుతో వారిని సర్వనాశనం చేస్తారు ముల్లాలు, మౌల్వీలు. ఖురాన్ దైవదత్తమని అది చాలా పవిత్రమైనదని నమ్ముతారు ముసల్మానులు.

తమ మతం మహోన్నతమైనదని, దాన్ని నిరశించరాదనే నమ్మికతో మతసంరక్షణార్థం ఎంతటి పశుత్వానికైనా వెనుదీయరు మతవాదులు. వేదాలు నమ్మని వారిని పాషండులని, బైబిలు నమ్మని వారిని 'అన్యులు' అని, ఖురాన్‌ను విశ్వసించనివారిని 'కాఫిర్లు' అని దూషిస్తారు. అవిశ్వాసుల్ని అన్ని మతాలు చీల్చిచెండాడిన గాథలెన్నో వున్నాయి. వేదాలు నమ్మని చార్వాకులను, కాఫిర్లను, అన్యులను వందలు, వేల సంఖ్యలో బలిగొన్నారు. సజీవదహనం చేశారు. అసామాన్యమైన చిత్రహింసలపాలు చేశారు. ఇంకా మతయుద్ధాలు లెక్కకు మిక్కుటంగానే జరిగాయి.

మతగ్రంథాలనిండా కరుణ, శాంతి, దయ, ప్రేమ వుండాలని వ్రాస్తారు. కాని ఆచరణలో మాత్రం అది శూన్యం. ఆచారాలు, సంప్రదాయాలన్న పేరుతో ఒకమతాన్ని మరొక మతం గౌరవించకపోగా ద్వేషిస్తుంది; హింసిస్తుంది. సర్వనాశనానికైనా తయారుగావుంటుంది. ఏ చిన్న సంఘటనను కూడా సహించలేదు మతం. అది వ్యక్తుల్ని బలిగొంటుంది. సమాజాన్ని నాశనం చేస్తుంది. దానికి తోడూ, నీడా, తనా, మనా అనే అరమరికలు లేవు. అలాంటి మతం స్త్రీలకు అన్యాయం చేస్తుంది. వారి వ్యక్తిత్వాన్ని వమ్ముచేస్తుంది. వారి హక్కులను కాలరాస్తుంది. దీనిని గురించి ఆశ్చర్యపడాల్సిన పనిలేదు.

ప్రపంచంలో నాడూ, నేడూ, ఏనాడు ఏ మతమూ స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛా సమానత్వాన్ని ప్రతిపాదించనేలేదు. స్త్రీల పై స్వైరవిహారం చేస్తూనేవుంది. అందువల్లే విద్యా విజ్ఞానాలు బొత్తిగా లేక, సంప్రదాయం

పేరుతో, మతాదేశంతో వంట ఇంటికీ, పడకటింటికీ పరిమితమయింది స్త్రీ. ఆమెను ఒకవైపు మతం మరోవైపు సమాజం, వేరొకవైపు పురుష దురహంకారం ఇనుప చట్రాలతో కట్టిపడేశాయి. వ్యక్తిత్వంలేని ఆటబొమ్మగా, నాసిరకం జాతిగా, నికృష్టజీవితాన్ని గడుపుతున్నది నారీలోకం. స్త్రీలను పురుషుల ఆస్తిలో జమకడుతుంది ఇస్లాం. అంటే ఆమెను దున్నే భూమితో పోల్చి దానిపై హక్కు దున్నేవాడిదేనని, వాడికి సర్వహక్కులూ వున్నాయంటుంది ఖురాన్. ప్రేమ ప్రాతిపదికగాగల వివాహంలోకాని, వారసత్వంలోకాని, సంరక్షకత్వంలోకాని, సంతాన నిరోధంలోకాని ఏ విషయంలో ఏ మాత్రం హక్కులేని బాధామయజీవి ముస్లిం స్త్రీ. అది చాలక భర్త నలుగురి భార్యలను పెండ్లాడే హక్కు ఇచ్చింది ఇస్లాం. ఇంకా నికృష్టమైనది పరదా. ఇలా ఎన్నో మరెన్నో పరిమితులకు లోనుచేసింది ఇస్లాం. ఆలా మతం యుగయుగాలుగా మహిళలపై స్వైరవిహారం చేస్తూనేవుంది. మతం పేరుతో మహిళపై దోపిడీలూ, దౌర్జన్యాలూ జరుగుతూనే వున్నాయి. మతం మహాక్రూరమైంది. కనుకనే నీతిపేరుతో దుర్మార్గపు దోపిడీని దేవుని వాక్కుగా బోధించి స్త్రీని బ్రహ్మాండంగా 'బ్రెయిన్ వాష్' చేసింది. ఇదంతా పురుషులే తమ అధికారాన్ని నిలుపుకోడానికి, పెంచుకోటానికి జరిపిన కుతంత్రం. దాన్ని నీతి, ధర్మం, చట్టం అనేపేర్లతో ప్రచారం చేశారు; చేస్తున్నారు. ఏనాటికీ స్త్రీలు స్వేచ్ఛా సమానత్వాలు కోరనంతగా ఈ భావాలు వారిలో జీర్ణించిపోయాయి. సనాతన ముసల్మాన్ మతగురువులు తమ అధికారాన్ని నిలుపుకోటానికి అవసరమొస్తే స్త్రీని సర్వనాశనం చేసిఅయినాసరే పురుషాధిపత్యాన్ని నిల్పటానికి సర్వవేళలా ఈ పని చేస్తూనేవుంటారు. మతాలన్నింటిలోకి ఇస్లాం చిట్టచివరిది. అయినా స్త్రీలను మహాక్రూరంగా, హీనంగా చూచేది ఇస్లామేనని చెప్పటానికి నిరూపణలు చాలా వున్నాయి.

మతమేదయినా వారి మార్గమేదయినా హిందూ, ముస్లిం, క్రైస్తవం స్త్రీల విషయంలలో ఏకాభిప్రాయంతో వున్నాయనేది నగ్న సత్యం. స్త్రీని ఒక నీచప్రాణిగాను, బానిసగా పేర్కొన్నది క్రైస్తవం. దేవుడు ఆదామును నిద్రపుచ్చి అతని ప్రక్కటెముకనుండి ఈవ్‌ను సృష్టించాడని బైబిలువాక్యం. స్త్రీ మూలంగానే పురుషుడికి ఇన్ని కష్టాలొచ్చాయని బైబిలు నిర్దేశించింది. స్త్రీ నరకానికి సింహద్వారమన్నాడు శంకరాచార్యుడు. ఇక స్త్రీలను కుక్కల

కన్నా హీనంచేశాడు మనువు. ఇక ఇస్లాంలో స్త్రీని గురించి చెప్పాలంటే చాలా ఘోరం; వర్ణనాతీతం. "తమ సంతానానికి పాలుఇచ్చి పెంచాలని తండ్రికోరితే రెండు సంవత్సరాలు ఆమె తప్పక పాలుఇవ్వాలి. వేరే స్త్రీ ద్వారా ఇప్పించే ఏర్పాటుచేస్తే అది ఆక్షేపణీయం కాదు" (233 ఖురాన్) అంటే భార్యాభర్తాలు విడిపడితే భర్త అజ్ఞలేనిదే బిడ్డకు పాలిచ్చే అధికారం తల్లికి లేదన్నమాట. ఆమె వ్యక్తిత్వం, హోదాను చాలా కించపరిచింది ఇస్లాం. అలాగే దాంపత్య జీవితంలో, విడాకులలో, వివాహంలో, మనవర్తి, దత్తతలలో, వారసత్వం, సంరక్షకత్వాలలో ఖురాన్ ఆమెకు న్యాయం చేయకపోగా పక్షపాతంతో చాలా అన్యాయం చేసింది. ఇంకా సాంఘిక, ఆర్థిక, రాజకీయరంగాలలో స్త్రీ పాత్రకు విలువేలేదు,

ముస్లిం స్త్రీలు ఏనాడూ సభలుపెట్టి కోర్కెలు, హక్కులూ, అధికారాలు అడిగిన పాపానపోలేదు. 'మనం మీరిలాంటి కృత్రిమ జీవితం గడుపుతా రెందుకమ్మా' అంటే మనల్ని తెగనాడుతారు. అజ్ఞాని అయిన చిరుతడిలా వుంటుంది వారి అభిభాషణ. ఉద్యోగినులు సైతం బురాఖాతో ఆఫీసులకెళ్ళి ఆఫీసుముందు తీసి సంచిలోపెట్టి మళ్ళా బైటికెళ్ళేటప్పుడు దాన్ని విధిగా ధరిస్తారు. పరదావల్ల గాలి, వెలుతురులేని ఇళ్ళల్లో నివాసంవల్ల మీ కళ్ళు పోవా? అంటే 'మేము చాలా అందమైన వాళ్ళమమ్మా కనుక పురుషులు మమ్ముచూస్తే మోహావేశులవుతారు. కాబట్టి మమ్ము గృహాలలోవుంచి మాకన్ని ఏర్పాట్లుచేస్తారు మా పెద్దలు.' అంటారు. స్త్రీ అందంగా అలంకరించుకొని బైటికెడితే ఆమెనే చూస్తారట. అంటే నెయ్యి వేడికి కరిగినట్లే స్త్రీని చూచిన పురుషుడు అలాగే కరిగిపోగలడని వారు చెప్తారు. అందువల్ల అందంగా కనిపించకుండా బుర్ఖా వేసుకుంటే ఏదో దయ్యం పోతున్నదిలే అని చూడరట. అందుకే వారి ఇళ్ళకు, కిటికీలకు విధిగా కర్టెన్లు వేసుకుంటారు. జాకెట్లు ముంజేతివరకు కుట్టించుకోవాలి. దర్జీకి నిలబడి కొలతలు ఇస్తే అపచారం. పైగా మొగాయన తాకితే మైలపడి పోతారట. స్త్రీ ఎంత సిగ్గుపడితే అంత పవిత్రత అంటారు. సిగ్గుమాలిన ఆడది పురుషుణ్ణి చెడగొడుతుందని వారి నమ్మకం. ఎంత చాటుగా మెలిగితే, ఎంతగా ముసుగులోకి నెట్టబడితే అంత పుణ్యవతిగా పేరు పొందుతుంది. అందువల్లే మాకు ముసుగులుంటే ఏం, మా మగాళ్ళు నల్గురి భార్యలను పెళ్ళాడితే ఏం అని ఎదురు ప్రశ్నలు వేసేవారు లేకపోలేదు.

అందువల్ల ముందుగా ముస్లింస్త్రీల వైఖరి మారితేనే గదా సంస్కరణకు మార్గాన్వేషణ. అసలు మతస్థుల మతదురహంకారం మార్చటం ఎంత కష్టమో ముస్లిం స్త్రీలలో మానసిక విప్లవం తేనటం అంతకన్నా కష్టం. సనాతనత్వపాదును పెకళించడం ఎంత కష్టమో అక్కడ ఆధునిక బీజాలు నాటటం అంతకన్నా కష్టతరం. అయినా ఎప్పుడో అప్పుడు ఈ పని జరగాలికదా! తమకాళ్ళకు బంధాలువడ్డాయని, స్వేచ్ఛా వయనానికి తమకు హక్కులేదని మనము మనముస్లిం సోదరీమణులకు తెలియజెప్పాలి కదా! మూడుకోట్ల ముస్లిం సోదరీమణులు బానిసావస్థలో వుంటే ప్రగతి పథకాలు అంతర్ధానం అయిపోవా?

సమాజంలో ఒక వర్గానికి అంటే ముస్లింస్త్రీలకు జరుగుతున్న అన్యాయాన్ని, అసమానతను, అవకతవకల్ని ఎత్తి చూపాల్సిన బాధ్యత మానవత్వమున్న ప్రతి వ్యక్తికీవుంది. అన్యాయాన్ని, అవినీతిని చూచిన సహృదయుడు స్పందిస్తాడు. ఆ కుళ్ళును, ఆ నైచ్యాన్ని ప్రజల దృష్టికి తెస్తాడు. వాళ్ళహృదయాలలో హత్తుకునేలా చేస్తాడు. ఒక వర్గమైన స్త్రీల ప్రయోజనాన్ని కాంక్షించి, వారిని ఆ మురికి కూపాలనుండి, ఇరుకుసందుల నుండి వెలుగులోకి తేవాలనే కాంక్షే నన్నీ రచనకు పురిగొల్పింది.

రచయిత, నిబద్ధత బాధ్యత ఇలాంటి రచనల్లో బైటపడుతుంది. సమాజంలో ఒక వర్గానికి కోపం వస్తుందని భయపడ్డ రచయిత సంఘంపట్ల తనకున్న బాధ్యత విస్మరించినట్లవుతుంది. నిజాయితీ లోపిస్తుంది. అతను నిజమైనసంస్కారి కాడని చెప్పవచ్చు. లబ్ధప్రతిష్టులైన గురజాడ, కందుకూరి, చలం, త్రిపురనేని అలా భయపడితే వాళ్ళకు చరిత్రలో స్థానం వుండేదికాదు; సమాజంలో మార్పు వచ్చేదికాదు.

ముస్లిం స్త్రీలతో చర్చించి, తర్కించి ఖురాన్ ఆధారంతో వ్రాసిందే ఈ సాహిత్యమంతా. తోటి అక్కా చెల్లెళ్ళయిన వారిస్థితిని మార్చాలనే తపనే నాయీ రచనకు ప్రోత్సాహన్నిచ్చింది. ఆధ్యేయమేనాకు మానసికధైర్యాన్ని సమకూర్చింది. నేను మనసారా నమ్మిన సత్యాన్నే ఇందు పొందుపరిచాను. ఇందులో నా పొరపాట్లు, లోపాలు దొర్లవచ్చు. దానికి నేనే బాధ్యత

వహిస్తానని హామీ ఇస్తున్నా. సహృదయులైన పాఠకులు ఇందులోని మంచిని గ్రహించగలరని నమ్ముతున్నాను. ఏది ఏమయినా నేను చెప్పింది నిజమని, వ్రాసింది న్యాయమని, నమ్మితేచాలను. ఈ రచన ద్వారా ఆ వర్గపు మహిళలు మేల్కొంటే నాకదే పారితోషికం. ఒకసారి ధ్వజమెత్తితే ఇక ఆ వర్గం కష్టాలకు, నష్టాలకు, అడ్డంకులకు, అవరోధాలకు ఝడియదు. ఎన్ని అవాంతరాలొచ్చినా వెనుకంజ వేయదు. ఆ పరివర్తన ఆ మహిళలలో కలుగక మానదు. డార్విన్ అన్నట్లు 'అణచబడ్డ ప్రతిజీవి ఒత్తిడికి తట్టుకోలేక ప్రతిఘటిస్తుంది.' ఆ స్థితికి స్త్రీలు వచ్చిననాడే వారిలో మానసిక వికాసం వస్తుంది. మార్పుకై పోరాడతారు; విముక్తికై పోరాటాలు సాగిస్తారు. చివరికి ఆత్మవిశ్వాసం పొందిన మహిళలు వ్యక్తిత్వాన్ని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందగల్గుతారు ; సమానత్వాన్ని సాధిస్తారు. ఆనాడే నిజమైన సమ సమాజావిర్భావం జరుగుతుంది. స్త్రీ పురుషులిద్దరికీ ఒకేనీతి ఆవిర్భవిస్తుంది. అస్తవ్యస్తాలు నశిస్తాయి. నేడు మన స్త్రీలకు కావాల్సింది సరిఅయిన అవగాహన, విద్య తద్వారా మానసిక జాగృతి ; శాస్త్రీయ దృక్పథం. దీనికి ముఖ్యమైన అంశం మానసిక దాస్య విముక్తి. ఆ విముక్తికి ఈ గ్రంథం తోడ్పడాలనేదే నా ఆకాంక్ష. సామాజిక ప్రగతికి, ముఖ్యంగా ముస్లిం మహిళాభ్యుదయానికి ఈ గ్రంథం ఉపకరిస్తే నా కృషి ఫలించినట్లే నాకదే పారితోషికం.

మల్లాది సుబ్బమ్మ

# కృతజ్ఞత

ఈ గ్రంథాన్ని వ్రాయటానికి ప్రత్యేకమంగా నాకు ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని కలిగించింది నా జీవిత భాగస్వామి, సహచరుడు, సహ కార్యకర్త శ్రీ ఎం. వి. రామమూర్తి. అంతేకాదు అనేకమంది రచించిన ఇంగ్లీషు సాహిత్యాన్ని తెలుగులోకి అనువాదంచేసి ఆ భావాలను సంగ్రహంగా చెప్పారు. అలా నాకు వారు తమ తోడ్పాటును అందించారు. ఎనలేని వారిసహాయ, సహకారాలు లేనిచో ఈ పుస్తకం అసలు బహిర్గతం కాకపోయేది. అది అక్షరాలా నిజం. ఈ పుస్తక ప్రచురణ కార్యక్రమానికి సర్వవిధాలా తోడ్పడిన రామమూర్తి గారికి నేను ఋణపడివున్నాను. ఇంకా ఈ పుస్తకానికి ఉపోద్ఘాతంకూడా రాశారు. దానికి నేను వారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఇట్లు
రచయిత

# ఉపోద్ఘాతం

ప్రపంచ వ్యాప్తిగా లెక్కలోకి తీసుకుంటే ఇస్లాంమతం ఈనాడు రెండవస్థానంలోవుంది. దేశాల సంఖ్యలో మొదటి స్థానంలోవుంది. ముస్లిం రాజ్యాలలో గత దశాబ్దంలో నూనె బావులు రాజ్యాధినేతల చేతుల్లోకిరావడం వల్ల ముస్లిం దేశాలకు విశేష విలువ, ప్రాధాన్యత వచ్చాయి. ఆ దేశాల సంపదపెరిగి అనేక దేశాల పౌరులకు, ముఖ్యంగా నిరుద్యోగులకు ఆ దేశాలలో ఉపాధి కలిగింది. ముస్లిందేశాలకు విశేషధనార్జన కలిగింది. ఆ సంపదనంతా వారూ క్రైస్తవులవలె మత ప్రచారానికి, మతవ్యాప్తికి కుమ్మరించడం మొదలుపెట్టారు.

## మతాంతరీకరణ

భారతదేశంలాంటి దేశాలలో పూర్వం మతాంతరీకరణ అధికారంద్వారా జరిగేది. ఈనాడు ప్రచారంతోను, ప్రబోధంద్వారా సాగుతుంది. ఈ మధ్య తమిళనాడులో ఒక గ్రామంలో ఒక వందమందికి పైగా దళితులు హిందూ మతాన్ని విడనాడి మహమ్మదీయ మతాన్ని స్వీకరించారు. దాంతో దేశ మంతా కలవరపడ్డది. క్రైస్తవ మిషనరీలు వందల ఏండ్లుగా మతాంతరీకరణ చేస్తున్నా ఏనాడూ ఇంత రభస జరగనేలేదు. ఈ అలజడికి, ఆందోళనకు కారణమేమిటి? మూడువేల ఏండ్లనుండి హిందూసమాజ రక్కసి ఉక్కు పాదాలక్రింద నలిగిపోతున్న దళితులు గత్యంతరంలేక మతం మార్చు కున్నారు. ఇది తప్పా? మానవుడు స్వేచ్ఛాజీవి. ఆశాజీవికూడాను. ఈ మార్పిడివల్లనైనా తాము విముక్తి పొందుతామని ఆశించటం ఆశ్చర్యమూ కాదు; నేరం అంతకన్నా కాదు. అసలింతకూ వారు తమిమ్మా మతాలనువదలి మహమ్మదీయ మతాన్ని ఎంచుకోవడం తప్పా? ఆ మాటకు వస్తే హిందూమతంలోనే ఉండి ఆ సమాజంపెట్టే యాతనలుపడుతూ, అవమానాలను భరిస్తూ కాలం వెళ్ళబుచ్చకుండా తిరుగుబాటు మనస్తత్వం వెలిబుచ్చటం తప్పా? హిందువుల దృష్టిలో అన్నింటికన్నా పెద్దతప్పు వారు మహమ్మదీయ మతంలో చేరడం. కారణం ఒకటి కాదు; అనేకం. మహమ్మదీయ సమాజంలో కులవ్యవస్థ అధికారికంగా లేదు. అది హిందువులకు

సవాలు. మహమ్మదీయులు సాధారణంగా ఉద్రిక్తులు. దురాక్రమణ మనస్తత్వాన్ని ప్రదర్శిస్తారు. మత కలహాలలో అనేక ప్రదేశాలలో మొదటి దెబ్బ వారుతీస్తారు. (చివరకు వారే నష్టపడే విషయం అందరికీ తెలిసినదే.) వీరి ఈ వైఖరి రెండవ కారణము. ముస్లింలు ఇంతవరకు పెద్దస్థాయిలో కుటుంబనియంత్రణ కార్యక్రమాన్ని చేపట్టలేదు. కనుక వారి జనాభా హిందువుల జనాభాకన్నా ఎక్కువ రేటులో పెరుగుతుంది. ఉదాహరణకు 1961 - 70 లో వారు 100 కి 33 చిల్లర పెరిగారు. ఈ లెక్కన వారి సంఖ్య గణనీయమవుతుందని భయం. అంతే కాదు. మతాంతరీకరణ తమిళనాడులోవలె సాగితే షెడ్యూలు జాతులు, షెడ్యూలు తెగలవారు ముస్లింలుగా మారితే దేశజనాభాలో ముస్లింలు 100 కి 25 మంది అవుతారు. ఒకవైపు పాకిస్తాను, మరోవైపు బంగ్లాదేశ్ ఉండగా, ఇతర ముస్లిం దేశాలు అండగా నిలిస్తే, దేశజనాభాలో 100 కి 25 మంది ముసల్మానులు ఉంటే ఎప్పటికయినా హిందూజాతి మనుగడకు ప్రమాదమని హిందూ జాతిరక్షణకు కంకణం కట్టుకున్న హిందువులకు భయంవుంది. ఇది మూడవ కారణం. ఇలాంటి కారణాలవల్ల తమిళనాడు సంఘటన హిందూ నాయకులలో కలవరం తెచ్చింది. మతమార్పిడి జాతి మనుగడకే గొడ్డలిపెట్టని .... .... వణికి పోతున్నారు.

## స్త్రీల ప్రసక్తి

రాజకీయాలు ఎలా ఉన్నా, మహమ్మదీయ మతంలోకి పోవడంవల్ల దళితులు ఉత్తరోత్తరాలాభిస్తారా అనేదే మరోప్రశ్న. ఏదైనా వారికి ఇష్టంవచ్చిన మతాన్ని స్వీకరించడానికి, ఆ మాటకువస్తే అన్ని మతాలను కాదని, ఏ మతంలో చేరకుండా ఉండటానికి దళితులకు సంపూర్ణమైన హక్కు ఉంది. దానిని ఎవరూ కాదనలేరు ; కాదనరాదు. కాగా అస్పృశ్యతను తొలగించుకోవటానికి ఇస్లాం మతంలోకిపోతే, మరి ఏ ఇతర బాధలు కలగవా అనేది మరోప్రశ్న. అంటరానితనం మానవజాతికే కళంకం. నిస్సందేహంగా దానిని ఎవరూ సమర్ధించరాదు ; సమర్ధించలేరు. అయితే ఇస్లాంలో స్త్రీల స్థితిఅన్నా మెరుగుగా ఉందా ? ఏ జాతిలో అయినా సగంమంది స్త్రీలు కదా ! మరి వారి స్థితిని గురించి ఆలోచించ నక్కరలేదా అనే ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

# XVIII

## ప్రపంచంలో స్త్రీలస్థితి

మతాంతరీకరణ విషయం కాసేపు అవతలకుపెట్టి ఆలోచించసాగితే స్త్రీల సమస్య తీవ్రస్వరూపం బోధపడుతున్నది. ఎంతో నాగరికత వెల్లి విరిసిన పాశ్చాత్య దేశాలలో సైతం ఆర్థిక రాజకీయరంగాలలో స్త్రీలను ముందుకు రానివ్వడంలేదు. కీలకస్థానాలలో స్త్రీలు ఇంచుమించుగా లేనట్లే లెక్క. ఇక మధ్యయుగపు పరిస్థితిలో ఉన్న దేశాలసంగతీ, అభివృద్ధి చెందని దేశాల సంగతీ చెప్పనవసరంలేదు. ప్రపంచవ్యాప్తగా స్త్రీలను గురించి పురుషులు, సమాజాలు మూడురకాలుగా ఆలోచిస్తున్నారు. స్త్రీని ప్రాణమున్న వస్తువుగా చూడటం మొదటిది. స్త్రీ పురుషులు దేవునిదృష్టిలో, మతవిషయికంగా సమానులు అని చెపుతూ ఈ సమానత్వం సర్వేసర్వత్రా వర్తించరాదనడం రెండవది. సమానులే కాని వారువేరు వీరువేరు. ఎవరి హక్కులూ బాధ్యతలూ వారికి ప్రత్యేకం అని చెప్పడం ఈ పద్ధతి. అలా కాక 'శారీరక నిర్మాణంలో తప్ప తతిమ్మా విషయాలన్నింటిలో స్త్రీ పురుషులు సమానులు; వారు సమాన శక్తి సామర్థ్యాలను ప్రదర్శించగలరు' అని చెప్పేది మూడవ పద్ధతి. దీనిని ఆధునికదృక్పథం అంటాం. ఇప్పుడిప్పుడే ఈ దృక్పథం పుంజుకుంటున్నది. దీనిని వ్యాప్తిచేయడానికే, దీనికి వ్యవస్థా రూపం ఇవ్వడానికే మహిళా దశాబ్దాన్ని ప్రకటించింది ఐక్యరాజ్యసమితి.

## ముస్లిం స్త్రీల స్థితిగతుల సమీక్ష

ఆధునికభావాల ప్రాతిపదికమీద సమాజాల పురోగతిని సమీక్ష చేయడం చేతు చాలా అవసరం. జనాభాలో సగంమందిగా ఉన్న స్త్రీలు దైన్యంలో, వైచ్యంలో మునిగివుంటే సమాజప్రగతి అనే దానికి అర్థం లేదు. కనుక విశేషవ్యాప్తి, ప్రాచుర్యం కలిగిన ఇస్లాం మతాన్ని అనుసరించే వారిలో స్త్రీలస్థితి ఎలా ఉన్నదనేది విచారణీయాంశం అయింది. అంతేగాక భారతదేశంలో నూటికి పదకొండు మంది ముస్లింలు ఉన్నారు. అంటే మతదృష్ట్యా అల్పసంఖ్యాక వర్గంలో అగ్రశ్రేణిలో ఉన్నారన్నమాట. అలాంటి భారత ముస్లింలలో స్త్రీల స్థితి ఎలా ఉందోగమనించడం మహిళోద్యమ కార్యకర్తలకే కాక, మానవ సంక్షేమాన్ని ఆకాంక్షించే

వారందరికీ అవశ్యకర్తవ్యం. ఈ దృష్ట్యా ఈ గ్రంథ రచనకు పూనుకోవడం జరిగిందని భావించాలి.

## మతం : స్త్రీలు

ఒక మతంలో స్త్రీలస్థితిని అంచనా కట్టేముందు ఆ మతాన్ని అనేక దృక్కోణాలనుండి పరిశీలించాలి. అవి చారిత్రక దృష్టిఅంటే ఈ మతం ఏ దేశంలో ఏ కాలంలో పుట్టింది, ఆనాటి దేశకాల పరిస్థితులు దానిని ప్రభావితం చేశాయా లేదా, అనేవి. అంతేగాక ఈ మత వ్యాప్తికి పూనుకున్న దేశీయులు ఎవరు ? వారి సామాజికాచారాలు ఈ మతస్థుల సంప్రదాయాలను మలిచాయా లేదా అనేది అందులోనే మరో అంశం. ఏ దేశంలో ముస్లిం సమాజాన్ని పరిశీలిస్తున్నామో ఆ సమాజపు స్థితిగతులు ఎలాంటివి ? ఆ మతం ఆ దేశంలో ప్రవేశించేటప్పుడు ఎలా ఉన్నాయి అనేది మూడవ అంశం. అంటే పుట్టినచోటు, వ్యాప్తిచేసిన వారి దేశం, స్వీకరించిన ప్రాంతం, అన్నిటి సామాజిక ఆచారాలు ఆ మతంపై ప్రభావం కలిగి ఉంటాయన్న మాట. ఆ మతప్రవక్త యొక్క వ్యక్తిత్వం, అతని ఆలోచనా ధోరణి, ఆయన ప్రవచనాలు, ఆయన ఆచరణ, వారి సూక్తులు, వారి సహచరుల ప్రవర్తన నియమావళి, పండితుల వ్యాఖ్యానాలు భాష్యాలూ వీటిని పరిశీలించటం మరొక దృక్పథం. ఈనాటి అవసరాలకు, ఈనాటి ఆలోచనా ధోరణికి, ఆ మతంయొక్క పద్ధతులు సరిపోతాయా అని ఆలోచించడం మూడవ దృక్పథం. రెండవ, మూడవ తరహా దృష్టితోనే ఈ పొత్తం రాయడానికి పూనుకున్నట్లు తోస్తుంది. కాగా పూర్వరంగ పరిచయం లేకపోతే సమస్య సరిగా అవగాహన కాదు కనుక ఉపోద్ఘాతంలో కూడా దానిని స్పృశించడం జరుగుతున్నది.

## మహమ్మదు ప్రవక్త

క్రీ. శ. 6వ శతాబ్దంలో జన్మించాడు మహమ్మదు అరేబియాలో. ఆనాటి సమాజం దైవవిశ్వాసం కలిగిఉన్నా అనేక దురాచారాలకు ఆలవాలంగాఉంది. వారిదేశం ఎక్కువగా ఎడారితో నిండిఉండేది. అక్కడక్కడ సొనలు, తోటలు ఉండేవి. కనుక ప్రజలు సంచార జాతులుగా

ఉండేవారు. తెగలుగా బ్రతికేవారు; ఒకతెగ మరియొక తెగతో పోరాడుతూ ఉండేది. కనుక యుద్ధాలుచేసే మగజాతికి ప్రాధాన్యత లభించింది. స్త్రీలను హీనంగా చూసేవారు. వారు ఇంచుమించుగా వస్తువులక్రింద జమ. నిరక్షరాస్యుడయిన మహమ్మదు ఆ సమాజ సంస్కరణకు పూనుకున్నాడు. ఆనాడు ప్రజలకు దేవునిపైన నమ్మకం ఉన్నదికదా! అలాంటి రోజులలో "నేను చెప్తున్నాను" అని మహమ్మదు ఏదైనా మంచిమాట చెప్పినా ఎవరూ నమ్మరు. ఆ విషయం మహమ్మదుకు తెలుసు. కనుక తన చెవిలో దేవదూత గేబ్రియల్ చెప్పిన విషయాలనే తను చెప్తున్నానని ప్రజలకు అతడు తెలియపరిచేటప్పటికి ప్రజలలో కొందరికయినా అతనిపై విశ్వాసం కుదిరింది. అప్పటికే అతనిని కొందరు పిచ్చివాడని నిరసించారు. అతడు "సమాధి" లోకి పోయేవాడు. అతని విమర్శకులు అతనికి 'మూర్ఛరోగమని', ఎగతాళి చేశారు. కష్టనష్టాలు భరించాడు. జయాపజయాలు పొందాడు. అవమానాలు సహించాడు. చివరకు విజయం అతనిదయింది. ప్రచారబలంతో, ఆయుధ సాయంతో తన మతవ్యాప్తి చేశాడు తన దేశంలో. అభిమానులు 'ప్రవక్త' అని అభివర్ణించారు. శత్రువులు 'వంచకుడు' అన్నారు. పండితులు "అజ్ఞాని" అని ఊపడించారు. ఎవరు ఏమన్నా మహమ్మదు చాల తెలివి కలవాడు. అందుకే సామాజిక సంస్కరణకు మత ప్రబోధాన్ని జోడించాడు. అతడు ఒక రకంగా ఆలోచిస్తే "యుగపురుషుడు". అంటే ఆ కాలపు పరిస్థితుల అవసరాలు తీర్చటానికి పుట్టినవాడు. అంతేకాదు ఆనాటి సామాజిక పరిస్థితులను సరిదిద్దటానికి ఆనాటి మౌలిక చింతనను అధిగమించి పోలేని మానిసి, అదే అతని బలహీనత. మరొక దృక్కోణం నుంచి చూస్తే అదే అతని బలం. ప్రజాదరణను పొందటానికి సాయపడిన విషయం. నిశ్చయంగా అతడు మహావ్యక్తి. కనుకనే ఎంతోమందిని ప్రభావితం చేయగలిగాడు; ఎంతోమందికి నేతృత్వం వహించగలిగాడు ఈనాటికీ అతని అనుయాయులు కోట్లాదిగా ఉన్నారు. కాకపోతే ఈనాటికీ అతని భావాలు అనుసరణీయాలా అనేది వేరే చర్చనీయాంశం. ఈనాడు ఇస్లాం మతాన్ని అవుననడానికి గాని, కాదనడానికి గాని అతనిని ప్రత్యేకంగా నిందించవలసిన అవసరంలేదు; ఖండించవలసిన అవసరంలేదు. కాగా ఒక్క విషయం మాత్రం గుర్తుపెట్టుకోవాలి. మహమ్మదు 'చివరి ప్రవక్త'

అనే భావం ఈనాడు అనుసరణీయం; అంగీకారయోగ్యం కాదు. దేవుని అస్తిత్వానికే ఎసరువచ్చిన ఈ రోజుల్లో, ప్రవక్తలకు చోటు ఎక్కడ ఉంటుంది ? అందులో 'ఆఖరి ప్రవక్త'కు అసలు చోటు లేదు. ఇలాంటి ప్రకటన మానవ మేధస్సుకు అపచారం. 13 వందల సంవత్సరాల నుండి తత్వశాస్త్రంలో, సైన్సులో, లలిత కళలలో, కవిత్వంలో ప్రగతి ఆగిపోయిందనడం అసంబద్ధం; అవివేకమేమో ! ఇలా నమ్మడం అంటే మానవ సమాజాభ్యుదయం స్తంభించి పోయిందనడం అన్నమాట. మహమ్మదు నిరక్షరాస్యుడయినంత మాత్రాన అతనిని అపహాస్యం చెయ్యనక్కరలేదు. 'చివరి ప్రవక్త' అని అతని వాక్యాలను శిరోధార్యాలుగా స్వీకరించనక్కర లేదు. అతనిని సరిగా అంచనావేసి అతని భావాలకు సరిగా మదింపు వేయటం, చరిత్రలో అతని స్థానాన్ని నిర్దేశించటం అవసరం. అందుకు అతని దేశపు ఆ కాలపు స్థితిగతులను గమనించడం అవశ్య కర్తవ్యం.

## మహమ్మదు కాలపు పరిస్తితులు :

అది తెగల సమాజం. ఆడపిల్లలను శత్రువులు ఎత్తుకొని వెళ్ళి పెళ్ళి చేసుకోవడం లేక ఉంపుడుగత్తెలుగా ఉంచుకోవటం జరిగేది. దీనిని తెగలు అవమానంగా భావించేవి. గట్టిగా రక్షించే స్థితిలో లేవు. కనుక బాలిక జననం అవమానంగా భావించేవారు అక్కరలేని ఆడపిల్లలు పుట్టగానే చంపి పూడ్చిపెట్టేవాళ్ళు. ఈ విషయాన్ని రూబిన్ లెవీ 'ఇస్లాంయొక్క' సామాజికశాస్త్రం ('Sociology of Islam' by Ruben Levy) లో వ్రాశాడు. ఇస్లాంకు పూర్వం అరేబియాలో బహు భార్యత్వం ఉండేది. (1948 వరకు మద్రాసు రాష్ట్రంలో కూడ, 1955 వరకు కొన్ని రాష్ట్రాలలో తప్ప యావద్భారతంలో హిందువులలో బహుభార్యత్వం ఉందనే విషయం హిందువులు గుర్తుచేసుకోవడం అవసరం). కాగా స్త్రీలు పురుషుని ఆస్తిగా పరిగణింపబడేవారు. పుట్టింటివారు కావచ్చు, భర్తకావచ్చు ఆమెకు పెత్తందారులు, వివాహాలు మూడురకాలుగా ఉండేవి. 'బీనా' (BEENA) పద్ధతిలో స్త్రీ తన తమ భర్తను ఎంపిక చేసుకోవచ్చును. తన ఇష్టం వచ్చినపుడు అతనిని బయటికి పంపవచ్చు. పిల్లలు మాత్రం ఆమె పుట్టింటివారి ఆస్తి. 'బాల్' (BAAL) అనేది రెండవ విధానం. భర్త ఇంట్లో భార్య కాపురం చేయాలి. పిల్లలు భర్త వంశానికి చెందుతారు. విడాకులు ఇచ్చే హక్కు భర్తది.

మూడవది ముత్యా (MUTA) పద్ధతి. ఇంతకాలం భార్యా భర్తలుగా ఉంటా మని గడువు నిర్ణయించుకొని కంట్రాక్టు ఏర్పరచుకుంటారు. కంట్రాక్టు కాలంలో భార్య భర్తకు విడాకు లివ్వరాదు. పిల్లలు ఆమె పుట్టింటి వంశానికి చెందుతారు. ఆమెకు మనవర్తి హక్కులేదు.

ఆనాడు విడాకులు రెండు రకాలుగా ఉండేవి. మొదటిది "ఖోల్", "మహర్", ఆనాడు వధువుకు చెందేది కాదు. వధువు తండ్రికి చెందేది. ఆ మహర్‌ను వధువు తండ్రి అల్లుడికి తిరిగి ఇచ్చి వేస్తే వివాహం రద్దు అయినట్టే. అంటే తండ్రి తన కుమార్తెను అలుడికి అమ్మాడన్న మాట. తీసుకున్న ధరమళ్ళీ తిరిగి ఇచ్చి వేస్తే ఆమె తండ్రి ఆస్థి అవుతుంది. రెండవరకం విడాకులను 'తలాఖ్' అంటారు. భర్తకు భార్యపై సంపూర్ణ హక్కులు ఉండేవి. ఆమెను అతిథులకు ఇవ్వ వచ్చు. ఇతరులతో కాపురం చేయమనవచ్చు. మా మూలుగా తన గొర్రెలను కాపలాకాసేవానితో కాపురం చేయమనే ఆచారం ఉండేది. సంతానకోసం కూలీన వంశస్తునితో కాపురం చేయమనవచ్చును. అతని మరణానంతరం అతని వారసులు ఆమెను స్వాధీనపరచుకొని ఆమె పొందును స్వీకరించవచ్చు. ఇలాంటి వివాహవ్యవస్థలో భర్త తన ఇష్టం వచ్చినపుడు భార్యకు విడాకులివ్వడం 'తలాఖ్' పద్ధతి. అతడు ఎవరికీ ఏ కారణాలను చెప్పనవసరం లేదు. భార్యగా ఉండగా ఆమెను భర్త తన ఇష్టం వచ్చినట్లు శిక్షించవచ్చు.

దీనినిబట్టి తెలిందేమంటే మాతృ వారసత్వ వ్యవస్థనుండి (MATRI LINEAL) పితృవారసత్వ వ్యవస్థకు మారే రోజులు (PATRILINEAL) అవి. మహమ్మదు చేసిన మార్పులలో ముఖ్యమైన వాటిని పేర్కొనడం అప్రసంగం జసం కాదు. (1) బీదరికంవల్ల గాని ఇతరత్రాగాని పిల్లలను చంపడం మాన్పించాడు. దాంతో ఆడ పిల్లలు బ్రతికారు.

(2) 'జకాత్' ఏర్పాటు చేసి బీదరికాన్ని తగ్గించాడు.

(3) స్త్రీలను బలవంతాన ఎత్తుకొని వెళ్ళి పెళ్ళి చేసుకోవడాన్ని నిషే ధించాడు.

(4) భర్త ఆస్తిలో భార్యకు, తండ్రి ఆస్తిలో కూతురుకు వారసత్వ హక్కు కలిగించాడు.

(5) 'మహర్' స్త్రీకి చెందేటట్లు చేశాడు. అంతకు క్రితం దానిని తల్లిదండ్రులు, బంధువులు తీసుకునేవారు. ఆమె దానిని తన ఇష్టం ఇచ్చినట్లు నాడుకోవచ్చు.

(6) స్త్రీ ఇష్ట ప్రకారం వివాహం జరగాలి.

(7) కొన్ని సందర్భాలలో వివాహపు రద్దును కోరడానికి స్త్రీకి హక్కు ఏర్పరచబడింది.

(8) భర్త త్వరపడి విడాకులిచ్చి, మళ్ళీ ఆమెనే పెళ్ళి చేసుకుంటానంటే కొన్ని ఆటంకాలు, ఆంక్షలు పెట్టాడు.

(9) బహుభార్యత్వాన్ని పూర్తిగా నిరసించలేదు కాని ఏక కాలంలో నల్గురు భార్యలకన్న ఎక్కువ కలిగి ఉండటానికి వీలులేకుండా చేశాడు. నల్గురు భార్యలను సమదృష్టితో చూడాలని ఆదేశించాడు. అంటే ప్రేమ, అభిమానం, గౌరవం వీటన్నిటి విషయంలో సమానంగా చూడాలి.

ఇవన్నీ మహమ్మదు సంస్కరణ భావాలకు ప్రతీకలు. భార్య భర్త ఇంట్లోనే కాపురముండాలనే దానిని, భర్తకుగల ఏక పక్షపు విడాకుల హక్కును, స్త్రీల ఇతరత్రా హోదాను, ప్రజాకార్యక్రమాలలో ఆమెకు ప్రసక్తి లేక పోవడాన్ని ఇలాంటి వాటిని మహమ్మదు మార్చలేక పోయాడు. అందరూ అన్ని పనులూ చేయలేరు; అందులో అన్ని కాలాలలోనూ చేయలేరు. మహమ్మదుకూ ఈ ఇబ్బందులూ, సాధక బాధకాలూ ఉన్నాయి. కాగా మహమ్మదు ఆ కాలానికి అభ్యుదయవాది అని గ్రహించడం మన విధి.

ఇక పోతే ఏ సమాజంలోనన్నా స్త్రీల స్థితిగతులను సమీక్ష చేసేటప్పుడు ఈ క్రింది నమోదుచేసే అంశాలను దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. 1) సమాజంలో స్త్రీలకు ఉన్న విద్యావకాశాలు ఎన్ని ?

2) వృత్తులను చేపట్టటం విషయంలో వారికున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, అవకాశాలు ఎలాంటివి ?

3) ఆ సమాజం యొక్క సాంస్కృతిక స్థాయి ఎలాంటిది ?

4) సమాజంలో స్త్రీ పురుషుల సంబంధాలు సమానత్వ ప్రాతిపదికపై ఉన్నాయా లేక పెత్తందారు, పనికత్తె సంబంధాలతో ఉన్నాయా ?

5) వివాహం విషయంలో స్త్రీలకు ఎంపిక హక్కు ఉన్నదా? ఉంటే అది ఎంత వరకు వర్తిస్తుంది.

6) వివాహ వ్యవస్థలో స్త్రీ హోదా ఎలాంటిది? కుటుంబ బడ్జెటు, పిల్లల విద్య, పిల్లల పెళ్ళిళ్ళు, వస్తువుల క్రియ విక్రియాలు, కుటుంబానికి ఇళ్ళు, భూములు లాంటివి సంపాదించుట వగయిరా కుటుంబ విషయాలలో జరిగే నిర్ణయాలలో ఆమె పాత్ర ఏ మేరకు?

7) విడాకులు, మనవర్తి లాంటి విషయాలలో ఆమెకు వెసులుబాట్లు ఉన్నాయా?

8) సంతానం పొందే విషయంలో వివాహిత అయిన ఆమె మాటకు విలువ ఉందా?

9) తన సంతానం యొక్క పోషణ, సంరక్షత్వం మొదలైన అంశాల సందర్భంగా ఆమెకు హక్కులు న్యాయంగా తగినట్లుగా ఉన్నాయా?

10) ఆమె ఆస్థిమీద, ఆమె సంపాదమీద, ఆమె ఆమె భర్త కలిసి సంపాదించిన ఆస్థులపైన ఆమెకు యాజమాన్యపు హక్కు, వినియోగపు హక్కు ఉన్నాయా? ఉంటే అవి ఏ మేరకు?

11) వారసత్వంగా ఆమెకు ఆస్థి సంక్రమించే విషయంలో స్త్రీ పురుషుల మధ్య వివక్ష ఉందా?

12) సమాజంయొక్క సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక రాజకీయ రంగాలలో ఆమె స్థానం ఎట్టిది? కీలక స్థానాల్లో పదవీ బాధ్యతలు నిర్వర్తించటానికి ఆమెకు అవకాశాలు ఉన్నాయా?

13) పురుషులలాగా ఆమెకు సంచారస్వాతంత్ర్యం ఉందా?

14) వేష భాషలలో, నడక తీరులో, మాట్లాడే పద్ధతిలో, పెద్దలను గౌరవించవలసిన విధానాల్లో స్త్రీ పురుష వివక్ష ఉందా? ఆమెపై ఆంక్షలు పరిమితులు విధించబడ్డాయా? ఆమె విధి నిషేదాల వత్తిళ్ళకు లోనవు తున్నదా?

15) ఇతరుల పిల్లలను దత్తు చేసుకునే సందర్భంలో ఆమె వివక్షకు లోనవుతున్నదా?

16) స్త్రీ పురుష సందర్భంగా సమాజంలో ద్వంద్వనీతి చలామణి అవుతున్నదా ?

17) వివాహమాడడానికి, అవివాహితగా ఉండటానికి స్త్రీకి హక్కు ఉందా? వివాహం ఆమెకు మాత్రమే నిర్ణయింపబడిన సంస్కారమా?

18) స్త్రీ అవివాహితగా తల్లి అవటం తప్పా !

19) శ్రమకు విలువ కట్టే సందర్భంగా స్త్రీ పురుష వివక్ష చెలామణి అవుతోందా ?

20) సమాజంలో స్త్రీ పురుషుల మధ్య శారీరక నిర్మాణంలో తేడాలు ఉండవచ్చును కాని మేధస్సు, ఇతర శక్తి సామర్థ్యాల విషయంగా స్త్రీని చిన్నచూపు చూడటం సంభవిస్తున్నదా ?

ఈ పై అంశాలను సర్వదా దృష్టిలో ఉంచుకొని ముసల్మాను సమాజాన్ని పరిశీలించడం ఆవశ్య కర్తవ్యం.

ముస్లిం సమాజాన్ని నియంత్రిణం చేసేవి అనేకం. మహమ్మదుచే 'దైవ ప్రేరితం'గా చెప్పబడిన ఖురాన్ మొదటిది. మహమ్మదు ఇతర సందర్భాలలో చెప్పిన మాటలు రెండవ కోవకు చెందినవి. వాటిని 'హాడిత్' అని వ్యవహరించడం కద్దు. ఏ సందర్భంలోనయినా మహమ్మదుయొక్క ఆచరణ('సున్నా') మార్గదర్శకంగా పరిగణించబడేది; అది మూడవ అంశం. ఇవన్నీ దొరకనప్పుడు మహమ్మదుయొక్క సహచరుల ఆలోచనకు ప్రాధాన్యత వస్తుంది. దానిని 'ఇజ్మా' అంటారు. ఇది నాల్గవది అన్నింటికన్న చివరిది దేశాచారాన్నిబట్టి నిర్ణయింపబడే విషయం. దీనిని 'ఇష్టిహాసన్' అని పిలుస్తారు. కనుక ముస్లిం సమాజంయొక్క బాగోగులను నిర్ధారణ చేయుడానికి కేవలం ఖురానులో వాక్యాలు, దానికి మతగురువులు, పండితులు చేసిన వ్యాఖ్యానాలు, భాష్యాలు మాత్రమే చాలవు. ఈ నాడు మనం 20వ శతాబ్దంలో బ్రతుకుతున్నాం. ఇస్లాం మతం పుట్టిన 13 శతాబ్దాల తరువాత ఆనాడు లేనివి, ఆనాడు ఊహించటానికి కూడా అవకాశం లేనివి అనేక సందర్భాలూ సన్నివేశాలు మనకు ఎదురు అవుతుంటాయి. ముస్లిం సమాజం ఆ సమస్యను ఎదుర్కోక తప్పదు. అప్పుడు అచ్చంగా ఖురాను మాత్రమే సహాయకారి కాదు. కాగా మహమ్మదుచే ప్రవచించబడిన సుభాషితాలు ఉపకరించవచ్చు. కొన్ని సందర్భాలలో అవి అన్వయించక

